# తైత్తిరీయోపనిషత్తు

## (A GUIDE TO SCIENTIFIC THOUGHT AND PRACTICAL UTILITY OF VEDA)

స్వరయుక్త మంత్ర, టీకా, తాత్పర్య, శాస్త్రీయ వివరణములు


వివరణ కర్త

**డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి,** M.Sc., M.Phil., Ph.D.

(రిటైర్డ్) రీడర్ & భౌతిక శాస్త్ర విభాగాధ్యక్షులు
టి.జె.పి.యస్. కళాశాల, గుంటూరు






**జగద్గురు పీఠము - గుంటూరు శాఖ**

**(The World Teacher Trust - Guntur Branch)**

గుంటూరు - 522 002

ఫోన్ : 233995

# విషయ సూచిక

# సమన్వయాంశ వివరణ సూచిక

# ముందుమాట

నాకు వేదాలను నేర్చుకోవాలని కోరిక ఉండేది. భారతీయ సంస్కృతీపరమైన వాతావరణం మా ఇంట్లో సమృద్ధిగా ఉంది. కాని, మా నాన్నగారు నాకు వేదాలను నేర్పలేదు. నేను ఇతరత్ర నేర్చుకోలేదు. కాని 24 సంవత్సరాలు గడిచి 25వ సంవత్సరములో అడుగు పెట్టినపుడు – అంటే, 1965వ సంవత్సరంలో – ప్రాతః స్మరణీయులు, అస్మత్ గురువరేణ్యులు, అంతర్జాతీయ ఆధ్యాత్మిక సేవా సంస్థ ఐన జగద్గురుపీఠాన్ని నెలకొల్పినవారు అయిన ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి అనుగ్రహంవల్ల నా కోరిక తీరింది. వాల్తేరు – ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఒక వైపు నా వృత్తికి సంబంధించిన భౌతికశాస్త్రంలో పరిశోధనా కార్యక్రమాన్ని నిర్వర్తిస్తున్నప్పుడు, ఇంకొక వైపు గురుదేవుల సాన్నిధ్య – అనుగ్రహ – ప్రభావం వలన నా ప్రవృత్తికి సరిపడే వేద, ఇతిహాస, మంత్ర, జ్యోతిష, హోమియోశాస్త్ర, యోగ, క్రతువిద్యా, కావ్యాదులలో శిక్షణా కార్యక్రమం గూడా పూర్తయింది. శంకర భగవత్పాదుల సౌందర్యలహరి, శివానందలహరులను తెలుగులో ఛందోబద్ధపద్యాలలో అనువదించగలిగిన కవితాశక్తి, సామర్థ్యాలను గూడా గురుదేవులు ప్రసాదించారు.

**ఈ గ్రంథ రచనకు ప్రేరణ :**

"స్వాధ్యాయ ప్రవచనే ఏ వేతి నాకో మౌద్గల్యః" అన్న ఉపనిషత్ సూక్తిని అనుసరించి గురుదేవుల వద్ద నేర్చుకొన్న విషయాలన్నిటినీ మరల మరల మననం చేయడం, శ్రద్ధాసక్తులు కలిగిన వారికి వీటిలో శిక్షణా తరగతులను నిర్వహించడం నా నిత్యానుష్ఠానాలలో ఒకటైపోయింది. ఈ శిక్షణాతరగతులను నిర్వహిస్తున్నపుడు వేదమంత్రాలకు, ముఖ్యంగా ఉపనిషత్ మంత్రాలకు సరియైన అర్థం గూడా తెలిస్తే నేర్చుకున్నవిద్య సార్థకమౌతుందనిపించింది. నాకు ఈ కోరిక ఉన్నట్లు గురుదేవులకు ఎలా తెలిసిందో ఏమో ఆ యేడు జరిగే గురుపూజల్లో – అంటే 1981 సంవత్సరంలో జరిగే గురుపూజల్లో మూడు రోజులూ ఉదయం, సాయంత్రం గూడా తైత్తిరీయోపనిషత్తులోని శిక్షావల్లిని వివరిస్తూ ప్రసంగించారు. అల్లాగే, 1982, 1983 సంవత్సరాల గురుపూజల్లో మిగిలిన ఆనందవల్లి, భృగువల్లులకు వివరణ ప్రసంగరూపంలో పూర్తి చేశారు. వేదమంత్రాలకు సరియైన పద్ధతిలో అర్థాలు చెప్తే

అన్ని రకాల వాళ్ళు - అంటే సైన్సు విద్యార్థులు, ఆర్ట్స్ విద్యార్థులు, పండితులు, పామరులు, సనాతనులు, ఆధునాతనులు గూడా అర్థం చేసుకొని ఆనందించగలరని మాస్టరు గారి ప్రసంగాలు విన్న తర్వాత నాకు అనిపించింది. ఇంతవరకు చాలా మంది ఈ వేద వాఙ్మయానికి దూరంగా ఉండడానికి కారణం - చెప్పేపద్ధతిలో ఉండే దోషంవల్లగాని, చెప్పే విషయంలోని దోషంవల్ల కాదని అనిపించిది. అందుకే ఈ గ్రంథాన్ని ఒక శాస్త్రీయమైన పద్ధతిలో వ్రాయాలని ప్రేరణ కలిగింది.

**శాస్త్రీయమైన పద్ధతి అంటే ?**

సైన్సు బాగా అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో ఏ విషయాన్నైనా ఒక శాస్త్రీయమైన పద్ధతిలో వివరిస్తే గాని ఆధునిక మానవులకు నచ్చదనేది సత్యం. శాస్త్రీయంగా అంటే - భౌతిక శాస్త్ర (Physics) ప్రకారం అనో, రసాయనిక శాస్త్ర (Chemistry) ప్రకారం అనో కాదు. ఒక కట్టుదిట్టమైన పద్ధతిలో (Systematic Method), హేతుబద్ధమైన చర్చలతో (Reasonable and Argumentative Discussion) చెప్పే విధానాన్ని 'శాస్త్రీయమైన పద్ధతి' అనాలి. ఈ ప్రస్తుత గ్రంథంలో వివరణ భాగమంతా అల్లాంటి శాస్త్రీయమైన పద్ధతి (Scientific Method) లో వ్రాయబడింది. ఈ వివరణలో సందర్భాన్ని బట్టి అన్ని రకాల సైన్సు శాస్త్రాలతో పాటు - తత్త్వ శాస్త్ర, యోగ శాస్త్ర, మంత్ర శాస్త్ర, తర్క శాస్త్రాలకు సంబంధించిన విషయాలు గూడా - ఆయా శాస్త్రాలకు సరిపడే ఉదాహరణలతో చిత్ర పటాలతో, ఉపనిషత్తులోని విషయాలను సమన్వయ పరచడానికి ప్రయత్నించాను. అందువల్ల కొందరికిది వేదాంత గ్రంథంలా కాకుండా ఒక సైన్సు పుస్తకంలాగా కూడా అనిపించవచ్చు.

**ఈ గ్రంథంలో వాడిని భాష ఎలాంటిది ?**

ఒకరికి తెలిసిన విషయాన్ని ఇంకొకరికి చెప్పాలన్నా, అందివ్వాలన్నా అందుకు ఉపయోగించే భాష - కాలాన్ని బట్టి మార్చాల్సి వుంటుంది. నేను కొన్ని పూర్వ గ్రంథాలను చదివాను. ఆ గ్రంథాల్లో ఉపయోగించిన భాషలో అన్నీ తెలిసిన అక్షరాలే, తెలిసిన మాటలే ! అయినా చదవడానికే కష్టమైంది. ప్రతి పదంలోను సున్నాలు, అరసున్నాలు, క్రావడులు, సంశ్లిష్ట సంయుక్తాక్షరాలు, క్రొత్త అర్థాలు తొంగి చూచే సంధులు ఆ గ్రంథాల నిండా ఉన్నాయి. అలాంటి భాషలో వ్రాస్తే, ఈ కాలం

వాళ్ళు ఈ గ్రంథం చదవలేరేమో ననిపించింది. అది సంపూర్ణంగా వీరగ్రాంథిక భాష. ప్రస్తుతం చెలామణిలో వున్న గ్రాంథిక భాష కంటె బాగా జటిలమైంది. అలా అని గ్రంథాన్ని పూర్తిగా సరళమైన గ్రామ్య, వ్యావహారిక భాషలలో వ్రాయడం గూడా నాకిష్టం లేదు. ఎందుకంటే ఈ సరళ గ్రామ్య, వ్యావహారిక భాషలు గూడా ప్రాంతాన్ని బట్టి మారతాయి. కాబట్టి, అన్ని ప్రాంతాల వారికి ఆ భాష కూడా పూర్తిగా అర్థమవదు. అందుచేత అటు వీరగ్రాంథికం కాకుండా ఇటు వీరగ్రామ్య, వ్యావహారికం కాకుండా మధ్యేమార్గంగా ప్రస్తుతం చెలామణిలో వున్న గ్రాంథిక భాషనే ఏ విధంగా మార్పులు చేస్తే – అర్థ సందిగ్ధత లేకుండా; పెడర్థాలకు, అనర్థాలకు దారితీయకుండా; చదువుకోవడమేమీ అంత కష్టం కాదు అనిపించే విధంగా ఉంటుందో – ఆ ప్రకారం మార్పులు చేసి వ్రాశాను. అనర్థాలకు దారి తీసే కొన్ని సంధులను విడదీసి వ్రాశాను (ఉదా: 1) 'తమ్మునితో నక్క ఇట్లనియె' అని వ్రాయడానికి బదులు 'తమ్మునితో అక్క ఇట్లనియె' అని, 2) 'సర్వ జీవులకన్నము పెట్టవలెను' అని వ్రాయడానికి బదులు 'సర్వజీవులకు అన్నము పెట్టవలెను' అని 3) 'నీవు నాకండగా నుండవలెను' అని వ్రాయుటకు బదులు 'నీవు నాకు అండగా ఉండవలెను' అని వ్రాసే విధంగా అన్నమాట ! ఈ 'ముందుమాట' శీర్షికలో వాడిన భాషలోనే వ్రాయవచ్చు. కాని, ఇదీ ఒక రకమైన వ్యావహారిక భాషే ! ఈ వ్యావహారిక భాషతో వచ్చే చిక్కేమిటంటే కాలాన్ని బట్టి మార్చవలసిన అవసరం ఈ వ్యావహారిక భాషలకు ఉంటుంది. ఈ శీర్షికలో వాడిన వ్యావహారిక భాష కొంతకాలం అయింతర్వాత ఇంకా ఎన్నో మార్పులు పొందుతుంది. (గ్రంథం చివర అనుబంధ శీర్షికను మళ్ళీ ఈ ముందుమాట శీర్షికలో వాడిన శిష్ట వ్యావహారిక భాషలోనే వ్రాశాను). ముందువచ్చే క్రొత్త తరాల వారు గూడా ఈ గ్రంథాన్ని చదువుకునేటప్పుడు వాళ్ళకి ఈ భాష ఎబ్బెట్టుగా అంటే క్రొత్తరకంగా అనిపించకుండా ఉండాలంటే కాలంతో పెద్దగా మార్పులు పొందకుండా ఉండేది; అన్ని ప్రాంతాల వారికి అర్థమై, చదవడానికి సౌలభ్యంగా ఉండేది; అనర్థాలకు, పెడర్థాలకు దారితీయనిది అయిన భాషను ఎన్నుకోవడమే మంచిదని కొంచెం గ్రాంథిక శైలి అనిపించే విధంగానే వ్రాశాను. ('గ్రంథమని చెప్పుకొనవలెనన్నచో గ్రాంథిక భాషను', 'పుస్తకం అని చెప్పుకుంటే చాలనుకుంటే వ్యావహారిక భాషని' వాడాలి అని ఒక వాదము!).

**గ్రంథంలో వాడిన పారిభాషిక పదాలు :**

వేదాంత పరిభాష, పాండిత్య పరిభాష సూటి సత్యానికి బంగారు కోటలా పనిచేస్తాయి. వీటి వల్ల విషయ ప్రవేశం అందరికీ అందుబాటులో ఉండకపోవడమే గాక విసుగ్గాడా వస్తుంది. అందుకని తప్పనప్పుడు తప్ప వీలైనంత వరకు పాండిత్య పద ప్రకోపాన్ని, వేదాంత ధోరణిని విస్మరించి సాధ్యమైందతవరకు అందరికీ అర్థమయే పారిభాషిక పదాలనే వ్రాశాను.

**విసుగు రాకుండా చదువుకోవాలంటే చిన్న సలహా !**

మంత్రాలు, టీక, తాత్పర్యం, వివరణ చదువుకోవాలనిపిస్తే - అన్నీ చదవండి. టీక చదవడం అనవసరం అనుకుంటే సూటిగా తాత్పర్యం, వివరణలు చదువుకోండి. తాత్పర్యం కూడా అనవసరం అనుకుంటే సూటిగా వివరణ చదువుకోండి. ఇంక వివరణ గూడా అనవసరం అనుకుంటే .... ('ఊ అనవసరమనుకుంటే?') .... 'అసలు గ్రంథాన్నే కొనకండి!'....

వివరణ చదువుకునేటప్పుడు మీకు అర్థమవనివి, పరిచయం లేనివి అయిన వివిధ శాస్త్రాల్లోని విషయాలు వస్తాయి. 'అవన్నీ నిజమేనా ?' అని అనుమానమొస్తే - అయా శాస్త్రాల విషయాలు తెలిసిన వారిని అడిగి తెలుసుకుంటే ఈ గ్రంథంలో గల సమన్వయం మీకు ఆనందాన్నిస్తుంది. [ఉదా: 81, 82, 83 పేజీలలో అష్ట వసువుల గురించి చెప్పేటప్పుడు వసువు అంటే ద్రవ్యాత్మక లోకానికి, అంటే - భౌతిక పదార్థ స్థితిని పొందడానికి సంబంధించిన లోకానికి దేవతలని (Lords of the plane of manifestation), భీష్ముడు అష్టవసువులలో ఒకడని, ఏడు గర్భాలు అస్థిరంగా ఉండి నిలవకపోయిన తర్వాత ఎనిమిదవ గర్భంలో పుట్టిన భీష్ముడు స్థిరంగా నిలిచాడని చెప్పే భారత కథలోని విషయం చెప్పబడింది. దీన్ని రసాయనిక శాస్త్ర పరంగా - సమన్వయ పరుస్తూ ప్రకృతిలో భౌతిక పదార్థ స్థితిని పొందే మూలకాలు గూడా పీరియాడిక్ టేబుల్‌లో 7 + 1 = 8 వర్గాలు (Groups)గా చేయబడ్డాయని మొదటి ఏడు వర్గాల మూలకాలు తక్కువ స్థిరంగాను, 8వ గ్రూపుకు చెందిన మూలకాలు ఎక్కువ స్థిరమైన (Most stable) ఎలక్ట్రాన్ విన్యాసం (Electronic configuration) కలిగి స్థిరంగా ఉంటాయని చెప్పబడింది. ఒక్క భారతకథే

తెలిసి, రసాయనిక శాస్త్ర విషయం తెలియక పోయినా ఈ సమన్వయం అర్థం కాదు. చదివి ఆనందించలేరు ! లేదా రసాయనిక శాస్త్ర విషయమే తెలిసి భారత కథా విషయం తెలియకపోయినా అంతే ! అందుచేత 'ఏదో ఒక విషయమే తెలిసిన వారు ఆ రెండో విషయం తెలిసిన వారిని సంప్రదించి సమన్వయంలోని నిజాన్ని అర్థం చేసుకుని ఆనందించండి' అని నా అభ్యర్ధన].

ఉపనిషత్తులో చెప్పబడిన విషయాలు కేవలం వేదాంతులకు, వృద్ధులకు పండితులకే కాదని, అందరూ నిత్యమూ ఉపాసించతగిన, తెలుసుకొన వలసిన, తెలుసుకొన్నవి ఆచనరణలో పెట్టవలసిన విషయాలేనని తెలియజెప్పడమే నా ప్రధాన ధ్యేయం. ఈ ప్రయత్నంలో సఫలుణ్ణి అయితే ఆ గొప్పతనం - గురుదేవుల అనుగ్రహానిది; విఫలుణ్ణి అయితే అది నా ప్రయత్న, సామర్థ్యలోపానిది. అందుచేత, నా యీ ప్రయత్నంలో లోపాలుంటే పెద్దలు వాత్సల్య భావంతో మన్నించండి. కోయిలల వంటి శ్రుతి విద్యాపారంగతులు లేత కొమ్మవంటి నా యీ గ్రంథ వివరణ ప్రతిలోగల పత్రాల్లోని చిగురు వంటి గుణాన్ని స్వీకరించి, వగరు వంటి దోషాలను విడవమని నా ప్రార్థన. ఆధునిక యువకులకు ఈ సమన్వయ వివరణ బాగా ఉపయోగపడుతుందని నా గట్టి నమ్మకం. సోదరులంతా చక్కగా ఈ గ్రంథాన్ని ఉపయోగించుకొని అర్థం తెలిసి ఉపనిషత్తులను చదువుకుంటారని ఆశిస్తాను.

-జి. ఎల్. ఎన్. శాస్త్రి.

# కృతజ్ఞతలు

నాకు జన్మనిచ్చిన జననీజనకులకు, జ్ఞానభిక్షను పెట్టి నన్ను అపురూపంగా తీర్చి దిద్దిన గురువరేణ్యులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారికి నా హృదయంలోనే భక్తి పూర్వక ప్రణామాలను సమర్పించుకుంటున్నాను.

ఈ గ్రంథం ముద్రణ కావడం ఇది మూడోసారి. ప్రథమ ముద్రణ జరిగినప్పుడు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ శాఖ వారు - వారి ఆధ్వర్యములో నిర్వహింపబడే ప్రతి గ్రంథాలయంలోను ఈ గ్రంథాన్ని కొనుగోలు చెయ్యడానికి 'సైటేషన్ నెంబరు' ఇచ్చి సహకరించారు, వారికి -

మన భారతదేశ ప్రభుత్వము వారి మానవ వనరుల శాఖ వారు ఈ గ్రంథాన్ని కొనుగోలు చేసి మన యావద్భారతదేశం నలుమూలలలోని విశ్వవిద్యాలయ గ్రంథాలయాలన్నిటికీ పంపిణీ చేయించారు, వారికీ - నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తకంలో నేను వ్రాసిన పద్యాలు చదివి మెచ్చుకొని, కొన్ని కొన్ని చోట్ల సవరించవలసినదిగా సలహాలిచ్చి ప్రోత్సహించిన - డా. ప్రసాదరాయ కులపతిగారికి, ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు తెల్పుకుంటున్నాను.

ఈ గ్రంథం ప్రస్తుత తృతీయ ముద్రణ యొక్క టైటిల్ పేజీ ముద్రణకు పూర్తిగా ద్రవ్య సహాయాన్ని శ్రీ నాగులపాటి వేణుగోపాలరావు గారు అందించారు. వీరు గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా ఆరేపల్లి ముప్పాళ్ల గ్రామంలో కీ.శే. నారాయణ, రమణమ్మ పుణ్య దంపతికి జన్మించారు. ESI కార్పొరేషన్‌లో మేనేజర్‌గా వృత్తి ధర్మాన్ని నిర్వర్తిస్తున్నారు. శ్రీ సూరి అప్పయ్య గారి ద్వారా 1984లో మాస్టర్ EK గారితో పరిచయం కలిగింది. ప్రస్తుతం జగద్గురు పీఠం గుంటూరు శాఖకు గౌరవ ఉపాధ్యక్షులుగా ఉన్నారు. హోమియో జ్యోతిశ్శాస్త్రాలలో జగద్గురు పీఠం గుంటూరు శాఖ వారి పర్యవేక్షణలో శిక్షణ పొందారు. గుంటూరు శాఖ వైద్య విద్యాలయ నిర్వహణలో సహకరిస్తూ వుంటారు. అనారోగ్యంగా ఉన్న వీరి భార్యకు

సంపూర్ణ ఆరోగ్యం చేకూరాలని; వీరు, వీరి కుటుంబ సభ్యులు అందఱూ ఆయురారోగ్యైశ్వర్యాలతో వర్ధిల్లాలని హృదయపూర్వకంగా కోరుకుంటూ, కృతజ్ఞతలు తెలియ జేస్తున్నాను.

ఈ తృతీయ ముద్రణకు తమ వంతుగా ద్రవ్య సహాయాన్ని, సహకారాన్ని అందించిన - శ్రీదేశిరాజు పార్థసారథి, శ్రీలక్ష్మి దంపతికి, చి.సూరపరాజు సత్యనారాయణ మూర్తి, చి. సూరపరాజు శ్రీనివాస్ సోదరులకు, చి.ఎమ్.వి. రమణకుమార్‌కు, పిడుగురాళ్ల వాస్తవ్యులు శ్రీరంగనాయకులు గారికి, పి. రామనాథం గారికి, జి. శ్రీనివాసరావు గారికి, దాచేపల్లి వాస్తవ్యులు శ్రీ సి. హెచ్. కాశయ్యగారికి, హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీ ఓరుగంటి భవానీశంకర మూర్తి, హనుమాయమ్మ దంపతికి - వారి వారి కుటుంబ సభ్యులకు - నా తరపున, మా జగద్గురు పీఠం గుంటూరు శాఖ తరపున హృదయపూర్వక కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

ఈ గ్రంథ తృతీయ ముద్రణ ప్రతిని డి.టి.పి. చేసి ఇచ్చిన చి.సౌ. ఇందిరకు, అందంగా ముద్రించి ఇచ్చిన విజయసాయి ఆఫ్‌సెట్ ప్రాసెస్ అండ్ ప్రింటింగ్ వారికి, శుభాశీస్సులు.

ఈ గ్రంథ ముద్రణకు పైవిధంగా సహకరించిన వారందఱినీ వేద పురుషుడు వేయికళ్ళలో కాపాడుతూ, ఆయురారోగ్యైశ్వర్యాలను అనుగ్రహిస్తూ, ముందు ముందు ఎన్నో సత్కార్యాలను వారిచే చేయించు గాక అని ప్రార్థిస్తున్నాను.

- వివరణ కర్త

12-9-2000

గుంటూరు.

జి.ఎల్.ఎన్. శాస్త్రి

# ముఖచిత్ర వివరణ

తిత్తిరిపిట్ట వేగంగాతిని క్రక్కిన వేదభాగాన్ని కృష్ణయుజు ర్వేదానికి సంబంధించిన తైత్తిరీయోపనిషత్తుగా చెబుతారు. ఉపనయన సంస్కారముతో రెండవ జన్మ వచ్చే వారిని ద్విజులు అంటారు. వీరు వేదాధ్యయనం చేస్తారు. పక్షులు అండజన్మ, పక్షిజన్మ అని రెండు జన్మలను కలిగి వుంటాయి. కాబట్టి పక్షులను గూడా ద్విజులంటారు. అలాంటి ద్విజత్వం కలిగిన వారికి – ద్విజత్వం కలిగిన తిత్తిరిపిట్ట సంకేతం. అది వేదాన్ని తినడం అంటే అధ్యయనం చేయడం అనీ అది వేదాన్ని క్రక్కడం అంటే అధ్యయనం చేసిన వేదాన్ని మరల ప్రవచనం చెయ్యడం (అంటే ఇంకొకరికి వినిపించునట్లు చెప్పడం) అనీ అర్థం చేసుకోవాలి. కృష్ణయజు ర్వేదానికి సంబంధించిన విద్య కాబట్టి ఈ పిట్ట చిత్రంలో నల్లగా చూపబడింది. పిట్టచుట్టూ క్రక్కబడిన వేదం చిన్న వృత్తంలో చూపబడింది. దాని చుట్టూ మూడు పంచశీర్ష నక్షత్రాలున్నాయి. ఒక్కొక్క నక్షత్రం ఒక్కొక్క వల్లిని, అంటే – మొదటి నక్షత్రం శిక్షావల్లిని, రెండవది బ్రహ్మావల్లిని, మూడవది భృగువల్లిని సూచిస్తాయి. 'ఈ వల్లులలో ముఖ్యంగా ఐదుఐదు చొప్పున ముఖ్యమైన విషయాలు ప్రతిపాదింపబడతాయి' అని ఆ నక్షత్రాల ఐదు శీర్షాలు తెలియ జేస్తాయి.

శిక్షావల్లిలో తెలుపబడే ఐదు ముఖ్య విషయాలు ఏవంటే 1. అధిలోకము 2. అధి జ్యౌతిషము 3. అధి విద్యము 4. అధిప్రజము 4. ఆధ్యాత్మము, ఆనందవల్లి లేదా బ్రహ్మావల్లిలో తెలుపబడే ముఖ్య విషయాలు ఏవంటే 1. ఆకాశము 2. వాయువు, 3. అగ్ని, 4. అపస్సు, 5. పృథివి. ఇంకా అన్నమయ్య, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ పురుషులు. భృగువల్లిలో తెలుపబడే ముఖ్యవిషయాలు ఏవంటే 1. అన్నమయ కోశము 2. ప్రాణమయ కోశము. 3. మనోమయ కోశము. 4. విజ్ఞానమయ కోశము. 5. ఆనందమయ కోశము.

ఈ విషయాలన్నీ గూడా కేంద్రం వద్దవున్న తిత్తిరిపిట్ట క్రక్కిన వేదం యొక్క తేజస్సులోనికే చిట్టచివరకు లీనమౌతాయి అని చెప్పడం కోసం మూడు నక్షత్రాల చుట్టూ ఉన్న పెద్ద వృత్తంలో గూడా తిత్తిరిపిట్ట చుట్టూ చిన్న వృత్తంలో వున్న రంగే చూపబడినది. ఈ తేజస్సు విశ్వగోళం అంతా వ్యాపిస్తుంది అని తెలియజేయడం కోసం దీని చుట్టూ ఆ పెద్దవృత్తాకారపరిధి చూపబడింది.

– జి.ఎల్.ఎన్. శాస్త్రి

ఓం గణేశాయ నమః

# పరిచయము

- కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

ఋషిప్రోక్త మైన వేదవిద్య నిత్యనూతనము. అది మంత్రముల రూపమున మానవుని ధర్మమునకు దైవముచే అందింపబడినది. అట్టి వేదవిద్యను అధ్యయనము చేయుట, బోధ చేయుట, అందు చెప్పబడిన ప్రకారము ఆచరించుట, అట్లాచరించు విధానములను ప్రచారము చేయుట అను నాల్గు పద్ధతుల నవలంబించు వానిని ఆర్యుడందురు. ఆర్యధర్మము పాటించుట వలన ఇహలోకసుఖము, పరలోక సుఖము సిద్ధించును. ఈ సిద్ధి తనకును, తనచే ప్రభావితమైన పరిసరములకును వర్తించును. ఈ ప్రయత్నమునకు సౌలభ్యము చేకూర్చుటకై జగద్గురు పీఠము ఈ గ్రంథములను అందుబాటులోనికి గొనివచ్చుచున్నది.

నవీన శాస్త్ర పరిశోధన, దాని ననుసరించి నాగరిక జీవనము కారణముగా మానవునకు కలిగిన వికాసమునకు, ఆర్య ధర్మమును జత పరుపనిచో మానవునకు సుఖశాంతులు లభింపవు. ఇట్లనుటకు ఈ శతాబ్దిలోని రెండు ప్రపంచ మహాసంగ్రామములే నిదర్శనములు. ఇంకను సంఘమున, సమాజమున నాగరికత పెరిగిన కొలదియు భద్రత తగ్గుట, సంపన్నత తగ్గుట అన్నది గూడ దీనికి నిదర్శనమే! దీనిని అరికట్టి, సంపన్నమైన ఇహపరసాధకమైన సుఖజీవితమును అలవరచుకొనవలెనన్నచో ఏనాటికైనా వేదధర్మము నాశ్రయింపక తప్పదు. మతములలో నొకదానిని పట్టుకొని లాభము లేదు. వేదధర్మము చక్కగా దర్శనము కావలెనన్నచో వేదము నందేమున్నదో తెలియుట ఆవశ్యకము.

వేదము మనలో నాలుగు విధములుగ వర్తించును. ఒకటి శ్వాస, రెండు కంఠనాదము, వాక్యము దాని యర్థము. మూడు మనస్సు, నాలుగు - దేహము. ఈ నాలుగు వరుసగా సామవేదము, ఋగ్వేదము, యజుర్వేదము, అథర్వణ వేదము అని పెద్దల చేత సంకేతము చేయబడినవి. వీనికి సంబంధించిన గ్రంథములను ఆ ఋషులే పలికి యుండుట చేత ఆ గ్రంథమును కూడ వేదములందురు. అనేక

రహస్యములను వివరించుటకు ఈ ఋషులు అనేక సంకేతములను ఉదాహరణములుగా, ఉపమానములుగా, ఉపదేశములుగా సృష్టించియిచ్చిరి. అట్టి సంకేతములు – 'విద్యలు' (Seeds of wisdom) అనబడును. అందొక్కొక్క విద్య ఒక్కొక్క బీజమై, ఒక జాతి వృక్షము వంటి మహాదర్శనమును సాధకుని యందు అంకురింపచేసి, విస్తరింప చేయును. ఒక్కొక్క విత్తనము ఒక్కొక్క ప్రత్యేక వృక్షమునే అంకురింప చేయును. దాని పుష్పములు, రంగులు, వాసన, కాయలు, పండ్లు, రుచి దానివే గాని ఇంకొక చెట్టునకుండవు. ఇట్టి విద్యలు వేద వాఙ్మయమున కొన్ని వేలున్నవి. అన్ని పండ్లచెట్లును, అన్ని కూరల మొక్కలును ఆహారమునకు వినియోగపడినట్లు, దేహపోషణము, ప్రాణరక్షణము చేసినట్లు ఈ మహావిద్యలన్నియు వేద దర్శనమునకు, ఇహపర సాధనమునకు వినియోగపడి సాధకుని తరింప చేయును. దహర విద్య, పంచాగ్ని విద్య, అక్షివిద్య, ఆయతన విద్య మొదలగునవి కొన్ని ముఖ్యమైన విద్యలకు ఉదాహరణములు. వీనిలో పక్షులను సంకేతముగా స్వీకరించిన విద్యలు కొన్ని యున్నవి. సుపర్ణ విద్య, త్రిసుపర్ణ విద్య, హంస విద్య, కపింజల విద్య, తిత్తిరి విద్య, కుశిక విద్య అనునవి కొన్ని ముఖ్యమైన ఉదాహరణలు. "పిట్టకథలు" అను సంప్రదాయము వీని నుండియే ఏర్పడినది.

విచిత్రమైన పిట్టకథలలో తిత్తిరిపిట్ట కథ ముఖ్యమైనది. వేద విద్యను వేగముగా భుజించి ఈ తిత్తిరిపిట్ట మరల క్రక్కినదట. దానిని పిట్టల రూపమున స్వీకరించి, భుజించిన బ్రహ్మవేత్తలైన శిష్యులు 'తైత్తిరీయము' అనబడు కృష్ణ యజుర్వేద శాఖకు సంబంధించిన వారైరి. ఉచ్ఛ్వాస – నిశ్వాసములకును, జీవ – దేహ సంబంధమునకును గల కథలు పిట్టకథలుగా బ్రహ్మవిద్యయందు సంకేతింపబడినవి. దేహమున ప్రాణ ప్రతిష్ఠ చేయుచు వచ్చుచు పోవుచున్న శ్వాసయే పక్షిగా నుపదేశింప బడినది. దానిని హంస మంత్రము రూపముగా నుపదేశించునపుడు హంసయను పిట్టగను, హరిమంత్రముగా నుపదేశించునపుడు మూపున విష్ణువును ధరించిన గరుత్మంతుడుగను, సంకేతింపబడినవి. ఉచ్ఛ్వాస నిశ్వాసములు రెండును ఈ పక్షికి రెండు రెక్కలు. ఆయుర్దాయమున గల సంవత్సరములు, మాసములు, పక్షములు, వారములు, అహోరాత్రములు, మున్నగునవి రెక్కల ఈకలు. యుగములు, మహాయుగములు, కల్పములు, మహాకల్పములు తోకయందలి ఈకలు. అంతర్యామి

అనుభూతి కలవాని జీవితమున గరుత్మంతుడు విష్ణుని వాహనముగా చెప్పబడెను. అదిలేని జీవుల జీవితమున అమృత కుంభమును కొని తెచ్చుచున్న గరుడుడుగా సంకేతింపబడెను. తాము నేర్చుకొనిన అంశములనబడుదర్భలపై ఈ అమృత కుంభము దింపబడుటయు, కాలబద్ధులైన జీవులు పాములుగా దర్భలు నాకుటయు పిట్టకథగా పురాణ విద్యలలో ముఖ్యవిద్యగా సంకేతింపబడినది. పిప్పల వృక్షముపై నున్న ఒకే సుపర్ణుడు అంతర్యామి, బహిర్యాములనబడు రెండు సువర్ణములుగను, ఈ సృష్టిలో బహుశాఖల జ్ఞాన, కర్మల ననుభవించుచున్న రంగు, రంగుల రెక్కలు గల అనేక సువర్ణములుగను ఋగ్వేదము వర్ణించుచున్నది. ఒకే సుపర్ణుని - ఇంద్రుడు, మిత్రుడు, మున్నగు బహువిధములుగా పెద్దలు వర్ణించుచున్నారని గూడ చెప్పబడినది.

జీవునకు - దేహమునకు పెండ్లి కుదుర్చు పురోహితునిగా సుపర్ణుడు చెప్పబడినాడు. అదేవిధముగా కంఠస్వరమునకును, శ్వాసకును గల సంబంధమును భూమికి దింపువాడుగా 'హంస' అను పక్షి వర్ణింపబడెను. ఈ హంస సృష్టికర్త వాహనము. వాక్కు అనబడు సరస్వతి ఈ హంస వాహనము నెక్కి "సోహం" అను శ్వాసయందు పచారులు చేయుచుండును. అదే విధముగా కంఠనాదమునకును, మనస్సునకును గల సంబంధము తిత్తిరిపిట్టగ వర్ణింపబడెను. ఉచ్చరించు ధ్వనిని బట్టి మనస్సు యొక్క అనుభవము మారును. పిడుగు పడినపుడు గుండెలదురును. మనస్సు దిమ్మర బోవును. సంగీతము వినిపించినపుడు మనస్సు ప్రాణమునకు చక్కని కుటీరముగా కట్టుకొనును. ఇట్లే అకారాది క్షకారాంత ధ్వనులలో ఒక్కొక్కదాని యుచ్చారణమునకు మనస్సుపై నొక్కొక్క ప్రభావమున్నది. దీనిననుసరించి మరల ఈ మనస్సు ఎట్టి శబ్దముల నుచ్చరింపవలెనో నిర్ణయించుకొనవలెను. దానితో భాష పుట్టును. పుట్టిన భాషలోని ధ్వనుల ప్రయోగముచే మరల ప్రభావితమైన మనస్సు ఆయా ధ్వనులకు అర్థములను నిర్ణయించుకొనును. దీనితో శబ్దార్థములు సాహిత్యముగ దిగి వచ్చును. దానికి సంకేతము చిలుక. ఈ చిలుక జోస్యమే 'శుకమహర్షి' అను పదమునకు గల మంత్రార్థము. పరాశరుడు, వ్యాసుడు, శుకుడు అనునవి తండ్రి, కొడుకు, మనుమడు పేర్లుగా పెట్టుకొని ఉండవచ్చును గాని అవి ఆ పేర్లకు వెనుకనున్న సంకేత విద్యలను కూడ సూచించుటకు వాడబడినవి. అట్లే,

పరాశరుని తండ్రియగు శక్తి పేరు గూడ. వసిష్ఠుడను పదము సౌరకుటుంబములోని ఒక వెలుగుల ముద్దకు సంకేతముగ వేదములందు వాడబడినది. వసిష్ఠుడనగా వసువులు గలవాడు. ఇది ధనిష్ఠుడో, బలిష్ఠుడో వంటి పదము. ఇంతకును ఒక్కొక్క పదము ఒక్కొక్క విద్యకు సంకేతము. తిత్తిరిపిట్టకథలోని తైత్తిరీయము కూడ కృష్ణయజుర్వేద సంహితలోని ఉపదేశమునకు సంకేతము. నాలుగు వేదములలో నొక్కొక్కదాని మోక్షవిద్యా రహస్యోపాసనము ఒక్కొక్క ఉపనిషత్తుగా నుపదేశింప బడినది. తైత్తిరీయువేదమగు కృష్ణయజుర్వేదమునకు మోక్షరహస్యవే తైత్తిరీయోపనిషత్తు. ఇందు అనేక రహస్య విద్యలు, సంకేతములు ఉపదేశింపబడినవి. వేదము, ఉపనిషత్తు అను గ్రంథములు స్వర ప్రధానములు, శ్రుతి ప్రధానములు అగు మంత్రములు. అనగా మననము చేయు వారిని రక్షించునవి. వానికి గల అర్థతాత్పర్యాదులను జతపరచుకొని మననము చేసికొనినచో ప్రయత్నము ఫలవంతముగ నుండును. ప్రస్తుత గ్రంథము తైత్తిరియోపనిషత్తులోని శిక్షావల్లి, ఆనందవల్లి లేక బ్రహ్మవల్లి, భృగువల్లులకు అపూర్వమైన వివరణము.

శిక్షావల్లి అధ్యాయములో ఐదు మహా సంకేతములు చెప్పబడినవి. ఈ అధ్యాయమొక ముఖ్యమైన విద్య. ఇందు మానవుడు వేదము నభ్యసించుటకు కావలసిన ఐదు తాళము చెవులవంటి ప్రయోగములున్నవి. అవి–

1. అధిలోకము (Application to the planes of the creation)
2. అధిజ్యోతిషము (Application to the layer of light)
3. అధివిద్యము (Application to the process of learning of knowing)
4. అధిప్రజము (Application to the process of reproduction)
5. అధ్యాత్మము (Application to the vehicle of utterence)

ప్రకృతి నుండి గ్రహించిన ఏ సత్యమునైనను ఈ ఐదు మహా సంకేతముల దీపపు వెలుగులో చదువుకొనవలయునని ఉపదేశింపబడినది.

సూర్యచంద్రుల వలన నేర్పడు తిథులు శుక్లపక్షమునందు 15, కృష్ణపక్షమునందు 15. అందు శుక్ల పక్షమందలి 15 తిథులు 5 + 5 + 5గా

విభజింపబడి 'అధిలోకము' అనబడు బాహ్య ప్రపంచ మందలి 15 అంశములుగా సంకేతింపబడినవి, 1. పృథివి 2. అంతరిక్షము 3. ద్యౌ 4. దిశలు 5. అవాంతరదిశలు I. అగ్ని II. జ్యోతి III. ఆదిత్యుడు IV. చంద్రుడు V. నక్షత్రములు 1. ఆపస్సు 2. ఓషధులు 3. వనస్పతులు 4. ఆకాశము 5. ఆత్మ.

కృష్ణ పక్షము నందలి 15 తిథులకు సంకేతములు అధ్యాత్మము అను పేరనుపదేశింప బడినవి. 1. ప్రాణము, 2. అపానము 3. వ్యానము 4. ఉదానము 5. సమానము. A. చక్షువు B. శ్రోత్రము C. మనస్సు D. వాక్కు E. త్వక్. 1. చర్మము 2. మాంసము 3. స్నాయువు 4. అస్థి 5. మజ్జ

ఈ విభాగము నధిష్ఠానముగా జేసికొని పంక్తి ఛందస్సు రూపమున జీవుడు అంతర్బహిర్లోకములను గూర్చి ప్రవచనము చేసెననీ చెప్పబడినది.

ఇట్లే ఇందలి మూడవది త్రయీవిద్య. ఇది భూః, భువః, సువః అను వ్యాహృతుల స్వరూపము నుపదేశించి, 'మహః' అనబడు నాల్గవ లోకము యొక్క అనుభూతిని తురీయస్థితిగా స్థాపించును. ఛందస్సుల కధిపతియైన కంఠధ్వనిని విశ్వరూపుడగు ఋషభుడుగ నుపదేశించుట ఇందలి మరియొక విద్య. "బ్రహ్మచారులు నా దగ్గరకు వత్తురుగాక" మొదలగు మంత్రములను న్యాసము చేసుకొనుట ఈ విద్య యొక్క స్వరూపము. ఇక అంతర్హృదయమైన మరియొక ఉపదేశము, "సయఏషో అంతర్ హృదయ ఆకాశః" అనబడు మంత్రములలో నిది యొసగబడినది. ఓంకారమును పరబ్రహ్మముగను, ఈ సృష్టిని సర్వముగను చూచుచుండుట, వినుచుండుట, సంభాషణాదులలో గూడ స్మరించుచుండుట, శ్వాసను గూడ ఓంకారముగా ధ్యానము చేయుట మొదలగు బ్రహ్మ విద్య ఇందలి "ఓమితి బ్రహ్మ" మొదలగు మంత్రములలో నుపదేశింపబడినది. ఈ సమస్త విద్యలతో కూడిన వేదవిద్యను అధ్యయనము చేసినవాడు జీవితాంతము వరకు ప్రవచనము చేయుచునే యుండవలెనను మహావృతము "ఋతంచ స్వాధ్యాయ ప్రవచనేచ" మున్నగు మంత్రములలో చెప్పబడినది.

నేనను ప్రజ్ఞయే విత్తనము నుండి వృక్షముగా విచ్చుకొనునట్లు ధ్యానము చేయవలెనను వృక్ష విద్య "అహం వృక్ష్యస్య రేరివ" అను మంత్రములలో

ప్రసాదింపబడినది. ఈ వేద విద్యామార్గము ననుసరించి తరింపతలచినవాడు జీవితమును ఏ నియమముల ప్రకారము నడుపుకొనవలెనో ఆ నియమములను గురువు శిష్యులకు చెప్పవలసిన విధానమంతయు "వేదమనూచ్య" మొదలగు మంత్రములలో నుపదేశింపబడినది. "ఇది ఆ దేశము, ఇది ఉపదేశము, ఇది వేదమందలి ఉపనిషత్తు, ఇది అనుశాసనము, ఈ విధముగ ఆచరింపవలెను" అని నిర్దేశింపబడినది.

రెండవదియగు ఆనందవల్లిలో భగవంతుడు సత్యము, జ్ఞానము, అనంతముగా అనుభవింపబడుననియు; అన్నమయుడు, ప్రాణమయుడు, మనోమయుడు, విజ్ఞానమయుడు, ఆనందమయుడుగా, పంచకోశములలో ఈ సృష్టియందంతర్యామిగా వర్తించుచున్నాడనియు, జీవుడుగా నుపాసించి దేవుడుగా ప్రవేశించుచున్నాడనియు స్థాపింపబడినది. దేవుడే తానింతమందిగా పుట్టి ఇన్ని రూపములతో ఆనందింప దలచెననియు, వేడిమి వెలుగు రూపమున తపస్సు చేసి సూర్యుడుగా వాని నుండి సృష్టిగా దిగి వచ్చెననియు గూడ స్థాపింపబడినది. అటుపైన ఆనందసాధనను చేయవలసిన ఉపాసన; నేను, అతడు అను పదములను వాడుటలో మంత్రములుగా నెట్లు వాడి తరింపవలెనో గూడ చెప్పబడినది. మనస్సు, వాక్కులు, ఆనందమును నిర్వచింపలేవనియు, ధ్యాన రూపమున అది ఆనందమున నిమిడి వర్తింపవలెననియు కూడ చెప్పబడినది. ఆనందము ఒక్కొక్క కక్ష్యలో కొంత కొంత అనుభవింపబడుననియు ఇట్లు సూక్ష్మ సూక్ష్మములైన కక్ష్యల నారోహణము చేసి బ్రహ్మానందము ననుభవింపవలెననియు గూడ చెప్పబడినది.

మూడవది యగు భృగువల్లి యందు తండ్రికిని పుత్రునకును గల సంబంధము భృగువునకు వరుణునకును గల సంబంధముగా ఇతి హాసము కల్పింపబడినది. ఈ తండ్రి కొడుకుల సంబంధమే కఠోపనిషత్తు నందు మరొక విధముగ చెప్పబడినది. ఇందు చెప్పబడిన భృగువే అందు చెప్పబడిన ఉశననుడు అనబడు వాజశ్రవనుడు. భృగువు, శుక్రుడు, భార్గవుడు, ఉశనసుడు, కవి అను పదములు వేద వాఙ్మయమున సమానార్థకములై ఒకే అంశమునుపదేశించును. "కవులలో నేను ఉశనసుడనబడు కవిని" అని గీతలో సూక్ష్మోపదేశము చేయబడినది.

జనన మరణముల నడుమ గల దేహబద్ధ జీవితమును యమలోకముగా కఠోపనిషత్తు బోధించును. ఇచ్చట యమలోకమనగా యమనియమాదులతో యమింపబడు లోకము. భృగువునకును వరుణునకును సంవాదము రూపము - ఈ భృగువల్లిలో పంచకోశముల ఉపాసన, సాధన, తరణోపాయములుగా చెప్పబడినది. ఇందు అన్నమయకోశము మొదలు అన్ని కోశములును బ్రహ్మము యొక్క అంతర్యామిత్వమే యని సోపాన క్రమమున స్థాపింపబడినది. వేదమార్గమున బ్రహ్మవిద్యను స్థాపించువాడు బ్రాహ్మణుడు. అతడు వహింపవలసిన దీక్షలోని నియమములు దీని చివర భాగమునందు చెప్పబడినవి.

1. అన్నమును నిందింపరాదు, పారవేయరాదు. శరీరము, అన్నము, ప్రాణము ఒకేపరబ్రహ్మ యొక్క రూపములని మరువరాదు.

2. అభిమానము, గర్వము మొదలగు కారణములతో అన్న పానీయములను తిరస్కరించుట గాని, వలసిన చోట దానము చేయుకుండుట గాని చేయరాదు. జలములలో అగ్నిని, అగ్ని యందు జలములను ధ్యానము చేయవలెను.

3. ఏ పని చేసినను పదిమందికి అన్నము వర్ధిల్లునట్లు సంకల్పించి పనికి వచ్చిన దానినే చేయవలెను.

4. తనకున్నంతలో నెవరికిని చోటులేదనక దానము చేయవలెను. ఇట్టి నియముములను చెప్పిన వెనుక పరబ్రహ్మమును ఏ విధముగా ధ్యానించిన నే ఫలము కలుగునో అట్టి ఫలశ్రుతి చెప్పబడినది. దానికి చివర "ఈ సూర్యునిలో నెవడు వెలుగుచున్నాడో అతడే నేను" అను మోక్షమంత్రము నుపాసించినవాడు అన్నమయాది కోశములలో జీవించుచున్ననూ బద్ధుడుగాక తరించునను ఫలశ్రుతితో ఉపనిషత్తు పరిసమాప్తి చేయబడెను.

ఇది మోక్ష విద్య గనుక దీని నుపాసించువారు భోగ మోక్షముల ననుభవించి తరింపగలరు.

ఈ మంత్రములలో నేమున్నది, అందలి రహస్యములెట్టివి, వాని

ప్రయోగమెట్టిది మొదలగు ముఖ్యాంశములీ గ్రంథమున మన శాస్త్రిగారిచే ఎల్లరకును సుబోధకమగునట్లుగా వివరింపబడినవి. చిరకాలము జగద్గురు పీఠమునందలి వివిధ ప్రాంతముల విద్యార్థులకు వేద విద్యను నేర్పుచున్న అనుభవశాలి జి.యల్.యన్.శాస్త్రి తన బోధనామృతమును అనుభవసరళిలో జతపరచి యీ గ్రంథమును విద్యార్థుల కొరకై పొందుపరచిరి. ఇట్లే మిగిలిన ఉపనిషద్భాగములకు, మరికొన్ని మంత్రములకు చక్కగా అర్థమును, పరమార్థమును వివరింపబోవుచున్నారు. మన సంస్థలో వివిధ ప్రాంతముల యందు వేదాధ్యయనము దాదాపు ఇరవై సంవత్సరాలుగా జరుగుచున్నది. దాని ప్రణాళికను స్థిరపరచి, తరగతుల నేర్పరచి, పరీక్షలు పట్టభద్రత ఏర్పరచుచున్నాము. గనుక విద్యార్థులకు గ్రంథము లభ్యము చేయుటకై ఈ వివరణతో గూడిన పుస్తకములను గ్రంథములుగా ప్రచురించెదము. ఈ ప్రయత్నము చేయువారికిని దీని ఫలితములను పొందువారికిని వేదపురుషుడు ఆయురారోగ్యైశ్వర్యములు చేకూర్చి, ఇహ పర సౌఖ్యములను సమకూర్చును గాక !

**రుధిరోద్గారి**

**పుష్య శుద్ధ ద్వాదశి**

# సంప్రార్థనము

## జగన్మాత

శ్లో॥ శర్వాణి శారదారాధ్యే
శరచ్చంద్ర నిభాననే।
శరణ్యే త్ర్యంబకేదేవి
శాతోదరి నమోఽస్తుతే॥

## ప్రణవ బ్రహ్మము

మ॥ 'కణ' రూప 'ప్రథమంబు' నవ్య 'నవ' సంఖ్యల్ తెల్పు 'బ్రహ్మ'దులున్
'అణు' 'కేంద్రాం' తర 'సూక్ష్మమున్' – 'సుఘన' దివ్యంబైన 'బ్రహ్మాండము'న్
'క్షణ – కల్పా' న్విత 'బీజ – వృక్ష' విధ విజ్ఞానమ్ము నిక్షిప్తమౌ,
'ప్ర–ణవ' బ్రహ్మమునుచ్చరింతు మొదటన్, ప్రజ్ఞావికాసార్థమై

## గణపతి

కం॥ అక్షర గణపతి – వాక్స
ల్లక్షణ గుణ, సిద్ధి, బుద్ధి, లబ్ధికరుందున్,
అక్షరకుక్షి, వినాయక,
నిక్షిప్తాధార చక్రనిలయుని గొల్తున్

## కులదైవము – సుబ్రహ్మణ్యస్వామి

సీ॥ దేహపార్వతికి నాత్మేశునకును యోగ
సారమై పుట్టు కుమారుడెవరు ?
శుక్రధాతువు యొక్క సూక్ష్మతేజమ్ముగా
నార్యుడెవరు సుషమ్నాగ్నియందు ?
షట్చక్రకృత్తికా స్వచ్ఛసారసుధల
నందుచు పెరుగు షడాస్యుడెవరు ?
ఆధార చక్ర పదార్థతత్త్వమ్మును
సత్త్వమ్ముగా మార్చు శక్తుడెవరు ?

గీ॥ సర్పవాలము నుండి శీర్షమ్ముదాక
వ్యష్టికుండలినీవల్లి కధిపు డెవరు ?
అట్టి స్కందుండు కులదైవమగును మాకు
ముందు ప్రార్థింతు వానినే ముక్తి కొఱకు

కం॥ విప్రబ్బెమ్మొందగ విబుధులు
నబ్రహ్మణ్యమ్ము పోయి ఆసాంతముగా
సుబ్రాహ్మీమయమగుటకు
సుబ్రహ్మణ్యుని గొలిచెద శుచిమంతుడనై

## గాయత్రి

శా॥ ఆయుర్దాయ గుణాభివృద్ధికిని ధన్యత్వమ్ము చేకూరగా,
సాయంప్రాతోదయ మధ్యకాలములలో సంధ్యా జపమ్మందునన్,
ధ్యేయమ్మందున ప్రజ్ఞ గూర్చి, పెడబుద్ధిన్ తీరుగా దిద్దు, శ్రీ
గాయత్రీ పరదేవతన్ కొలిచెదన్ కైవల్య సంసిద్ధికై

## తల్లి

మ॥ నవమాసమ్ములు నన్ను మోసి, తన ప్రాణస్పందనమ్మిచ్చి, యీ
నవరంధ్రముల కాయమున్ కనుచు నానందాబ్ధిలోమున్గి, నా
లవరూపమ్మును పెంచగా తన తనూలావణ్యమర్పించి, న
న్నవనిన్ నిల్పిన మాతృమూర్తియగు – శేషమ్మన్ సదా కొల్చెదన్

## తండ్రి

మ॥ సిరులన్ గోరక, ధర్మమార్గముననే జీవించి, సంతానమే
స్థిరమౌసంపద యంచునెంచి, తన యాస్తిన్ శక్తి నర్పించి, సు
స్థిర విద్యాసుగుణమ్ములున్ కలుగురీతిన్ పెంచి, పోషించి, ఈ
శ్వరునిన్ జేరిన తండ్రియైన – హనుమచ్ఛాస్త్రిన్ సదా కొల్చెదన్.

## గురువు

మ|| స్థిరచిత్తుండును, బుద్ధిశాలి, ఘనసౌశీల్య స్వభావుండు, సా
దరహాసద్యుతిమంతుడున్, సకల విద్యా సారచిద్రూపుడున్,
నరరూపాచ్యుత పుణ్యమూర్తి, భవచింతల్ దీర్చు సౌజన్య సుం
దరుడౌ, శ్రీగురు వెక్కిరాలకుల కృష్ణస్వామినే గొల్చెదన్.

## పరమ గురువు

మ|| భవరోగార్త జనాళిబాధలు హరింపన్ జేసి రక్షించగా,
నవమంత్రమ్ములు సృష్టిజేసి తన జ్ఞానమ్మున్ ప్రసాదింపగా,
అవనిన్ తిండికి లోటు లేనటుల యోగార్థాదులన్సాకగా
శివధాత్రచ్యుత తత్త్వమూర్తియగు శ్రీ సీవీవినే గొల్చెదన్.

## బ్రహ్మ

మ|| అన్నియు లీనమై, ప్రళయమందుననున్న విశాల విశ్వమున్
తిన్నగ పూర్వ రూపముగ తీరుగ తెచ్చెడి సృష్టిలోన, తా
నెన్నడు సృష్టికర్తనను నించుక భావము పొందకుండగా,
"తన్ను" ననుగ్రహింపుమని – తండ్రిని కోరిన బ్రహ్మగొల్చెదన్

## విష్ణువు

శా|| ఆరాధింతును చిత్తశుద్ధిగ ఘనశ్యామప్రభాదేహునిన్,
క్షీరాబ్ధిస్థిత శేషతల్పశయనున్, శ్రీ సేవితాంఘ్రిద్వయున్,
స్మేరాస్యద్యుతిమత్క పోలయుగళున్, శ్రీభూపతిన్, స్వర్ణకే
యూరాలంకృత బాహునిన్, ప్రబలరమ్యోరోలసత్ కౌస్తుభున్

## మహేశ్వరుడు

మ|| శశిరేఖామర వాహినీకలిత శీర్ష స్థానసంశోభితున్,
శశిసూర్యానలనేత్రునిన్, విమలభస్మ శ్రీ సుసంపన్నునిన్,
విశదప్రాభవ నీలకంఠపరితోవేల్లత్ సమీరాంధసున్,
దశకంఠార్చిత దివ్యమూర్తి, శివునిన్ – ధ్యానించి పూజించెదన్.

## సరస్వతీ దేవి

గీ|| పలుకు "సంకల్ప"మై "పరా" వాక్కుగాను,
చలిత "భావము" - వాక్కు "పశ్యంతి" గాను,
భావ "రూపమున్" "మధ్యమా" వాక్కుగాను
వ్యక్తభా "షోచ్చరణము"గ "వైఖ"రగుచు,
నాల్కపైనాడు "వాణికి" నతులు శతము.

## లక్ష్మీదేవి

కం|| పద్మముఖి, పద్మగంధిని,
పద్మాక్షిని, పద్మధాత్రి, పద్మవికాసన్,
పద్మిని, పద్మనివాసిని
పద్మప్రియ, పద్మనాభపత్నిని గొలుతున్.

## పార్వతీదేవి

కం|| "ఉ"  అనిన నాపకుండగ,
"మా" యనిననుగూడ తపము మానక చేయన్,
ధ్యేయార్థ దేహమందిన-
"మాయమ్మ" "నుమను" గొలుతును మానస మందున్

## శ్రీరాముడు

మ|| నతులన్ జేయుచు మ్రొక్కెదన్ - శుభకరజ్ఞాన ప్రకాశాన్వయున్,
పితృవాక్పాలన ధీరునిన్, సదయగంభీరాస్య సంశోభితున్,
స్మితభాషిత్వ సువర్తనున్, క్షితి సుతాసీతైక పత్నీ వ్రతున్,
మితభాషిత్వ ఋతవ్రతున్, సుగుణసమ్మిశ్రుండు - శ్రీరామునిన్.

## శ్రీ కృష్ణుడు

గీ|| బహుళ భార్యలు గల్గిన బ్రహ్మచారి,
భోగ భాగ్యమ్ములందిన యోగవిభుడు,

బుల్లినోటను విశ్వమ్ము చెల్లువాడు,
నెమలి ఈకతో భ్రమ పెట్టునేర్పు గలిగి
గుల్లపుల్లతో గుండెలన్ కొల్లగొట్టు-
నల్లనయ్యకు నర్పింతు నతులు శతము.

## జగత్పిత

కం॥ శుక, పశు, ఝుర, నిర్జర, నర,
పిక, గిరి, తరు, నిధులతోడ విరియును జగమున్,
శకలములుగ కనబడు నీ
సకలము నొక దేహమైన స్వామిని గొల్తున్.

కం॥ దేవాలయ దేహములో
దేవతలందఱును దేహ దివ్యాంగములై,
ఈ విశ్వ దేహమందున
దేవునిగా చెల్లునట్టి దేహిని గొలుతున్

- జి. యల్. ఎన్. శాస్త్రి

# వివరణకర్తృవంశ కాలాదులు

కం॥ నిండైన విగ్రహమ్మును,
పండిన డెందమ్ము గల్గి, బ్రహ్మకు సముడౌ
కౌండిన్య ఋషికి చెందిన
పండితవంశమ్ము గొర్తి వారిది భువిలో

కం॥ పొంగిన ఉత్సాహముతో
మంగళకరమతులునౌచు మాముత్తాతల్
సింగముగనిలిచి చేసిరి
సంగమ్మునువీడి సప్తసంతానమ్ముల్

సీ॥ రంగయ్య ముత్తాత, రామ్మూర్తి మా తాత,
అవ్వబుచ్చెమ్మ, మంగమ్మ బామ్మ,
సహృదయ సౌశీల్య సంస్కారపూర్వక
సద్గుణుండు హనుమచ్ఛాస్త్రి తండ్రి,
సాధు సౌజన్య సంస్కార సద్గుణవతి,
శాంతరూపమ్ము శేషమ్మ తల్లి,
అన్నయ్యలిరువురు ననుజులిద్దరు నాకు
అక్కలిద్దరు, చెల్లెలొక్క తేను

ఆ॥వె॥ కైకలూరు వద్ద కల్దిండి ఊరుకు
దాపునందు వెంకటాపురమ్ము
నేను పుట్టినట్టి నేలయై యుండగా-
పట్ట విద్య సాగె బందరందు.

గీ॥ విక్రమాశ్వీజ ద్వాదశి వెన్నెలందు,
భాగ్య-శశితోడ, పాతాళ-భానుకుజులు,
భ్రాతృ - శుక్ర, బుద్ధి - బుధ, లాభ - గురుశనులు
నుండి, శతభిషా నక్షత్ర యుక్త మిధున
లగ్న (సాయన కర్కట లగ్న) మందు

కం॥ పదిపై తొమ్మిది వందల
పదినాల్గుల వత్సరమున, పదియవ నెలలో,
పది రెండవ తేదీ నిశి
పదకొండుంబావునకును ప్రభవముగంటిన్.

కం॥ నను 'లక్ష్మీనారాయణ'
యని మాతామహుని లక్ష్మయార్యుని పేరున్
ఘనముగ పెట్టెను తండ్రియు
తన తండ్రిని చూచుచుండె తల్లియు నాలో.

కం॥ శాస్త్రములు చదవవలెనని
'శాస్త్రి' యనియు కలిపినారు జననీ జనకుల్
'శాస్త్రి' యనియు 'జీ ఎల్లెన్
శాస్త్రి' యనియు పిలుచుటయ్యె సామాన్యముగా

కం॥ బందరు, కాశీ, వాల్తే
రందు జదివితి పరిశోధనాంతము వరకున్,
కుందనపు బ్రహ్మవిద్యా
మందారమ్మిచ్చె కృష్ణమాచార్యుండున్

కం॥ మిత్రునివలె నాదుకొను క
ళత్రము 'విష్ణుప్రియ' విమలచరిత, మరియున్
పుత్రిక – 'అనంత శశికళ'
పుత్రుడు 'శివసుందరుండు' పుణ్యఫలమ్ముల్.

గీ॥ పరమనైష్ఠిక స్వచ్ఛందభావ జీవి,
బంధరహితుడు, బహుళ సద్గ్రంథకర్త,
శేషయార్య సర్వాకుల శేఖరుండు,
మహిత గాంభీర్యమౌని మా మామగారు.

–జి. ఎల్. ఎన్. శాస్త్రి

శా॥ శ్రీరామాయణ భారతార్థములతో శ్రీకారమున్ జుట్టి, సం
సారా క్రాంత విలక్షణారహిత సంస్కారార్థ మార్గ ప్రయో
గారంభ ప్రథమోపదేశయుత వేదాంతార్థముల్ జెప్పె, సు
స్మేరాస్య ప్రభతోడ - నట్టి గురువౌ - శ్రీ కృష్ణమాచార్యకున్

సీ॥ దర్శింపగాగోరు ధ్యాన చిత్తముతో
నాయార్తి నావాహనముగ నిచ్చి,
హృదయ సింహాసనమ్మునెదుట సిద్ధము జేసి
పరవశ బాష్పార్ఘ్య పాద్యమిచ్చి,
స్వచ్ఛమానస సరోవర జలమ్ముల యందు
స్నానమ్ము చేయించి మేను తుడిచి,
భావనా తంతువుల బంగారు జలతారు
పట్టు వస్త్రమ్ములు కట్టనిచ్చి,
ఆపాద మస్తమ్ము నరసి నే జూచెడి
తీరు నామముగాను తీర్చిదిద్ది,
నీతినే యజ్ఞోపవీతమ్ముగా నిచ్చి
నాకీర్తి రేఖల నగల నిచ్చి,
సంస్కార వాసనా సౌమ్యధూపమ్మిచ్చి
జ్ఞాన దీపారాధనమ్ము నిచ్చి,
మధురానుభవ జన్మమమతాన్నమును బెట్టి
ముక్త సంగఫల తాంబూల మిచ్చి,

తే॥గీ॥అంతరోత్తేజ కర్పూర హారతిచ్చి,
పూర్ణ సంస్కారధీ మంత్ర పుష్ప మిచ్చి,
కృష్ణమాచార్యునర్చించి తృప్తిగాను
అంకితమ్మొదు తైత్తిరీయమ్ముతోడ

-జి. ఎల్. ఎన్. శాస్త్రి

# నేపథ్యము

ఈ భూగోళము మీద ఉన్న సర్వజీవులు పార్థివులు. అనగా పృథివికి సంబంధించిన వారు. ఈ భూమిపై ఆధారపడినవారు. ఈ భూమి సత్యమునకు కట్టుబడి సూర్యుని చుట్టును తిరుగుచున్నది. ఆ సూర్యుడు ధర్మమునకు కట్టుబడి ఉన్నవాడగుటచే అంతరిక్షములో గల సూర్య కుటుంబ బాధ్యతను వహించుచున్నాడు. ఎన్నడును మారని ధర్మము(లు) ఈ అంతరిక్షములో అంతర్లీనమై ఉన్నది (వి). దానిపట్ల మన బుద్ధి వికసించినపుడు ఆ ధర్మమును మనము క్రొత్తగా కనిపెట్టినట్లు చెప్పుకొనుచున్నాము. కనిపెట్టిన రోజు నుండి మాత్రమే మనకు ఆ ధర్మమును గుఱించి తెలిసినను - మనము కనిపెట్టక పూర్వమునుండి గూడ ఆ ధర్మము అంతరిక్షములో అంతర్లీనమై సాధ్యస్థితిలో వున్న సత్యముగా ఉన్నదని తెలుసుకొనవలెను. ఉదా: మొట్ట మొదటగా మానవుడు సముద్ర జలమును త్రాగిన నాడు 'సముద్రపునీరు ఉప్పగా నుండును' అని తాను కనిపెట్టినట్లు చెప్పును. కాని, సముద్రపు నీరు అంతకు ముందు గూడ ఉప్పగానే ఉండి ఉండునను విషయమును మరచిపోరాదు. అనగా, 'సముద్రపు నీరు ఉప్పగా నుండును' అను ధర్మము అంతరిక్షములో అంతర్లీనమై ఉన్న సత్యమేగదా! అట్లే, పరమాణువులో ప్రోటానులు, ఎలక్ట్రానులు, న్యూట్రానులు ఉన్నవని శాస్త్రజ్ఞులు చెప్పిననాటి నుండియే కాక అంతకు పూర్వముగూడ అట్లే అవి పరమాణువు నందు ఉండి ఉండును! ఈ విధముగా అంతరిక్షములో అంతర్లీనమై ఉన్న చెక్కు చెదరని సత్యములనే 'వేదము' అందురు.

## వేదము అపౌరుషేయము :

మనము చదువుకొను కొన్ని పుస్తకములకు ఆ పుస్తకములను వ్రాసిన గ్రంథకర్తలుందురు. (There will be some body to claim the authorship for any book) ఎక్కముల పుస్తకములో ఎక్కము లుండును. అంకెల మధ్యగల కొన్ని ధర్మములు ఈ ఎక్కముల పుస్తకములలోనుండును. మొట్టమొదటగా ఈ ఎక్కములను చెప్పిన వారికి పూర్వము గూడ ఈ అంకెల ధర్మములున్నవి. ఉదా: 6 X 6 = 36 అని మనకు తెలియుటకు పూర్వము గూడ 6 X 6 = 36

అనునది సత్యమే గదా ! అనగా, ఎక్కములకు గ్రంథకర్త లేదు (No body can claim the authorship for multiplication tables). ఈ ఎక్కములకు ప్రత్యేకించి ఎవరో ఒక పురుషుని యొక్క కర్తృత్వము లేదు కాబట్టి వీటిని అపౌరుషేయములు అనవలెను. అట్లే, అంతరిక్షములో అంతర్లీనమై ఉన్న శాశ్వత ధర్మములను ఒక గ్రంథముగా, ఒక భాషలో వ్రాసుకొనినచో అది ఆ భాషలో వ్రాసుకొనిన 'వేదగ్రంథము' (A text book of technical know - how of space and nature) అగును. అనగా, గ్రంథస్థము చేయబడిన వేదమును 'వేదగ్రంథము' అనవలెను. అంతరిక్షములో అంతర్లీనమై వున్న శాశ్వత సత్యములను, ధర్మములను తెలుపు ఇట్టి వేద గ్రంథమునకు గూడ ప్రత్యేకించి ఒక పురుషుని యొక్క కర్తృత్వము లేదు కాబట్టి - వేదమును గూడ అపౌరుషేయము అని భారతీయులు చెప్పుదురు.

## వేదజ్ఞానము - బుద్ధి :

కేవలము ఇంద్రియములచే తెలుసుకొను విషయములనే అంగీకరించు వారిని భౌతికవాదులు' (Materialists) అందురు. జ్ఞానము - ఇంద్రియములచేత తెలుసుకొనబడునది మాత్రమే కాదు. పంచేంద్రియములకు అందని, పంచేంద్రియములు గ్రహించలేని విషయములు గూడ ఉండును. పంచేంద్రియములకు గోచరమగువానినే అంగీకరించు భౌతికవాది కూడ - పంచేంద్రియములకు గోచరముకాని 'బుద్ధి' అనునది ఉన్నదని అంగీకరించవలసి యుండును. అంగీకరించనిచో మనము 'నీకు బుద్ధిలేదా?' అని ఆ భౌతికవాదిని అడుగవచ్చును. అప్పుడు అతనిలో పంచేంద్రియములకు గోచరము కాని 'బుద్ధి', 'కోపము' బయటపడును. పంచేంద్రియములకు సంబంధించని ఈ 'బుద్ధి' ఉండుటచేతనే మానవుడు వివేకవంతుడై జంతువుల కన్న ఉన్నతుడుగా గుర్తింపబడు చున్నాడు. అవివేకముగా పనిచేసిన వానిని 'బుద్ధిలేదా గాడిదా ?' అని పెద్దవారు తిట్టుటను గూడ మనము వినుచుందుము. ఈ బుద్ధిచేతనే మానవుడు పంచేంద్రియాతీత జ్ఞానమును గూడ గ్రహించుట (Receive), ధారణ చేయుట (Retain), గుర్తుతెచ్చుకొనుట (Recall or Recollect), మరియు గ్రహించిన

వాటిని మరల వ్యక్తపరచుట (Represent or Reproduce) చేయగలుగుచున్నాడు. వేదము అతీంద్రియజ్ఞానము గూడ కాబట్టి మనలోని ఈ 'బుద్ధి' (Intellect)ని ఉపయోగించి వేదమును అర్థము చేసుకొనవలెను.

## ఉపనిషత్తు :

కర్మ, ఉపాసన, జ్ఞానము - అని వేదము మూడు విధములు, ఉపాసనా జ్ఞానములను బోధించునట్టి వేదభాగమును 'ఉపనిషత్' అందురు. వేదములో చెప్పబడిన అతి ముఖ్య విషయములను సంగ్రహపరచి చివరకు వ్రాయబడినవే ఉపనిషత్తులు. వేదమునకు అంతమునందు (చివరగా) వ్రాయబడినవగుటచే 'వేదాంతశాస్త్రములు' అని, వేదము నందలి ముఖ్యవిషయముల సంకలనములు అగుటచే 'వేద శీర్షములు' (శ్రుతి శిరస్సులు) అని కూడ ఈ ఉపనిషత్తులకు నామాంతరములు గలవు. 'ఉప - నిషతి ఇతి ఉపనిషత్' అని ఉపనిషత్పదమునకు నిర్వచనము. 'ఉప' అనగా, 'దగ్గఱగా', 'నిషతి' - అనగా 'తీసుకొని వెళ్ళునది' అని అర్థము. 'దేని దగ్గఱకు?' అని ప్రశ్నవేసినచో 'ఈ సమస్త విశ్వమునకు కారణమైన ఆ పరమాత్మ సాన్నిధ్య మధురానుభూతిని కలిగించు యోగమార్గ మోక్షస్థితికి' అని చెప్పుకొనవలెను. కాబట్టి మోక్షస్థితికి దారితీయు యోగము, యోగజీవనములను గూర్చి ఈ ఉపనిషత్తులు చెప్పునని గ్రహించవలెను.

## యోగవిద్య - ఉపనిషత్తులు :

మానవసృష్టి జరిగిననుండి మానవునకు యోగవిద్య ఉపదేశింపబడుచున్నది. వేద సంప్రదాయములో ఈ యోగ విద్య అవిచ్ఛిన్నముగా మార్పులు లేకుండా నిలబడినది. అనాదిగా వచ్చుచున్న ఈ యోగమార్గముతో సమన్వయమ్ము కుదరని ఏ క్రొత్తమార్గమైనను వర్జింపవలసినదియే అగును. ఈ సమన్వయమును, ఆ సనాతన యోగమార్గమును నిలబెట్టునవియే గురుకులములు. ఈ గురుకులములలో సనాతన ఉపాసనాయోగ మార్గములను బోధించు ఉపనిషత్తులు చాల గలవు. కొందరు ఈ ఉపనిషత్తుల సంఖ్యను 108గా చెప్పుదురు. కాని, వాటిలో సుప్రసిద్ధముగా అందఱును ఎక్కువగా చదువుకొనునవి అనగా, ప్రధానమైనవి పది. ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యకములనునవి వీటి పేర్లు.

## తైత్తిరీయోపనిషత్తు :

ఇంతకు ముందు తెలిపిన దశోపనిషత్తులలోనిదే ఒకటియైన తైత్తిరీయోపనిషత్తునందు - యోగవిద్యా విధానము, యోగజీవన విధానము జమిలిగా పేనబడి ఉండును. ఎక్కువమంది ఆంధ్రులు యజుశ్శాఖీయులు. అనగా యజుర్వేదమునకు సంబంధించిన వారు. ఈ యజుర్వేదమునకు సంబంధించినదే ఈ తైత్తిరీయోపనిషత్తు. ఆచరణ మాని చర్చలోనికి దిగు బుద్ధిపోయి, పూర్తిగా ఆచరణలోనికి దిగువారిని యోగసాధకులందురు. సత్యమును విమర్శద్వారా తెలుసుకొనుటకు ప్రయత్నించువాడు - తత్త్వశాస్త్ర పండితుడు (Philosopher). సత్యమును ప్రయోగము చేయుట ద్వారా తెలుసుకొనువాడు - శాస్త్రజ్ఞుడు (Scientist). సత్యమును ఆచరణ ద్వారా తెలుసుకొనువాడు - యోగసాధకుడు (Occultist). అట్టి సాధకుని ఆచరణకొఱకై యోగ, జీవన సమన్వయమును తెలుపు విషయములు ఈ తైత్తిరీయోపనిషత్తునందు ఉండును. గురుదేవులు ఈ ఉపనిషత్తునకు చక్కని పరిచయము వ్రాసిరి. ఆ పరిచయము ఈ గ్రంథమునకు ప్రాణము. అందు ఎక్కువమందికి తెలియని, ఉపనిషత్తుకు సంబంధించిన పెక్కు విషయములున్నవి. తైత్తిరీయమును గూర్చి ఉపోద్ఘాతముగా ఆ విషయములు చదువుకొనిన చాలును. ఇంక ఈ గ్రంథములో చెప్పబడునవి వ్రాసి, ఈ నేపథ్య శీర్షికను ముగించెదను.

ఈ తైత్తిరీయోపనిషత్తును ముఖ్యముగా ఐదు అధ్యాయములుగా చెప్పుదురు. 1. శిక్షావల్లి 2. బ్రహ్మవల్లి లేక ఆనందవల్లి 3. భృగువల్లి 4. నారాయణ ప్రశ్నము 5. చిత్తి ప్రశ్నము. అనునవి వీటి పేర్లు. మొదటి నాలుగు అధ్యాయములు పూర్తిగా బ్రహ్మవిద్యాపరముగా నుండును. అందుచే ఆ నాలుగింటిని మాత్రమే ఈ ఉపనిషత్తునందు చెప్పుట సంప్రదాయముగా వచ్చుచున్నది. ప్రస్తుత గ్రంథమున మొదటి మూడు వల్లులు టీకా తాత్పర్య వ్యాఖ్యానసహితముగా వివరింపబడినవి, ఏ విద్యనైన నేర్చుకొనునపుడు గాని, ప్రసంగమునకు గాని, ఒక క్రతువునకు గాని ఆద్యంతములందు ప్రార్థనాపూర్వక శాంతిపాఠములుండుట భారతీయుల సంప్రదాయము. ఈ మూడు వల్లులు గూడ అట్టి శాంతి పాఠములతోనే ప్రారంభింపబడినవి. ఈ శాంతి పాఠములకు గూడా టీకా తాత్పర్య వివరణాదు

లీయబడినవి. నిత్యము పారాయణ చేసుకొనువారి సౌకర్యార్థము మూడు వల్లులు, పూర్వ శాంతిపాఠము నుండి ఉత్తర శాంతిపాఠము వరకు - అను వాకముల మధ్యలో టీకా తాత్పర్యాదులు అడ్డులేకుండా, పూర్తిగా ఒకేచోట, ఒక్కొక్క అనువాకము ఒక్కొక్క పేరావలె, సస్వరముగా గ్రంథమునకు ప్రారంభములో ఈయబడినవి. తరువాత, అనువాకానుసారము టీకా, తాత్పర్యాదులీయబడినవి. (ఈ అను వాకములలో మంత్రములు స్వరయుక్తముగా తెలుపబడలేదు) ఉపాసకులు. సాధకులు గ్రంథస్థ విషయములను గ్రహించి వేదమయ జీవితమును గడుపుదురు గాక!

-వివరణ కర్త

# గణపతి ప్రార్థన



ఓం॥ గణానాం త్వా గణపతిగ్ం హవామహే,

కవిం కవీనా ముపమశ్రవస్తమమ్।

జ్యేష్ఠ రాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత

ఆనశ్శృణ్వన్నూతిభి స్సీదసాదనమ్॥

శ్రీ మహాగణాధిపతయే నమః।

గురుభ్యో నమః । హరిఃఓమ్॥

శ్రీరస్తు

# తైత్తిరీయోపనిషత్తు

## శిక్షావల్లి

### పూర్వశాంతి పాఠము

### శ్రీ గురుభ్యోనమః హరిఃఓమ్

శం నో మిత్ర శ్శం వరుణః । శం నో భవ త్వర్యమా । శం న ఇంద్రో బృహస్పతిః । శం నో విష్ణు రురుక్రమః । నమో బ్రహ్మణే । నమ స్తే వాయో । త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । *త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి। ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి । త న్మా మవతు । త ద్వక్తార మవతు । అవతు మామ్ । అవతు వక్తారమ్ । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥

***

శీక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణస్స్వరః । మాత్రా బలమ్। సామసంతానః । ఇత్యుక్త శ్శీక్షాధ్యాయః॥ (1)

---

* వైదిక సంప్రదాయము ననుసరించి 'త్వమేవ'. శాంకర భాష్యము ననుసరించి 'త్వామేవ'.

సహ నౌ యశః । సహ నౌ బ్రహ్మవర్చసమ్ । అథాతస్సగ్ం
హితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామః । పంచస్వధికరణేషు । అధి
లోక మధిజ్యౌతిష మధివిద్య మధిప్రజ మధ్యాత్మమ్ । తా మహాసగ్ం
హితా ఇత్యాచక్షతే । అథాధిలోకమ్ । పృథివీ పూర్వరూపమ్ ।
ద్యౌ రుత్తరరూపమ్ । ఆకాశ స్సంధిః । వాయు స్సంధానమ్ । ఇత్యధి
లోకమ్ । అథాధిజ్యౌతిషమ్ । అగ్నిః పూర్వరూపమ్ । ఆదిత్య
ఉత్తరరూపమ్ । ఆప స్సంధిః । వైద్యుతస్సంధానమ్ । ఇత్యధిజ్యౌతి
షమ్ । అథాధివిద్యమ్ । ఆచార్యః పూర్వరూపమ్ । అన్తేవాస్యుత్తర
రూపమ్ । విద్యా సన్ధిః । ప్రవచనగ్ం సన్ధానమ్ । ఇత్యధివిద్యమ్ ।
అథాధిప్రజమ్ । మాతా పూర్వరూపమ్ । పితోత్తరరూపమ్ । ప్రజా
సన్ధిః । ప్రజననగ్ం సన్ధానమ్ । ఇత్యధిప్రజమ్ । అథాధ్యాత్మమ్ । అధ
రాహనుః పూర్వరూపమ్ । ఉత్తరాహనురుత్తరరూపమ్ । వాక్సంధిః ।
జిహ్వా సంధానమ్ । ఇత్యధ్యాత్మమ్ । ఇతీమా మహాసగ్ంహితాః ।
య ఏవ మేతా మహాసగ్ం హితా వ్యాఖ్యాతా వేద । సంధీయతే
ప్రజయా పశుభిః । బ్రహ్మవర్చసేనాన్నా ద్యేన సువర్గేణ లోకేన ॥ (2)

యశ్ఛన్దసా మృషభో విశ్వరూపః । ఛందోభ్యోఽధ్యమృతా

థ్సంబభూవ । స మేన్ద్రో మేధయా స్పృణోతు । అమృతస్య దేవ

ధారణో భూయాసమ్ । శరీరం మే విచర్షణమ్ । జిహ్వా మే మధు

మత్తమా । కర్ణాభ్యాం భూరివిశ్రువమ్ । బ్రహ్మణః కోశోఽసి

మేధయా పిహితః । శ్రుతం మే గోపాయ । ఆవహంతీ వితన్వానా ।

కుర్వాణా చీర మాత్మనః । వాసాగ్ంసి మమ గావశ్చ । అన్న పానే

చ సర్వదా । తతో మే శ్రియ మావహ । లోమశాం పశుభిస్సహ

స్వాహా । ఆమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా । విమాయన్తు

బ్రహ్మచారిణ స్స్వాహా । ప్రమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా

దమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా । శమాయన్తు బ్రహ్మచారిణ

స్స్వాహా । యశోజనేఽసాని స్వాహా । శ్రేయా న్వస్యసోఽసాని

స్వాహా । తం త్వా భగ ప్రవిశాని స్వాహా । సమాభగ ప్రవిశ

స్వాహా । తస్మిం త్సహస్రశాఖే । నిభగాహం త్వయి మృజే స్వాహా ।

యథాఽఽపః ప్రవతా యన్తి । యథామాసా అహర్జరమ్ । ఏవం

మాం బ్రహ్మచారిణః । ధాత రాయన్తు సర్వత స్స్వాహా । ప్రతివేశో

ఽసి ప్రమా భాహి ప్రమాపద్యస్వ ॥ (3)

భూర్భువ స్సువ రితి వా ఏతా స్తిస్రో వ్యాహృతయః ।
తాసాముహ స్మైతాం చతుర్థీమ్ । మాహాచమస్యః ప్రవేదయతే ।
మహ ఇతి । తద్బ్రహ్మ । స ఆత్మా । అఙ్గాన్యన్యా దేవతాః ।
భూరితి వా అయం లోకః । భువ ఇత్యన్తరిక్షమ్ । సువరిత్య సౌ
లోకః । మహ ఇత్యాదిత్యః । ఆదిత్యేన వావ సర్వే లోకా మహీ
యంతే । భూరితి వా అగ్నిః । భువ ఇతి వాయుః । సువ రిత్యాదిత్యః ।
మహ ఇతి చన్ద్రమాః । చంద్రమసా వావ సర్వాణి జ్యోతీగ్ంషి
మహీయంతే । భూ రితి వా ఋచః । భువ ఇతి సామాని । సువ రితి
యజూగ్ంషి । మహ ఇతి బ్రహ్మ । బ్రహ్మణా వావ సర్వే వేదా
మహీయంతే । భూరితి వై ప్రాణః । భువ ఇత్యపానః । సువరితి
వ్యానః । మహ ఇత్యన్నమ్ । అన్నేన వావ సర్వే ప్రాణా మహీ
యన్తే । తా వా ఏతాశ్చతస్ర శ్చతుర్ధా । చతస్ర శ్చతస్రో వ్యాహృ
తయః । తా యో వేద । స వేద బ్రహ్మ । సర్వేఽ స్మై దేవా బలి
మావహన్తి॥ (4)

స యఏషోఽన్తర్హృదయ ఆకాశః । తస్మి న్నయం పురుషో
మనోమయః । అమృతో హిరణ్మయః । అన్తరేణ తాలుకే । య ఏష

స్తన ఇవావలంబతే । సేంద్రయోనిః । యత్రాసౌ కేశాన్తో వివర్తతే ।

వ్యపోహ్య శీర్షకపాలే । భూ రిత్యగ్నౌ ప్రతితిష్ఠతి । భువ ఇతివాయౌ ।

సువ రిత్యాదిత్యే మహ ఇతి బ్రహ్మణి । ఆప్నోతి స్వారాజ్యమ్ ।

ఆప్నోతి మనసస్పతిమ్ । వాక్పతి శ్చక్షుష్పతిః । శ్రోత్రపతి

ర్విజ్ఞానపతిః । ఏత త్తతో భవతి । ఆకాశ శరీరం బ్రహ్మ । సత్యాత్మ ప్రాణారామం

మన ఆనన్దమ్ । శాన్తి సమృద్ధ మమృతమ్ । ఇతి ప్రాచీన యోగ్యో పాస్స్వ।।(5)

పృథివ్యంతరిక్షం ద్యౌ ర్దిశో ఽ వాంతరదిశాః । అగ్ని ర్వాయు

రాదిత్య శ్చన్ద్రమా నక్షత్రాణి । ఆప ఓషధయో వనస్పతయ ఆకాశ

ఆత్మా । ఇత్యధిభూతమ్ । అథా ధ్యాత్మమ్ । ప్రాణో వ్యానో ఽ పాన

ఉదాన స్సమానః । చక్షు శ్శ్రోత్రం మనో వాక్త్వక్ । చర్మ మాగ్ంం

సగ్ంం స్నావా ఽస్థి మజ్జా । ఏత దధి విధాయ ఋషి రవోచత్ ।

పాఙ్క్తంవా ఇదగ్ం సర్వమ్ ।పాఙ్క్తేనైవ పాఙ్ క్తగ్గ్ స్పృణో

తీతి ।। (6)

ఓ మితి బ్రహ్మ । ఓ మి తీదగ్ం సర్వమ్ । ఓమిత్యేతదను

కృతిహస్మ వా అప్యో శ్రావయేత్యాశ్రావయన్తి । ఓ మితి సామాని

గాయంతి । ఓగ్ం శోమితి శస్త్రాణి శగ్ంసన్తి । ఓ మిత్యధ్వర్యుః ప్రతి గరం ప్రతిగృణాతి । ఓ మితి బ్రహ్మ ప్రసౌతి । ఓమిత్యగ్ని హోత్ర మనుజానాతి । ఓ మితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ బ్రహ్మోపాప్న వానీతి । బ్రహ్మైవోపాప్నోతి ॥ (7)

ఋతం చ స్వాధ్యాయ ప్రవచనే చ । సత్యం చ స్వాధ్యాయ ప్రవచనే చ । తపశ్చ స్వాధ్యాయప్రవచనే చ । దమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । శమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । అగ్నయశ్చ స్వాధ్యాయప్రవచనే చ । అగ్ని హోత్రం చ స్వాధ్యాయ ప్రవచనే చ । అతిథయశ్చ స్వాధ్యాయప్రవచనే చ । మానుషం చ స్వాధ్యాయ ప్రవచనే చ । ప్రజా చ స్వాధ్యాయ ప్రవచనే చ । ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । ప్రజాతిశ్చస్వాధ్యాయ ప్రవచనే చ సత్యమితి సత్యవచా రాథీతరః । తప ఇతి తపోనిత్యః పౌరుశిష్టి ః । స్వాధ్యాయ ప్రవచనే ఏ వేతి నాకో మౌద్గల్యః । తద్ధి తపస్తద్ధి తపః ॥ (8)

అహం వృక్షస్య రేరివా । కీర్తిః పృష్ఠం గిరేరివ । ఊర్ధ్వ పవిత్రో వాజినీవ స్వమృత మస్మి । ద్రవిణగ్ం సవర్చసమ్ । సుమేధా అమృతో ఽక్షితః । ఇతి త్రిశఙ్కో ర్వేదానువచనమ్ ॥ (9)

వేద మనూచ్యా ఉఽ చార్యోఽం తేవాసిన మనుశాస్తి । సత్త్యం వద । ధర్మం చర । స్వాధ్యాయా న్మా ప్రమదః । ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతు మా వ్యవచ్ఛేథ్సీః । సత్యా న్న ప్రమదితవ్యమ్ । ధర్మా న్న ప్రమదితవ్యమ్ । కుశలా న్న ప్రమదితవ్యమ్ । భూత్యైన ప్రమదితవ్యమ్, స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ । దేవపితృ కార్యాభ్యాం న ప్రమదితవ్యమ్ । మాతృ దేవోభవ । పితృదేవోభవ । ఆచార్యదేవోభవ । అతిథి దేవో భవ । యాన్యనవద్యాని కర్మాణి । తాని సేవితవ్యాని । నో ఇతరాణి । యాన్యస్మాకగ్ం సుచరితాని । తాని త్వయోపాస్యాని । నో ఇతరాణి । యే కేచాస్మ చ్ఛ్రేయాగ్ంసో బ్రాహ్మణాః । తేషాం త్వయా ఉఽ సనేన ప్రశ్వసితవ్యమ్ । శ్రద్ధయా దేయమ్ । అశ్రద్ధయా ఉదేయమ్ । శ్రియా దేయమ్ । హ్రియా దేయమ్ । భియా దేయమ్ । సంవిదా దేయమ్ । అథ యది తే కర్మవిచికిథ్సా వా వృత్త విచికిథ్సా వా స్యాత్ । యేతత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః । యుక్తా ఆయుక్తాః । అలూక్షా ధర్మ కామాస్స్యుః । యథా తే తత్ర వర్తేరన్ । తథా తత్ర వర్తేథాః । అథాభ్యాఖ్యాతేషు । యే తత్ర బ్రాహ్మణా స్సంమ్మర్శినః । యుక్తా ఆయుక్తాః । అలూక్షా ధర్మ కామాస్స్యుః ।

యథా తే తేషు వర్తేరన్ । తథా తేషు వర్తేథాః । ఏష ఆదేశః ।
ఏష ఉపదేశః । ఏషా వేదోపనిషత్ । ఏత దనుశాసనమ్ । ఏవ
ముపాసితవ్యమ్ । ఏవ ముచైత దుపాస్యమ్ ॥ (10)

* * *

## ఉత్తర శాంతి పాఠము

శంనో మిత్ర శ్శం వరుణః । శం నో భవత్వర్యమా । శం
న ఇన్ద్రో బృహస్పతిః । శం నో విష్ణు రురుక్రమః । నమో బ్రహ్మణే ।
నమ స్తే వాయో । త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వా మేవ
ప్రత్యక్షం బ్రహ్మావాదిషమ్ । ఋతమవాదిషమ్ । సత్యమవాదిషమ్ ।
తన్మామావీత్ । తద్వక్తార మావీత్ । ఆవీన్మామ్ । ఆవీద్వక్తారమ్ ।
ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

* * *

# బ్రహ్మావల్లి - ఆనన్దవల్లి

## పూర్వ శాంతి పాఠము

హరిః ఓమ్ ॥ సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై ।

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

* * *

బ్రహ్మవిదాప్నోతి పరమ్ । తదేషాఽభ్యుక్తా । సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ । యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్ । సోఽశ్నుతే సర్వా న్కామా న్సహ । బ్రహ్మణా విపశ్చి తేతి । తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః । ఆకాశా ద్వాయుః । వాయోరగ్నిః । అగ్నే రాపః । అద్భ్యః పృథివీ । పృథివ్యా ఓష ధయః । ఓషధీభ్యోఽన్నమ్ । అన్నాత్పురుషః । స వా ఏష పురుషోఽన్నరసమయః । తస్యేద మేవ శిరః । అయం దక్షిణః పక్షః। అయ ముత్తరః పక్షః । అయ మాత్మా । ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ॥ (1)

అన్నాద్వై ప్రజాః ప్రజాయన్తే । యాః కాశ్చ పృథివీగ్ం
శ్రితాః । అథో అన్నే నైవ జీవన్తి । అథైనదపియన్త్యన్తతః ।
అన్నగ్ం హి భూతానాం జ్యేష్ఠమ్ । తస్మా థ్సర్వౌషధ ముచ్యతే ।
సర్వం వై తేఽన్న మాప్నువన్తి । యే న్నం బ్రహ్మోపాసతే ।
అన్నగ్ంహి భూతానాం జ్యేష్ఠమ్ । తస్మాథ్సర్వౌషధముచ్యతే ।
అన్నాద్భూతాని జాయన్తే । జాతాన్యన్నేన వర్ధన్తే । అద్యతేఽత్తిచ
భూతాని । తస్మాదన్నం తదుచ్యత ఇతి । తస్మాద్వా ఏతస్మాదన్న
రసమయాత్ । అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః । తేనైషపూర్ణః ।
సవా ఏష పురుష విధ ఏవ । తస్య పురుషవిధతామ్ । అన్వయం పురుష
విధః । తస్య ప్రాణ ఏవ శిరః । వ్యానో దక్షిణః పక్షః । అపాన
ఉత్తరః పక్షః । ఆకాశ ఆత్మా । పృథివీపుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష
శ్లోకో భవతి ॥ (2)

ప్రాణం దేవా అను ప్రాణన్తి । మనుష్యాః పశవశ్చయే ।
ప్రాణో హి భూతానా మాయుః । తస్మా థ్సర్వాయుష ముచ్యతే ।
సర్వమేవత ఆయుర్యన్తి । యే ప్రాణం బ్రహ్మోపాసతే । ప్రాణోహి
భూతానా మాయుః । తస్మా థ్సర్వాయుష ముచ్యత ఇతి ।తస్యైష

ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య । తస్మా ద్వా ఏతస్మా త్ప్రాణ
మయాత్ । అన్యోఽన్తర ఆత్మా మనోమయః । తేనైష పూర్ణః ।
సవా ఏష పురుషవిధ ఏవ । తస్య పురుషవిధతామ్ । అన్వయం
పురుషవిధః । తస్య యజురేవ శిరః । ఋగ్దక్షిణః పక్షః । సామో
త్తరః పక్షః । ఆదేశ ఆత్మా । అథర్వాఙ్గిరసః పుచ్ఛం ప్రతిష్ఠా ।తద
ప్యేష శ్లోకో భవతి ॥ (3)

యతో వాచో నివర్తన్తే । అప్రాప్య మనసా సహ । ఆనందం
బ్రహ్మణో విద్వాన్ । నబిభేతి కదాచనేతి । తస్యైష ఏవ శారీర
ఆత్మా । యః పూర్వస్య । తస్మాద్వా ఏతస్మాన్మనోమయాత్ ।
అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః । తేనైష పూర్ణః । స వా ఏష
పురుషవిధ ఏవ । తస్య పురుషవిధతామ్ । అన్వయం పురుషవిధః ।
తస్యశ్రద్ధైవ శిరః । ఋతం దక్షిణః పక్షః । సత్యముత్తరః పక్షః ।
యోగ ఆత్మా । మహః పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ॥ (4)

విజ్ఞానం యజ్ఞం తనుతే । కర్మాణి తనుతేఽపి చ । విజ్ఞానం
దేవా స్సర్వే । బ్రహ్మ జ్యేష్ఠ ముపాసతే । విజ్ఞానం బ్రహ్మ చేద్వేద ।

తస్మాచ్చే న్న ప్రమాద్యతి । శరీరే పాప్మనో హిత్వా । సర్వా న్కామాన్థ్సమశ్నుత ఇతి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య । తస్మా ద్వా ఏతస్మా ద్విజ్ఞానమయాత్ ॥ అన్యోఽన్తర ఆత్మాఽఽనన్దమయః । తేనైష పూర్ణః । స వా ఏష పురుషవిధ ఏవ । తస్య పురుష విధతామ్ । అన్వయం పురుష విధః । తస్య ప్రియ మేవ శిరః । మోదో దక్షిణ పక్షః । ప్రమోద ఉత్తరః పక్షః । ఆనంద ఆత్మా । బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ॥ (5)

అసన్నేవ స భవతి । అస ద్బ్రహ్మేతి వేద చేత్ । అస్తి బ్రహ్మేతి చేద్వేద । సంత మేనం తతో విదురితి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య । అథాతోఽనుప్రశ్నాః । ఉతా విద్వానముంలోకం ప్రేత్య । కశ్చన గచ్ఛతీ 3 । ఆహో విద్వా నముం లోకం ప్రేత్య । కశ్చి థ్సమశ్నుతా3 ఉ । సోఽకామయత । బహు స్యాం ప్రజాయేయేతి । స తపోఽతప్యత । సతపస్తప్త్వా । ఇదగ్ం సర్వ మసృజత । యదిదం కించ । తథ్సృష్ట్వా । తదేవాను ప్రావిశత్ । తదనుప్రవిశ్య । సచ్చ త్యచ్చాభవత్ । నిరుక్తం చానిరుక్తంచ । నిలయనం చానిలయనం చ । విజ్ఞానం చావిజ్ఞానం చ ।

సత్యం చానృతం చ సత్య మభవత్ । యదిదం కిఞ్చ । తథ్సత్య

మిత్యాచక్షతే । తదప్యేష శ్లోకో భవతి ॥ (3)

అస ద్వా ఇద మగ్ర ఆసీత్ । తతో వై సదజాయత । తదా

త్మానగ్గ్ం స్వయమకురుత । తస్మా త్తథ్సుకృత ముచ్యత ఇతి ।

యద్వై తత్సుకృతమ్ । రసో వై సః । రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా

నన్దీభవతి । కో హ్యేవాన్యా త్కః ప్రాణ్యాత్ । య దేష

ఆకాశ ఆనందో న స్యాత్ । ఏషహ్యేవానన్దయాతి । యదా హ్యే

వైష ఏతస్మి న్నదృశ్యే ఽ నాత్మ్యే ఽ నిరుక్తే ఽ నిలయనే ఽ భయం

ప్రతిష్ఠాం విందతే । అథ సో ఽభయం గతో భవతి । యదా హ్యే

వైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే । అథ తస్యభయంభవతి ।

తత్త్వేవభయం విదుషో ఽమన్వానస్య । తదప్యేష శ్లోకో భవతి ॥ (7)

భీషా ఽస్మా ద్వాతః పవతే । భీషోదేతిసూర్యః । భీషా ఽస్మా

దగ్ని శ్చేన్ద్రశ్చ । మృత్యుర్ధావతి పంచమ ఇతి । సైషా నన్దస్య

మీమాగ్ంసా భవతి । యువా స్యా థ్సాధు యువాధ్యాయకః ।

ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః । తస్యేయం పృథివీ సర్వావిత్తస్య పూర్ణాస్యాత్ ।

స ఏకో మానుష ఆనన్దః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

తే యే శతం మానుషా ఆనన్దాః । స ఏకో మనుష్యగంధర్వాణా

మానన్దః । శ్రోత్రియస్య చాకామహతస్య । తే యే శతం మనుష్య

గంధర్వాణా మానన్దాః । స ఏకో దేవంగంధర్వాణా మానన్దః । శ్రోత్రి

యస్య చాకామహతస్య । తే యే శతం దేవగన్ధర్వాణా మానన్దాః ।

స ఏక ఆజానజానాం దేవానా మానన్దః । శ్రోత్రియస్య చాకామహ

తస్య । తే యే శత మాజానజానాం దేవానా మానన్దాః । స ఏకః

కర్మదేవానాం దేవానా మానన్దః । యే కర్మణా దేవా నపి యన్తి ।

శ్రోత్రియస్య చాకామహతస్య । తే యే శతం కర్మదేవానాం

దేవానా మానన్దాః । స ఏకో దేవానా మానన్దః । శ్రోత్రియస్య

చాకామహతస్య । తే యే శతం దేవానా మానన్దాః । స ఏక ఇన్ద్ర

స్యానన్దః । శ్రోత్రియస్య చాకామహతస్య । తే యే శతమిన్ద్రస్యా

నన్దాః । స ఏకో బృహస్పతే రానన్దః । శ్రోత్రియస్య చాకామహ

తస్య । తే యే శతం బృహస్పతే రానన్దాః । స ఏకః ప్రజాపతే

రానన్దః । శ్రోత్రియస్య చాకామహతస్య । తే యే శతం ప్రజాపతే

రానన్దాః । స ఏకో బ్రహ్మణ ఆనన్దః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

సయ శ్చాయం పురుషే । యశ్చాసా వాదిత్యే । స ఏకః । స య

ఏవం విత్ । అస్మా ల్లోకా త్ప్రేత్య । ఏత మన్నమయ మాత్మాన
ముపసంక్రామతి । ఏతం ప్రాణమయ మాత్మాన ముపసంక్రామతి ।
ఏతం మనోమయ మాత్మాన ముపసంక్రామతి । ఏతం విజ్ఞానమయ
మాత్మాన ముపసంక్రామతి । ఏత మానన్దమయ మాత్మాన ముప
సంక్రామతి । తదప్యేష శ్లోకో భవతి ॥ (8)

యతో వాచో నివర్తన్తే । అప్రాప్య మనసా సహ । ఆనన్దం
బ్రహ్మణో విద్వాన్ । న బిభేతి కుతశ్చనేతి । ఏత్గ్ం హ వావ న
తపతి । కి మహగ్ం సాధు నాకరవమ్ । కిమహం పాప మకరవమితి ।
స య ఏవం విద్వా నేతే ఆత్మానగ్గ్ం స్పృణుతే । ఉభే హ్యేవైష
ఏతే ఆత్మానగ్గ్ం స్పృణుతే । య ఏవం వేద । ఇత్యుపనిషత్ ॥ (9)

## ఉత్తర శాంతి పాఠము

సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవా
వహై । తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై । ఓం
శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

* * *

# భృగువల్లి

## పూర్వశాంతి పాఠము

హరిః ఓమ్ । సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీ
కరవావహై । తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై । ఓం
శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

* * *

భృగు ర్వై వారుణిః । వరుణం పితర ముపససార । అధీహి
భగవో బ్రహ్మేతి । తస్మా ఏతత్ప్రోవాచ । అన్నం ప్రాణం చక్షు
శ్శ్రోత్రం మనో వాచ మితి । తగ్ం హోవాచ । యతో వా ఇమాని
భూతాని జాయన్తే । యేన జాతాని జీవన్తి । యత్ప్రయ స్త్యభిసం
విశన్తి । త ద్విజిజ్ఞాసస్వ । తద్బ్రహ్మేతి । సతపో ఽతప్యత । స
తపస్తప్త్వా ॥ (1)

అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ । అన్నా ద్ధ్యేవ ఖల్విమాని
భూతాని జాయన్తే । అన్నేన జాతాని జీవన్తి । అన్నం ప్రయ న్త్యభి
సంవిశ న్తీతి । తద్విజ్ఞాయ । పున ర్రేవ వరుణం పితర ముపససార ।

అధీహి భగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞా సస్వ । తపో బ్రహ్మేతి । సతపోఽతప్యత । స తప స్తప్త్వా ॥

ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్ । ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । ప్రాణేన జాతాని జీవన్తి । ప్రాణం ప్రయ న్త్యభిసంవిశ న్తీతి । తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితర ముపస సార । అధీహి భగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపోఽతప్యత । స తప స్తప్త్వా ॥ (3)

మనో బ్రహ్మేతి వ్యజానాత్ । మనసో హ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । మనసా జాతాని జీవన్తి । మనః ప్రయ న్త్యభి సంవిశ న్తీతి । తద్విజ్ఞాయ । పున రేవ వరుణం పితర ముపససార । అధీహిభగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ । తపసా బ్రహ్మ విజి జ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపోఽతప్యత । స తప స్తప్త్వా ॥ (4)

విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్ । విజ్ఞానా ద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । విజ్ఞానేన జాతాని జీవన్తి । విజ్ఞానం ప్రయ న్త్యభి

సంవిశ న్తీతి । తద్విజ్ఞాయ । పున రేవ వరుణం పితర ముపససార ।
అధీహి భగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ । తపసా బ్రహ్మ విజి
జ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపో ఽతప్యత । స తప స్తప్త్వా ॥ (5)

ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్ । ఆనన్దా ద్ధ్యేవ ఖల్విమాని
భూతాని జాయన్తే । ఆనన్దేన జాతాని జీవన్తి । ఆనన్దం ప్రయన్త్యభి
సంవిశ న్తీతి । సైషా భార్గవీ వారుణీ విద్యా । పరమే వ్యోమ న్ప్రతి
ష్ఠితా । య ఏవం వేద ప్రతితిష్ఠతి । అన్న వానన్నాదో భవతి । మహా
న్భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన । మహా న్కీర్త్యా ॥ (6)

అన్నం న నిన్ద్యాత్ । తద్వ్రతమ్ । ప్రాణో వా అన్నమ్ ।
శరీర మన్నాదమ్ । ప్రాణే శరీరం ప్రతిష్ఠితమ్ । శరీరే ప్రాణః ప్రతి
ష్ఠిత ః । త దేత దన్న మన్నే ప్రతిష్ఠితమ్ । స య ఏత దన్న మన్నే
ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవా నన్నాదో భవతి । మహాన్భవతి
ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన । మహాన్కీర్త్యా ॥ (7)

అన్నం న పరిచక్షీత । తద్వ్రతమ్ । ఆపో వా అన్నమ్ ।
జ్యోతి రన్నాదమ్ । అప్సు జ్యోతిః ప్రతిష్ఠితమ్ । జ్యోతిష్యాపః ప్రతి
ష్ఠితాః । త దేత దన్న మన్నే ప్రతిష్ఠితమ్ । స య ఏత దన్న మన్నే
ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవా నన్నాదోభవతి । మహా
న్భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన । మహాన్కీర్త్యా ॥ (8)

అన్నం బహు కుర్వీత । తద్వ్రతమ్ । పృథివీ వా అన్నమ్ ।
ఆకాశోఽన్నాదః । పృథివ్యా మాకాశః ప్రతిష్ఠితః । ఆకాశే పృథివీ
ప్రతిష్ఠితా । తదేత దన్నమన్నే ప్రతిష్ఠితమ్ । స య ఏత దన్న
మన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవా నన్నాదోభవతి । మహా
న్భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన । మహాన్కీర్త్యా ॥ (9)

న కంచన వసతౌ ప్రత్యాచక్షీత । తద్వ్రతమ్ । తస్మా
ద్యయాకయా చ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్ । అరాధ్యస్మా
అన్న మిత్యాచక్షతే । ఏతద్వై ముఖతోఽన్నగ్ం రాద్ధమ్ ।
ముఖతోఽస్మా అన్నగ్ం రాధ్యతే । ఏతద్వై మధ్యతోఽన్నగ్ం
రాద్ధమ్ । మధ్యతోఽస్మా అన్నగ్ం రాధ్యతే । ఏతద్వా అన్తతో

ఉన్నగ్ం రాద్ధమ్ । అన్నతో ఉస్మా అన్నగ్ం రాధ్యతే । య ఏవం

వేద । క్షేమ ఇతి వాచి । యోగక్షేమ ఇతిప్రాణాపానయోః ।

కర్మేతి హస్తయోః । గతి రితి పాదయో ః । విముక్తి రితి పాయౌ ।

ఇతి మానుషీ స్సమాజ్ఞాః । అథ దైవీః । తృప్తి రితివృష్టౌ । బలమితి

విద్యుతి । యశ ఇతి పశుషు । జ్యోతి రితి నక్షత్రేషు । ప్రజాతి రమృత

మానన్ద ఇత్యుపస్థే । సర్వ మిత్యాకాశే । తత్ప్రతిష్ఠేత్యు పాసీత ।

ప్రతిష్ఠావాన్భవతి । తన్మహ ఇత్యుపాసీత । మహాన్భవతి । తన్మన

ఇత్యుపాసీత । మానవా న్భవతి । తన్నమ ఇత్యుపాసీత । నమ్యన్తే

ఉస్మై కామాః । తద్బ్రహ్మేత్యుపాసీత । బ్రహ్మవా న్భవతి ।

తద్బ్రహ్మణః పరిమర ఇత్యుపాసీత । పర్యేణం మ్రియన్తే ద్విషన్త

స్సపత్నాః । పరి యే ఉప్రియా భ్రాతృవ్యాః । స యు శ్చాయం

పురుషే । యశ్చాసా వాదిత్యే । స ఏకః । స య ఏవం విత్ ।

అస్మాల్లోకాత్ప్రేత్య । ఏత మన్నమయ మాత్మాన ముపసంక్రమ్య ।

ఏతం ప్రాణమయ మాత్మాన ముపసంక్రమ్య । ఏతం మనోమయ

మాత్మాన ముప సంక్రమ్య । ఏతం విజ్ఞాన మయ మాత్మాన ముప

సంక్రమ్య । ఏత మానన్దమయ మాత్మాన ముప సంక్రమ్య । ఇమా

న్లోకా న్కామాన్నీ కామరూప్యనుసంచరన్ । ఏత థ్సామ గాయ

న్నాస్తే । హా౩వు హా౩వు । హా౩వు । అహమన్న మహమన్న మహ
మన్నమ్ । అహ మన్నాదో౩ఽ హమన్నాదో౩ఽ హమన్నాదః ।
అహగ్గ్ శ్లోకకృ దహగ్గ్ శ్లోకకృ దహగ్గ్ శ్లోకకృత్ । అహ మస్మి
ప్రథమజా ఋతా౩స్య । పూర్వం దేవేభ్యో అమృతస్య నా౩భా౩ఇ ।
యో మా దదాతి స ఇ దేవ మా౩ఽఽవాః । అహ మన్న మన్న
మదన్త మా౩ద్మి । అహం విశ్వంభువన మభ్యభవా౩మ్ । సువర్ణ
జ్యోతీః । య ఏవం వేద । ఇత్యుపనిషత్ ॥ (10)

## ఉత్తర శాంతి పాఠము

సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవా
వహై । తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై । ఓం శాన్తి
శ్శాన్తి శ్శాన్తి ః ॥

* * *

శ్రీరస్తు

# తైత్తిరీయోపనిషత్తు

## ప్రథమాధ్యాయము - శిక్షావల్లి

## (టీకాతాత్పర్య వివరణములు)

## పూర్వశాంతి పాఠము

శం నో మిత్ర శ్శం వరుణః । శం నో భవ త్వర్యమా ॥ శం న ఇంద్రో బృహస్పతిః । శం నో విష్ణు రురుక్రమ ః । నమో బ్రహ్మణే । నమస్తే వాయో । త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । *త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి। ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి । తన్మా మవతు । త ద్వక్తారమవతు। అవతు మామ్ । అవతు వక్తారమ్ । ఓం శాన్తి శాన్తి శాన్తిః ।

**టీక :** మిత్రః = మిత్రుడు, కొలతలకు, (Lord of Measures) పగటికి, ప్రాణప్రవృత్తికి అనగా ఆకర్షణాత్మక ప్రక్రియకు అధిష్ఠాన దేవత, నః = మాకు (అనగా విద్య నేర్పు గురువు, నేర్చుకొను శిష్యులకు); శం = సుఖమును, శాంతిని (కలిగించు లేదా కలుగజేయు వాడుగా); వరుణః = వరుణుడు, ఆవరణము గలవాడు, (Lord of Boundaries) అపాన ప్రవృత్తికి అనగా వికర్షణాత్మక ప్రక్రియకు, రాత్రికి అధిష్ఠాన దేవత; నః = (మాకు); అర్యమా = అర్యముడు (నాగలి వలె దున్నుచు పోవువాడు) చూపునకు, నేత్రమునకు అధిష్ఠాన దేవత,(Lord of Spur). నః = మాకు; శం = సుఖమును, శాంతిని (కలుగజేయువాడుగా), భవతు = అగుగాక !; ఇంద్రః = ఇంద్రుడు (అంతరిక్ష దేవత), నః = మాకు, శం = సుఖమును, శాంతిని (కలుగజేయువాడుగా అగుగాక); బృహస్పతిః = (అందుకోవలసిన దానిని వాక్కుగా అందజేయువాడు, అనగా వాక్కునకు, బుద్ధికిని అధిష్ఠాన దేవత)

---

* వైదిక సంప్రదాయముననుసరించి 'త్వమేవ', శాంకర భాష్యము ననుసరించి 'త్వామేవ'.

బృహస్పతి, ఉరుక్రమః = త్రివిక్రముడు (కాల, దిశాత్మకముగా విస్తరించు పాదప్రక్షేపము గల); విష్ణుః = విష్ణువు (దేశ కాలాత్మక స్వరూపుడు, సర్వవ్యాపకుడు) (Lord of Pervasion) నః = మాకు; శం = సుఖమును, శాంతిని (కలుగజేయు వాడుగా అగుగాక); బ్రహ్మణే = చెప్పువానిగా మరియు వినువానిగా వేషము వేసుకొనిన ఓ బ్రహ్మ !; నమః = నమస్కారము; వాయో = ఓ వాయుదేవతా! (Lord in the form of his expansion or in the form of Pulsation) తే = నీ కొఱకు; నమః = నమస్కారము; త్వం + ఏవ = త్వమేవ = నీవే; ప్రత్యక్షం = ప్రత్యక్షమైన; బ్రహ్మ = బ్రహ్మము (అని); వదిష్యామి = చెప్పుచున్నాను. అనగా ఉచ్చారణగా పలుకుచున్నాను; ఋతం = ఋతస్వరూపునిగా; వదిష్యామి = చెప్పుచున్నాను; సత్యం (Truth) = సత్యస్వరూపునిగా (కూడ నిన్నే); వదిష్యామి = చెప్పుచున్నాడను, తత్ = ఆ బ్రహ్మము; మాం = నన్ను (అనగా విద్యార్థి అగు నన్ను); అవతు = రక్షించును గాక; తత్ = ఆ బ్రహ్మము; వక్తారం = ఆచార్యుని లేదా గురువుని (కూడ); అవతు = రక్షించుగాక, మాం = నన్ను; అవతు = రక్షించుగాక ; వక్తారం = గురువుని; అవతు = రక్షించుగాక (Protect) ; ఓం శాంతిః శాంతిః శాంతిః = (ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపములు) శాంతించుగాక !

**తాత్పర్యము :** మిత్ర, వరుణ, అర్యమ, ఇంద్ర, బృహస్పతి, విష్ణు దేవత లారా ! మాకు సుఖ శాంతులను కలుగజేయు వారుగా అగుదురు గాక ! ఓ బ్రహ్మమా ! నమస్కారము. వాయుదేవతా నీకు నమస్కారము, నీవే ప్రత్యక్ష బ్రహ్మము అయి ఉన్నావు. (నిజముగా ముమ్మాటికి) నీవే ప్రత్యక్ష బ్రహ్మమని చెప్పుచున్నాను, అప్రయత్న సత్యముగా వచ్చు మాట రూపముగా (నిన్నే) చెప్పుచున్నాను, సత్యరూపమైన మాటగా (నిన్నే) చెప్పుచున్నాను. ఆ బ్రహ్మము నన్ను రక్షించు గాక ! ఆచార్యుని రక్షించు గాక ! నన్ను రక్షించు గాక ! ఆచార్యుని రక్షించు గాక ! ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములైన తాపత్రయములు శాంతింపబడుగాక !

**వివరణము :** శాంతిపాఠమును "శం" అను అక్షరముతో ప్రారంభించుట ఎంతైనను సమంజసము. "శం" అనగా 'శాంతి' అని అర్థము. శర్మ

అనగా గూడా 'శాంతి కలవాడు' అనియే అర్థము. శాంతము లేని శర్మ లందఱును ఆ పేరునకు తగరు. విద్యార్థి అనగా (గురువు లేక ఆచార్యుని వద్దకు వచ్చి) విద్యను అర్థించువాడని అర్థము, విద్య అనగా అక్షరములను చదువుట, వ్రాయుట మాత్రమే కాదు, అక్షరములను వ్రాయ గలుగుట, చదువ గలుగుటలను "అక్షరాస్యత" (Literacy) అందురు. చదువుట, వ్రాయుట నేర్చిన వారిలో కూడ బుద్ధి వికసించని వారుండ వచ్చును. బుద్ధియనగా యుక్తాయుక్త వివేక జ్ఞానమునకు సంబంధించిన ఒక శక్తి. మానవునిలో బుద్ధి ఉండుటకు అవకాశము ఉండుట చేతనే జంతువుల కన్న వేరుగా గుర్తింపబడుచున్నాడు. వివేక రహితముగ పనిచేసిన వానిని 'బద్ధి లేదా గాడిదా" అని అనుట కూడా మనము వినుచుందుము. ఈ బుద్ధి వికసించుటకు పంచజ్ఞానేంద్రియముల ద్వారా తెలియబడు విషయములే కాక ఇంద్రియాతీతమైన విషయములు కూడ తెలియ వలెను. అప్పుడు మాత్రమే నిద్రాణమై యున్న బుద్ధికి జ్ఞానోదయము కల్గును. ఈ విధమైన జ్ఞానోదయమును కలుగ జేయునదియే విద్య. ఇట్టి జ్ఞానము కల్గుటకు జ్ఞానమునకు సంబంధించిన దేవతల అనుగ్రహమును సంపాదించు ఉద్దేశ్యముతో విద్యార్థి ముందుగా జ్ఞానమునకు, కొలతలకు సంబంధించిన దేవతను ప్రార్థించవలెను. "మితి" అనగా మానము (Measure) లేదా కొలత అని అర్థము. ఈ కొలతలకు అధిష్ఠాన దేవత "మిత్రుడు". (సంస్కృతములోని "మిత్ర" అను పదము నుండి Metre అను ఇంగ్లీషు పదము పుట్టినది. దీనిని కొలతలకు ఉపయోగించుట తెలిసిన విషయమే కదా!) అందుచే "శంనో మిత్రః" అనగానే జ్ఞానమునకు కొలతలకు సంబంధించిన దేవత అయిన మిత్రుడు మాకు శాంతిని కలుగు జేయు గాక అని ప్రార్థించుట జరిగినది.

దేవతలు మన చుట్టును ఉన్న ఆవరణములోనే ఉందురు. రేడియోస్టేషను ప్రసారము చేసిన పాట మన చుట్టును వుండు చోటులో ఉండును. మన రేడియోను ట్యూన్ చేసికొనినచో అది మనకు వినబడును. అట్లే మన చుట్టును ఉన్న ఆవరణములోని దేవతలతో సంబంధమేర్పడుటకు గాను

"శంనోవరుణః" అని ఆవరణమునకు సంబంధించిన దేవత అయిన వరుణుని ప్రార్థించుట జరిగినది. ఈ మిత్రావరణులకు మరికొంత వివరణ అవసరము.

సూర్యుడు తూర్పు దిక్కున ఉదయించుటతో పగలు ప్రారంభమగును. ఆ తూర్పు దిక్కున ఉదయించు సూర్యుని బట్టి మనము నిర్వర్తించు కొనబోవు కార్యక్రమములను ఏర్పరచుకొందుము. ఈ కార్యక్రమములను నిర్ణయించు కాలమును కొలతగా ఇచ్చును కాబట్టి తూర్పు దిక్కున్ ఉన్న సూర్యుని మిత్రుడు అందురు. మరియు తూర్పున సూర్యోదయముతో పగలు ప్రారంభమగును. కాబట్టి మిత్రుడు పగటికి, కాలమునకు, కొలతలకు అధిష్ఠాన దేవత (Lord of Day, Time and Measures)

అట్లే పడమటి దిక్కున ఉన్న సూర్యుని వరుణుడు అందురు. వరుణుడు రాత్రికి, ఆవరణములకు (Spaces) అధిష్ఠాన లేదా అభిమాన దేవత (Lord of Night and boundaries). ఇట్లు చెప్పుటకు గల కారణము కుండలినీయోగ రహస్యము తెలిసినచో - విశదమగును.

అంతరిక్షములో కొంత పరిమాణము (Volume) మేరకు విస్తరించి ఉన్న మనశరీరములో వెన్నెముకకు పైన ప్రజ్ఞ (Consciousness) అనియు, వెన్నెముకకు క్రింద ద్రవ్యము (Matter) అనియు యోగవిద్యలో సంకేతము గలదు. ఈ వెన్నెముకను యోగదండము, మేరు దండము బ్రహ్మదండము అను పేర్లతో గూడ పిలుచుదురు. 1) ఈ వెన్నెముక పైభాగమున కెదురుగా భ్రూమధ్య ప్రాంతములో ఆరవ చక్రమైన ఆజ్ఞా చక్రముండును. ఇది తూర్పుదిక్కును తెలియ జేయును. బాహ్య రంగములో తూర్పు దిక్కున గల సూర్యుడెట్లో- మన అంతరంగములో ఈ ఆజ్ఞా చక్రము వద్ద గల ప్రజ్ఞాకేంద్రము అటువంటిది. ఈ ప్రజ్ఞా కేంద్రము వద్దనే జ్ఞాన నేత్రము (wisdom centre) ఉండును. జ్ఞాన నేత్రమున్న ఈ దిశను జ్ఞానదిశ అనియు, ఈ దిశ వద్ద ప్రజ్ఞా కేంద్రమును మిత్రుడనియు అందురు. 2) వెన్నెముక అడుగు భాగమున కెదురుగా మొదటిదైన మూలాధార చక్రముండును. ఇది పడమటి దిక్కును తెలియ జేయును. బాహ్య రంగములో పడమటి దిక్కున గల సూర్యుడెట్లో, మన

అంతరంగములో ఈ పృథివీతత్వమునకు సంబంధించిన మూలాధార చక్రము వద్ద గల కేంద్రము అటువంటిది. ఇది శరీరములోని మొత్తము బలమునకు (Strength) స్విచ్ వంటిది. పడమటి దిక్కు వద్ద గల ఈ కేంద్రమునే వరుణుడు అందురు. "భృగుర్వై వారుణిః" అని భృగువల్లి ప్రారంభింపబడును, ద్రవ్యాత్మక శరీర నిర్మాణమునకు కారణభూతమైన శుక్ర (Sprem) ధాతువునకు సంబంధించిన భృగువు, ఈ ద్రవ్యాత్మక శక్తికి సంబంధించిన కేంద్రమైన వరుణుని కొడుకుగా చెప్పబడుట ఇందులకే ! ప్రజ్ఞ పగలు గాను, ద్రవ్యము రాత్రిగాను గూడా సంకేతము గలదు. అందువలన ప్రజ్ఞా కేంద్రము మిత్రుడు, ద్రవ్య కేంద్రము వరుణుడు వరుసగా పగటికి, రాత్రికి అభిమాన దేవతలుగా చెప్పబడిరి.

నిద్రనుండి మెలకువ వచ్చు స్థితిని సూర్యోదయము తెలియ జేయును. ఈ మెలకువతోనే మనకు - మనము, మన చిరునామా, మన ఉద్యోగము, మన చదువు, డిగ్రీలు, డ్యూటీలు, భార్య, పిల్లలు మొదలగునవన్నియు "శతపత్రభిత్తి" న్యాయము వలె అత్యల్ప కాలములో వరుసగా గుర్తుకు వచ్చుట జరిగి - మనస్సు, బుద్ధి వికసించుట జరుగును. బుద్ధివికాసము జ్ఞానమునకు దారితీయును. కాబట్టి ఈ జ్ఞానోదయమును సూర్యోదయముతో సమన్వయ పరచవలెను. ఈ సూర్యోదయము తూర్పు దిక్కున జరుగును కాబట్టి తూర్పును "జ్ఞానదిశ" అందురు. మనలో నిద్రాణమై మరుగునపడి ఉన్న విషయములు వెలుగులోనికి వచ్చుటకు ఈ తూర్పుదిశ, అక్కడ వున్న సూర్యుడు లేదా మిత్రుడు ఉపకరించినారు కాబట్టి ఈ దిశను జ్ఞాన దిశ అనియు, మిత్రుని జ్ఞానదేవత అనియు గ్రహించవలెను. తూర్పు - జ్ఞానదిశ అగుటచేతనే ఎవరికైన ఒక విషయము ఎంత చెప్పినను అర్థము కానపుడు మన పెద్దవారు "తూర్పు తిరిగి దండము పెట్టుము" అని అందురు. 'ఆ జ్ఞానదిశ, దాని దేవత కరుణించి అర్థము అగునట్లు చేయవలసినదే ఇక మావలన కాదు' అని ఇందలి భావము.

"అర్" అనగా దున్నుట (To Plough) అని అర్థము. అందువలననే "అరక" అనగా దున్నుసాధనము అయిన "నాగలి" అని అర్థము. శాంతి పాఠములోని

"అర్యముడు" అనగా దున్నుచూ పోవునట్లగుపడువాడు. ఎవరు, దేనిని దున్నుచున్నారని ప్రశ్న రావచ్చును. ఈ అర్యముడు కూడ సూర్యునికి గల ఒక పేరు. సూర్యోదయ దిశ నుండి క్రమ క్రమముగా ఆకాశ క్షేత్రమును తన కిరణములతో దున్నుకొనుచూ పోవుచూ చివరకు పశ్చిమ దిక్కును చేరునట్లు కనపడుచున్నాడు. కాబట్టి ఇట్టి సూర్యుని "అర్యముడు" అందురు. మన బుద్ధి అను నాగలి కూడ నేర్చుకొనబోవు అంతరిక్షములో అంతర్లీనమై ఉన్న జ్ఞానము అను క్షేత్రమును దున్నుచూ పోవుచూ మోక్షము అను పంటను పొందుటకు గాను, తత్ సంబంధమైన అర్యముని ప్రార్థించుట జరిగినది. ఈ దేవత చూపు ద్వారా అందుకొనవలసినవాడు, అనగా చూపునకు, కంటికి అధిష్ఠాన దేవత. (Lord of Spur) (చక్షో సూర్యో అజాయత - పురుష సూక్తం).

తరువాత ఇంద్రుని ప్రార్థించుట జరుగును. "ఇదం-ద్రః - ఇంద్రః" అని ఇంద్ర పదమునకు నిర్వచనము. "ఇదిగో నేను ఇక్కడ ఉన్నాను" అని అంతరిక్షములోని ఏ బిందువు వద్దనైననూ వ్యక్తమగుటకు అధిష్ఠాన దేవత ఇంద్రుడు, దృగ్గోచరమగు జ్ఞానము పొందుటకు ఉపకరించు ఇంద్రియములకు పైన ఉన్నవాడు. అనగా ఇంద్రియములకు అధిపతి అయిన మనస్సే ఇంద్రుడు, నేర్చుకొనబోవు విద్య మనస్సు ద్వారా గ్రహింప బడుట జరుగును. కాబట్టి ఇంద్రుని ప్రార్థించుట జరిగినది.

బృహస్పతి అనగా అందుకొనవలసిన దానిని వాక్కుగా అందించువాడు. అందుకొనవలసిన జ్ఞానము. ఆ జ్ఞానవిద్య - వాక్కు ద్వారా అందును. కాబట్టి "జ్ఞాన విద్యకు, వాక్కునకు కూడా బృహస్పతియే గురువు" మనస్సైన ఇంద్రునికి గురువు బృహస్పతి. మరియు సర్వదేవతలకును కూడా గురువు బృహస్పతియే! దేవతలనగా మనలోనే యుండి మనచే మంచిపనులు చేయించు శక్తులు, "ఇట్లు చేయుటవలన జ్ఞానము, సుఖము అభివృద్ధి అగును" అని మంచిని ప్రబోధించువాడు బృహస్పతి. ('జీవో - జ్ఞానసుఖే' - అనగా బృహస్పతి, అనగా గురువు - జ్ఞానమును, సుఖమును ఇచ్చువాడు అని జ్యోతిశ్శాస్త్రకారులు కూడ చెప్పుదురు). అందుచే అట్టి బృహస్పతిని ప్రార్థించుట జరిగినది.

జ్ఞాన సముపార్జనకు ఎంతమంది సహాయ సహకారములో కావలయును, అట్టి సర్వులుగాను వ్యాపించినట్టి విష్ణువును ('సర్వం విష్ణుమయం జగత్', 'విశ్వంబు

విష్ణుందు', 'వ్యాపనశీలః' విష్ణుః) ప్రార్థించుట జరుగును. మరియు ఈ విష్ణువు ఎట్టివాడనగా ఉరుక్రముడు. ఒక పాదమును స్థూల ప్రదేశాత్మకమైన భూమిపైననూ, రెండవ పాదమును సూక్ష్మ నిర్దేశాత్మకమైన ఆకాశముపైననూ, ఇక మూడవ పాదమును ఈ చెప్పిన రెండును ఉన్నట్లు చూడగల్గుటకు కారణము లేదా కేంద్రస్థానమైన శిరస్సుపైనను ఉంచి తన మూడు పాదములతో మూడింటిని కొలచినవాడు, (చోటును కొలుచుటకు కావలసిన ప్రాథమిక ప్రమాణములు గూడ పొడవు, వెడల్పు, ఎత్తు అను మూడే గదా!) అట్లు విక్రమించిన వాడగుటచే విష్ణువునకు ఉరుక్రముడని పేరు వచ్చింది. అందువలననే స్థూల, సూక్ష్మ, కారణాత్మకముగా (Physcial, Vital or Subtle and Causal) జ్ఞాన మభివృద్ధి యగుటకు ఉరుక్రముడైన విష్ణువుని ప్రార్థించుట జరిగినది.

'బ్రహ్మణే' అనుటలో పరబ్రహ్మ స్మరణ జరుగును, ఇటు - జ్ఞానము నుపదేశించు వానిగాను, జ్ఞానమును పొందువానిగాను భౌతిక రూపములలో కూడా గుణాతీత స్థితి నుండి గుణమయుడుగా వ్యక్తమగుచున్న ఆ పరబ్రహ్మకు నమస్కరించుట జరిగినది. 'ప్రార్థించుచున్నానని' 'నమస్కరించుచున్నానని' చెప్పుటకు "శ్వాసను" పెట్టుబడి పెట్టి చెప్పవలెను. అట్టి శ్వాసకు కారణ భూతమైనది వాయువు. దానికి అధిష్ఠాన దేవత అయిన వాయుదేవునికి నమస్కరించుట జరిగినది. మరియు ఈ వాయుదేవుని "నీవే ప్రత్యక్ష బ్రహ్మ అయివున్నావు" అని నిర్ధారించి చెప్పుట జరుగును. ప్రతివారు 'నీవు' అనునపుడు ప్రత్యక్ష బ్రహ్మ అని; 'నేను' అనునపుడు 'ఈశ్వరుడు' అని తెలుసుకొనవలెను. ఈశ్వరుడు ఎవరితో చేయబడి, ఎవరి యొక్క భాగమో ఆయన పరమేశ్వరుడు లేదా పరబ్రహ్మ, ఈ రెంటికీ భేదము తెలియవలెనన్నచో ఒక ఉదాహరణ చెప్పుకొనవలెను, నల్లబల్ల (Black Board) మీద ఒక వృత్తమును గీసినచో, ఆ వృత్తములో ఇమిడి వున్న నల్లబల్ల భాగము ఈశ్వరుడు. ఆ వృత్తములోని చోటు దేనితో చేయబడి, దేనియొక్క భాగమో అటువంటి వెనకనున్న నల్లబల్ల (Back ground black board) పరమేశ్వరుడు లేదా పరబ్రహ్మ, అనగా ఈశ్వరుడు - చిన్న నేను (Soul), పరమేశ్వరుడు లేదా పరబ్రహ్మ - పెద్దనేను (Spirit). లేదా ఈ రెంటినీ నిప్పురవ్వ, నిప్పువంటివిగా అర్థము చేసికొనవచ్చును. ఈ విషయమే భగవద్గీతలో -

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి" అని చెప్పబడినది. అనగా ప్రతి జీవి హృదయంలోను ఉన్నవాడు ఈశ్వరుడు అని అర్థము.

ఈ పరబ్రహ్మ - దేవ, గంధర్వ, యక్ష, కిన్నర, మానవాది రూపములాగా వ్యక్తమగునని చెప్పునపుడు సంకోచము, సందేహము కలుగుటకు అవకాశము కలదేమో కాని, వాయువుగా వ్యక్తమైనాడని చెప్పుట ప్రత్యక్ష సత్యము. మన అస్తిత్వమునకే కారణభూతమై నటువంటిది. 'పరబ్రహ్మ వాయువుగా వ్యక్తమగుట సత్యముగాదు' అని ఎవరైనా అన్నచో అట్లు ఒప్పుకొనక పోవుటను చెప్పుటకు గూడా శ్వాసలోని నిశ్వాస వాయువునే పెట్టుబడి పెట్టి చెప్పవలెను. కాబట్టి, ఆ నిశ్వాసలోని వాయురూప వాక్యములుగా ఆ పరబ్రహ్మ వ్యక్తమౌచున్నాడు గదా ! ఎవరైన ఇంకెట్లు కాదనగలరు ? అనగా 'నేను నిన్నే ప్రత్యక్ష బ్రహ్మగా చెప్పుచున్నాననునపుడు గూడ నిన్నే పెట్టుబడి పెట్టి, నిన్నే ఉచ్చారణగా చేయుచు, నిన్నే పలుకుచున్నాను. అందుచేతనే ఓ వాయుదేవతా నీవు వ్యక్తపరబ్రహ్మ ప్రత్యక్షరూపము' అని నమస్కరించుట జరిగినది. రెండవసారి మరల చెప్పుట - 'ఈవిధముగా నేను చెప్పిన విషయములో ఏమాత్రము అనుమానము లేదు. నిన్నే ప్రత్యక్ష బ్రహ్మగా నొక్కి వక్కాణించుచున్నాను" అని నిర్ధారణ.

ఎవరు - మనలో నుండి పలుకుచున్నపుడు, ఆ పలుకుచున్నది మనమే అనుకొని భ్రమపడుచున్నామో - ఆయన మాటను అనగా అప్రయత్న సత్యముగా వచ్చిన ఆ మాటను 'ఋతము' అందురు. ఋషులు శాపములిచ్చునపుడు, ఆశీర్వదించునపుడు వారి నోటి నుండి అప్రయత్నముగా వెలువడు మాటను గూడ ఋతముగా అర్థము చేసుకొనవలెను. మన ప్రయత్నము వలన వచ్చిన మాట మనమాట యగును. మన ప్రమేయము లేక మనలో నుండి వచ్చిన మాట పరమాత్ముని మాట అగును అట్టి అప్రయత్న సత్యమును ఋతమందురు. అట్టి ఋతస్వరూపునిగా ఓ బ్రహ్మమా నిన్నే చెప్పుచున్నాను" అని తరువాత చెప్పబడినది.

అప్రయత్నముగా వచ్చిన ఋతము నుండి నేను గ్రహించి పలుకు మాటలోని సత్యస్వరూపునిగా కూడా నిన్నే చెప్పుచున్నాను - అనుటలో తన కర్తృత్వము లేదని వినయ పూర్వకముగా చెప్పుట జరుగును. ఋతము - సత్యములకు భేదము

తెలిసికొనవలె నన్నచో మరల ఒక ఉదాహరణ చెప్పుకొనవలెన. 'పంచదార తియ్యగా నుండును', అను ధర్మమును 'ఋతము' అందురు. అనగా పంచదారను తినిన తరువాత అది తియ్యగా నుండునని తెలిసికొనిన ధర్మమును సత్యముగాను, పంచదారను తినిన తరువాత నుండి మాత్రమే కాక తినక పూర్వము నుండి గూడా అది తియ్యగానే వుండునన్న ధర్మమును ఋతముగాను అర్థము చేసికొనవలెను.

ఇన్ని విధములుగా పరబ్రహ్మమును ప్రార్థించి చివరకు ఓ బ్రహ్మమా ! నన్నును, ఆచార్యుని - మాప్రయత్నము సఫలమగునట్లు సంరక్షింపుము. అనగా 'శిష్యునకు విద్యను కలుగజేయుటలోనూ, ఆచార్యునకు బోధనావక్తృత్వ సామర్థ్యమును కలుగ జేయునట్లుగాను సంరక్షింపుము'. అని గురుశిష్యులిద్దరి తరపున శిష్యుడే అభ్యర్థనము చేయుట జరుగును. ప్రార్థన వలన కలుగు ఫలము కేవలము తనకు మాత్రమే దక్కవలెననెడి స్వార్థము శిష్యునకు ఉండరాదనునది ఇందు సూచితము. ఆపదలోనున్నపుడు 'రక్షించండి' అని ఒక్కసారి కాక 'రక్షించండి, రక్షించండి' అనునట్లే ఇక్కడ కూడా రెండుసార్లు "తన్మామవతు తద్వక్తారమవతు అవతుమాం అవతువక్తారమ్" అని రెండుసార్లు రక్షించమనుట పునరుక్తి దోషమును కాక సహజత్వమునే (Naturality) సూచించును.

చిట్టచివరకు 'ఈ విద్యానముపార్జన వలన నాలోని తాపములు ఉపశమింపబడి నేను, నా చుట్టుప్రక్కల వాతావరణము సుఖశాంతులతో వర్థిల్లుగాక! అని ప్రార్థన ముగియును. శాంతిః, శాంతిః, శాంతిః అని ముమ్మారు ఉచ్చరింపబడుట వలన మూడు విధముల తాపములు శమింపబడవలెనన్న అర్థములో ఇట్లనుట జరిగినది. ఈ మూడు విధముల తాపములనే తాపత్రయములు అని సాధారణముగా మనము వాడుచుందుము. అవి -

1. ఆధ్యాత్మిక తాపము 2. ఆధి భౌతిక తాపము 3. ఆధిదైవిక తాపము.

మన శరీరమునకు వచ్చు జ్వరము, పంటిపోటు, గుండెనొప్పి మొదలైనవానిని ఆధ్యాత్మిక తాపములనియు; ఇంటిలో దొంగలు పడుట, పొరుగువారితో పోట్లాటలు, కొట్లాటలు మొదలైనవి ఆధిభౌతిక తాపములుగాను ఇక అతివృష్టి, అనావృష్టి మొదలైన వానిని ఆధిదైవిక తాపములుగాను చెప్పుకొన

వచ్చును. ఆధ్యాత్మిక తాపము శమించినచో వ్యక్తిగతముగా ప్రతిఫలమును, అదిభౌతిక తాపోపశమనముతో సమాజమునకు ప్రతిఫలమును, అధిదైవిక తాపోపశమనముతో జగత్కళ్యాణమే ప్రతిఫలముగాను సిద్ధించును.

ఇట్టి ప్రార్థనలు, శాంతి పాఠములు కుల, వర్గ, వర్ణ, మత, జాతి భేదము లేక సర్వులకును శ్రేయస్సును చేకూర్చును. భారతీయుల ప్రార్థనలన్నియు ఈ విధముగాస్వార్థరహితముగా నుండునని గుర్తించుకొనవలెను, విద్యాభ్యాస ప్రసంగాది సమయములలో, ఆద్యంతముల యందుకూడ ఇట్టి ప్రార్థనలను పఠించి పరబ్రహ్మ అనుగ్రహమును పొందవచ్చును.

**మంత్రము : *శీక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణ స్స్వరః । మాత్రాబలమ్ । సామ సంతానః । ఇత్యుక్త శీక్షాధ్యాయః ।*** *(1)*

**టీక :** శీక్షాం = శిక్షను, వ్యాఖ్యాస్యామః = వివరముగా చెప్పుచున్నాము, వర్ణః = వర్ణములు, స్వరః = స్వరములు, మాత్రా = మాత్రలు, బలమ్ = బలము, సామ = సామము, సంతానః = సంతానము (అని), ఇతి = ఈ విధముగా, శీక్షాధ్యాయః = శిక్షాధ్యాయము, ఉక్తః = చెప్పబడినది.

**తాత్పర్యము :** వర్ణములన్నియు, స్వరములనియు, మాత్రలనియు, బలమనియు, సామమనియు, సంతానమనియు, ఆరు విధములుగా శిక్షను గూర్చి చక్కగా చెప్పబడినది, ఇదియే శిక్షాధ్యాయము.

**వివరణము :** వేదాంగములలో నొకటియగు "శిక్ష" (శీక్షా - నసో) అక్షరములను, పదములను, ఎట్లు పలుకవలెనో శిక్షించు శాస్త్రము (Science of pronounciation or Articulation of Sound). దీనికి సంబంధించిన అధ్యాయమగుటచే దీనిని శిక్షాధ్యాయము అందురు. 'శిక్ష' అనుటకు బదులు 'శీక్షా' అనుట ఒక విధమైన వైదిక ఛాందసము.

**వర్ణములు :** 'వర్ణము' అను పదమునకు సంస్కృతమున చాల అర్థములు గలవు. రంగు (Colour), అక్షరము (letter or alphabet), తెగ (Class) , ఒక

విధమైన గీతిక (సంగీతములో 'వర్ణము'లని కొన్ని పాటలను వ్యవహరింతురు) మొదలగునవి. ప్రస్తుత సందర్భమును బట్టి వర్ణములనగా అక్షరములని అర్థము చెప్పుకొనవలెను. అక్షరములనగా 'అ' కారాది 'క్ష' కారాంతముగా నున్న అక్షరములు, ఇవి క్షరము కానివి, అనగా నశింపనివి. అందుచే అక్షరములని పేరు వచ్చెను. అక్షరాభ్యాస మనగా నశింపనిదగు విద్యను అభ్యసించు సంస్కారము. వ్రాయబడిన అక్షరములను చెరిపినను అవి నాశము చెందనివియే అగును, మరియు నేర్చిన విద్య - ఇంకొకరిచే దొంగిలింపబడి నాశమవనిది. అక్షరములు సంఖ్యలవలెనే అంతరిక్ష ధర్మములుగా ఉన్నవి. వాటిని కాగితముపై వ్రాసినపుడు వ్యక్తరూపమును (సిద్ధస్థితి or mainfested state), వ్రాయనపుడు లేదా వ్రాసి చెరిపినపుడు అవ్యక్తరూపములోను (సాధ్యస్థితి Potential State) ఉండును. అందుచే వాటిని అక్షరము లనిరి.

"అ" నుండి "క్ష" వరకు అగ్నిబీజమైన "ర" (రేఫము) (Trill) సాయముతో ఉచ్చరింపబడునని కావున అక్షరములని పేరు వచ్చినది అని గూడా చెప్పుకొనవచ్చును.

**స్వరములు :** 'స్వరము' అను పదమునకు కూడ చాలా అర్థములు కలవు. ప్రస్తుత సందర్భమును బట్టి స్వరమనగా మాట తీరు లేక మాట యొక్క స్థాయి అని అర్థము చెప్పుకొనవలెను. పాణిని ప్రకారము -

"సమాహార స్స్వరితః" అని స్వరిత పదమునకు నిర్వచనము, అనగా హెచ్చుతగ్గులు లేక మామూలుగా మాట్లాడు స్థాయిని 'స్వరితము' అందురు.

"ఉచ్చైరుదాత్తః" అని ఉదాత్తపద నిర్వచనము, అనగా మామూలుగా మాట్లాడు స్థాయికన్న హెచ్చు స్థాయిని 'ఉదాత్తము' అందురు.

"నీ చైరను దాత్తః" అని అనుదాత్త పద నిర్వచనము. అనగా, మాములుగా మాట్లాడు స్థాయికన్న తక్కువ స్థాయిని 'అనుదాత్తము' అందురు,

మామూలు స్థాయిలో పలుకు మాటనే నిర్దిష్టమైన కాలవ్యవధిలో సాగదీసి ఉచ్చరించినచో ఆ స్థాయి "దీర్ఘస్వరిత" మగును. వైదిక సంప్రదాయ ప్రకారము అనుదాత్తముగా ఉచ్చరింపవలసిన అక్షరమునకు క్రిందుగా అడ్డగీత (–) నుంచుటయు, స్వరితముగా నుచ్చరింపవలసిన అక్షరమునకు పైన నిలువుగా గీతను(।) ఉంచుటయు,

ఉదాత్తముగా నుచ్చరింపవలసిన అక్షరమునకు పైనగాని క్రిందగాని ఏ గుర్తును ఉంచకపోవుటయు, దీర్ఘస్వరితముగా ఉచ్చరింపవలసిన అక్షరమునకు పైన రెండు నిలువుగీతల (॥) నుంచుటయు పాఠకుల సౌకర్యార్థము సాధారణముగా పాటింపబడును. (కాని, కొందరు, చెప్పుటతోడనే తేలికగా అర్థమగునని పై నిలువు గీత ఉదాత్తమును, క్రింద అడ్డగీత అనుదాత్తమును, ఏ గీతలేనిచో స్వరితమును తెల్పునని చెప్పుదురు. కాని అది సరికాదు.) ఉదా: పైన చెప్పబడిన మంత్రమును స్వరయుక్తముగా వ్రాసినపుడు "శీక్షాంవ్యాఖ్యాస్యామః" అగును. అపుడు "వ్యా" అనునది దీర్ఘ స్వరితము, 'స్యా' అనునది, అనుదాత్తము. అదే విధముగా "సామసంతానః" అనునపుడు 'మ' అనునది స్వరితము, 'తా' అనునది అనుదాత్తము. ఏ గుర్తులేనివన్నియు ఉదాత్తములు అగును. స్వరితములు కంఠస్థానమును స్పృశించుచు వ్యక్తమగును. ఉదాత్తములు మూర్ధస్థానమును స్పృశించుచు వ్యక్తమగును. అనుదాత్తములు నాభి లేదా హృదయ స్థానమును స్పృశించుచు వ్యక్తమగును.

**మాత్రలు :** అక్షరమును ఉచ్చరించుటకు తీసుకొనవలసిన కాలమును నిర్దేశించు కొలమానములను మాత్రలందురు. ఇవి ముఖ్యముగా మూడు రకములు 1) హ్రస్వము 2) దీర్ఘము 3) ప్లుతము, హ్రస్వ దీర్ఘములు ఛందస్సులోని లఘు, గురువులవంటివి.

ఒక హ్రస్వాక్షరమును మామూలుగా ఉచ్చరించుటకు పట్టు కాలమును ప్రమాణముగా తీసికొని దానికి రెట్టింపు కాల వ్యవధితో ఉచ్చరించు అక్షరమును దీర్ఘము అందురు. ఉదా: 'అ' అనునపుడు హ్రస్వము, 'ఆ' దీర్ఘము అగును.

ఒక హ్రస్వాక్షరమును మామూలుగా ఉచ్చరించుటకు పట్టుకాలమునకు మూడు రెట్లు కాలవ్యవధితో ఉచ్చరించు అక్షరమును 'ప్లుతము' అందురు. ఒక్కొక్కప్పుడు మూడు రెట్లు కాలవ్యవధికన్న ఎక్కువ వ్యవధితో ఉచ్చరింపవలసినవి గూడ ఉండును.

(శిక్షావల్లిలో ప్లుతములు రావుగాని మిగిలిన వల్లులలో ప్లుతములుకూడ

వచ్చును. ఇట్టి ప్లుతములకు ప్రక్కగా కాలవ్యవధిని సూచించు అంకెను గూడ తెలుపుదురు. ఉదా : 'హో 3' ఉ)

**బలము :** అక్షరములను ఉచ్చరించునపుడు చేయవలసిన ప్రయత్న విశేషమును 'బలము' అందురు.

ఉదా: 'మ' అక్షరమును ఉచ్చరింపదలచినచో పెదవులు రెంటిని కలుప వలయును, ఈ విధముగా పెదవులను కలుపు ప్రయత్నమును బలమందురు.

**సామము :** అక్షరములను అతివేగముగను, అతిమందముగను పలుకక మధ్యమవత్తిగా, సమముగా ఉచ్చరించుటను 'సమత' లేక "సమము" లేక "సామము" అందురు.

**సంతానము :** "వర్ణానాం అవిలంబేనోచ్చారణం సంహితా సంజ్ఞంస్యాత్" అని "సంహిత" లేక "సంతాన" పదమునకు ప్రమాణము. అక్షరములను పదములను ఉచ్చరించునపుడు విలంబనము అనగా ఆలస్యము లేక ఉచ్చరించుట 'సంతాన' మనబడును.

పైన చెప్పబడిన ఆరు విషయములను జాగ్రత్తగా గుర్తుపెట్టుకొని వేదమును పఠించవలెను, లేనిచో అనర్థములకు, పెదర్థములకు దారి తీయును.

ఉదా : 'తే' అను పదమును ఉదాత్తముగ ఉచ్చరించినచో 'వారు' అని అర్థము నిచ్చును. ఆ పదమునే అనుదాత్తముగా ఉచ్చరించినచో 'నీ కొఱకు' అను అర్థము నిచ్చును. అట్లే 'మా' అనుపదమును ఉదాత్తముగా ఉచ్చరించినచో 'వద్దు' అను అర్థము నిచ్చును. ఆ పదమునే అనుదాత్తముగా ఉచ్చరించినచో 'నన్ను' అను అర్థము నిచ్చును. ఒక్కొక్కప్పుడు స్వర భేదము వలన అర్థము పూర్తిగా మారి వ్యతిరేకార్థము వచ్చి వినాశమునకు దారి తీయుట గూడ జరుగవచ్చును.

ఉదా: "ఇంద్రశత్రుః" అను పదములోని అక్షరముల స్వరములను తప్పుగా ఉచ్చరించుటవలన ఇంద్రుడు హతుడగుటకు బదులు ఇంద్రుని శత్రువు హతుడయ్యెను.

ఒక్కొక్కప్పుడు ఉచ్చరింపవలసిన అక్షరములను ఉచ్చరింపవలసిన విధముగా ఉచ్చరించకపోయినచో అనర్థములకు దారితీయును.

ఉదా: 'కార్యం సకలం కురు' అను వాక్యమును 'కార్యం శకలం కురు' అను రీతిలో 'స'కు బదులు 'శ' ను ఉచ్చరించినచో 'కార్యమును సంపూర్ణముగా చేయుము' అను అర్థమునకు బదులు 'కార్యమును ముక్కలుముక్కలుగా చేయుము అనగా చెడగొట్టుము' అను వ్యతిరేకార్థము వచ్చును. (ఈ వాక్యములోని "స" అనునది దంత్యము. అనగా దంతముల సహాయముతో నాలుక ఉచ్చరించవలసిన అక్షరము. "శ" అనునది తాలవ్యము అనగా తాలువు సహాయముతో నాలుక ఉచ్చరించవలసిన అక్షరము. (నోటిలో నాలుకపైన పై దవడుకు డిప్పవలె డొల్లగా ఉండుదానిని 'తాలు' అందురు). దీనిని బట్టి అక్షరముల స్వరములందే కాక ఉచ్చారణలో గూడ చాలా జాగ్రత్తగా నుండవలెనని గుర్తించుకోవలెను. అక్షరములను సరిగా ఉచ్చరించు విధానము ఈ క్రింద తెలుపబడినది.

అ, క, ఖ, గ, ఘ, ఙ, హ - వీనిని నాలుక కంఠస్థాన సహకారముతో ఉచ్చరించవలెను.

ఇ, చ, ఛ, జ, ఝ, ఞ, య, శ - వీనిని తాలు స్థానసహకారముతో ఉచ్చరించవలెను.

త, థ, ద, ధ, న, ల, స - వీనిని దంతముల సహకారముతో ఉచ్చరించవలెను.

ఉ, ప, ఫ, బ, భ, మ - వీనిని పెదవుల సహకారముతో ఉచ్చరించవలెను.

ఙ, ఞ, న, ణ, మ - వీనిని ముక్కు సహకారముతోఉచ్చరించవలెను.

ఎ, ఏ, ఐ - కంఠము, తాలువుల సహకారముతో ఉచ్చరించవలెను.

ఒ, ఓ, ఔ - కంఠము, పెదవుల సహకారముతో ఉచ్చరించవలెను.

వ - దంతముల, పెదవుల సహకారముతో ఉచ్చరించవలెను.

ఎంత విపులముగా చెప్పినను సంగీతమునకు Postal tutition ఎట్లు కుదరదో, అట్లే అక్షరోచ్చారణకు గాని, వేదమును చదువు విధానమునకు గాని పైన చెప్పిన వన్నియు సమగ్రములు కావు. గురువు ముఖతః ఉచ్చరించినపుడు శిష్యుడు శ్రద్ధగా విని తిరిగి ఉచ్చరించు ఒక్క పద్ధతియే సరియైనది. ఈ విధముగానే వేదము చదువుట వచ్చును. వేదములను 'శ్రుతులు' అనుటలో గల ఔచిత్యమిదియే! వేదమును చదువు వారిలో అధమ పాఠకులను గూర్చి ఈ క్రింద ఉదహరించిన శ్లోకమును గుర్తు పెట్టుకొనుట సందర్భశుద్ధిగా, సముచితముగా నుండును.

"గీతీ శీఘ్రీ శిరఃకంపీ, తథా లిఖిత పాఠకః,
అనర్థజ్ఞో, ఉల్పకంఠశ్చ, షడేతే పాఠకాధమా"

ఈ శ్లోకార్ధము ఏమనగా -

(వేదమును) పాట పాడినట్లు చదువువాడు, మితిమీరిన వేగముగా చదువువాడు, తలను (పైకి క్రిందకూ) కంపించుచూ చదువువాడు, పాఠమును చదువునట్లు చదువువాడు, అర్థము తెలియక చదువువాడు, నెమ్మదిగా నూతిలో నుండి వచ్చుమాట యొక్క స్థాయిలో చదువువాడు - ఈ ఆరుగురినీ అధమ పాఠకులందురు. అదే విధముగా ఉత్తమ పాఠకులను గూర్చి ఈ క్రింది శ్లోకము చెప్పబడినది.

"మాధుర్య మక్షరవ్యక్తిః పదచ్ఛేదస్తు సుస్వరః
ధైర్యం లయసమర్థం చ షడేతే పాఠకాగుణాః"

(ఇంకనూ శ్రుతులనెట్లు చదువవలెనో తెలుపుటకు చాల విషయములు గలవు గాని గ్రంథవిస్తరణ భీతిచే ఇక్కడ వాటినన్నిటినీ సంపూర్ణముగా వ్రాయుట జరుగలేదు - వివరణ కర్త).

**మంత్రము :** *సహ నౌ యశః । సహనౌ బ్రహ్మవర్చసమ్ । అథాతస్సగ్ంహితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామ్యః । పంచస్వధికరణేషు । అధిలోక మధిజ్యౌతిష మధివిద్య మధిప్రజ మధ్యాత్మమ్। తా మహాసగ్ంహితా ఇత్యాచక్షతే । అథాధి లోకమ్। పృథివీ పూర్వ రూపమ్ । ద్యౌ రుత్తర రూపమ్ । ఆకాశ స్సంధిః । వాయు స్సంధానమ్। ఇత్యధిలోకమ్ । అథాధిజ్యౌతిషమ్ । అగ్నిః పూర్వరూపమ్ । ఆదిత్య ఉత్తరరూపమ్।*

**అపస్సంధిః । వైద్యుతస్సంధానమ్ । ఇత్యధిజ్యౌతిషమ్ । అథాధివిద్యమ్ । ఆచార్యః పూర్వరూపమ్ । అన్తేవాస్యు త్తర రూపమ్ । విద్యా సన్ధిః । ప్రవచనగ్ం సన్ధానమ్ । ఇత్యధివిద్యమ్ । అథాధిప్రజమ్ । మాతా పూర్వరూపమ్ । పితో త్తరరూపమ్ । ప్రజాసన్ధిః । ప్రజననగ్ం సన్ధానమ్ । ఇత్యధిప్రజమ్ । అథాధ్యాత్మమ్ । అధరాహనుః పూర్వరూపమ్ । ఉత్తరాహనురుత్తర రూపమ్ । వాక్సంధిః । జిహ్వా సంధానమ్ । ఇత్యధ్యాత్మమ్ । ఇతీమామహాసగ్ం హితాః। య ఏవ మేతా మహాసగ్ంహితావ్యాఖ్యాతా వేద। సంధీయతే ప్రజయా పశుభిః । బ్రహ్మవర్చ సేనాన్నాద్యేన సువర్గేణ లోకేన ।(2)**

**టీక :** నౌ = మాకు (శిష్యాచార్యుల మగు మాకు), యశః = కీర్తి, సహ = కూడా (అగుగాక), బ్రహ్మవర్చసమ్ = బ్రహ్మతేజస్సు, నౌ = మాకు, సహ = కూడా (అగుగాక) అథ = ఇకమీదట, (Now) పంచసు = ఐదుగానున్న, అధికరణేషు = ఆశ్రయములచేత, సగ్ంహితాయాః = సంహితల యొక్క, (Of great Volumes) ఉపనిషదం = ఉపాసనమును, వ్యాఖ్యాస్యామః = వివరించుచున్నాము. అధిలోక మధిజ్యౌతిష మధివిద్య మధిప్రజ మధ్యాత్మమ్ = (అవియేవియన-) అధిలోకము, అధిజ్యౌతిషము, అధివిద్య, అధిప్రజము, అధ్యాత్మము అని ఐదు సంహితములు, తాః = ఆ ఐదింటి(నే), మహాసగ్ంహి తాః = మహాసంహితలని, ఆచక్షతే = పలుకుచున్నారు; అథ = ఇక (పైన), అధిలోకమ్ = లోకసంహితకు సంబంధించిన విషయము (చెప్పబడుచున్నది), (ఈ లోక సంహితకు) పూర్వరూపమ్ = ముందు లేక క్రిందుగా లేక మొదటగా కన్పడు అక్షర రూపము, పృథివీ = భూమి అనియు, ఉత్తర రూపమ్ = తర్వాత లేక పైదిగా కన్పడు అక్షర రూపము, ద్యౌః = అంతరిక్షమనియు, సంధిః = ఈ ముందు చెప్పబడిన రెండింటికి సంబంధించిన అక్షర రూపము, ఆకాశ = ఆకాశమనియు, సంధానమ్ = ఈ ముందు చెప్పబడిన రెంటిని సంధానపరచు అక్షర రూపము, వాయుః = వాయువనియు, ఇతి = ఈ విధముగా, లోకమ్ = 'లోకము' అను సంహితను గురించి చెప్పబడిన ఉపాసనము, అథ = ఇక, అధిజ్యౌతిషమ్ = జ్యోతిస్సంహితకు సంబంధించిన విషయము (చెప్పబడుచున్నది), (ఈ జ్యోతిస్సంహితకు) పూర్వరూపమ్ = ముందు లేక క్రిందుగా లేక మొదటిదిగా కన్పడు అక్షర రూపము, అగ్నిః = అగ్ని

(అనియు), ఉత్తరరూపమ్ = తర్వాత లేక పైదిగా కన్పడు అక్షర రూపము, ఆదిత్యః = సూర్యుడు (అనియు), సంధిః = ఈ రెంటికి సంబంధించిన అక్షర రూపము, ఆపః = ఉదకము (అనియు), సంధానమ్ = ఈ రెంటినీ సంధానపరచు అక్షరరూపము, వైద్యుతః = విద్యుత్తు (అనియు), ఇతి = ఈ విధముగా, అధిజ్యౌతిషమ్ = జ్యోతిస్సంహితను గూర్చి చెప్పబడిన ఉపాసనము, అథ = ఇక, అధివిద్యమ్ = విద్యా సంహితకు సంబంధించిన విషయము (చెప్పబడుచున్నది), (ఈ విద్యాసంహితకు), పూర్వరూపమ్ = ముందు లేక క్రిందుగా లేక మొదటిదిగా కన్పడు అక్షర రూపము, ఆచార్యః = ఆచార్యుడు (అనియు), ఉత్తర రూపమ్ = తర్వాత లేక పైదిగా కన్పడు అక్షరరూపము, అంతేవాసీ = శిష్యుడు (అనియు), సంధిః = ఈ రెంటికి సంబంధించిన అక్షర రూపము, విద్యా = విద్య (అనియు), సంధానమ్ = ఈ రెంటినీ సంధానపరచు అక్షర రూపము, ప్రవచనగ్ం = ప్రవచనము (అనియు), ఇతి = ఈ విధముగా, అధివిద్యమ్ = విద్యా సంహితను గురించి చెప్పబడిన ఉపాసనము, అథ = ఇక, అధిప్రజమ్ = ప్రజాసంహితకు సంబంధించిన విషయము (చెప్పబడు చున్నది), (ఈ ప్రజాసంహితకు) పూర్వ రూపమ్ = ముందు లేక క్రిందుగా లేక మొదటిదిగా కన్పడు అక్షర రూపము, మాతా = తల్లి (అనియు), ఉత్తర రూపమ్ = తర్వాత లేక పైదిగా కన్పడు అక్షర రూపము, పితా = తండ్రి (అనియు), సంధిః = ఈ రెంటికి సంబంధించిన అక్షరరూపము, ప్రజా = ప్రజ (అనియు), సంధానమ్ = ఈ రెంటినీ సంధానపరచు అక్షర రూపము, ప్రజననగ్ం = ప్రజననము (అనియు), ఇతి = ఈ విధముగా, అధిప్రజమ్ = ప్రజాసంహితను గురించి చెప్పబడిన ఉపాసనము, అథ = ఇక, అధ్యాత్మమ్ = అధ్యాత్మ సంహితకు సంబంధించిన విషయము (చెప్పబడుచున్నది), (ఈ అధ్యాత్మ సంహితకు), పూర్వరూపమ్ = ముందు లేక క్రిందుగా లేక మొదటిదిగా కన్పడు అక్షర రూపము, అధరాహనుః = క్రింది (పెదవితో కూడిన కదిలెడి) దవడ (అనియు), ఉత్తర రూపమ్ = తర్వాత లేక పైదిగా కన్పడు అక్షర రూపము, ఉత్తరాహనుః = పై (పెదవితో కూడిన కదలని) దవడ (అనియు), సంధిః = ఈ రెంటికి సంబంధించిన అక్షర రూపము, వాక్ = వాక్కు (అనియు), సంధానమ్ = ఈ రెంటినీ సంధానపరచు అక్షర రూపము, జిహ్వా = నాలుక (అనియు), ఇతి = ఈ విధముగా, అధ్యాత్మమ్ =

అధ్యాత్మసంహితను గురించి చెప్పబడిన ఉపాసనము, ఇతి = ఈ విధముగా, ఇమాః = చెప్పబడిన, మహా సంహితాః = గొప్ప ఉపాసనములను, యః = ఎవడు, ఏవమ్ = ఈ (పైన చెప్పబడిన), వ్యాఖ్యాతాః = వివరింపబడిన విధముగా, ఏతాః = మహాసంహితాః = గొప్ప సంహితలు (ఐదింటిని), వేద = (ఉపాసన ద్వారా) తెలుసుకొనుచున్నాడో (సః = వాడు), ప్రజయా = సంతానముతోను, పశుభిః = పశువులతోను, బ్రహ్మవర్చసేన = బ్రహ్మవర్చస్సుతోను, అన్నాద్యేన = ఆహారాది భోగ్యవస్తు సముదాయముతోను, సువర్గేణలోకేన = స్వర్గలోకము లేదా సు + వర్గము = మంచి బంధు మిత్రవర్గాదులతోను, సంధీయతే = కూర్చబడినవాడు లేదా పొందబడినవాడు (అగుచున్నాడు).

**తాత్పర్యము :** విద్యను నేర్చుకొనుటకు ముందుగా శిష్యుడు తనకు, (తనవలన) తన గురువునకు బ్రహ్మవిద్య విషయికమగు కీర్తి, బ్రహ్మవర్చస్సు కలుగవలయునని ప్రార్థించును.

ఇక ఐదు అధికరణములుగా నున్న సంహితల యొక్క ఉపాసనమును వివరించుచున్నాము. 1. అధిలోకము 2. అధి జ్యౌతిషము 3. అధివిద్య 4. అధిప్రజ 5. అధ్యాత్మము – అని ఈ ఐదు పేర్లతో ఈ సంహితలు చెప్పబడును. వీనినే మహాసంహితలు (Great Volumes) అని కూడా అందురు.

పూర్వాక్షర రూపమును భూమిగాను, ఉత్తరాక్షర రూపమును అంతరిక్షముగాను, ఈ రెంటి సంధిని ఆకాశముగాను, ఈ రెంటినీ సంధానము చేయు దానిని వాయువు గాను, అధిలోక సంహిత నుపాసించవలెను.

పూర్వాక్షర రూపమును అగ్నిగాను, ఉత్తరాక్షర రూపమును ఆదిత్యునిగాను, ఈ రెంటి సంధిని జలములుగాను, ఈ రెంటినీ సంధానము చేయు దానిని విద్యుత్తుగాను, అధిజ్యౌతిష సంహిత నుపాసించవలెను.

పూర్వాక్షర రూపమును ఆచార్యుని గాను, ఉత్తరాక్షర రూపమును శిష్యునిగాను, ఈ రెంటి సంధిని విద్యగాను, రెంటినీ సంధానము చేయు దానిని ప్రవచనము గాను అధివిద్యా సంహిత నుపాసించవలెను.

పూర్వాక్షర రూపమును, తల్లిగాను, ఉత్తరాక్షర రూపమును తండ్రిగాను, ఈ రెంటి సంధిని సంతానముగాను, ఈ రెంటినీ సంధానము చేయు దానిని ప్రజననముగాను, అధి ప్రజాసంహిత నుపాసించవలెను.

పూర్వాక్షర రూపమును క్రింది పెదవిని కలిగిన కదిలెడు దవడగాను, ఉత్తరాక్షర రూపమును పై పెదవిని కల్గిన కదలని దవడగాను, ఈ రెంటి సంధిని వాక్కుగాను, ఈ రెంటినీ సంధానము చేయుదానిని నాలుకగాను అధ్యాత్మ సంహిత నుపాసించవలెను.

ఈ చెప్పబడిన ఐదు మహాసంహితలను ఎవడు ఈ విధముగా ఉపాసించునో వాడు చక్కని సంతానముతోను, గోగణాది పశు సంపదతోను, మృష్టాన్న భోజన వస్త్రాది సౌకర్యములతోను, మంచి బంధుమిత్ర వర్గముతోను స్వర్గలోక సదుపాయములను అనుభవించును.

**వివరణము :** మా (గురుశిష్యులు) ఇద్దరికి యశస్సుతో విద్య వచ్చు గాక అనియు, ఇంకొకరి విధానమును విమర్శ (Comment or Criticise) చేయకుండా మా ప్రయత్నము కొనసాగు గాక అనియు, వెలుగులు కలిసి ఒకేవెలుగు ఐనట్లుగా (Homogenious) మా ఇరువురి వర్చస్సులు కలిసి ఉండుగాక అనియు, శిష్యుడే గురుశిష్యులిద్దరి తరపున ప్రార్ధన చేయుటతో విద్య నేర్చుట ప్రారంభమగుట చక్కని సాధనా సంప్రదాయమును తెలియ జేయును.

"పృథివీ" పదము నుండి "పార్థివ" పదము పుట్టినది. ఈ పార్థివ లోకము రజస్సంబంధమైన లోకము. అనగా అణువులతో కూడిన భూలోకమే ఈ పృథివి. ఇది మనము నిలబడుటకు, మన అస్తిత్వమునకు, వ్యక్తరూపమునకు కారణమైనది. అన్నిటికంటె క్రిందుగా కనబడునది ఘనపదార్ధము, ఒక గ్లాసులో ఘన, ద్రవ, వాయు పదార్ధములున్నచో అన్నిటి కన్న క్రింద ఘనపదార్ధము వుండును. (The Mostly Gravitated or Gross State of matter is solid) అందువలన క్రిందుగా నుండునది 'పృథివీలోకము' అని ఇక్కడ చెప్పబడినిది, మీదుగా ఉండునది ద్యులోకము. "ద్యౌః" అను పదము నుండి ద్యులోకము పుట్టినది. దీని నుండియే

'దివ్య' లేదా "Theos". అను సంస్కృత, ఆంగ్ల పదములు పుట్టినవి. దివము అనగా ఆకాశము కాదు, మనకు ఆకాశము వలె కనపడు దానిపైది, నేర్చుకొన్నది - జ్ఞానరూపములో క్రిందుగా నున్నచో ఆ పైన తెలియవలసినది. - దివ్యజ్ఞాన రూపములో ఉండును. ఈ జ్ఞాన, దివ్యజ్ఞాన రూపములకు ప్రతీకలైన పృథివీ, ద్యులోకములకుసంధిగా ఆకాశమును ఊహించవలెను. ఇది పృథివీ ద్యులోకాలకు మధ్య కవాటము వంటిది (Gate or boundary Line) ఇంటిలోని విషయములు తెలిసినవి. బైట విషయములు - తెలియవలసినవి. అనగా ఈ శరీర సంబంధ విషయములు - తెలిసినవి. వీనికి కారణభూతమైన బాహ్యారంగ విషయములు - తెలియవలసినవి. ఈ రెంటికి మధ్య సంధానము జరుగవలెను. "వాయుస్సంధానమ్" అనగా ఈ వాయువు ద్వారా లోపలకు బైటకు మధ్య సంధానము, ప్రసారము (Coupling, communication) జరుగును. ఇచ్చట ప్రసారమనగా ఉచ్ఛ్వాస నిశ్వాసల ద్వారా జరుగు ప్రక్రియ. ఈ శ్వాస - వాయు రూపమే కాబట్టి అంతరంగ బాహ్యారంగాలను - పృథివీ, ద్యులోకములతోను; సంధానమును - వాయువుతోను పోల్చిరి. ఈ వాయువు వల్ల జరుగు శ్వాసలోని 'సోఽహం' - లోపల వున్న జీవాత్మ (అహం) బయట వున్న పరమాత (సః) ఒకడే అని తెలియును. 'సోఽహం అనగా సః + అహమ్ = వాడే నేను అని అర్థము. ఈ వాయువు ఉన్నంతవరకు జీవన వ్యాపారము జరుగును. ఆగిపోవుటతో జీవన వ్యాపారము నిలచిపోవును. ఇది ఒకరమైన ఉపాసనా మార్గము (ఉపాసన మనగా శాస్త్రానుసారము విచ్ఛేదము లేక శాస్త్ర నిర్దిష్టమగు ఒక అలంబనము నందు బుద్ధిని ప్రవేశపెట్టి, ఎల్లప్పుడు దానిని స్మరించు విధానము. ఒక పర్యాయము ధ్యేయము నందు బుద్ధిని ప్రవేశపెట్టిన చాలదు).

ఈ మొదటి సంహితలో ఇంకొక సమన్వయము కలదు, మనము ఎరుగున్న విషయముల నుండి ఎరుగవలసిన విషయముల వైపు చూచునపుడు ముందుకనపడునది కార్యము. (effect or result) అటుపైన ఉపాసనలో కనపడునది కారణము (Cause). కన్నులు తెరువగనే ముందు తెలియునది పృథివి, అటుపైన దానికి కారణభూతమైనది ద్యులోకము. కనుక, 'పృథివీ పూర్వరూపమ్,

ద్యౌ రుత్తర రూపమ్' అని చెప్పబడినది. అట్లే ఇతర సంహితలలో అగ్నిముందు తెలియబడునది (కార్యము). అటుపైన తెలియబడునది దానికి కారణభూతమైన ఆదిత్య లోకము, అట్లే మన ఉనికికి కారణము తల్లి - పృథివీరూపము, అటుపైన తండ్రి - కారణరూపుడు అని తల్లి చెప్పగా తెలియును.

ఇక రెండవ సంహితలో పూర్వ రూపమైన అగ్నికి ఆదిత్యుడు ఉత్తర రూపము, ఆదిత్యునిలో మనము చూడలేని వెలుగులు, వేడి చాలా సూక్ష్మముగా వుండును. అగ్నిలో మనము చూడగల్గు వెలుగు, వేడి వ్యక్తమై కనపడును. ఈ అగ్ని, ఆదిత్యుల మధ్య సంధిగా ఆపస్సులు, సంధానముగా విద్యుత్తు అని చెప్పబడినది.

ఆపస్సులు (నీరు) సంధిగా పనిచేయుటకు విద్యుత్తు ద్వారా సంధానము జరుగును, ఉదజని ఆమ్లజని కలసి నీరుగా ఏర్పడు ప్రక్రియలో దీనిని అన్వయించవచ్చును. ఇవి రెండును కలసినపుడు విద్యుత్తు పుట్టును. (వర్షము వచ్చుటకు ముందుమేఘముల మధ్య మెరుపు గూడ విద్యుత్తే). లేదా నీటిలో విద్యుత్తు పంపినచో ఇవి రెండును వేరగును, అందుచే అగ్ని,ఆదిత్యులకు ఆపస్సు (నీరు) సంధి గాను, విద్యుత్తు సంధానముగాను చెప్పబడినవి.



($2H_2 + O_2 = 2H_2O$ + X కెలోరీల శక్తి)

'ఆచార్యః పూర్వరూపమ్' అనగా విద్య నేర్పు గురువు ముందు, 'అంతేవ్యాస్యుత్తర రూపమ్ ! అనగా నేర్చుకొను శిష్యుడు తర్వాత అని సమన్వయించినచో ఇద్దరి మధ్య ప్రవచనము అనగా 'గురువు అనుట - శిష్యుడు అనుసరించుట' అనునది సంధానము అగును. ఇద్దరి మధ్యన సంధి విద్య యగును. ఇట్లే ఇతర సంహితలను గూర్చి కూడా తెలియ వలెను. ప్రకృతి నుండి గ్రహించు ఏ సత్యమునైనను ఈ ఐదు మహా సంకేతముల దీపపు వెలుగులో చదువు కొనవలయునని ఉపదేశము.

పైన చెప్పబడిన విధముగా ఐదు మహా సంహితలను అర్థము చేసుకొని ఉపాసించు వానికి చక్కని సంతానము, గోగణాది పశు సంపద, మృష్టాన్న భోజన వస్త్రాది సౌకర్యములు కలుగును. అప్పుడు వాని స్థితి స్వర్గలోకములో ఉండునట్లు

సుఖసంతోషములతో నుండును. ఇక్కడ స్వర్గలోకమును తాత్పర్యములో చెప్పబడిన మంచి సౌకర్యములు, అనగా సు + వర్గముగా (మంచి బంధుమిత్ర సదుపాయా సౌకర్యాదులుగా) గూడా అర్ధము చేసుకొనవలెను. అట్టి వాడు మంచి బృహ్మణశక్తి కలిగి తేజస్వంతుడు గూడా అగును.

**మంత్రము :** **యు శ్చన్దసా మృషభో విశ్వరూపః । ఛందోభ్యో ఉధ్యమృతాథ్సం బభూవ । స మేన్ద్రో మేధయా స్పృణోతు । అమృతస్య దేవ ధారణో భూయాసమ్ । శరీరం మే విచర్షణమ్ । జిహ్వా మే మధుమత్తమా । కర్ణాంభ్యాం భూరి విశ్రువమ్ । బ్రహ్మణః కోశో౽సిమేధయా పిహితః । శ్రుతం మే గోపాయ । ఆవహంతీ వితన్వానా। కుర్వాణా చీర మాత్మనః । వాసాగ్ంసి మమగావశ్చ । అన్నపానేచ సర్వదా ।తతో మే శ్రియ మావహ। లోమశాం పశుభి స్సహ స్వాహా । ఆమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా। విమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా । ప్రమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా । శమాయాన్తు బ్రహ్మచారిణస్స్వాహా । యశోజనే౽సాని స్వాహా । శ్రేయాన్వస్యసో ౽సానిస్వాహా । తంత్వాభగ ప్రవిశాని స్వాహా । సమాభగ ప్రవిశస్వాహా । తస్మిన్థ్సహస్రశాఖే। నిభగాహం త్వయి మృజే స్వాహా । యథాః౽౽పః ప్రవతా యన్తి । యథామాసా అహర్జరమ్। ఏవం మాం బ్రహ్మచారిణః । ధాత రాయన్తు సర్వత స్స్వాహా । ప్రతివేశో౽సి ప్రమాభాహి ప్రమాపద్యస్వ ॥** *(3)*

**టీక:** యః = ఏయది, ఛందసాం = (వేదముల) గమనరీతికి, ఋషభః = (ప్రాధాన్యమైన) వృషభరూపముగా (వచ్చిన) ('ఠ' రూపమై వచ్చిన), విశ్వరూపః = విశ్వరూపుడుగా (వచ్చిన) (సః = ఆ ప్రణవము), అమృతాత్ = అమృత స్వరూపములగు, ఛందోభ్యో = వేదములలో, సంబభూవ = చక్కగా ప్రకాశించు చున్నదైన, ఇంద్రః = ఇంద్ర రూపముగా, సః = ఆప్రణవము, మా = నన్ను, మేధయా = ప్రజ్ఞచేత, స్పృణోతు = స్పృశించి, సంతోషింప చేయుగాక, అమృతస్య = అమృతత్వమునకు కారణమైన (బ్రహ్మజ్ఞానమును), ధారణః = ధరించువాడనుగా, భూయాసమ్ = అయ్యెదనుగాక, శరీరంమే విచర్షణమ్ = (నా) శరీరము శిథిలముగాకుండా యోగ్యమైనదిగా ఉండుగాక, జిహ్వామే మధుమత్తమా = (నా) నాలుక మధుర భాషణము కలదిగా అగుగాక, కర్ణాం భ్యాం భూరి విశ్రువమ్ (నా)

చెవుల వలన విస్తారముగావిందునుగాక, బ్రహ్మణః కోశోఽసి = పరమాత్మ యందు నివాస స్థానమైన నీవు, మేధయాపిహితః = (మా) సామాన్య ప్రజ్ఞచేత కప్పబడితివి, శ్రుతంమేగోపాయ = (నా) శ్రవణ పూర్వక జ్ఞానమును రక్షించుము, ఆవహంతీ వితన్వానా = (నున్న) చక్కగా నడిపించుచు వ్యాప్తి లేక విస్తరింప చేయుదానివిగా అగుగాక, కుర్వాణా చీరమాత్మనః = (నన్ను శారీరికముగా) ధీర్ఘకాలముండునట్లుగా చేయుదానివి(అగుగాక), వాసాగ్ంసి మమగావశ్చ = (నాకు) వస్త్రములను, గోవులను, అన్నపానేచ సర్వదా = (ఇల్లు వాకిలి) అన్న పానీయాదులన్నియు ఎల్లపుడు కలుగ చేయుదానివిగా (అగుగాక), తతోమే శ్రియమావహ = అటుపిమ్మట నాకు సిరులను, లోమశాం పశుభిస్సహస్వాహా = వెంట్రుకలు వంటిపైన బాగా విస్తారముగా మొలచు గొఱ్ఱె మొదలైన పశువులను కూడా (పొందింప చేయు దానివిగా (అగుగాక), ఆమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా = బ్రహ్మ విద్య నేర్చుకొనువారు నా వద్దకు వచ్చుగాక; విమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా = వివిధ రకముల కోరికలతో ఉందు బ్రహ్మచారులు నా వద్దకు వచ్చుగాక, ప్రమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా ప్రమాణ లేదా శ్రేష్ఠబుద్ధిగల బ్రహ్మచారులు నా వద్దకు వచ్చుగాక, దమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా = దమము గల బ్రహ్మచారులు నా వద్దకు వచ్చుగాక, శమాయన్తు బ్రహ్మచారిణస్స్వాహా = శమము గల బ్రహ్మచారులు నా దగ్గరకు వచ్చుగాక, జనే = జనులలో, యశః = కీర్తిగలవాడను, అసాని = అయ్యెదను గాక, వస్యసః = ధనవంతుని కంటె, శ్రేయాన్ = శ్రేష్ఠుడను, అసాని = అయ్యెదను గాక, తంత్వాభగ ప్రవిశాని స్వాహా = పూజ్యమైన ఆ నిన్ను ప్రవేశించెదను గాక, సమాభగ ప్రవిశ స్వాహా = అట్టినీవు నా యందు ప్రవేశించుము, తస్మిన్ సహస్రశాఖే = వివిధ సంప్రదాయ, శాఖ, రూపాదులలో వ్యక్తమగు ఓ ప్రణవమా, అహం = నేను, త్వయి = నీ యందు, నిమృజే = క్షాళనము చేసుకొన్నవాడను (అగుదును గాక), యథా ఽఽపః ప్రవతాయంతి = పల్లమువైపునకు నీరు ఎట్లు పోవునో, యథామాసా అహర్జరమ్ = మాసము నందు రేయింబవళ్ళు ఏ విధముగా లీనమగుచున్నవో, ఏవం = ఈ విధముగా, మామ్ = నన్ను, బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు, సర్వతః = అంతటనుండి, అన్ని విధముల, ఆయంతు = వచ్చెదరు గాక, ప్రతివేశోఽసి = సమీపము నందు గల ఇంటివలెనుంటివి, మా = నన్ను, ప్రభాహి = ప్రకాశింప చేయుము, మా = నన్ను, ప్రపద్యస్వ = పొందుము.

**తాత్పర్యము :** ఛందస్సులకు మొదటి రూపమై, విస్తరించు విశ్వ రూపమై, అమర వేదములలో ప్రకాశించు ఈశ్వర స్వరూపమైన ప్రణవ బ్రహ్మమా ! నన్ను మేధావంతునిగా చేయుము. అమృతత్వమునకు కారణమైన బ్రహ్మజ్ఞానమును ధరించువాడనుగా అయ్యెదను గాక, నా శరరీము శిధిలము కాకుండా యోగ్యమైనదిగా నుండు గాక, నాలుక మధుర భాషణము చేయునది అగుగాక, నా చెవుల వలన విస్తారముగా సద్విషయములను విందును గాక, ఓ ప్రణవబ్రహ్మమా ! పరమాత్మయే నివాసస్థానమై ఉండియు నీవు మా సామాన్య జ్ఞానము చేత కప్పబడితివి. నా శ్రవణ పూర్వక ఆత్మజ్ఞానమును రక్షించుము. అటుపైన నన్ను చక్కగా నడిపించుచు, వృద్ధి కలుగు చుండునట్లు - గో, మేషాది పశుగణములను, అన్న, వస్త్ర, పానీయాదులను పొందింప జేయుదువు గాక, శమదమాది విశిష్ట గుణములు గల బ్రహ్మవిద్యాసక్తులు అడ్డు పెట్టబడకుండ నావద్దకువిస్తారముగా వచ్చుదురు గాక, ప్రజలలో నేను శ్రేష్ఠుడనుఅయ్యెదను గాక, నేను నిన్ను, నీవు నన్ను ప్రవేశించుదుము గాక, నేను నీయందు క్షాళనము అగుదును గాక, నీరు పల్లపు దిశలలో పోవునట్లు, మాసములో రేయింబవళ్ళు లీనమగునట్లు నన్ను సద్బ్రహ్మచారులు చేరవచ్చెదరు గాక, సమీప గృహమువలెనున్న (అనగా చక్కని అందుబాటుగా నున్న) ప్రణవమా! నన్ను ప్రకాశింప చేసి నన్ను పొందుము.

**వివరణము :** ఈ అనువాకము నందు హోమపూర్వక మంత్రములు చెప్పబడినవి. (మంత్రాంతమున స్వాహా అనునవి ఈ విషయమును చెప్పును).

ఉచ్చరింపబడునది అది ఉచ్చరింపబడుటకు పూర్వము ఉచ్చరించు వానిలో ఉచ్చరించు వానిగా ఉండును. సముద్రములో అల రాక పూర్వము ఆ అల సముద్రములోనే సముద్రముగా నుండును. అట్లే ఈ సమస్త సృష్టి సృష్టింపబడుటకు పూర్వము సృష్టించువానిలో సృష్టికారునిగా ఉండును. అవ్యక్త సరస్సుగా బ్రహ్మలో నుండి వ్యక్త శబ్దరూపములో సరస్వతి బయటకు ఉచ్చారణ ద్వారా వ్యక్తమై ప్రవహించును. బైబిలు నందు గూడ సృష్టికి సంబంధించిన వాక్యములు యోహాను దర్శించినవి ఈ క్రింది విధముగా కలవు.

'First there was the word, The word was with the God. He utterdforth the word and there was the World.' భగవద్గీతలో "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అనగా - సృష్టి విచ్చుకొనునది 'ఓమ్' - అను ప్రణవము నుండి' అని ఉందును. (బ్రహ్మ = బృహ్మణ శక్తి గల లేదా చక్కగా విచ్చుకొని విస్తరిల్లగలవాడు అని అర్థము). ఈఉపనిషత్తులోనే "సోఽకామయత, బహుస్యాం ప్రజా యేయేతి .... ఇదగ్ం సర్వ మసృజత" అని ముందు చెప్పబడును. అనగా భగవంతుడు కూడ పెక్కు మందిగా అవవలెనని కోరిక కలుగగా ఒక్కడైన తాను ప్రపంచములో వివిధ జీవరాసులుగా మారెను. ('uni' hasbecome 'verse' to form 'universe') ఈ విధముగా సృష్టి ప్రక్రియకు, వాక్ ప్రక్రియకు సంబంధము, సామ్యము గలదు. వెలుగు వ్యక్తస్వరూపమును చూపగలదు. అవ్యక్త స్థితిని చూపలేదు. భవగంతుడు తాను ఇంతమందిగా అవవలెనని కోరుకొని శబ్దరూపములో ఉచ్చరించిన తర్వాత ఈ ప్రపంచము వచ్చినదని పై ఉపనిషత్ వాక్యము తెలుపుచున్నది. ప్రపంచము వెలుగులోనికి రాకపూర్వము శబ్దరూపములో ఉన్నదని దీనిని బట్టి తెలియును, వెలుగు ఉన్నచో ఎక్కడ, ఎవరున్నది (Location) తెలియును. వెలుగు లేనపుడు కూడ "ఎక్కడ ఉన్నావు" అని ప్రశ్నించినపుడు అవతలివారి నుండి "ఇక్కడ ఉన్నాను" అని శబ్దరూపములో సమాధానము వచ్చును, ఈ సమాధానము వచ్చిన దిశను బట్టి, చెప్పిన వ్యక్తి గొంతు బట్టి ఎటువైపుగా (Direction) ఎవరు వున్నది తెలియును. (దిశశ్శ్రోత్రాత్ - అని పురుషసూక్తమంత్రము), అనగా Locationకు వెలుగు, కన్ను ఎట్లో - దిశకు (Direction) శబ్దము, చెవి అట్లని అర్థము చేసుకొనవలెను.

'వృషభో విశ్వరూపః' అనుటలో - ఉచ్చరించు వాక్యములోని పదములు, ఆ పదములలోని అక్షరములు ఉచ్చరింపబడవలెనన్నచో గొంతులోని Vocal Cords మధ్యనుండి రావలెను. ఈ Vocal Cords చమకములో "గ్రావాణః" అను పదముతో తెలుపబడినవి. (గ్రావాణశ్చమే). గ్రావాణములనగా 'తిరగటిరాళ్ళు' అని అర్థము. ఈ తిరగటిరాళ్ళ నడుమ నుండి పిండి ఎలా వచ్చుచున్నదో, ఈ Vocal Cords మధ్య నుండి వాక్కు అలా వచ్చుచున్నది. గ్రావాణ పదములో "గ" కారమును

తొలగించినచో "రావాణము" అని వచ్చును. దీని అర్థము 'రవమును అనగా శబ్దమును పుట్టించునవి' అనవచ్చును. చమకములో - 'గ్రావాణశ్చమే తరువాత స్వరవశ్చమే, ఉపరవాశ్చమే' అని ఉండుట ఈ అర్థమును సమర్థించును. అందుచేతనే చమకములో ఈ పదము వేయబడినది. ఈ రెండు రావాణముల (Vocal Cords) మధ్య నుండి అక్షరములు బయటపడుటకు ముందు రేఫము (ర్) పుట్టును. ఈ రేఫమునకు నిశ్వాసాత్మకమైన "హ" కారము తోడైనపుడు అది బయటకు ఉచ్చరింపబడుటకు వీలగు స్థితిలో ఉండును. దీనికి శక్తి బీజము "ఈం"తోడైనపుడు పూర్తిగా ఉచ్చరింపబడి బయటకు వచ్చును. అప్పుడు నిశ్వాసము - 'హ'; రేఫము - 'ర్', శక్తి - 'ఈం' ఈ బీజములు కలిసి "హ్రీం" అగును. ఈ 'హ్రీం' మీద - ఉచ్చరింపబడవలసినవి, వ్యక్తమవలసినవి ఆధారపడి యుండును, అందువలననే "అతస్త్వామారాధ్యాం హరిహర విరించ్యాదిభిరపి" అని శంకరాచార్యుల వారు సౌందర్యలహరిలో హరిహరులు గూడ శక్తిమీదనే ఆధారపడి, ఆరాధించుదురని చెప్పినారు. (అనగా హరి, హర శబ్దములు ఉచ్చరింపబడుటకు లేదా వ్యక్తమగుటకు 'హ్రీం' సహకారము లేనిదే సాధ్యము కాదు అని ఇందలి భావము).

ఋగ్వేద, 'ర్' కారములు వాక్కు సంబంధమైనవి - అను అర్థములో 'వాగేవఋక్' అందురు. కావున, వాక్యములకు, పదములకు, అక్షరములకు, పదముల కొలతలకు, వాక్కు యొక్క గమనమునకు ఈ "ర్" నాంది అగుటచే "ఛందసాం" ఋషభో విశ్వరూపః" అని 'ర్' కారమును ఋషభము లేదా వృషభము అనుట ఈ మంత్రములో జరిగినది. దీనిని జ్యోతిశ్శాస్త్రములో వృషభరాశితో పోల్చుదురు. రాసులలో రెండవ దైన వృషభము వాక్కు స్వరూపమును గూడ తెల్పును. వృషభములో నున్న గ్రహమును బట్టి వాక్కు ఎట్లుండునో తెలియును. కావున ఈ మంత్రములో రేఫము మీద - ఉచ్చరింపబడబోవు అక్షర, పద, వాక్యములు ఆధారపడినవి అని చెప్పుట ఎంతయో సమంజసము. మరియు "చత్వారిశృంగా, త్రయోఽస్యపాదా, ద్వేశీర్షే సప్తహస్తాసో అస్య, త్రిధాబద్ధో, వృషభోరోరవీతి, మహోదేవో మర్త్యాగ్ంఆవివేశా" అని నారాయణ ప్రశ్నలో చెప్పబడును. వాక్కు - వృషభముతో ఈ మంత్రమునందు పోల్చబడినది. ఈ వృషభము విచిత్రమైనది.

'దీనికి నాలుగు కొమ్ములు, మూడు పాదములు, రెండు తలలు ఏడుహస్తములు వుండి మూడు విధములుగా గుంజకు కట్టబడినది', అని చెప్పబడినది. ఇందులోని సంకేతములను విడదీసినచో నాలుగు కొమ్ములు - పరా, పశ్యంతి,మధ్యమా, వైఖరి అను – సంకల్పము, భావము, సంకేతము, ఉచ్చారణలకు ప్రతీకలైన వాక్కు యొక్క నాలుగు స్థితులను తెలియ జేయును. మూడు పాదములు – తార, మధ్యమ, మంద్రస్థాయిలను లేదా ఉదాత్త, స్వరిత, అనుదాత్త స్థాయిలను తెలియజేయును. రెండు తలలు - వాక్కులోని శబ్దము, అర్థములను తెలియ జేయును. ఏడు హస్తములు – సప్తస్వరములను తెలియజేయును. 'మాట్లాడువారుగా, మాట్లాడబడు వాక్కుగా, వినువారుగా - వాక్కు మూడు విధములుగా ముడివేయబడినది' అని "త్రిధాబద్ధో" అనునది తెలియ చేయును. ఇట్టి అనేక రీతులలో వృషభమునకు ప్రాధాన్యము గలదు.

"సమేంద్రో మేధయా" అనుచోట ఇంద్ర అను పదమునకు 'ఇదమ్ ద్రః = ఇదిగో నేను ఇక్కడ వున్నాను' అని అర్థము. అనగా చోటులో ఏ బిందువు వద్దనైనను గుప్త స్థితిలో లేదా అవ్యక్త స్థితిలో (Potential State) ఉన్న వానిని ఇంద్రశబ్దముతో చెప్పుదురు. ఇది పరమేశ్వరునకు గూడ సమన్వయమగును, "శ్రుతం గర్తసదమ్" అని నమకములోను, "ఈశావాస్య మిదం సర్వమ్" అని ఈశావాస్యోపనిషత్తు నందును ఈశుడు ప్రతిపాదింపబడును. అందుచేతనే వేద సంప్రదాయములో ఇంద్రునకు, రుద్రునకు దగ్గర సంబంధము కలదు. ఈ ఇంద్రుడు అంతరిక్షమునకు అధిపతి, అంతరిక్షములోని ఆకాశము శబ్ద గుణకము కాబట్టి, ఇంద్ర రూపముగా అనగా వాక్కు రూపముగా అని అర్థము చెప్పుకొనవలెను. "మేధయా" అనుటతో 'ముందు మేధస్సు చేత నన్ను స్పృశింపుము' అని కోరుట జరిగినది. అనగా అన్నిటి కన్న మనిషికి ముందు కావలసినది డబ్బు కాదని దీనిని బట్టి తెలియును. సద్వినియోగపరచు బుద్ధి ముందు ఉండవలెను. అందుచేతనే సౌందర్యలహరిలో శంకరాచార్యుల వారు ఫలశ్రుతి శ్లోకము నందు అమ్మవారి అనుగ్రహము "సరస్వత్యా లక్ష్మ్యా విధిహరిసపత్నో విహరతే" అని సరస్వతి అనుగ్రహము ముందు లక్ష్మి కటాక్షము తర్వాత భక్తునికి వచ్చునని చెప్పిరి, లక్ష్మి కటాక్షము పొందుటకు అనగా సిరులను పొందుటకు ముందు ఈ దేహధారి ఐన మానవుడు చాలా అర్హతలు పొందవలెనని

"శరీరంమే విచర్షణమ్"...తో మొదలిడి "అన్నపానేచసర్వదా వరకు చెప్పి అటుపైన "తతోమే శ్రియమావహ", అని ఇచ్చట చెప్పుట జరిగినది.

1. 'శరీరం మే విచర్షణమ్' – 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్' అని చెప్పుదురు. వేదాంతములో ఈ శరీరము శాశ్వతము గాదు అది ఎన్నడో పోవునదియే అని చెప్పినను, శారీరికమైన ఆకలి, దప్పిక కలిగి పరితపించునపుడు ఆ చెప్పు వేదాంతము – చెప్పువానికి వినువానికి, గూడ ఎక్కదు. అందుచే మంచి పనులు చేయుటకు ఈ శరీరము ఇవ్వబడినది. శరీరము శిథిలము కాకుండ యోగ్యమైనదిగా ఎక్కువ ధర్మకార్యములను సాధించుటకు ఉపకరించునదిగా ఉండుగాక అని ఇక్కడ చెప్పబడినది. ఇది ఒక అర్హత.

2. 'జిహ్వా మే మధుమత్తమా' – అన్ని ఇంద్రియములకంటె నాలుక చురుకైనది. మిగిలిన ఇంద్రియములకు ఒక్కొక్క వ్యాపారమే ! కళ్ళకు – చూచుట, చెవులకు – వినుట, ముక్కుకు – వాసన చూచుట మొదలైనవి. కాని, ఈ నాలుకకు రెండు వ్యాపారములు 1. తినుట 2. తిట్టుట, ఈ రెండు వ్యాపారములలో ఇది బరితెగించకుండ ఉండుటకు నాలుక చుట్టును, కత్తెర బోను వంటి కొరుకుడు పండ్లు, కోరపండ్లు, దంతములు భగవంతుడు జాగ్రత్తపడి ఏర్పాటు చేసెను. మిగిలిన ఇంద్రియములు రెండు రెండు చొప్పున ఉండును. కాని నాలుక ఒక్కటే ! ఐనను చాల చురుకు దనముతో వ్యవహరించును. ఈ నాలుక అనవసరమైన మాటలు మాట్లాడకుండా ఎప్పుడును మధురభాషణములే చేయునదిగా ఉండుగాక, నలుగురు దీని మాటల వలన సుఖమును, సంతోషమును, ఆనందమును పొందుదురు గాక అను ఉద్దేశ్యముతో ఈ మంత్రము ఈయబడినది. దీనిని సాధించినపుడు మరియొక అర్హత వచ్చును.

3. 'కర్ణాభ్యాం భూరి విశ్రువమ్' – చెవులు అనవసరమైనవి కాక మంచి విషయములనే విస్తారముగా వినుచుండుగాక, చెవులకు భూషణములు సద్భాషణములే గాని తదితర అలంకారములు కావు. అనగా పై రెండింటి వలన ఇంటిలోనైనా, గవర్నమెంటులో నైనా బ్రతికినంత కాలము పలుకవలసిన మధురభాషణములు చేయుచు, వినవలసిన మంచి విషయములనే వినుచు గడుపుచుందుము గాక అని

దీని అర్థము. "స్వస్తి న ఇంద్రోవృద్ధశ్రవాః' అనగా "పెద్దల మాటలు వినుట వలన ఇంద్రుడు పెద్దవాడైనాడు, అటువంటి ఇంద్రుడు మనకు మంచి చేయుగాక' అను మంత్రములో గూడ పెద్దలమాట వినుటకు ప్రాధాన్యము ఈయబడినది.

4. 'బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః' – సహజముగా జ్ఞానరూపములో ప్రణవ బ్రహ్మము మనలో ఇమిడిఉన్నను, మన లౌక్యము దానిని కప్పి మరుగుపరచును. అందుచే మా లౌక్యము పోయి కప్పబడిన ప్రణవ బ్రహ్మము మేల్కొనుగాక అని ఈ మంత్రార్థము.

5. 'శ్రుతంమేగోపాయ' – 'వినుట వలన రక్షింపబడుదును గాక' ! అని దీని అర్థము. 'ఎవరు చెప్పుచున్నారు ?' అను దానితో సంబంధము లేక ఏమి చెప్పబడుచున్నదో దానిని వినుట జరుగవలెను. తండ్రి తొడపై కూర్చుండుటకు మరు జన్మలో తనకు కొడుకై పుట్టవలెనని, నారాయణుని గూర్చి తపస్సు చేసినచో తండ్రి తొడపై కూర్చుండు భాగ్యము లభించునని సురుచి ధ్రువునికి చెప్పినది. దీనిని కేకలు వేయుటగాకాక ఉపదేశముగా గ్రహించి ధ్రువుడు నారాయణునికై తపస్సు చేసి, మెప్పించి తొడమీదకన్న తారాపథములో చెక్కు చెదరని స్థిరమైన స్థానమును పొందెను. అందుచే, వినుట వలన నేను రక్షింపబడుదును గాక, రక్షింపబడినది నిలబడుగాక అని ఈ మంత్రార్థము. ఇన్ని అర్హతలు పొందిన తరువాత 'తతోమే శ్రియమావహ' అప్పుడు సిరులు వచ్చుట జరుగునని అర్థము.

6. 'కుర్వాణా చీరమాత్మనః' – ఆత్మకు శరీరము – వస్త్రము వంటిది. ఈ ఆత్మ దేహములో సుస్థిరతకు నా శరీరము దీర్ఘకాలము ఉండునట్లు అగుగాక అని అర్థము, మిగిలిన మంత్రములలో నిరంతరము శమదమాది గుణములు గల బ్రహ్మచారులు నా వద్దకు వచ్చి నా అతిథి సత్కారములు పొందుదురు గాక అని గృహస్థ ధర్మము ప్రతిపాదింపబడినది.

7. 'వాసాగ్ంసి.... సర్వదా' గోవులు, గొఱ్ఱెలు మొదలైన పశుసంపద ఉన్నపుడు వ్యవసాయాది కృషి కర్మలు సమృద్ధిగా జరిగి, పాడి, పంట అభివృద్ధి చెంది, అన్న పానీయాదులకు లోటు లేక – ఎల్లప్పుడు ఇంటికి వచ్చిన నలుగురికి వినియోగ పరచుటకు, అతిథి మర్యాదలు జరుపుటకు వీలగును. కేవలము

ధనముండుట వలన తక్షణ, సత్వర వినియోగమునకు వీలుకాక పోవచ్చును. (పూర్వపు రోజులలో ఇచ్చి పుచ్చుకొనుటలు – గో, గణాది పశువుల ద్వారా, (Barter system) వస్తు వినిమయము ద్వారా ఉండెడిది, వాటినే వారు సంపదగా నిర్ణయించెడివారు ) ఈ అర్థములో 'వాసాగ్ంసి మమగావశ్చ ! అన్న పానేచ సర్వదా!' అని చెప్పబడినది. ధనము కన్న సంపద ముఖ్యమని దీనిని బట్టి తెలియును. అందువలన ధనము నుండి సంపదవైపునకు (From Money to Wealth) మన దృష్టి మారవలెనని ఇందలి ఉపదేశము.

8. 'యశోజనేఽసాని స్వాహా' – శిథిలము కాని యోగ్యమైన శరీరము ద్వారా ప్రజోపయోగకరమైన పుణ్య కార్యములు చేసి, ఈ శరీరమునకు సార్థకతను తెచ్చు కీర్తిని పొంది యశశ్శరీరునిగా పేరు తెచ్చుకొనవలెనను ఉద్దేశ్యముతో ఈ మంత్రము చెప్పబడినది.

9. 'శ్రేయాన్వస్యసోఽసానిస్వాహా' – ధనవంతుడగుట కంటె శ్రేష్ఠుడగుట మంచిది. అనగా గొప్పవాడగుట కంటె మంచివాడగుటను కోరుట ఉత్తమము. ధనమున్నంత మాత్రమున ఇతరులకు ఉపయోగపడవలెనను సదుద్దేశ్యము ఉండకపోవచ్చును. కాని శ్రేష్ఠబుద్ధి కలిగిన వాడు మంచి పనులు చేయుట ఒక వేళ తన వలన కాని పక్షములో వాటిని చేయించగలవారిచేత చేయించుటకు చిత్తశుద్ధితో ప్రయత్నించి సఫలుడగును. అందుచే ధనవంతుని కంటె శ్రేష్ఠుడగుట ఉత్తమమని ఈ మంత్రములో చెప్పబడినది.

10. 'తంత్వాభగ.... త్వయిమృజేస్వాహా' – వివిధ రకములైన ఆరాధనా, సంస్కృతీ, సంప్రదాయములున్నను, అవి అన్నియు ఆ ప్రణవము యొక్క వ్యక్త విధానములే అని గౌరవించవలెను. అంతేగాని మన మెఱుగున్న పద్ధతిని, మనకు నచ్చిన పద్ధతిని గొప్పదని; మిగిలిన విధానములు చెడ్డవని, లోపభూయిష్టములు అనెడు విమర్శతో కూడిన అసహన బుద్ధి పనికిరాదు. ఇట్టి మలిన బుద్ధి కలుగకుండుటకై ముందుగానే నిర్మలమైన ప్రణవములో క్షాళనము చెంది పునీతుడగుటను, తన మలినభావములకు ప్రణవ శుద్ధి కలుగుటను – కోరుచు ఈ మంత్రము చెప్పబడినది. మరియు 'తస్మిన్ సహస్రశాఖే' అనునపుడు – 'ఓం' అను

ఏకాక్షర ప్రణవము వేద, వేదాంగ, శాస్త్రాదులుగా శాఖోపశాఖలై విస్తరిల్లవలెనని గూడ ఈ మంత్రమునకు అర్థము చెప్పుకొనవలెను.

11. 'యథా ఉ ఉపః ప్రవతాయన్తి' – ఎక్కడెక్కడ వున్న నీటి ప్రవాహములకు పల్లపు ప్రాంతములు సముద్రము వలె ఆశ్రయము నీయగల సమర్థస్థితిలో నుండును. నీరు మెరక ప్రాంతమునకు చేరదు. అట్లే ఎవరైన తన వద్దకు వచ్చినపుడు చెట్టెక్కి కూర్చుండు వాని వద్ద ఆశ్రయము లభింపదు. తనపై ఆధారపడువారున్నప్పుడు, వచ్చినపుడు తాను చెట్టు క్రింద వుండి వారికాశ్రయమును ముందు చూడవలెను. పల్లమెక్కడ వుండునో నీటికి తెలిసినట్లు – తన వద్ద ఆశ్రయము లభించునని వివిధ బ్రహ్మచారులకు తెలియవలెనని – అందుకు అనువుగా తానుండవలెనని కోరుచూ ఈ మంత్రము చెప్పబడినది.

12. 'యథా మాసాఅహర్జరమ్' – అన్ని రోజులు ఒకే విధముగా నుండవు. మరియు అన్ని రేయింబవళ్ళు గూడ ఒకే కాలవ్యవధిని, ధర్మమును కలిగివుండవు, అయినను మాసములో అవి అన్నియు లీనమగును. అనగా ఎక్కువ తక్కువలను పక్షపాత బుద్ధిలేక మాసము తనయందు ఆ రేయింబవళ్ళ నన్నింటినీ లీనము చేసికొనును. అట్లే వివిధ మనస్తత్వములు, సంప్రదాయములు గలవారైనను అన్ని రకముల బ్రహ్మచారులు ఏకోన్ముఖులై నా ఆశ్రయములో వర్ధిల్లవలెనని కోరుచూ ఈ మంత్రము చెప్పబడినది.

13. 'ప్రతివేశో ఉసి... పద్యస్వ' – ఆశ్రయము – దూర, భారమైనచో చేరుట కష్టము. కాని ప్రణవ విషయములో ఆ విధముగా కాదు, మనలో నిరంతరము జరుగు ఉచ్ఛ్వాస, నిశ్వాసాత్మకమైన 'సో ఉహం' (స్ + ఓ + హ్ + ం)లో ఇమిడి వున్న 'ఓ + ం = ఓం' "హృదయస్థమనాసన్నమ్" అన్నట్లుగా వున్నది. అట్టిప్రణవము నందు లీనమగుటకై 'నేను ఒక వేళ అసమర్థుడనైనచో ఆ ప్రణవమే కరుణించి నన్ను తనయందుంచుకొని నన్ను తనంతగా (ఆశ్రయ సమర్థునిగా) చేయుగాక' అని కోరుచూ (మార్జార కిశోర న్యాయము) ఈ చిట్ట చివరి మంత్రము చెప్పబడినది.

**మంత్రము : భూర్భువ స్సువరితి వా ఏతాస్తిస్రో వ్యా హృతయః । తాసాముహ స్మైతాం చతుర్థీమ్ । మాహాచమస్యః ప్రవేదయతే । మహ ఇతి । తద్బ్రహ్మ।**

**స ఆత్మా । అఙ్గాన్యన్యా దేవతాః । భూ రితి వా అయం లోకః । భువ ఇత్యన్తరిక్షమ్ । సువ రిత్యసౌ లోకః । మహ ఇత్యాదిత్యః । ఆదిత్యేన వావ సర్వే లోకా మహీయంతే, భూ రితి వా అగ్నిః । భువ ఇతి వాయుః । సువ రిత్యాదిత్యః । మహ ఇతి చన్ద్రమాః। చంద్రమసా వావ సర్వాణి జ్యోతీగ్ంషి మహీయంతే । భూరితి వా ఋచః। భువ ఇతి సామాని । సువ రితి యజూగ్ంషి । మహ ఇతి బ్రహ్మ । బ్రహ్మణా వావ సర్వే వేదా మహీయంతే । భూ రితివై ప్రాణః । భువ ఇత్యపానః । సువరితి వ్యానః । మహ ఇత్యన్నమ్ । అన్నేన వావ సర్వే ప్రాణామహీయన్తే । తా వా ఏతాశ్చతస్రశ్చతుర్ధా । చతస్రశ్చతస్రో వ్యాహృతయః । తా యో వేద । స వేద బ్రహ్మ । సర్వే స్మై దేవా బలి మావహన్తి ।** (4)

**టీక :** భూః = 'భూః' అనియు, భువః = 'భువః' అనియు, సువః = 'సువః' అనియు, ఇతి = ఈ విధముగా, ఏతాః = ఈ, తిస్ర = మూడుగా నున్న, వ్యాహృతయః వై = వ్యాహృతులు గదా, తాసామ్ = ఆ వ్యాహృతులకు. ఏతాం= ఈ, చతుర్థీమ్ = నాలుగవ వ్యాహృతిని, మహః ఇతి = 'మహః' అని, మహాచమస్యః= మాహాచమస్య మహర్షి, ప్రవేదయతే = తెలుసుకొనెను, తత్ = 'మహః' అను ఆ వ్యాహృతియే, బ్రహ్మ = బ్రహ్మము, సః = ఆ 'మహః' అను వ్యాహృతియే, ఆత్మ = ఆత్మ, అన్యాః = ఇతరములగు, దేవతా ః = దేవతలు, అంగాని – అంగములు, భుః ఇతి = 'భూః' అను వ్యాహృతి, అయం = ఈ, లోకః వై = లోకము కదా (ఈ లోకము అనగా మనుష్య లోకము), భువః ఇతి = 'భువ' అను వ్యాహృతి, అంతరిక్షమ్ = అంతరిక్షలోకము, సువఃఇతి = 'సువః' అను వ్యాహృతి, అసౌలోకః = స్వర్గలోకము, మహః ఇతి = 'మహః' అనువ్యాహృతి, ఆదిత్యః = ఆదిత్యలోకము, సర్వే = సమస్తమైన, లోకాః = లోకములు, ఆదిత్యేన = ఆదిత్యుని చేత, మహీయంతే, వావ = వృద్ధి పొందుచున్నవి గదా, భూఃఇతి = 'భూః' అను వ్యాహృతి, అగ్నిః = అగ్ని, భువః ఇతి = 'భువః' అను వ్యాహృతి, వాయుః = వాయువు, సువః ఇతి = 'సువః' అను వ్యాహృతి, ఆదిత్యః = ఆదిత్యుడు, మహః ఇతి = 'మహః' అను వ్యాహృతి, చంద్రమాః = చంద్రుడు, సర్వాణి = సమస్తమైన, జ్యోతీగ్ంషి = జ్యోతిస్సులు, చంద్రమసా = చంద్రుని చేత, మహీయంతే వావ =

వృద్ధిని పొందుచున్నవి గదా, భూః ఇతి = 'భూః' అను వ్యాహృతి, ఋచఃవై = ఋక్కులు గదా, భువః ఇతి = 'భువః' అను వ్యాహృతి, సామాని = సామములు (సామవేదము), సువఃఇతి = 'సువః' అను వ్యాహృతి, యజూగ్ంషి = యజుస్సులు (యజుర్వేదము), మహఃఇతి = 'మహః' అను వ్యాహృతి, బ్రహ్మ = ఓంకారము, సర్వే వేదాః = వేదములన్నియు, బ్రహ్మణా =ఓంకారము చేత, మహీయంతేవావ = వృద్ధిని పొందుచున్నవి గదా! భూః ఇతి = 'భూః' అను వ్యాహృతి, ప్రాణఃవై = ఆకర్షణాత్మక ప్రాణశక్తిగదా, భువఃఇతి = 'భువః' అను వ్యాహృతి, అపానః = వికర్షణాత్మక అపానశక్తి గదా, సువఃఇతి = 'సువః' అను వ్యాహృతి, వ్యానః = వ్యాపనశీలకశక్తి గదా, మహఃఇతి = 'మహః' అను వ్యాహృతి, అన్నం = అన్నము గదా, సర్వే = సమస్తమైన, ప్రాణాః = ప్రాణములు, అన్నేన = అన్నము చేత, మహీయంతేవావ = వృద్ధి పొందుచున్నవి గదా! తాః = ఆ, ఏతాః = ఈ, చతస్రః = నాలుగు (వ్యాహృతులు), చతుర్ధావా = నాలుగు విధములుగదా, వ్యాహృతయః = వ్యాహృతులు, చతస్రః చతస్రః = నాలుగు నాలుగు చొప్పున, తాః = ఆ వ్యాహృతులను, యః = ఎవడు, వేద = ఉపాసించునో, సః = వాడు, బ్రహ్మ = బ్రహ్మమునే, వేద = ఉపాసించుచున్నాడు. అస్మై = ఈ (చెప్పిన విషయము) ఎరిగిన వానికి, సర్వేదేవాః = దేవతలందఱును, బలిమ్ = పూజను, ఆవహంతి = చేయుచున్నారు.

**తాత్పర్యము :** 'భూః', 'భువః', 'సువః' అను మూడును వ్యాహృతులని చెప్పబడును. 'మాహాచమస్యుడు' అను మహర్షి "మహః" అను నాల్గవ వ్యాహృతి కలదని తపః ప్రభావము చేత కనిపెట్టెను. అదియే బ్రహ్మము. అదియే ఆత్మ, భూః, భువః, సువః - అను వ్యాహృతులు అంగములైనచో ఈ 'మహః' అను వ్యాహృతి అంగి అగును. అనగా అంగి - కారణమై అంగములకు పెరుగుదల ఏర్పడునట్లు ఈ 'మహః' అను వ్యాహృతి కారణమై 'భూః, భువః, సువః' అను వ్యాహృతులకు స్థితి, పెరుగుదలలు కలుగుచున్నవి. ఈ అంగ భూతములైన వ్యాహృతులు చతుర్విధములైన - లోక, దేవ, వేద, ప్రాణ, దృష్టి - ఉపాసనా రూపులుగా చెప్పబడినవి.

1. 'భూః' అను వ్యాహృతిని ఈ లోక (అనగా భూలోక) దృష్టితో ఉపాసించవలయును. 'భువః' అను వ్యాహృతిని అంతరిక్ష దృష్టితో ఉపాసించ వలయును. 'సువః' అను వ్యాహృతిని స్వర్గలోక దృష్టితో ఉపాసించవలయును. 'మహః' అను వ్యాహృతిని ఆదిత్య లోక దృష్టితో ఉపాసించవలయును. ఈ పై లోకము లన్నియు ఆదిత్య లోకము వలన ప్రకాశ సమన్వితములై వృద్ధి పొందుచున్నవి. దీనిని లోక దృష్టి ఉపాసన మందురు.

2. 'భూః' అను వ్యాహృతిని అగ్ని దృష్టితో ఉపాసించవలయును. 'భువః' అను వ్యాహృతిని వాయు దృష్టితో ఉపాసించవలయును. 'సువః' 'మహః' అను వాటినివరుసగా ఆదిత్య, చంద్ర దృష్టులతో ఉపాసించవలయును. ఈ దేవతలు చంద్రుని చేత పరిపూర్ణులై పూజ్యులగుచున్నారు. దీనిని దేవవిశేష దృష్టి ఉపాసనమందురు.

3. 'భూః', 'భువః', 'సువః', 'మహః' అను వ్యాహృతులను వరుసగా ఋగ్వేద, యజుర్వేద, సామవేద, ఓంకార దృష్టులతో ఉపాసించవలయును. వేదములన్నియు ఓంకారముతో ప్రారంభింపబడి ఓంకారముతో అంతమై, లీనమగునవి అగుట వలన ఈ వేదములన్నియు ఓంకారము వలన పూజనీయములై వృద్ధి పొందుచున్నవి. దీనిని వేద దృష్టి ఉపాసనమందురు.

4. 'భూః', 'భువః', 'సువః', 'మహః' అను వ్యాహృతులను వరుసగా ప్రాణ, అపాన, వ్యాన, అన్న దృష్టులతో ఉపాసించవలెను. అన్నము చేతనే ప్రాణములన్నియు పోషింపబడుచున్నవి. కావున ఈ కర్షణలన్నియు అన్నముచే వృద్ధి పొందును అని చెప్పిబడినది. దీనిని ప్రాణదృష్టి ఉపాసనమందురు.

పై దానిని బట్టి 'భూః' అను వ్యాహృతి - పృథివి, అగ్ని, ఋగ్వేదము, ప్రాణము అను నాలుగువిధములు; 'భువః' అను వ్యాహృతి – అంతరిక్షము, వాయువు, సామవేదము, అపానము అను నాలుగువిధములు; 'సువః' - అను వ్యాహృతి - స్వర్గము, ఆదిత్యుడు, యజుర్వేదము, వ్యానము అను నాలుగు విధములు; 'మహః' అను వాహృతి – ఆదిత్యలోకము, చంద్రుడు, ఓంకారము, అన్నము అను

నాలుగు విధములుగను అగును. ఈ విధముగా 4 X 4 = 16 అంగభూతములుగా ఈ వ్యాహృతులను ఎవడు ఉపాసించునో అతడే బ్రహ్మము నెరుగును. దేవతలందరు అతనినే పూజింతురు.

**వివరణము :** 1) భూలోకమనగా ద్రవ్యమయాత్మక లోకము (Plane of Matter or Materialisation), భువర్లోకమనగా శక్తిమయాత్మక లోకము (Plane of Force), సువర్లోకమనగా ప్రజ్ఞామయాత్మక లోకము (Plane of Consciousness). ఈ మూడు లోకములు కలిసినపుడు నాల్గవది పుట్టును. అనగా ప్రజ్ఞ, శక్తి, ద్రవ్యము కలిసినపుడు జీవి పుట్టును. ఈ జీవి అంగి అనుకొనినచో పై మూడును అంగములగును. (Force = బలము అయినను శక్తిగా ఇక్కడ అనువదింపబడినది).

ఉదా: పిండి, నీళ్ళు, ఉప్పు, వేడి కలిసినపుడు రొట్టె పుట్టును. అప్పుడు ఈ రొట్టె - అంగి, మిగిలినవి - దాని అంగములగును. ఈ అంగి - అంగముల సంబంధమే ఇచ్చట చెప్పబడినది. మరికొన్ని ఉదాహరణలు : దేవుడు - అంగి,దేవతలు - అంగములు; సూర్యుడు- అంగి, వాని కిరణములు అంగములు; చంద్రుడు - అంగి, అతని కళలు అంగములు; అన్నము - అంగి, బియ్యము, నీళ్ళు, ఉష్ణము దాని అంగములు.

భూలోకమనగా అది, ఇది అను పేర్లతో చెప్పబడు భౌతిక లోకము. సువర్లోకమనగా వీడు, వాడు అనుచు - వానిలోను, వీనిలోను ఉన్న అంతర్యామిని గుర్తించు లోకము. ఇది ప్రజ్ఞకు సంబంధించినది. భువర్లోకమనగా పైన చెప్పిన ద్రవ్యమునకు ఈ ప్రజ్ఞకు మధ్యన ఉండు లోకము (Intermediate Plane). దీనినే అంతరిక్ష లేదా శక్త్యాత్మక లేదా చైతన్యాత్మక లేదా స్పందనాత్మకలోకమని కూడా అందురు.

భూలోకమునకు అష్టవసువులు అధిష్ఠాన దేవతలు. భువర్లోకమునకు ఏకాదశరుద్రులు అధిష్ఠాన దేవతలు. సువర్లోకమునకు ద్వాదశ ఆదిత్యులు అధిష్ఠాన దేవతలు. ఈ 8 + 11 + 12 = 31. ఈ 31 కాక సృష్టి ప్రారంభమునకు ఒక అధిష్ఠాన దేవత, ముగింపునకు మరియొక అధిష్ఠాన దేవత (ఈ ఇద్దరినే అశ్వినీ

దేవతలు అందురు) కలిసి మొత్తము 33 ఒక వర్గముగా ప్రతి సృష్టిప్రక్రియకు అవసరమగు దేవతా కోటి (కోటి అనగా వర్గము) అని చెప్పబడినది.

ఈక్రింది శ్లోకము దానినే చెప్పును.

త్రయ స్త్రింశత్ సహస్రాణి
త్రయ స్త్రింశత్ శతానిచ,
త్రయ స్త్రింశచ్చ దేవానాం
సృష్టి స్సంక్షేప లక్షణాః.

ఈ ముప్పది ముగ్గురు అంగములైనచో పరమాత్మ అంగియగును అందుచే 'అంగాన్యన్యా దేవతాః' అని చెప్పబడినది.

అవ్యక్త స్థితిలో నున్న సర్వాంతర్యామి వ్యక్తసృష్టిగా ఒక దాని కన్న ఒకటి స్థూలమగు మూడు లోక మార్గములలో రూపొందుట జరుగును. 1) దేవలోకము (Plane of Light) లేదా వికిరణాత్మక లోకము (Plane of Radiation). దీనికి 12 మంది ఆదిత్యులు అధిష్ఠాన దేవతలు, ఒక్కొక్క రాశిలోనున్నపుడు సూర్యుడు ఒక్కొక్క ఆదిత్యునిగా ప్రభావమును కలిగి యుండును. కావున మేషాది మీన పర్యంత రాశులకు ద్వాదశ (12) ఆదిత్యులగుదురు. ఈ వికిరణాత్మక లోకమునే 'ప్రజ్ఞాత్మక', 'సూర్యాత్మక (Solar) లోకము'లని గూడ అందురు.

వికిరణాత్మక లోకము తరువాత అంతకన్న స్థూలమగు స్పందనాత్మక లోకము (Plane of Vibration) నందు తరువాత సృష్టి వ్యక్తమగును. ఈ లోకమునకు 11 మంది రుద్రులు అధిష్ఠాన దేవతలు. పంచజ్ఞానేంద్రియములు + పంచ కర్మేంద్రియములు + చిత్తము కలిసి మొత్తము ఏకాదశ రుద్రులగుదురు. ఈ స్పందనాత్మక లోకమునే 'అంతరిక్ష' లేదా 'మనో' లేదా 'చంద్రాత్మక (Lunar) లోకము'లని గూడ అందురు.

స్పందనాత్మక లోకము తరువాత అంతకన్న స్థూలమగు వసు లోకము (Plane of Materilisation or Preciptation) నందు తరువాత స్పష్టముగా సృష్టి వ్యక్తమగును. ఈ లోకమునకు 8 మంది వసువులు అధిష్ఠాన దేవతలు. "భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ, అహంకార ఇతీయం మే,

భిన్నా ప్రకృతి రష్టధా" అన్న గీతావాక్యానుసారము - భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి అనునవి అహంకారముతో కలిసి అష్ట వసువు లగును. (పరమాత్మ అయిన శ్రీకృష్ణుని ప్రధానమైన అష్టభార్యలు అష్ట ప్రకృతులకు లేదా అష్ట వసువులకు ప్రతీకలే !) ప్రకృతిలోనుండు మూలకములు (Elements) గూడా 7 + 1 = 8 గ్రూపులలో వ్యక్తమై, చివరిదైన 8వ లేదా '0' గ్రూపులో స్థిరమైన ఎలక్ట్రాను విన్యాసము (Stable configuration) కలిగిన మూలకము లుండునని రసాయనిక శాస్త్రము చెప్పును. అనగా సృష్టి విధానములో అత్యంత స్థిరత్వము అష్ట వసువులకు చెందిన వసులోకములో జరుగునని గ్రహించవలెను. (పరమాత్మపరముగా శ్రీకృష్ణుడు భౌతిక సృష్టిలోనికి జీవునిగా దిగివచ్చుట - అష్టమ గర్భములోనే అనియు, అట్లే జీవాత్మ పరముగా - భీష్ముడు గంగాపుత్రునిగా భౌతిక సృష్టిలోనికి వచ్చునది గూడ అష్టమ గర్భములోనే అనియు చెప్పుట ఇందులకే ! ఈ కథలలో ఇంకనూ, తెలిసికొనవలసిన విషయములు చాల గలవు) ఈ వసులోకమునే 'పృథివ్యాత్మక (Planetary) లోక'మని గూడ అందురు.

అశ్వినీదేవతలిద్దరు (నాసత్యుడు, దస్రుడు) సృష్టి ప్రారంభమునకు, సృష్టి ముగింపునకు సంబంధించిన దేవతలు. వీరిని మనలో శ్వాసకు కారణమైన ఉచ్ఛ్వాసమునకు, నిశ్వాసమునకు సంబంధించిన వారుగా అర్థము చేసికొనవలెను.

2. పీల్చబడునది - వాయువు (Permiating matter), పీల్చుటకు ఉపయోగపడునది - అగ్ని (Kindling and Combstive force), పీల్చువాడు - ఆదిత్యుడు (Radiating Consciousness), అగ్ని - పుట్టుటకు, వాయువు - పెరుగుటకు, ఆదిత్యుడు - ప్రసార ప్రక్రియకు ప్రతీకలుగా ఉన్నచో ఈ మూడింటితో నాల్గవ వానిగా మనలో 'మనస్సు' - అనువాడు పుట్టును. వానినే చంద్రునిగా ఇచ్చుట చెప్పబడినది. (చంద్రమా మనసోజాతః - పురుష సూక్తము). ఈ చంద్రుని చేతనే తెలివి, ఊహ, గ్రహణ శక్తి అను వెలుగులు వృద్ధి చెందును.

3. 'ఋక్' అనగా రేఫము (The Trill) 'సామ' మనగా నిశ్వాసాత్మక నాదము (Voice), 'యజుస్సు' అనగా ఆ పుట్టిన నాదాత్మక భాషలో మన దినచర్య. ఈ మూడును కలిసినపుడు నాల్గవవాడు ఉచ్చరించువానిగా లేదా సృష్టికర్తగా పుట్టి మేల్కొనును. ఇట్టి సృష్టిని - వాక్కుగా ఉచ్చరించు వానిని బ్రహ్మ అందురు. ఈ

బ్రహ్మవల్లనే పైన చెప్పబడిన రేఫ, నాద, భాషలకు, ప్రతీకలైన ఋక్, సామ, యజుర్వేదములు వృద్ధి చెందుచున్నవని ఇచ్చట చెప్పబడెను.

4) ప్రాణమనగా ఆకర్షణ లేదా స్వీకరించు శక్తి (Receiving Faculty), అపాన మనగా వికర్షించు లేదా విడచుశక్తి (Rejecting faculty), వ్యానమనగా వ్యాపించు శక్తి, (permiating faculty), ఈ మూడింటి కలయికతో నాల్గవదైన అన్నము (Transition Layer Between Two States of Matter) ఏర్పడి అనగా, పై మూడు శక్తులు ఉండు అన్నమయజీవి పుట్టి వ్యవహరించును. ఈ అన్నము వలననే ఒక స్థితి నుండి మరియొక స్థితికి ద్రవ్యము మార్పులు చెందుచు ప్రాణ, అపాన, వ్యాన శక్తులు అభివృద్ధి చెందుచున్నవని ఇచ్చట చెప్పబడినది.

**సారాంశము :** 'భూః', భువః, సువః అనునవి మూడు వ్యాహృతులు. 'మాహాచమస్యుడు' అను మహర్షి 'మహః' అను దానిని నాల్గవ వ్యాహృతిగా కనిపెట్టెను. అదియే బ్రహ్మ, అదియే ఆత్మ. ఈ మహః అను అంగికి భూః, భువః, సువః అనునవి వ్యాహృతులు, అంగి యొక్క అధీనముగా ఇతరాంగములకు వృద్ధి ఎట్లు కల్గునో - అటులనే ఇతర వ్యాహృతులకు ఈ వ్యాహృతి వలన అట్టి వృద్ధి కలుగుచున్నది. ఈ విధముగా తెలిసినవాడే బ్రహ్మ నెరుగును. అతని యందే దేవతలు వ్యక్తమై, అతనిని దేవతలు కొల్చుదురు.

చమసమనగా సోమపానార్థము ఉపయోగించు పాత్ర, భూమి మీద నుండి చూచినపుడు ఆకాశము ఒక అర్థగోళము వలె కన్పించును. భూమి ఉపరితలము ఒక వర్తులాకారతలమువలె ఉండి, అడుగున మరియొక అర్థ గోళమును ఊహింపచేయుటకు వీలుగా నుండును. పై అర్థగోళమును ఆకాశపుడిప్పగను, క్రింది అర్థగోళమును పాతాళపు డిప్పగను, అట్లే - పై అర్థగోళమును పగలుకు సంబంధించి నదిగను, క్రిందిది రాత్రికి సంబంధించినదిగను, అట్లే - పైది సూర్యాత్మకముగను క్రిందిది - చంద్రాత్మకముగను, అట్లే పైది - హిరణ్యాత్మకముగను (Golden), క్రిందిది - రజతాత్మకముగను (Silver) ఊహించి ఒక పాత్ర యొక్క స్వరూపముగా ధ్యానించినచో అదియే 'చమస' మనబడును. జీవుడు కళ్ళు తెరుచుట తోడనే పై అర్థగోళము మహా - గొప్పగా కన్పడును. తన చుట్టును మహాగొప్పగా కన్పడు ఈ

ఆవరణ అను – 'చమస' పాత్రను 'మహా' అను ఉపసర్గతో 'మహాచమసము' అనుట జరిగినది. మాహాచమస్యుడు ఈ విధముగ ధ్యానించుట వలన 'మహాచమసము' అను పేరుతో వ్యవహరించుట జరిగినదని కూడా చెప్పవచ్చును. దీనికి ప్రతీకగనే అనేక సోమయాగములందు మహాచమస్యుడు అట్టి పాత్రను ఉపయోగించెను. ఇట్టి మహాచమస్యునిచే దర్శింపబడిన 'మహః' వ్యాహృతిని – అంగములవంటి భూః, భువః, సువః వ్యాహృతులకు 'అంగి'గాఎవడు ఉపాసించునో వానికి మహత్వము సిద్ధించి దేవతల పూజలందుకొనును.

**మంత్రము : స య ఏషోఽన్తర్హృదయ ఆకాశః । తస్మిన్నయం పురుషో మనోమయః । అమృతో హిరణ్మయః । అన్తరేణతాలుకే । య ఏష స్తన ఇవావలంబతే। సేంద్రయోనిః । యత్రాసౌకేశాన్తో వివర్తతే । వ్యపోహ్య శీర్షకపాలే । భూ రిత్యగ్నౌ ప్రతితిష్ఠతి । భువ ఇతి వాయౌ । సువ రిత్యాదిత్యే । మహ ఇతి బ్రహ్మణి । ఆప్నోతి స్వారాజ్యమ్ । ఆప్నోతి మనసస్పతిమ్ । వాక్పతి శ్చక్షుష్పతి ః । శ్రోత్రపతి ర్విజ్ఞానపతిః। ఏత త్తతో భవతి । ఆకాశ శరీరం బ్రహ్మ । సత్యాత్మ ప్రాణారామం మన ఆనన్దమ్ । శాన్తిసమృద్ధ మమృతమ్ । ఇతి ప్రాచీనయోగ్యో పాస్వ ॥** *(5)*

**టీక :** అంతః + హృదమే = హృదయ మధ్య భాగమున, యః = ఏ, ఏషః = ఈ, ఆకాశః = (దహర) ఆకాశము కలదో, తస్మిన్ = ఆ దహరకాశము నందు, మనోమయః = మనోమయుడును, అమృతః = మరణరహితుడును, హిరణ్మయః = తేజస్వంతుడును, (అగు), సః అయమ్ = ఆ ఈ, పురుషః = పురుషుడు, తాలుకే = తాలుకకు (నాలుకపైన ఉన్న అంగటి అనగా నాలుకతో లొట్టలు వేయునపుడు నాలుకకు తగులు భాగము), అంతరేణ = మధ్యభాగమునందు; యః = ఏ, ఏషః = ఈ, స్తనః = స్తనము, ఇవ = వలె, అవలంబతే = వ్రేలాడుచున్నదో; యత్ర = ఎచ్చట, అసౌ = ఈ, కేశముల యొక్క మొదలు, వివర్తతే = వంపుతిరిగి సుడివలె (విశేషస్థితిలో వేరుగా) నున్నదో (శిఖకు మూలస్థానము), శీర్షకపాలే = శిరః కపాలములను, వ్యపోహ్య = వేరుచేయునదిగా కనిపించి బయలు వెడలునది, (ఏది కలదో), సా = అది (యే), ఇంద్ర యోనిః = ఇంద్రగ్రంథి, భూః = 'పుట్టుక అనువాడు, అగ్నౌ = అగ్ని యందు (తన్ను తాను), ఇతి = ఈ విధముగా, ప్రతితిష్ఠతి

= స్థాపనము చేసుకొనుచున్న వాడు అగుచు, సువః = "నేను" అని ఎవరికి వారికి తెలియు, ఆదిత్యే = సూర్యుని యందు (తనకు తానే), ప్రతితిష్ఠతి = స్థాపనము చేసుకొనుచున్న వాడు అగుచు, మహ ఇతి = ఈ మొత్తము ఉన్నటువంటిదైన, బ్రహ్మణి = చుట్టును వున్న బ్రహ్మయందు, ప్రతి తిష్ఠతి = (తనకు తానే) స్థాపించుకున్న వాడుగా అగుచున్నాడు. స్వర్ + రాజ్యం (స్వః + రాజ్యమ్) = స్వారాజ్యమ్ = తన ఏలుబడి దానినిగా, ఆప్నోతి = పొందుచున్నాడు, మనసః పతి = మనస్సునకు పతిగా, ఆప్నోతి = పొందుచున్నాడు, వాక్పతిః = వాక్కుమీద అనగా మాట్లాడగల్గుటలో ఆధిపత్యము, చక్షుష్ పతిః = నేత్రముల మీద అనగా చూడగల్గుటలో ఆధిపత్యము, విజ్ఞానపతిః = విజ్ఞానాధిపతి అనగా తెలుసుకొనుటలో ఆధిపత్యము, (పొందు చున్నాడు) తత్ = తర్వాత, ఏతత్ = ఈ చెప్పబోవునది, భవతి = అగుచున్నాడు, ఆకాశ శరీరమ్ = ఆకాశములో ఈ శరీరము ఒక ప్రమాణము (Unit) అని, సత్యాత్మ = "నేనున్నా" నను సత్యమును తెలుసుకొను లోకము (నందు) ప్రాణారామం = ప్రాణము అను తోట (లోనే క్రీడించుచు), మన ఆనందమ్ = మనస్సు అను ఆనందము(లో), శాంతి సమృద్ధమ్ = తరుగని శాంతి (యే జీవితముగా భావించి) అమృతమ్ = ఎడబాటు లేనిదిగా, బ్రహ్మ = బ్రహ్మానంద స్థితిలో (ఉండునని), ప్రాచీన యోగ్య = ప్రాచీన యోగ్యుడా, ఉపాస్వ = ఉపాసించుము.

**తాత్పర్యము :** హృదయ మధ్య భాగమున గల దహరా కాశమును - మనోమయుడును, మరణరహితుడును, జ్యోతిర్మయుడును, తేజస్వంతుడును అగు ఆ పరమ పురుషునికి స్థానముగా ఉపాసించుమని మొదట చెప్పబడినది. తాలుక యొక్క (అంగటి భాగము) మధ్య భాగముపై నుండి క్రిందికి స్తనము వలె వ్రేలాడుచున్నట్లు అగుపడునది ఒకటి ఉండును. శిరస్సుపై కేశములు శిఖవద్ద సుడి తిరుగు చోటు నుండి తిన్నగా లోపలికి ఊహించురేఖ ఈ స్తనమూల బిందువును చేరును. ఆ మూల బిందువును 'ఇంద్రయోని' లేదా 'ఇంద్రగ్రంథి' అందురు. ఇదియే జీవికి మొదట పుట్టుక స్థానము (యోని). ఇచ్చట 'పుట్టుక' అనునది అగ్ని యందు తనకు తాను స్థాపనము చేసుకొనును. 'బ్రతుకుట' అనునది వాయువు నందు తనకు తాను స్థాపనము చేసుకొనును. "నేను" అని ఎవరికి వారికే తెలియు

జ్ఞానసూర్యుని యందు తనకు తానే స్థాపించుకొనును. తరువాత ఈ మొత్తము శరీరముగా వ్యక్తమై చుట్టునూ వున్న బ్రహ్మయందు తనకు తానే స్థాపించుకొనును. ఈ విధముగా బ్రహ్మయందు తానుండి తన ఏలుబడిని తాను పొందును. మనస్సునకు లోబడి ఉండక దానికి ఆధిపత్యము వహించును. అట్లే చక్షువులకు, వాక్కుకు, శ్రోత్రములకు, విజ్ఞానమునకు లోబడి ఉండక వాటికి ఆధిపత్యము వహించును. అటుపైన ఆకాశములో ఈ శరీరము ఒక భాగము అనియు, 'నేనున్నా' నను సత్యము తెలియులోకములో, ప్రాణములు అను తోటలో విహరించుచు, మనస్సు అను ఆనందమును పొందుచు, తరుగని శాంతి సంపదలతో, వియోగము లేని యోగస్థితిలో బ్రహ్మ (ఆనంద) స్థితిలో ఉండునట్లుగా ఉపాసించవలెనని ప్రాచీన యోగ్యునికి (శిష్యునికి మహాచమస్యుడు అను ఆచార్యుడు) ఉపాసనామార్గముగా ఉపదేశించెను.

**వివరణము :** ఈ మంత్రములలో ఉపాస్యమానములైన విద్య గురించి చెప్పబడినది. దీనినే 'దహరవిద్య' లేదా 'అంతర్ హృదయవిద్య' అని కూడా అందురు. ఇచ్చట మన శరీరములో పరమపురుషుని స్థానము చెప్పబడినది. నారాయణ ప్రశ్నము నందు కూడా దీని ప్రసక్తి ఈ క్రింది మంత్రములో ఈయబడినది.

దహ్రం విపాపం పరమేఽశ్మభూతం
యత్పుణ్డరీకం పురమధ్యసగ్ంస్థమ్
తత్రాపి దహ్రం గగనం విశోక
స్తస్మిన్ యదన్త స్తదుపాసితవ్యమ్.

హృదయాంతర్భాగము 'దహరాకాశము' అనబడును. దీనినే 'దహరము' అని కూడా అందురు. సూర్యునిలో వున్న పరమ పురుషుడే ప్రతి హృదయాంతరమందలి దహరాకాశ పురుషుడని ఈ మంత్రములోని ఉపదేశము. బ్లాక్ బోర్డుమీద వృత్తమును గీసినపుడు వృత్తము బయట వున్న బ్లాక్ బోర్డే వృత్తములోపల గూడ ఉండును గదా! అట్లే మరియొక ఉదాహరణ: గోదావరిలో బిందె మునిగివున్నపుడు బిందెలో గోదావరి వుండును. అట్లుండుటకు కారణము బిందె గోదావరిలో వుండుటయే గదా! అదే విధముగా మన శరీరము బయటవున్న ఆకాశము మన శరీరములోపల హృదయమధ్యమున ఉన్నది. బైట ఆకాశమును

'చోటు' అని, హృదయములోని ఆకాశమును 'మాటు' అని చెప్పవచ్చును. చోటులో మనము ఉండుటచే మనహృదయములో గూడ చిన్నచోటు 'మాటు' రూపములో వున్నది. బైటవున్న చోటును 'పెద్దనేను'కు సంబంధించినది అన్నచో, లోపల వున్న చోటు 'చిన్న నేను'కు సంబంధించినది. ఈ 'చోటు' అను ఆయన మనలో వుండి మన పేరుతో పలుకుచూ ఉచ్చరించుచున్నాడు. చోటులో విద్యుత్తు తటస్థముగా వున్నది. దీనిని చోటులోని విద్యుదాశయము అనవచ్చును. అది ఇవతలకు వ్యక్తమైనపుడు విద్యుచ్ఛక్తి అగును. మొట్టమొదటగా సూర్యుని - చోటుమధ్యలో - డైనమో యంత్రముగా ఏర్పాటు చేసినట్లు ఊహించవలెను. ఈ విద్య అన్ని శాస్త్రముల యందు సమన్వయ పరచి అష్టాంగ యోగములోను, ఆగమ శాస్త్రము (దేవాలయ నిర్మాణాది విషయములు) లోను ఇవ్వబడినది. ఈ 'చోటు' అను ఆయన ఇంద్రియములలో మేల్కొనినపుడు ఆ స్థితిలోని చోటును 'ఇంద్రుడు' అని కూడ అందురు. (ఇదమ్ + ద్రః = ఇంద్రః అనగా ఇదిగో ఇక్కడ వున్నాను అని అర్థము).

ఎక్కడ శిరస్సుపై కేశములు వివర్తములై సుడి ఏర్పడునో అక్కడ నుండి తిన్నగా తాలుక (Palate లేదా అంగటి) పైన వున్న భాగమును కలుపు రేఖ, బ్రహ్మరంధ్రము నుండితిన్నగా క్రిందకు పోవు రేఖ కలిసిన చోటును ఊహించినచో దానిని ఇంద్రయోని లేదా ఇంద్రగ్రంథి అందురు. దీనినే Penial Gland అందురు. ఇది జీవునికి మొదటి పుట్టుక స్థానము. జీవునిలో చంద్రాత్మక (Magnetic), సూర్యాత్మక (Electric), ప్రజ్ఞలు రెండు వుండును. జీవుడు భౌతిక శరీరరూపములో వ్యక్తమగుటకు ముందు తన తత్త్వమునకు సరిపడు తల్లిదండ్రులను ఎన్నుకొనును. తండ్రి ఎడమముక్కు నుండి చంద్రాత్మక ప్రజ్ఞ లోపలికిపోయి, ఇడానాడి ద్వారా ఈ ఇంద్రయోని స్థానమును చేరి తొమ్మిది రోజులు అక్కడ వుండును. భ్రూమధ్యము నుండి సూటిగా లోపలకు గీసిన గీత, బ్రహ్మరంధ్రము నుండి క్రిందకు గీసిన నిలువు గీత కూడ ఇక్కడనే కలియును. భ్రూమధ్యము తూర్పుదిశను, బ్రహ్మరంధ్రము ఉత్తరదిశను సూచించును. అందుచే ఇవి రెండును కలియు బిందువు ఈశాన్య బిందువగును. జీవునకు ఈ ఈశాన్య బిందువు ప్రథమ పుట్టుక స్థానము. దీనిని అనుసరించియే ఇంటి స్థలమునందు కట్టబోవు ఇంటికి శంకుస్థాపనము ఈశాన్య

దిక్కులో చేయుదురు. ఈ ఇంద్రయోని లేదా ఇంద్రగ్రంథి మనస్సునకు అతీతమైన ప్రవర్తనపై ఆధిపత్యము కలిగి యుండును. పరవశత్వము, తన్మయీకరణము, మత్తు, తెలివితప్పుట, సంగీత జ్ఞానము, హిస్టీరియా, ఉన్మాదము మున్నగు స్థితులు ఈ గ్రంథికి సంబంధించినవి. ఈ గ్రంథి లోపము వలన జడత్వము, మూగ, అంధ, బధిరత్వములు కూడ కలుగవచ్చును. భక్తి యోగ సాధనకు ఈ గ్రంథియే కారణము. దీని ఉనికిని ప్రతిరోజు గుర్తుంచు కొనుటకు భ్రూమధ్య ప్రాంతములో బొట్టును పెట్టుకొనుమని భారతీయులు చెప్పుదురు.

గోడకు అవతల వస్తువు ఉన్నపుడు కంటితో చూడవలెనన్నచో గోడ అడ్డమగును. కాని వస్తువున్నట్లు తెలియుటకు గోడ అడ్డము కాదు. అదే విధముగా బయట చోటుకి హృదయములో మాటుకి దీని ద్వారా అనుసంధానము ఉండును. శిరస్సుపై భాగము ఆకాశపుడిప్పవలె ఉండి, హృదయములోని ఆకాశమునకు ఈ యోని ద్వారా అనుసంధానమును కలిగి యుండును. ఇది స్వయం భూః స్థానము, అందువలననే మనస్సునకు, చక్షువులకు, వాక్కునకు, శ్రోత్రమునకు విజ్ఞానమునకు లోబడి వుండక వాటిపై ఆధిపత్యము వహించునని ఈ మంత్రములో చెప్పబడినది.

ఆకాశ, దహరాకాశములకు అనుసంధానము తిన్నగా వున్నప్పటి స్థితిలో పైన చెప్పిన ఆధిపత్యము ఈ యోని స్థానమునకు వుండి, ఆకాశమునకు ఒక చిన్న ప్రమాణమే ఈ దేహము అని తెలియుట జరుగును. అంతేగాని ఈ దేహము స్వయంప్రతిపత్తి గల్గిన వేరొక భాగముగా గుర్తించుట జరుగదు. అట్టిస్థితిలో మనస్సే ఆనందమయస్థితిలో వుండును. మనస్సే పరబ్రహ్మము అగును. తరుగని శాంతిగా జీవించుట జరుగును. జీవించుట అనగా శాంతియే గాని శాంతి ఒక మెట్టుకాదు. ద్వైత్వ భావము లేనపుడే ఇట్టి శాంతి సమృద్ధిగా ఉండును. ఇది 'సాధు విద్య' కాని 'భంగుసాధు జీవితము' కాదు. ఈ ఉపాసనను మహాచమనస్యుడను ఆచార్యుడు ప్రాచీన యోగ్యుడను శిష్యునికి ఉపదేశము చేసినట్లుగా చెప్పుదురు.

**మంత్రము : పృథివ్యంతరిక్షం ద్యౌర్దిశో ఽవాంతరదిశాః । అగ్ని ర్వాయు రాదిత్య శ్చన్ద్రమా నక్షత్రాణి । అప ఓషధయో వనస్పతయ ఆకాశ ఆత్మా । ఇత్యధిభూతమ్ । అథాధ్యాత్మమ్ । ప్రాణోవ్యానోఽపాన ఉదానస్సమానః । చక్షుశ్శ్రోత్రం**

***మనోవాక్త్వక్ । చర్మమాగ్ంసగ్గ్ం స్నావాఽ స్థి మజ్జా । ఏత దధి విధాయ ఋషి రవోచత్ । పాఙ్క్తం వా ఇదగ్ం సర్వమ్ । పాఙ్ క్తేనైవ పాఙ్ క్తగ్గ్ స్పృణోతీతి । (6)***

**టీక :** పృథివి = భూమి లేక భౌతిక పదార్థము, అంతరిక్షమ్ = అంతరిక్షము లేక ఆకాశము, ద్యౌః = ద్యులోకము లేక వెలుగుల లోకము, దిశః = దిక్కులు, అవాంతరదిశాః = అవాంతర దిక్కులు, అగ్నిః = అగ్ని, వాయుః = వాయువు, ఆదిత్యః = సూర్యుడు, చంద్రమాః = చంద్రుడు, నక్షత్రాణి = నక్షత్రములు, ఆపః = జలములు, ఓషధయః = ఓషధులు, వనస్పతయః = వనస్పతులు, ఆకాశః = ఆకాశము, ఆత్మ = ఆత్మ, ఇతి = ఈ విధముగా, అధిభూతమ్ = అధిభౌతిక పంచకము, అథ = ఇక, అధ్యాత్మమ్ = దేహమునకు సంబంధించిన పంచకత్రయము, ప్రాణః = ప్రాణ వాయువు, వ్యానః = వ్యానవాయువు, అపానః = అపానవాయువు, ఉదానః = ఉదాన వాయువు, సమానః = సమాన వాయువు, చక్షుః = నేత్రములు, శ్రోత్రమ్ = చెవులు, మనః = మనస్సు, వాక్ = వాక్కు, త్వక్ = దేహము, చర్మ = చర్మము, మాగ్ంసగ్గ్ం = మాంసము, స్నావా = నరవిశేషము, అస్థి = ఎముక, మజ్జా = కొవ్వు, ఏతత్ = ఈ విధముగా, ఋషిః = తెలిసిన ఒక ఋషి, అధివిధాయ = పై విధముగా, ఇదమ్సర్వం = ఈ కనపడు ప్రపంచమంతయు, పాఙ్క్తంవా = పంచకమే, పాఙ్ క్తేన ఏవ = పంచకము చేతనే, పాఙ్క్తం = పంచక్రతయము, స్పృణోతి ఇతి = నిండించుచున్నాడు అని, అవోచత్ = పలికెను.

**తాత్పర్యము :** ఈ అనువాకమునందు పరబ్రహ్మమును పృథివ్యాది పాంక్తస్వరూపమున ఉపాసించునట్టి విధానము చెప్పబడుచున్నది. పృథివి, అంతరిక్షము, వెలుగులలోకము, దిక్కులు, అవాంతర దిక్కులు. ఇవి ఐదును లోకపాంక్తము. అగ్ని, వాయువు, ఆదిత్యుడు, చంద్రుడు, నక్షత్రములు – ఈ ఐదును దేవతాపాంక్తము. జలములు, ఓషధులు, వనస్పతులు, ఆకాశము, ఆత్మ – ఈ ఐదును భూపాంక్తము. ఈ ఐదు, ఐదుగా చెప్పిన మూడు పాంక్త వర్గములు అధిభౌతికమైనవి. అనగా బాహ్యపాంక్తత్రయము. ప్రాణము, వ్యానము, అపానము, ఉదానము, సమానము – ఇవి వాయుపాంక్తము. నేత్రము, శ్రోత్రము, మనస్సు, వాక్కు శరీరము – ఇవి ఇంద్రియపాంక్తము. చర్మము, మాంసము, స్నావ, అస్థి,

మజ్జ - ఇవి ధాతుపాంక్తము. ఈ ఐదు ఐదుగా చెప్పిన మూడు పాంక్తవర్గములు ఆధ్యాత్మికమైనవి. ఈ కనపడు ప్రపంచమంతయు ఆధిభౌతిక పాంక్తత్రయము, ఆధ్యాత్మిక పాంక్తత్రయముల రూపముల చేతనే ఉన్నదను విషయమును - తెలిసిన ఋషులు చెప్పుదురు.

**వివరణము :** వ్యక్తమగు సృష్టిని శుక్ల పక్షముతోను, అవ్యక్తమగు సృష్టిని కృష్ణ పక్షముతోను సమన్వయ పరచినచో శుక్ల పక్ష తిథులు 15, కృష్ణ పక్షతిథులు 15కు వరుసగా బ్రహ్మాండములోను పిండాండములోను ఆధిభౌతిక, ఆధ్యాత్మిక అంగములు 15 చొప్పున చెప్పబడినవి. వ్యక్తమగు సృష్టి స్వరూపములో వున్న ప్రపంచము ఐదు చొప్పున మూడు వర్గములుగా బ్రహ్మాండము నందును ఐదు చొప్పున మూడు వర్గములుగా పిండాండము నందును కలిగి యుండును. అనగా సృష్టికి - ఐదు సంఖ్యకు చాల దగ్గర సంబంధమున్నది. అందుచేతనే ఐదు + ఐదు+ ఐదుగా అటు బాహ్యరంగములోను, ఇటు అంతర్ రంగములోను అనగా బ్రహ్మాండ, పిండాండములలోను కలిగి వుండుట చేత ఈ కనపడు సృష్టిని 'ప్ర + పంచము = 'చక్కగా - ఐదు' అను పేరుతో పిలిచిరి. అందుచేతనే ఈ అనువాకములో వాటి వివరణ తాత్పర్యములో తెలిపిన విధముగా తెలుసుకొనవలెను. ఆధి భౌతికముగా ఉన్న ఐదు + ఐదు + ఐదు = 15 అను సంఖ్యకు ప్రతీకగనే శ్రీ విద్యలో అమ్మవారి మంత్రమునకు "క, ఏ, ఈ,ల హ్రీం; హ, స, క, హ, ల, హ్రీం; స, క, ల, హ్రీం" అను పదిహేను అక్షరములు ఉన్నవి. అమ్మవారు - ప్రకృతి, అయ్యవారు - పురుషుడు, వ్యక్తమైన సృష్టి అమ్మవారికి సంబంధించినది. లీనమగు సృష్టి ప్రళయము. ఇది అయ్యవారికి సంబంధించినది. మరియు 15 శుక్ల పక్ష తిథులు సృష్టి వ్యక్త మగుటకును, 15 కృష్ణపక్ష తిథులు సృష్టి లీనమగుటకును ప్రతీకలు. అందుచేతనే ఈ అనువాకములో చెప్పిన పద్ధతిననుసరించి శ్రీ విద్యలో గూడ వ్యక్తసృష్టి స్వరూపిణి ఐన అమ్మవారి మంత్రమునకు 3 X 5 = 15 అక్షరములు ఈయబడినవి. పంచభూతములు; పంచతన్మాత్రలు; పంచ జ్ఞానేంద్రియములు; పంచకర్మేంద్రియములు; మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, ప్రజ్ఞలు కలిసి మరల ఐదు ఐదుగా వున్నవి. అనగా సృష్టికి ట్రేడ్‌మార్కు లేదా ఎంబ్లమ్ (Em-

blem) ఐదుగా గ్రహించవలెనని ఈ మంత్ర సారాంశము. సృష్టికి సంబంధించిన ఈ విషయములు పంక్తి ఛందస్సులో వేదములందుండును. పంక్తి అనగా 'ఐదు' అని అర్థము.

ప్రాణాపాన వ్యానోదాన సమానములను (ప్రాణ, అపాన, వ్యాన,ఉదాన, సమానములు) పంచవ్యాహృతులందురు. మనము దేనినైన స్వీకరించుటకు లేదా ఆకర్షించుటకు అవసరమగు బలమును 'ప్రాణ' మనియు, విడుచుటకు లేదా వికర్షించుటకు అవసరమగు బలమును 'అపాన' మనియు, కేంద్రము నుండి బయటకు అనగా పరిధి వైపునకు విస్తరింప జేయుటకు అవసరమగు బలమును 'వ్యాన' మనియు, బయట పరిధి నుండి కేంద్రము వైపునకు ముడుచుకొను లేదా సంకోచింప జేయుటకు అవసరమగు బలమును 'ఉదాన' మనియు, ఈ నాలుగు బలములను ఎప్పటికప్పుడు సమన్వయ పరచు బలమును 'సమాన' బలమనియు అందురు. 'కర్ష' అనగా - పట్టుట (Grip), ఈడ్చుట, లాగుట, దున్నుట మొదలగు అర్థములు గలవు. (నాగలిని చేతబట్టి లాగువాడు లేదా దున్నువాడు కాబట్టి వ్యవసాయదారునకు "కర్షకుడు" అను పేరు వచ్చినది ('కృషి' అను పదమునకు 'కృ', 'కర్ష్' అనునవి మూల ధాతువులగును). పట్టునకు - ధనాత్మకముగను, విడుపునకు - ఋణాత్మకముగను ఈ కర్షణ ఉండునని గుర్తుంచుకోవలెను. ప్రత్యయముతో కూడిన ఈ 'కర్ష' పదముతో పై ఐదు వ్యాహృతులకు సంబంధించిన బలములను ఈ క్రింద నుదహరించిన పేర్లతో వ్యవహరింతురు.

ప్రాణము = ఆకర్షణ = Attraction or force of intake

అపానము = వికర్షణ = Repulsion or force of out going or expulsion

వ్యానము = అపకర్షణ = Centrifugal force

ఉదానము = అపాకర్షణ = Centripetal force

సమాన = సంకర్షణ = Poise or equilibrium or Coordinating force.

మనము తిను ఆహారము మనలో ఈ ఐదు బలములను కలుగజేసి మనలను కాపాడునదిగా వుండునట్లు చేయవలెనని భోజనమునకు ముందు, ఈ బలముల పేర్లు వ్యాహృతులతో చెప్పుచూ కొద్ది కొద్దిగా అన్నమును

ఓం ప్రాణాయ స్వాహా
ఓం అపానాయ స్వాహా
ఓం వ్యానాయ స్వాహా
ఓం ఉదానాయ స్వాహా
ఓం సమానాయ స్వాహా

అని మనలోని జఠరాగ్ని హోమగుండము నందు 'స్వాహా' అనుచు సమర్పించుదుము. మనలో ఈ బలములు గుప్తముగా అనగా సాధ్యస్థితిలో ప్రాణాపాన వ్యానోదాన సమాన నాడుల ద్వారా పనిచేయును ("ఓం" యొక్క ప్రాశస్త్యము రాబోవు అను వాకము నందు వివరింపబడును).

**మంత్రము : *ఓ మితి బ్రహ్మ । ఓ మితీదగ్ం సర్వమ్ । ఓ మిత్యే తదనుకృతిహస్మ వా అప్యోశ్రావయేత్యా శ్రావయన్తి । ఓ మితి సామాని గాయంతి । ఓగ్ం శోమితి శస్త్రాణి శగ్ంసన్తి । ఓ మిత్యధ్వర్యుః ప్రతిగరం ప్రతి గృణాతి । ఓ మితి బ్రహ్మ ప్రసౌతి । ఓ మిత్యగ్ని హోత్ర మనుజానాతి । ఓ మితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ బ్రహ్మోపాప్నవానీతి । బ్రహ్మైవో పాప్నోతి । (7)***

**టీక :** ఓం ఇతి = 'ఓం' అను శబ్దము యొక్క రూపమును, బ్రహ్మ = పరబ్రహ్మమని, ఇదగ్ంసర్వమ్ = ఈ కనపడు సమస్తమైనదియు, ఓం ఇతి = ఓంకారమనియే, ఓం ఇతి ఏతత్ = ఈ ఓంకారమనునది, అనుకృతి = అనుకరణమని, హస్మవై = తెలిసిన విషయమే గదా!, అపి = మరియు, ఓ శ్రావయ ఇతి = 'ఓ శ్రావయ అని, ఆ శ్రావయంతి = తిరిగి పలుకుచున్నారు, ఓం ఇతి = 'ఓం' అనియే, సామాని = సామవేద మంత్రములను, గాయంతి = గానము చేయుచున్నారు. ఓగ్ంశోమ్ ఇతి = 'ఓగ్ంశోమ్' అని, శస్త్రాణి = శస్త్రమంత్రములను, శగ్ంసన్తి = చెప్పుచున్నారు, ఓమ్ ఇతి = 'ఓం' అని అధ్వర్యుః = అధ్వర్యుడు,

ప్రతిగరం = ప్రతిగరమును, ప్రతిగృణాతి = బదులు పలుకుచున్నాడు. ఓం ఇతి = 'ఓం' అనియే, బ్రహ్మ = బ్రహ్మ అను ఋత్విక్కు ప్రసౌతి = అనుజ్ఞ నిచ్చుచున్నాడు. ఓం ఇతి = 'ఓం' అని, అగ్నిహో్త్రమ్ = అగ్ని హో్త్రమును చేయుటకు, అనుజానాతి = అనుజ్ఞ నిచ్చుచున్నాడు. బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, బ్రహ్మ = వేదాది శాస్త్రములను, ఉపాప్నవానీతి = పొందెదనని, ప్రవక్ష్యన్ = ప్రవచనము చేయదలచిన వాడై, ఓం ఇతి = 'ఓం' అని, ఆహ = పలికెను, బ్రహ్మ ఏవా = బ్రహ్మమునే, ఉపాప్నోతి = పొందుచున్నాడు.

**తాత్పర్యము :** 'ఓం' అను అక్షరము పరబ్రహ్మ స్వరూపము. ఈ కనపడున దంతయు ఓంకారాత్మకమే ! దేనిని చెప్పుటకైనను ఓంకారమునే ఉచ్చరించి, అనుకరించుట సుప్రసిద్ధమైన విషయము. 'ఓ శ్రావయ' అనియు 'ఓం' అనియు, 'ఓగ్ంశోమ్' అనియు, 'ఓమ్' అనియు ఈ విధముగా వరుసగా యజ్ఞ, యాగాదులలో ఏ పనికైనను ముందు 'ఓం' కారపూర్వక పదములను పలుకుదురు. చివరకు అగ్నిహో్త్రమును చేయుటకు అనుజ్ఞను ఒసగునపుడు కూడ 'ఓం' అనియే చెప్పుదురు బ్రాహ్మణుడు వేద శాస్త్రాధ్యయనములకు ముందు 'ఓం' అని పలికి బ్రహ్మంత వాడగుచున్నాడు.

**వివరణము :** ఈ అనువాకములో 'ఓం' అను ప్రణవము యొక్క పాశస్త్యమును, తదుపాసనమును చెప్పబడినది. 'ఓం' అనునది ఏకాక్షర పదములలో బహు విశిష్టమైనది. భగవద్గీతలో కూడ "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అనియు, "తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపః క్రియాః, ప్రవర్తన్తే, విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్" అనియు కృష్ణ భగవానునిచే చెప్పబడినది. "క్షరముకాని అనగా ఎన్నడును నశించని ఏకాక్షరమైన 'ఓం' బ్రహ్మకు ప్రతీక అనియు, అందువలన శాస్త్రోక్తములగు యజ్ఞ, దాన, తపఃక్రియలన్నియు ఎల్లప్పుడును 'ఓం' అని చెప్పిన పిమ్మటనే అనుష్ఠింపబడుచున్న"వని దీని అర్థము. "తస్య వాచకః ప్రణవః" అని పాతంజలము కూడ చెప్పును. అనగా పరమేశ్వరుని వాచకరూపము 'ఓం' అని దీని అర్థము. వాఙ్మయము నందలి మిగిలిన పదములన్నియు ఒక ఎత్తు, 'ఓం' అనునది ఒక ఎత్తు. ఏ భాషలో ఏ పదమైనను మానవుడు తన భావమును ఆ

భాషలో వ్యక్తము చేయుటకు ఏర్పరచుకున్న సంకేతమగును. కాని, 'ఓం' అనునది మానవునిచే ఏర్పరచబడినది కాదు. సృష్టిలోనే పరమాత్మను, జీవాత్మను అనుసంధానపరచు 'శ్వాస'లో నిక్షిప్తమై వున్న ఏకాక్షర పదము. పరమాత్మ నిశ్వాసముపై జీవుని ఉచ్ఛ్వాసము ఆధారపడి వుండును. పరమాత్మ ఉచ్ఛ్వాసముపై జీవుని నిశ్వాసము ఆధారపడి వుండును. ఏ వ్యక్తి అయినను ఉచ్ఛ్వాసము చేయునపుడు కుల, వర్గ, వర్ణ, మత, జాతి భేదములు లేక 'సో' అనియు, నిశ్వాసము చేయునపుడు 'హం' అను శబ్దములు శ్వాసను అనుసరించును. ఈ రెండక్షరములు కలిసి 'సోఽహం' అగును. 'సోఽహం' అను పదమును విడదీసినపుడు సః + అహమ్ అగును. అనగా 'వాడే నేను' అని అర్థము వచ్చును. ఇక్కడ 'వాడు' అనగా పరమాత్మ, 'నేను' అనగా జీవాత్మ. అనగా నిశ్వసించు భగవంతునిపై ఉచ్ఛ్వాసము చేయు మానవుని అస్తిత్వము ఆధారపడి వున్నదని ఇందలి భావము.

'సోఽహం' అను పదము (స్ + ఓ) + (హ్ + ం) అను విధముగా ఏర్పడినది 'స్', 'హ్' లు హల్లులు. ఇవి భాషకు, లిపికి దేహముల వంటివి. 'ఓ', 'ం'లు అచ్చులు. ఇవి ప్రాణముల వంటివి. కాబట్టి 'సోహం' అను పదమునకు 'ఓం' అనునది ప్రాణప్రద మగును. ఈ 'ఓం' అనుపదము పరమాత్మకు జీవాత్మకు మధ్య ప్రాణోపదేశ మంత్రముగా సంధింపబడి, మానవుదేర్పరచు కొనిన సంకేత పదముగాగాక సహజముగనే (అనగా పుట్టుకతోపాటుగా) ప్రతివారి శ్వాసలో నిక్షిప్తమైనది. కావున 'ఓం'ను, ఒక భాషాతీత, మతాతీతమైన ఒక విశిష్ట మంత్రముగా 'భా-రతీయులు' (భా = వెలుగును, జ్ఞానమును, రతి = కోరుట అనగా వెలుగును, జ్ఞానమును కోరువారు. తమసోమాజ్యోతిర్గమయ' అనునది భారతీయుల సూక్తి) స్వీకరించిరి. మరల 'ఓం' లో 'ఓ' అనునది పరమాత్మకు సంకేతము కాగా, 'ం' అనునది జీవాత్మకు సంకేతమగును. 'ఓ' ని ఉచ్చరించునపుడు – నోరు తెరవబడి పెదవులు దూరమై ఒక విధమైన అపరిమితత్వమును, 'ం' అనునపుడు నోరు మూయబడి, పెదవులు మూతబడి ఒక విధమైన పరిమితత్వమును తెలియ జేయును. విత్తనము నుండి వృక్షము వెలువడునట్లు 'ఓ' నుండి 'ం'కు జరుగు సృష్టి విధానము, మరల వృక్షమంతయు విత్తులోనికి లీనమగునట్లు 'ం' నుండి తిరిగి 'ఓ' లోనికిలీనమగు

ప్రళయ విధానమును ఈ "ఓ⇄ం" అను ఏకాక్షర ద్విగతి చర్యా (Reversable Process) మంత్రములో ఇమిడి వున్నవి. 'ఓం' అనునపుడు బయటవున్న ఆకాశమునకు (చోటు), మన హృదయములో నున్న దహరాకాశము (మాటు)నకు మధ్య జరుగు శ్వాసపై మనస్సును లీనముచేయుటయే 'ఓం కారోపాసన' లేదా 'ప్రణవోపాసన'. ఇదియే ప్రణవ రహస్యము.

'ఓం' ను 'ప్రణవము' అందురు. ఈ పుస్తకములోనే సంప్రార్థన శీర్షిక యందు మొదట ఒక పద్యమున్నది. ఆ పద్యము యొక్క వివరణ తెలిసికొనినచో ప్రణవ రహస్యము, ప్రాశస్త్యము ఉపాసనము తెలియును. మరల ఆ పద్యమును ఇక్కడ వ్రాసి, వివరించిన సమంజసముగ నుండును.

మ. 'కణ' రూప 'ప్ర'థమం బు - నవ్య 'నవ' సంఖ్యల్ తెల్పు 'బ్రహ్మ'దులున్
'అణు' 'కేంద్రాం'తర 'సూక్ష్మమున్' - 'సుఘన' దివ్యంబైన బ్రహ్మాండము'న్
'క్షణ-కల్పా' న్వితి, 'బీజ - వృక్ష' విధవిజ్ఞానమ్ము నిక్షిప్తమౌ
'ప్రణవ' బ్రహ్మము నుచ్చరింతు మొదటన్ ప్రజ్ఞావికాసార్థమై.

"ప్రధాన కారణము (Primary cause)ను, విశ్వ ప్రజ్ఞా (Cosmic Consciousness) సంకేతుడును, అయిన ఆది నారాయణుని నుండి - నవనవోన్మేషముగా విచ్చుకొను నవబ్రహ్మల (Nine fold awakenings) వరకు; ఏకకణజీవి (Uni cellular Species) అమీబా నుండి నవమాస ప్రవర్ధమానుడైన మానవుడు (Human Species) మొదలగు జీవుల వరకు; ప్రారంభము (Begining) నుండి ఇప్పటి (Present) వరకు; పురాతనము (Ancient) నుండి ఆధునాతనము (Modern) వరకు; ప్రమాణము (Unit) నుండి పరిమాణము (Magnitude) వరకు; పాత (Old) నుండి క్రొత్త వరకును - జరుగునది ప్రజ్ఞాత్మక వికాసము. ఒకటి నుండి తొమ్మిది వరకు - జరుగునది సంఖ్యాత్మక వికాసము. అణువు నుండి బ్రహ్మాండము వరకు, సూక్ష్మము (Subtle) నుండి స్థూలము (Gross) వరకు, గుప్తము (Potential or latent) నుండి వ్యక్తము (Manifested) వరకు, కేంద్రము (Centre) నుండి పరిధి (Circumference) లేదా అవధి (boundary) వరకు, ఏమియు లేనట్లు కనబడు (Apparent something) ఆకాశము నుండి అన్నియు వున్నట్లు కనబడు

పృథివీతత్త్వము వరకు - కలుగునది ప్రాదేశాత్మక వికాసము (Spatial unfoldement). క్షణము (Microscopic unit of time) నుండి కల్పము (Macrascopic unit of time) వరకు, తక్షణ (Instantaneous) స్థితి నుండి కాల్పనిక (Imaginary) స్థితి వరకు - జరుగునది కాలాత్మక వికాసము. - ఈ మూడు వికాసములు బీజము (seed) నుండి వృక్షము (Tree) విచ్చుకొను మౌనవికాస విజ్ఞానము (Science of the silent process of unfodment) వలె దేనియందు గుప్తమై ఒక దానితో ఒకటిపరస్పర సంపూరక సంబంధమును (Complimentary dependence) కలిగి వుండునో - అట్టి 'ప్ర-ణవ' బ్రహ్మను - నా ప్రజ్ఞ సంపూర్ణముగా వికసించి, ఉన్నతి చెందుటకు ప్రప్రథమముగా ఉచ్చరించుదును." - అని స్థూలముగాపై పద్యమునకు తాత్పర్యము.

పై వివరణ ఇంకను పూర్తిగా అర్థమగుటకు మరికొన్ని విషయములను గూడా గుర్తించుకొనవలెను. "ప్రణవము" అను సంస్కృత పదము - 'ప్ర + నవ = ప్రణవ' అయినదిగా గ్రహించవలెను. 'ప్ర' - అన్న ఏకాక్షర పదమునకు - ప్రారంభము, ప్రథమము, ఒకటి, ప్రమాణము, చక్కగా అని; నవ - అన్న ద్వ్యక్షర పదమునకు - క్రొత్త, తొమ్మిది అను అర్థములు చెప్పుకొనవలెను. సృష్టికి ఆది యందు యోగ నిద్రలో ఒంటిగింటి రామలింగము వలె వున్న నారాయణుని నుండి సృష్టిని సంపూర్ణ స్థితిలోనికి వికసింప జేయుటకు అవసరమైన నవబ్రహ్మల వరకు - అన్నపుడు మనలో జరుగు కథను అనుసంధానము చేయవలెను. గర్భస్థుడైన - శుక్రశోణిత జీవకణము పూర్తిగా మానవ రూపమును పొంది ప్రసవింపబడుటకు గూడా తొమ్మిదినెలలు పట్టును. ఒక్కొక్క నెలకు ఒక్కొక్క బ్రహ్మ చొప్పున సంపూర్ణ మానవ రూపమును పొందుటకు నవబ్రహ్మలు పనిచేయుదురు. 'బ్రహ్మ' అనగా 'బృహ్మణ శక్తి గలవాడు' లేదా 'బృహ్మణము చేయువాడు' అని అర్థము. (విషయములను విపులముగా అర్థమగునట్లు వివరించి చెప్ప గలవాడెవడైనను బృహ్మణ శక్తి గలవాడు లేదా 'బ్రాహ్మణుడు' అగును). పూర్తిగా మానవ రూపమును పొందుట రెండు స్థితులలో జరుగును. 1) జీవ పరిణామము (Cosmogenesis) 2) మానవ పరిణామము (Anthropogenesis). ఏకకణ జీవి నుండి మానవ కణము వరకు జరుగు వికాసమును 'జీవ పరిణామ'మని , మానవ కణము నుండి పూర్తి

మానవ రూపము వచ్చు వరకు జరుగు వికాసమును 'మానవ పరిణామ'మనియు అందురు. ఈ రెండు వికాసములకు నవబ్రహ్మలు కారకులగుదురు.

సంఖ్యాత్మక వికాసము ఒకటి నుండి తొమ్మిది వరకు జరుగును. అటు పైన మరల అంకెలు పునరావృతమగును. సృష్టి ప్రళయములు గూడా ఇదే విధముగా ఒక దాని నుండి రెండవ దానిలోనికి వికసించుచు ముకుళించుచు పునరావృతమగు చుండుననునది ఇందు సూచితము.

అణువు నుండి బ్రహ్మాండము వరకు విచ్చుకొనుట ప్రాదేశాత్మక వికాసము. ఇది 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అను నారాయణీయ మంత్రమునకు సరిపడు బృహ్మణము. అదే విధముగా క్షణము (Second) - కాలమును కొలుచుటకు స్వల్ప ప్రమాణము, కల్పము - చాల పెద్ద ప్రమాణము.

పైన చెప్పబడిన వికాసములను అర్థము చేసుకొనుటకు మన మెఱుగున్న "బీజ-వృక్ష" వికాసమును ఉదాహరణగా ఇచ్చుట జరిగినది. ఇవి రెండును ఒకదానిలో ఒకటి నిక్షిప్తమై వుండును. బీజములో వృక్షము గుప్తముగా వుండును. ఇది ప్రళయస్థితి. బీజము వృక్షముగా ఆవిర్భావము చెందుట - సృష్టిస్థితి. ఈ రెండు ప్రక్రియలు బీజ - వృక్షములో నిక్షిప్తమై వుండును బీజము నుండి వృక్షముగా వికాసము చెందుట చాల మౌనముగా జరుగును. మఱ్ఱి చెట్టు క్రింద - దక్షిణ దిక్కునకు తిరిగి ఒక ముని తన చేతి చూపుడు వ్రేలును, బొటన వ్రేలిని కలిపి వుంచి (చిన్ముద్ర) స్థిరముగా ధ్యాన స్థితిలో వుండును. ఆయనను దక్షిణామూర్తి అందురు. చూపుడు వ్రేలు - బ్రహ్మను (వాడు =సః), బొటన వ్రేలు, నేను (అహం) ను సూచించును. ఈ రెంటినీ కలుపుట - అనగా 'సః + అహమ్ = సోఽహం' అనగా 'వాడే నేను' అను మంత్రము. ఇది బ్రహ్మ విద్యాసారము. "మఱ్ఱి బీజము నుండి పెద్ద మఱ్ఱి చెట్టు ఏ విధముగా విచ్చుకొనునో అట్లే ఈ చిన్న మంత్రము నుండి సమస్త బ్రహ్మ విద్యయు విస్తరణము చెందును. చివరకు దీనిలోనికే లీనమగును." అని తెలియ చెప్పుట కోసము ఈ ముని మఱ్ఱి చెట్టు క్రింద కూర్చుండెను. ఇది మౌనముగానే జరుగు వికాసము కాబట్టి ఆయనది 'మౌనవ్యాఖ్య' అనిరి. దక్షిణామూర్తి శివుడే ! శివుడనగా మంత్ర శాస్త్రములో 'ఓం' అని అర్థము. (తస్యవాచకః

ప్రణవః - పాతంజలం) ఓం అనగా - ప్రణవం, ప్ర + నవ = ప్రణవ కాబట్టి, "ప్ర" నుండి "నవ"కు, "నవ" నుండి "ప్ర"కు సృష్టి ప్రళయ వికాసములు జరుగుచుండునని ఇందలి సంకేతార్థము. మరియు, ప్ర - అనగా చక్కగా, నవ - అనగా క్రొత్తగా లేదా చక్కని యౌవన దశలో వున్నవాడని ప్రణవస్వరూపుడైన దక్షిణామూర్తిని మన పురాణములు కీర్తించును. మరియు, ప్ర = 1 నవ = 9; కాబట్టి, అంకె 1- ప్రజ్ఞకు, అంకె 9 - ద్రవ్యమునకు, ప్రతీకలు కాబట్టి - ప్రణవము "ప్రజ్ఞ నుండి పదార్థమునకు' అనెడి సృష్టి వికాసమును గూడ స్ఫురింప జేయును.

పైన చెప్పిన కారణముల వలన 'ఓం' అను అక్షరమునకు అంతటి ప్రాశస్త్యము కలదు. ఈ అనువాకములో మరికొన్ని ఉదాహరణలతో ఓం కార వైశిష్ట్యము చెప్పబడుచున్నది. యజ్ఞ సమయములలో హవిస్సునిచ్చెడి సమయమైనదని తెల్పుటకు "ఓ శ్రావయ" అని 'ఓ'తో ప్రారంభించి చెప్పుదురు. సామగానమును ప్రారంభించుటకు ముందు గూడ 'ఓ' తోనే మొదలిడుదురు. హోతలు శస్త్రములను పఠించునపుడు "ఓగ్ం శోం" అని ప్రారంభింతురు. బ్రహ్మ - ఇతర ఋత్విక్కులకు యజ్ఞ సమయములో 'ఓం ప్రోక్ష' అని అనుజ్ఞ నిచ్చును. అధ్వర్యుడు 'ఓ దామోద' అని ప్రతిగరమును పలుకును. యజ్ఞములో 'అగ్నిని తీసుకొని రమ్ము' అని అనరు. 'ఓం' అని అందురు. అట్లే ఎవరైన ప్రశ్నించినపుడు "ఊ" అనుటకు బదులు 'ఓం' అనుట సంస్కృత భాష యందలి సంప్రదాయము. (ఓ - అని గూడ తెలుగులో చెప్పుదురు). ఏ బ్రాహ్మణుడైనను స్వాధ్యాయనము నందును, గురువు శిష్యునికి వేదమును బోధించునపుడును 'ఓం' తోనే ప్రారంభించును. అప్పుడు మాత్రమే అధ్యయన ప్రవచనములకు శుద్ధి, సిద్ధి కలిగి బ్రహ్మ స్థితిని పొందుట జరుగును.

**మంత్రము : ఋతం చ స్వాధ్యాయ ప్రవచనే చ । సత్యంచ స్వాధ్యాయ ప్రవచనే చ । తపశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । దమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । శమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । అగ్ని హోత్రంచ స్వాధ్యాయ ప్రవచనే చ । అతిథయశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । మానుషం చ స్వాధ్యాయ ప్రవచనే చ । ప్రజా చ స్వాధ్యాయ ప్రవచనే చ । ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచ నే చ । సత్యమితి సత్యవచా రాథీతరః ।**

**తప ఇతి తపోనిత్య ః పౌరుశిష్టిః । స్వాధ్యాయ ప్రవచనే ఏవేతినాకో మౌద్గల్యః । తద్ధి తపస్తద్ధి తపః ॥** **(8)**

**టీక :** ఋతంచ = ఋతమును, స్వాధ్యాయ ప్రవచనేచ = తనకు తాను చదువుకొనుట, ఇతరులకు చెప్పుటలును, సత్యంచ = సత్యమును, తపశ్చ = తపస్సును, దమశ్చ = బాహ్యేంద్రియ నిగ్రహమును, శమశ్చ = అంతరేంద్రియ నిగ్రహమును, అగ్నియశ్చ = అగ్నులును, అగ్నిహోత్రంచ = అగ్నిహోత్రములును, అతిథయశ్చ = అతిథులును, మానుషంచ = మనుష్య సంబంధ వ్యవహారమును, ప్రజాచ = సంతానమును, ప్రజనశ్చ = భార్యా సంగమమును, ప్రజాతిశ్చ = సంతతికి సంతతి పొందుటయును, (తప్పక అనుష్ఠింప తగినవి), సత్యం ఇతి = సత్యమును పలుకుటయే రాధీతరః = రధీతర వంశస్థుడగు, సత్యవచాః = సత్యవచసుడను మహర్షి (యొక్క) (అభిమతము), తపః ఇతి = తపస్సు చేయటయే, పౌరుశిష్టిః = పురుశిష్టి మహర్షి పుత్రుడగు. తపోనిత్యః = తపోనిత్యుడను మహర్షి (యొక్క) (అభిమతము), స్వాధ్యాయ ప్రవచనే ఏవేతి = స్వాధ్యాయ ప్రవచనములే, మౌద్గల్యః – ముద్గలమహర్షి పుత్రుడగు, నాకః = నాకుడను ఆచార్యుని (అభిమతము), తత్ హి = (కావున) అవి, తపః = తపశ్శబ్ద వాచ్యములు, తత్ హి = (కావున) అవి, తపః = తపశ్శబ్ద వాచ్యములు.

**తాత్పర్యము :** శాస్త్రోక్త శ్రౌత, స్మార్తకర్మలు, సత్యము పలుకుట, తపస్సు చేయుట, బాహ్యేంద్రియ నిగ్రహమును కలిగి యుండుట, అంతరేంద్రియ నిగ్రహమును కలిగి యుండుట, త్రేతాగ్ని సంబంధ కార్యములను నిర్వర్తించుట, అతిథి పూజనము చేయుట, మనుష్య సంబంధమైన వ్యవహారములు చక్క బెట్టుట, సంతానమును కని, పెంచి వారిని సంస్కార వంతులుగా చేయుట, సంతతికి సంతతికలుగగా చూచుట, భార్య పట్ల దాంపత్య ధర్మమును వహించుట, వీటన్నింటిని స్వాధ్యాయ ప్రవచనములతో అనగా తాను వేదశాస్త్రాదులను చదువుకొనుట, ఇంకొకరికి చెప్పుటతో నిత్యము అనుష్ఠింప దగిన కర్మలుగా చెప్పబడినవి. రధీతర గ్రోత్రోద్భవుడైన సత్యవచసుడను ఆచార్యుడు అన్నిటికన్న సత్యవచనము పలుకుట విశిష్టకరముగా చెప్పెను. పురుశిష్ట మహర్షి పుత్రుడగు తపోనిత్యుడను ఆచార్యుడు అన్నిటికన్న తపస్సు ఉత్తమమనెను. ముద్గల మహర్షి యొక్క పుత్రుడగు నాకుడను

ఆచార్యుడు స్వాధ్యాయ, ప్రవచనములు అన్ని కర్మలకన్న ఉత్తమోత్తమము అని చెప్పెను. కావున ఇదియే తపస్సు అని నిర్ధారింపబడినది.

**వివరణము :** ఈ అనువాకములో ప్రతి ఒక్కడు నిత్యము అనుష్ఠింప వలసిన కర్మలు చెప్పబడినవి. ఏ కర్మ ఐనను స్వాధ్యాయ ప్రవచనములు లేనిదే సిద్ధి చేకూరదనునట్లుగా మరల మరల వీటిని చెప్పుట జరిగినది. శాస్త్రము నందు చెప్పబడిన రీతిలో శ్రౌత, స్మార్తకర్మలు చేసినచో ఋతమునకు సంబంధించిన కర్మలు పూర్తి యగును. ఈ కర్మలు చేయుటలో శాస్త్రమును ప్రమాణముగ తీసుకొనవలెను. ఇవి తాము చేయుచు, ఇతరులచేత చేయించవలెనని స్వాధ్యాయ ప్రవచనములకు ఇక్కడ అర్థము చెప్పుకొనవలెను. అట్లే ఈ అనువాకములో ఇక ముందు చెప్పబడు అన్ని కర్మలను తాను చేయుచు, వాటి విశిష్టతను ఇతరులకు తెలిపి, వారు కూడ అనుష్ఠించునట్లు చేయవలెనని అర్థము చెప్పుకొనవలెను.

తపస్సు అనగా నేర్చుకొనవలసిన, చేయవలసిన పనుల యందు తపన లేదా శ్రద్ధాసక్తులను కలిగి యుండుట – 'అగ్నయశ్చ' అని చెప్పినపుడు జఠరాగ్నికి, దక్షిణాగ్నికి, గార్హపత్యాగ్నికి, ఆహవనీయాగ్నికి సంబంధించిన విషయముగా అనగా తనలోని అగ్నులకు సంబంధించిన విషయము గాను, 'అగ్నిహోత్రంచ' – అనునపుడు బైట చేయవలసిన నిత్యాగ్ని హోత్ర హోమాదులుగాను చెప్పుకొనవలెను. 'మానుషంచ' అనునపుడు మనుష్య సంబంధమైన వ్యవహారములు అనగా మనపై అధికారుల పట్ల (Superiors), మన క్రింద పనిచేయువారి పట్ల (Subordinates), జీతగాండ్రపట్ల భార్యాబిడ్డల యందు, తదితర బంధు మిత్రులయందు నిర్వర్తించవలసిన బాధ్యత, సత్ప్రవర్తనాదుల విషయముగా చెప్పుకొనవలెను. 'ప్రజాచ', 'ప్రజనశ్చ' – అనునపుడు సత్సంతానమును పొందుట, అట్టి సంతానమునకై భార్యపట్ల వహించవలసిన దాంపత్య ధర్మమును అవలంబించుట, సంతానమును పొందిన తర్వాత వారి పట్ల తండ్రిగా వహించవలసిన పూర్తి బాధ్యతలను బాధ్యతాయుతముగా నిర్వర్తించుట, అటుపైన సంతతికి సంతతి అనగా మనుమలు, మనుమరాండ్రు కలుగుటను అభిలషించి పుత్రీ, పుత్రులకు వివాహాది శుభకార్యములను నెరవేర్చుట అను విషయమును చెప్పుకొనవలెను.

పైన చెప్పిన అనుష్ఠానములలో అతిముఖ్యమైనవి ఏవి ? ఏవి చేసినచో మిగిలిన వన్నియు చేసినట్లే అగును ? అను ప్రశ్నలు ఎవరికైన కలిగినచో అట్టి ప్రశ్నలకు దృష్టాంత పూర్వకముగా కొందరు సనాతనాచార్యుల ఉద్దేశ్యములు కూడ ఈ అనువాకమునందు చెప్పబడెను.

రథీతర వంశస్థుడైన ఆచార్యుడు అన్నింటికన్న సత్యవచనమును పలుకుట ముఖ్యమైన దానిగా చెప్పెను. పురుశిష్టి వంశమునకు సంబంధించిన ఆచార్యుడు తపస్సును అన్నిటికన్న ముఖ్యమైన దానినిగా పేర్కొనెను. సత్ – అనగా మంచిగా లేదా విశిష్టముగా ఉండునది అని అర్థమును చెప్పుకొనినచో, కనీసము సత్యవచనమును అనుష్ఠించినచో చాలును అనుభావములో రథీతరుడు చెప్పియుండ వచ్చును. ఏ విషయమందైనను ఆచరించవలెనని, నేర్వవలెనని, ఉత్సాహ, కుతూహల, శ్రద్ధాసక్తులను కలిగి యుండుటను "తపన" పదమునకు అర్థముగా గుర్తించి, పౌరుశిష్టుడు తపస్సునకు ప్రాధాన్యము ఇచ్చి వుండవచ్చును. చిట్టచివరకు ముద్గల మహర్షి పుత్రుడైన 'నాకుడు' అను ఆచార్యుడు ఈ అనువాకము నందు పునః పునః చెప్పబడిన స్వాధ్యాయ ప్రవచనములను అత్యంత అనుష్ఠేయములుగా చెప్పెను. మంచి పనులు, మంచి విషయములు తనకే పరిమితము గాక, ఇతరులకు కూడ వ్యాప్తి కలుగుట ముఖ్యము అను ఉద్దేశ్యముతో అన్నిటికన్న మిన్నగా ఇవియే తపస్సులు అని గట్టిగా నొక్కి వక్కాణించుట జరిగినది. వాస్తవమునకు ఈ ముగ్గురు చెప్పిన వాటిలో ఏ ఒక దానిని స్వీకరించి, ఆచరించినను ఒక దాని వలన మిగిలినవి సిద్ధించి జన్మసాఫల్యము, సార్థకత చేకూరునని తెలిసికొనవలెనే గాని వారికి షూర్కులు వేయుటకు ప్రయత్నింపరాదు.

**మంత్రము : *అహం వృక్షస్య రేరివా । కీర్తిః పృష్ఠంగిరేరివ । ఊర్ధ్వ పవిత్రో వాజినీవ స్వమృతమస్మి । ద్రవిణగ్ం సవర్చసమ్ । సుమేధా అమృతో౽క్షితః । ఇతి త్రిశఙ్కో ర్వేదాను వచనమ్ ॥*** *(9)*

**టీక :** అహం – నేను, వృక్షస్య =వృక్షమునకు, రేరివా = ప్రేరకుడను, కీర్తిః = ఖ్యాతి లేదా యశస్సు, గిరేః = పర్వతము యొక్క పృష్ఠం ఇవ = శృంగము వలె లేదా స్థిరత్వము వలె, ఊర్ధ్వ పవిత్రః = సన్మార్గముచే పవిత్రుడను, వాజిని +

ఇవ = వాజినీవ = సూర్యుని యందు వలె, స్వమృతమ్ = పాపదోషము లంటనివానిగా, అస్మి = అగుచున్నాను. సవర్చసమ్ = వర్చస్సుతో కూడి, ద్రవిణగ్ం = ధనము గల, సుమేధాః = మంచి బుద్ధిగల, అమృతః = మరణము లేని, అక్షితః = వికార రహితుడను లేదా దేని వలనను దెబ్బతినని, (వాడనుగా అగుచున్నాను) ఇతి = ఈ విధముగా, త్రిశంకోః = 'త్రిశంకు' అను మహర్షి యొక్క వేదానువచనమ్ = వేదవచనము.

**తాత్పర్యము :** 'వృక్షము' – అనగా (పుట్టి పెరిగి, వధించుటకు వీలైనదను అర్థములో) సంసార వృక్షముగా గ్రహించి అట్టి సంసార వృక్షమునకు ప్రేరకుడను నేనే అనియు, నా కీర్తి పర్వత శిఖరముల వలె అత్యున్నత మనియు, సంసారము అంటని స్థితిలో వున్న వాడననియు, సూర్యుని వంటి ఆత్మ స్వరూపుడననియు, తేజస్వంతము, ధనవంతము, వికార రహితత్వము, సద్బుద్ధి కలిగినవాడను "నేను" అనియు త్రిశంకు మహర్షి యొక్క వేదాంత వాక్యము.

**వివరణము :** పూర్వానువాకములో చెప్పబడిన ఆచరణీయము లైన కర్మలనన్నిటిని త్రికరణ శుద్ధితో నెరవేర్చుచున్నపుడు మముక్షత్వమునకు ఉపాసకుడు దగ్గఱ పడును. అట్టి ముముక్షస్థితిని త్రిశంకుమహర్షి ఈ అనువాకములో ఇచ్చినాడు. బాధ్యతాయుతమైన కర్మలను ఫలాపేక్ష రహితముగా నిర్వర్తించినపుడు సాంసారిక దోషము అంటదు. అట్టివాడు సంసారములో నున్నను సంసార బంధము అంటదు. కర్మ బంధమంటునని కర్మలను త్యజించరాదు. రామకృష్ణ పరమహంస చెప్పినట్లు 'జీవియను ప్రయాణీకునకు సంసారమను పడవలో ప్రయాణము తప్పదు. పడవ నీటిలోనే ప్రయాణము చేయవలెను. కాని పడవలోనికి నీరు ఎక్కరాదు'. అట్లే జీవి సంసారమును సాకవలెను. కాని, జీవికి సంసారమంటరాదు. కాళిదాసు గూడ 'రఘువంశరాజులు సుఖములను తమకు అంటని విధముగా అనుభవించిరి' ('అసక్తఃసుఖమన్వభూత్') అని చెప్పెను. ఇట్టివారు మముక్షత్వమునకు దగ్గఱ పడుదురు. ఇది సంసారాతీతమైన స్థితి. పండు పండిన తర్వాత తీగకు బంధితమవని స్థితి. చింతకాయ చింతగుల్ల ఐనస్థితి. పూర్వపు వగరు, పులుపు, పెంకునకంటి

యుందు సంగము తొలగి, తీపితోనిండి పెంకుతో సంబంధము లేని స్థితి కలిగిన చింతగుల్లతో ఈ ముముక్షత్వస్థితిని పోల్చవచ్చును. అట్టివాడు ఈ అనువాకములో చెప్పినట్లు విశుద్ధుడే, పవిత్రుడే, దీప్తిమంతుడే, జనన మరణాతీతుడే, చెక్కు చెదరని కీర్తిమంతుడే, ఐహికాముష్మిక ధనసంపన్నుడే ! అని అర్థము చేసుకొనవలెను. లేదా ఈ చెప్పినవన్నియు మనలోని 'నాది' కి సంబంధించినవిగా కాక, 'నేను'కు సంబంధించినవిగా అర్థము చేసుకొనవలెను.

**మంత్రము :** ***వేద మనుచ్యా ఽఽచార్యోఽంతే వాసిన మనుశాస్తి । సత్యంవద। ధర్మంచర । స్వాధ్యాయా న్మా ప్రమదః । ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః । సత్యా న్న ప్రమదితవ్యమ్ । ధర్మా న్న ప్రమదితవ్యమ్। కుశలా న్న ప్రమదితవ్యమ్ । భూత్యై నప్రమదితవ్యమ్ । స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ । దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్ ॥ మాతృదేవోభవ ॥ పితృదేవోభవ ॥ ఆచార్యదేవోభవ । అతిథి దేవోభవ । యాన్యనవద్యాని కర్మాణి । తాని సేవితవ్యాని ।నో ఇతరాణి । యాన్యస్మాకగ్ం సుచరితాని । తాని త్వయోపాస్యాని । నో ఇతరాణి । యే కే చాస్మ చ్ఛ్రేయాగ్ంసో బ్రాహ్మణాః । తేషాం త్వయాఽఽసనేన ప్రశ్వసితవ్యమ్ । శ్రద్ధయా దేయమ్ । అ శ్రద్ధయాఽదేయమ్ । హ్రియా దేయమ్। భియా దేయమ్ । సంవిదా దేయమ్ । అథ యది తే కర్మ విచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్ । యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః । యుక్తా ఆయుక్తాః। అలూక్షా ధర్మ కామాస్యుః । యథా తే తత్ర వర్తేరన్ । తథా తత్రవర్తే థాః । అథాభ్యాఖ్యాతేషు । యేతత్ర బ్రాహ్మణా స్సంమర్ శినః । యుక్తా ఆయుక్తాః । అలూక్షా ధర్మ కామాస్స్యుః । యథా తే తేషు వర్తేరన్ । తథా తేషు వర్తే థాః । ఏష ఆదేశః । ఏష ఉపదేశః । ఏషా వేదోపనిషత్ । ఏత దనుశాసనమ్ । ఏవముపాసితవ్యమ్। ఏవ ముచైత దుపాస్యమ్ ।*** *(10)*

**టీక :** వేదం = వేదమును, అనూచ్య = బోధించి, ఆచార్య = ఆచార్యుడు లేదా గురువు, అంతే వాసినమ్ = శిష్యుని లేదా విద్యార్థిని, అనుశాస్తి = శాసించుచున్నాడు, సత్యం = సత్యమును, వద = పలుకుము, ధర్మం = ధర్మమును, చర = ఆచరింపుము, స్వాధ్యాయాత్ = అధ్యయనమునుండి, మా ప్రమదః =

పొరపాటు పడకుము, ఆచార్యాయ = ఆచార్యుని కొఱకు, ప్రియం = ఇష్టమైన, ధనమ్ = ధనమును, ఆహృత్య = ఇచ్చి, ప్రజాతంతుం = సంతతి క్రమమును, మా వ్యవచ్ఛేత్సీః = విచ్ఛిత్తిని కలుగ జేయకుము, సత్యాత్ = సత్యము నుండి, (అనగా సత్యమును పలుకు విషయము పట్ల), న ప్రమదితవ్యమ్ = పొరపాటు పడకుము, ధర్మాత్ = ధర్మము నుండి (అనగా ధర్మము విషయములో), న ప్రమదితవ్యమ్ = పొరపాటు పడకుము, కుశలాత్ = రక్షణ విషయములో, భూత్యై = శ్రేయస్కరమైన, శుభమైన పనుల విషయములో, స్వాధ్యాయ ప్రవచనాభ్యామ్ = చదువు కొనుట, ఇతరులకు చెప్పుట విషయములలో, దేవ పితృకార్యాభ్యామ్ = దేవ పితృ కార్యముల నాచరించు విషయములో, న ప్రమదితవ్యమ్ = పొరపాటు పడకుము. (అనగా యథావిధిగా ఆచరింపుము), మాతృదేవోభవ = తల్లియే దైవముగా కలవాడవు అగుము, పితృదేవోభవ = తండ్రియే దైవముగా కలవాడవు అగుము, ఆచార్యదేవోభవ = గురువే దైవముగాకలవాడవు అగుము, అతిథిదేవో భవ = అతిథియే దైవముగా కలవాడవు అగుము, యాని, = ఏ, కర్మాణి = పనులు, అనవద్యాని = నింద్యములుకావో, తాని = అట్టిపనులే, (త్వయా = నీచేత), సేవిత వ్యాని = సేవించదగినవి, ఇతరాణి = ఇతరమైన పనులు, అనగా నింద్యములైనవి, నో = వద్దు, వలదు, చేయకుము, అస్మాకం = మా యొక్క, యాని సు చరితాని = ఏమంచి పనులు కలవో, తాని = ఆ మంచి పనులే, త్వయా = నీ చేత, ఉపాస్యాని = ఉపాసించతగినవి. అనగా చేయదగినవి, ఇతరాణి = ఇతరమైన పనులు అనగా మేము చేయు మంచి పనులు కానివి, నో = చేయకుము, యేకేచ = ఎవరైనను, అస్మత్ = మనకంటె లేదా మా కంటె, శ్రేయాగ్ం సః = శ్రేష్ఠులు, (ఐన) బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, (నీ దగ్గరకు వచ్చుచున్నచో), తేషాం = వారికి, త్వయా = నీ చేత, ఆసనేన = ఆసనము ఇచ్చుటచేత, ప్రశ్వసితవ్యమ్ = శ్రమను పోగొట్టవలెను, శ్రద్ధయా = శ్రద్దతో, దేయమ్ = ఇవ్వవలెను, అశ్రద్ధయా = అశ్రద్ధతో, అదేయమ్ = ఇవ్వకూడదు, శ్రియా = ఐశ్వర్యముననుసరించి, అనగా తాహతును బట్టి, దేయమ్ = ఇవ్వవలయును, హ్రియా = సిగ్గుపడుచు, దేయమ్ = ఇవ్వవలెను. భియా = భయపడుచు, లేదా బిడియపడుచు, దేయమ్ = ఇవ్వవలెను, సంవిదా = చక్కగా తెలిసికొనిన జ్ఞానము చేత, దేయమ్ = ఇవ్వవలెను, అథ = అటుపైన, తే = నీకు,

విషయములను శాసించి చెప్పుచున్నాడు. సత్యమునే పలుకుము, ధర్మమునే ఆచరింపుము, అధ్యయన విషయములో పొరపాటు పడకుము. (ఆచార్యునికి ఏదైన దక్షిణగా సమర్పింపవలెనని అనిపించినచో) - ఆచార్యునికి ఇష్టమైన ద్రవ్యమును తెచ్చియిమ్ము. పుత్రపౌత్రాదులను పొందు విషయక్రమమునకు అవరోధమును కలిగించకుము. సత్యమును పలుకుటలో, ధర్మమును ఆచరించుటలో, రక్షణ విషయములో, శ్రేయస్కరమైన శుభకార్యములను చేయు విషయములో, దేవతా సంబంధమైన, పితృసంబంధమైన పనులను నెరవేర్చు విషయములోను పొరపాటును, ఏమరపాటును పడకుము. తల్లిని, తండ్రిని, ఆచార్యుని, అతిథిని దేవతలుగా భావించి పూజింపుము. నింద్యములు కాని పనులను చేయుము. నింద్యములైన పనులను చేయకుము. మేము చేయు మంచి పనులే చేయుము. మేము ఏదైనా (పొరపాటున) మంచివి కానివి చేయుట జరిగినచో వానిని చేయకుము.

మనకంటె అనగా నీ కంటె, నా కంటె ఎవరైనా శ్రేష్ఠులైన బ్రాహ్మణులు నీ కడకు వచ్చినచో ఎదురేగి, తోడ్కొని వచ్చి, ఆసనము మొదలైన వాటిని కలుగజేసి, వారిని సేవించి, బడలిక తీర్చుము. ఇచ్చునపుడు శ్రద్ధతో ఇమ్ము, అశ్రద్ధతో ఈయకుము. నీ సంపద, తాహతును బట్టి ఇమ్ము. సిగ్గుపడుచు, బిడియపడుచు, ఇచ్చునది ఎవరికో తెలిసికొని ఇమ్ము.

ఎప్పుడైనను పనులనాచరించు విషయములో సందేహము వచ్చినపుడు - నీకు అందుబాటులో నుండి, చక్కగా విమర్శించి, విడమరచి యుక్తమైన రీతిలో చెప్పగల సమర్థులును; ఇంకొకరు చెప్పకయే మంచి పనులను ఆచరించువారును; క్రూరస్వభావము లేని వారును; ధర్మము నందు ఆదరాభిమానములు కలవారును ఐన - బ్రాహ్మణులు - నీవు సందేహపడు విషయములలో లేదా సందర్భములలో ఏ విధముగా ఆచరించుదురో లేదా ప్రవర్తించుదురో ఆ విధముగానే నీవును అట్లే ప్రవర్తింపుము.

ఎప్పుడైనను దోషులని సంశయింపబడుచున్నవారి విషయములో ఏమి చేయవలెనని సందేహము వచ్చినపుడు - నీకు అందుబాటులో నుండి, చక్కగా

విమర్శించి, విడమరచి,యుక్తమైన రీతిలో చెప్పగల సమర్థులును; ఇంకొకరు చెప్పకయే మంచి పనులను ఆచరించువారును; క్రూరస్వభావములేనివారును; ధర్మమునందు ఆదరాభిమానములు కలవారును ఐన - బ్రాహ్మణులు నీవు సందేహ పడు విషయములో ఏ విధముగా నిర్ణయము తీసుకొని ప్రవర్తించెదరో నీవు కూడ అదే విధమైన నిర్ణయమును ప్రామాణికముగా తీసుకొని ప్రవర్తింపుము.

ఈ పైన చెప్పిన విషయములను ఆదేశముగా తీసుకొనుము. లేదా ఉపదేశముగా తీసుకొనుము. ఈ విషయములన్నియు వేద సారాంశముగా, శాసన వాక్యములుగా ఉపాసన చేయుము. ఇదియే నీకు నిజముగా ఉపాసింప దగిన విషయము.

**వివరణము :** వేద విద్యనంతను ఆమూలాగ్రము బోధించి వివరించిన తరువాత ఆచార్యుడు శిష్యునికి ఇకముందు పాటింపవలసిన నియమములను (Instructions) చేయవలసిన పనులను, ఉండవలసిన ప్రవర్తన గూర్చి ఈ అనువాకములో శాసనపూర్వకముగా చెప్పును. అందుచే దీనిని 'అనుశాసన అనువాకము' అందురు.

బ్రహ్మచర్యాశ్రమములో శిష్యుడు ఆచార్యుని వద్ద విద్యలన్నియు పూర్తి చేయును. అటుపైన గృహస్థాశ్రమములో అడుగు పెట్టవలసి యుండును. ఆ సందర్భములో ముందుగా "సత్యంవద" అను అనుశాసనముతో ప్రారంభించి, "ఏవ ముచైత దుపాస్యమ్" అను వాక్యము వరకు ఆచార్యుడు శిష్యునకు చెప్పును. ఈ రోజులలో కూడా విశ్వ విద్యాలయములో పట్టా (Degree) ప్రదానము జరిగిన తరువాత ఆ స్నాతకోత్సవసభలో (Convocation Function) పెద్దవారైన ఒకరి చేత విద్య పూర్తి చేసిన వారి నుద్దేశించి ఇదే విధముగా స్నాతకోత్సవ ప్రసంగమును (Convocation Address) ఏర్పాటు చేయుదురు. ఈ అనువాకములో చెప్పిన విషయములు ఇట్టి సందర్భములలో చెప్పినచో ఎంతయో సమంజసముగా, సముచితముగా ఉండును. ఇక ఈ అనువాకములో చెప్పబడిన అట్టిమంచి విషయములకు వివరణ తెలుపబడును.

"సత్యంవద" అని ముందుగా చెప్పెను. 'సత్యమునే పలుకుము' అని దీని అర్థము. బ్రహ్మ చర్యాశ్రమమును వదలి గృహస్థా శ్రమములో అడుగు పెట్టినపుడు విద్యార్థి ఎన్నో లౌకిక విషయములను ఎదుర్కొనవలసి వచ్చును. ఐనప్పటికి, ఎట్టి పరిస్థితులలోనైనను సత్యమును విడనాడరాదు. విశ్వామిత్రుడు తపత్సంతయును పూర్తి చేసిన తరువాత దేవతలు వశిష్ఠునిచే విశ్వామిత్రుడు బ్రహ్మర్షి ఆయెనని ఒప్పించిరి. అప్పుడు విశ్వామిత్రుడు వశిష్ఠునితో 'ఈ మాట మొదటనే అన్నచో నీ కుమారులు వందమంది నాచే హతులై ఉండెడివారు కాదు గదా!' అనగా అప్పుడు వశిష్ఠుడు – "నీవప్పుడు బ్రహ్మర్షివి కావు. మరి నేను నా కుమారుల కొఱకై నీవు బ్రహ్మర్షివైతివని ఎట్లు అనృతము పలుకగలను ? "సత్యం పుత్రశతాద్వరమ్" అనెను. అనగా 'ఒక సత్యవాక్యము వందమంది పుత్రులకన్న శ్రేష్ఠమైనది' అను అర్థములో పలికెను. దీనిని బట్టి సత్యమునకు ఎంత ప్రాముఖ్యము కలదో వశిష్ఠుని వలన తెలియును. మను ధర్మశాస్త్రములో కూడ "సత్యం బ్రూయత్, ప్రియం బ్రూయత్, నబ్రూయత్ సత్యమప్రియమ్, ప్రియంచ నానృతమ్ బ్రూయత్, ఏషధర్మస్సనాతనః" అని సత్య, ప్రియ వచనముల యొక్క ప్రాముఖ్యము నొక్కి వక్కాణింపబడెను. "సత్యాన్నాస్తి పరోధర్మః" అని ఆర్యోక్తి కూడ కలదు. 'There is no religion higher than truth' అని దివ్యజ్ఞాన సమాజము వారు కూడ తమ సంస్థకు ముఖ్య సూత్రముగా తెలుపుదురు. "సత్యంవద" అనునపుడు "Speak Truth" అను ఇంగ్లీషు అనువాదము గాని, 'సత్యమును పలుకుము' అను తెలుగు అనువాదము కాని నూటికినూరుపాళ్ళు సరిపోయినవని చెప్పుటకు వీలు లేదు. సత్యమును పలుకుటయే గాక 'సత్యము పలుక బడునట్లు, సత్యము వర్ధిల్లునట్లు చూడుము'. అను ఒక విధమైన శాసనపూర్వకమైన ఆజ్ఞగా ఆచార్యుడు శిష్యునికి ఉపదేశించినట్లు కూడ అర్థము చేసికొనవలెను.

"ధర్మంచర" అనగా 'ధర్మమునే ఆచరింపుము' అని అర్థము. ధర్మమనగా న్యాయము, వృత్తి లక్షణము, కర్మ, స్వభావము అను అర్థములు చాల చెప్పుకొనవచ్చును. కాని, ఇక్కడ హృదయము ప్రబోధించు మార్గములో పనులు చేయుమని ధర్మపదమునకు అర్థము చెప్పుకొనవలెను. ఎందువలననగా ధర్మమునకు

పుట్టినిల్లు హృదయము అందుచేతనే కృష్ణపరమాత్మ ఉపదేశించిన గీతలో ప్రథమ శ్లోకము "ధర్మ – క్షేత్రే" అను పదములతో ప్రారంభింపబడినది. హృదయమే ఈ ధర్మ క్షేత్రము, కురుక్షేత్రమని పెద్దలు చెప్పుదురు. భారతములో యక్షుడు ధర్మరాజును 'ధర్మాచరణ విషయములో దేనిని ప్రమాణముగా తీసుకొనవలెనని అడిగినపుడు, ధర్మరాజు "ధర్మస్యతత్త్వం నిహితం గుహాయామ్" అనగా, ధర్మము గుహయైన హృదయమునందు ఉండునని, ఆ హృదయ ప్రబోధమును ప్రమాణముగ తీసుకొనుమని చెప్పును. ఈ ధర్మమును ధర్మము కొఱకే ఆచరించవలెను. అంతే కాని ధర్మమును ఆచరించినచో రక్షణ కలుగునను క్షత్రియధర్మరీతిలో గాని ధర్మమును ఆచరించినచో ప్రయోజనము కలుగునను వైశ్యధర్మరీతిలో గాని ధర్మమును ఆచరించనిచో శిక్షించుదురను శూద్ర ధర్మరీతిలో గాని ధర్మమును ఆచరించరాదు. 'ఎందుకు ధర్మమును ఆచరించితివి' అని ప్రశించినపుడు 'అట్లాచరించుట ధర్మము కాబట్టి' అను బ్రాహ్మణధర్మ రీతిలో మాత్రమే సమాధానము ఉండవలెను కాని వేరొక హేతువేదియు ధర్మాచరణమునకు కారణము కారాదు. (ఇక్కడ ఉపయోగించిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రపదములు గౌణార్థములో వాడబడినవి గాని కులమునకు సంబంధించినవి కావు). ముందు, వాక్కుతో చేయు కర్మను గురించి 'సత్యంవద' అని చెప్పి, ఆ చెప్పిన దానిని కర్మణా చేయుటలో ధర్మబద్ధముగా నుండవలెనని శాసించుట జరిగినది.

"స్వాధ్యాయాన్మా ప్రమదః" అనగా 'అధ్యయనము చేయుటలో పొరపాటు పడకుము' అని అర్థము. స్వ + 'అధ్యయనము' అని విడదీసినచో, 'స్వ' అనగా 'తన – శీల, ప్రవర్తనాదుల విషయమై' లేదా 'ఆత్మజ్ఞాన సముపార్జన విషయమై' ఎప్పటికప్పుడు ఆత్మ విమర్శ చేసికొనుచు జాగ్రత్తపడుచుండు' మని గూడ చెప్పుకొనవచ్చును. (తన విషయమై, అన్నపుడు నీవు – నీ గుఱించి అని ఇక్కడ విద్యార్థి పరముగా అర్థము చెప్పుకొనవలెను). ఇందువలన తనను గుఱించి తాను ఎక్కువగా నిర్ణయించకుండుటలో (Over estimation) పర్యవేక్షణ (Checking) జరుగును. ('మా ప్రమదః' అనునది పొరపాటు పడకుము' అని ఈ 'పర్యవేక్షణ' అర్థమును సూచించును.) బ్రాహ్మణునకు విధించిన షట్కర్మలలో మొదటిది

అధ్యయనము. ఇక మిగిలినవి అధ్యాపనము, యజనము, యాజనము, దానము ప్రతిగ్రహములు.

"అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా,
దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానా మకల్పయత్.

అని, మను ధర్మశాస్త్రము చెప్పును, "చదువుట, చదివించుట; మంచి పనులు చేయుట, చేయించుట; దానమిచ్చుట, ఇతరులిచ్చిన దానమును పుచ్చుకొనుట – ఈ ఆరును బ్రాహ్మణుడు చేయవలసిన పను" లని దీని అర్థము. అందుచే, ప్రతి దినము మంచి విషయములైన వేద శాస్త్రాది గ్రంథాధ్యయనము తప్పక చేయవలెను. ఇంకొకరికి సందేహము వచ్చినపుడు అడిగినచో నివృత్తి చేయవలెనన్నను, అప్పటికప్పుడు చెప్పగలిగి యుండవలెనన్నను తప్పనిసరిగా మస్తకములోనికి పుస్తకములోని విషయములన్నియు పొరపాటు లేకుండ ఎక్కవలెను. అందులకై నిత్యము అధ్యయనము చేయుట చాల మంచిదని చెప్పుట జరిగినది. ఇక్కడ "ప్రమదః" అనగా "ప్రమాదము" అను అర్థమును చెప్పుకొనరాదు. "ప్రమదః" అనగా 'పొరపాటు' అని చెప్పుకొనవలెను. "ప్రమాదో ధీమతా మపి" అనగా – 'బుద్ధిమంతులు కూడ పొరబడుటకు అవకాశము కలదు' అను అర్థములోనే ఈ ఆర్యోక్తి చెప్పబడినది. అధ్యయనము నుండి పొరబడరాదు అనగా అధ్యయనము మరువరాదనియు, అధ్యయనము చేయు పుస్తకములోని విషయములు చెప్పుటలో గాని, చేయించుటలో గాని పొరపాటు రాకూడదనియు అర్థములు చెప్పుకొనవచ్చును.

"ఆచార్యాయ... మావ్యవచ్ఛేత్సీః" విద్యనంతయు ఆచార్యుని వద్ద నేర్చుకొనిన తరువాత ఆచార్యునికి గురుదక్షిణగా ఏదైన ఈయవలెనని శిష్యునకు అనిపించినచో అప్పుడు గురువునకు ఇష్టమైనదేదైన తెచ్చి ఈయవలెను. ఆచార్యుడు నోరు తెఱచి అడుగరాదు. ఆచార్యుడు అడుగక పోయినను శిష్యుడు తెచ్చి యిచ్చుట తప్పుకాదు. ఆ విధముగా శిష్యుడిచ్చిన గురుదక్షిణను గురువు స్వీకరంచుట తప్పుకాదు.

బ్రహ్మచర్యాశ్రమములో విద్యపూర్తిగా నేర్చుకొనిన తరువాత శిష్యుడు గృహస్థాశ్రమములో అడుగు పెట్టవలెనను విషయము ఇక్కడ విచిత్రముగ చెప్పబడినది.

నాలుగు ఆశ్రమములలో గృహస్థాశ్రమము విశిష్టమైనది. మిగిలిన బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసాశ్రమముల వారు ఈ గృహస్థులపైననే తమ భోజనాదికములకు ఆధారపడియుందురు. "యథా మాతరమాశ్రిత్య సర్వే జీవన్తి జంతవః, తథా గృహస్థ మాశ్రిత్య సర్వేజీవన్తి మానవాః" అని మను ధర్మశాస్త్రము చెప్పును. సర్వ జంతువులును తల్లిని ఆశ్రయించుకొని బ్రతుకునట్లు సర్వ మానవులు గృహస్థును ఆశ్రయించుకొని బ్రతుకుదురని దీని అర్థము. ఈ గృహస్థాశ్రమములోనే స్వార్థ పూరితమైన ప్రేమ తన నుండి భార్యా బిడ్డలకు, అటుపైన తోటి వారికి, వారి పిల్లలకు విస్తరిల్లి విశ్వ ప్రేమ అలవడుట జరుగును. మరియు, పరంపరాగతముగా వచ్చుచున్న "సంతతి క్రమము అను తంతువును అనగా దారమును త్రుంచవద్దు" అను అర్థములో "ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః" అని చెప్పబడినది. "నా గురువు నుండి నేను వేదమును నేర్చుకొంటిని, నా నుండి నీవు నేర్చుకొంటివి, ఇక ఇంతటితో అనగా నీతో ఈ వేదవిద్య అంతము కారాదు. నీ నుండి నీ శిష్యునికి గాని లేదా పుత్రునకు గాని వేద విద్య సంక్రమించవలెను. కావున, నీవు అట్టి పుత్రుని పొందుటకై వివాహమాడి గృహస్థాశ్రమమును స్వీకరింపుము, మరియు, నీ తాతవలన మీ తండ్రికి శరీరమీయబడినది. నీ తండ్రివలన నీకు శరీర మీయబడినది. ఇక ఇటుపై నీతో ఈ క్రమము ఆగక నీవలన కూడ ఇంకొకరికి పుత్ర రూపములో శరీర మీయబడలెను" అని దీని అర్థము. అనగా విద్యా వ్యాప్తి క్రమమున కైనను, వంశాభివృద్ధి క్రమమునకైనను గృహస్థాశ్రమ స్వీకారము యొక్క ప్రాముఖ్యమును తెల్పు నుద్దేశ్యముతో – పరంపరాగతముగా వచ్చుచున్న విద్యావ్యాప్తి తంతువునకును, ప్రజాతంతువునకును అవాంతరము రానీయవలదని చెప్పబడినది.

'సత్యాసత్యనిర్ణయములోను; ధర్మాధర్మ నిర్ణయములోను; ధర్మ, సాధనకై ఉపయోగపడు శరీరము యొక్క రక్షణ విషయములోను లోక శ్రేయస్సు, మంగళకరమైన పనులను ఆచరించుటలోను; చదువుకొనుట, ఇతరులకు చెప్పుట అను విషయములోను – ఏ మాత్రము పొరపాటు రానీయకుము' అని ఆచార్యుడు చెప్పును. సత్యమును పలుకుట ధర్మమును ఆచరించుటలను గూర్చి ఇంతకు పూర్వమే చెప్పబడినది. 'ఇతరులు చెప్పువిషయములలోని సత్యాసత్యములను, చేయు

పనులలోని ధర్మాధర్మములను నిర్ణయించి తేల్చుకొనుటలో పొరపాటు పడకుము' అని ప్రస్తుతము చెప్పుకొనవలెన. "శరీర మాద్యమ్ ఖలు ధర్మసాధనమ్" అనగా "ధర్మసాధనమునకు శరీరము ముఖ్యము గదా లేదా ప్రథమము గదా" అని దీని అర్థము. "మంచి పనులు చేయుటకై అవసరమగు ఈ భౌతిక శరీరమును "ఇది పాడు శరీరము, ఇది అశాశ్వతము' అను మెట్ట వేదాంత వచనములు పలుకక, అట్టి శరీర రక్షణకై, ఆరోగ్య విషయమై ఎన్నడును ఏమరుపాటు గాని, పొరపాటు గాని రానీయకుము" అని చెప్పబడినది. (ఈ మెట్ట వేదాంత వచనములు చెప్పుటకు కూడ మరల ఈ నాలుకతో కూడిన శరీరమే కావలెను కదా!) ' ఏ విధమైన పనిచేసినను లోకహితార్థము, లోక కళ్యాణార్థము చేయుమని చెప్పును. 'లోకము' అనునపుడు ఆ లోకములో పనిచేయువాడు గూడ కలిసియే ఉండును గాబట్టి లోక కళ్యాణము జరిగినపుడు పనిచేయు వానికి, వాని కుటుంబమునకు కూడ మంచి జరుగును. (Individual is a part of the Unverse. Therefore if benefit is done to the Universe the individual will also be benefited) దీనినే యజ్ఞార్థ కర్మ అందురు. 'చదువుకొనుటలోను, చదివినది ఇతరులకు చెప్పుటలోను పొరపాటు పడకుము' అని తరువాత చెప్పును. 'చదవినది ఒకటి, ఇతరులకు చెప్పునది మరియొకటి కారాదు. ఏ విధముగా ఆలోచించనను విషయములు వివరించుటలో గాని, వేద విద్యను ఇంకొకరిచే చదివించుటలో గాని, తను ఆచరించునది ఇంకొకరిచే ఆచరింప చేయుటలో గాని ఏ మాత్రము తేడా రాకుండ చూచుకొనుము' అని దీని అర్థము. అనగా... తనకు, ఇతరులకు కూడ ఒకే రకమైన విద్య, ధర్మము, న్యాయము వర్తింప చేయవలెనని అర్థము చెప్పుకొనవచ్చును.

గృహస్థాశ్రమమునందు చేయవలసిన దేవసంబంధ, కార్యములు, పితృ సంబంధ కార్యములు, చాలా ఉండును. దేవకార్యములనగా యజ్ఞయాగాది కర్మలు, పితృకర్మలనగా శ్రాద్ధాదికర్మలు. ఈ రెంటిని నియమ బద్ధముగా శ్రద్ధతో చేయవలెనని చెప్పును. దేవకార్యములు ఆచరించుట వలన తెలివి, బుద్ధి, ఓజస్సు, భ్రాజస్సు, సృజనాత్మకశక్తి పెంపొందును. పితృకర్మల వలన శౌచము, శారీరక దారుఢ్యము, వంశాభివృద్ధి మొదలైనవి పెంపొందును.

'మాతృదేవోభవ... అతిథిదేవోభవ" అనుటలో తల్లి, తండ్రి, గురువు అతిథి – వీరిని దైవములుగా భావించి, పూజించవలెనని నియమించబడినది. దైవములుగా భావించవలసిన వారిలో ఏ క్రమము పాటింపవలెనో కూడ తెలుపబడినది. ప్రప్రథమముగా తల్లిని దైవముగా పూజింపవలెను. అటు తరువాత తండ్రి, గురువు, అతిథి వచ్చుదురని ఇక్కడ చెప్పిన దానిని బట్టి గ్రహించవలెను.

'ఉపాధ్యాయాత్ దశాచార్య, ఆచార్యాణాం శతంపితా, సహస్రంతు పితౄన్మాతా, గౌరవేణాతిరచ్యతే' అనగా 'ఒక ఉపాధ్యాయునికిచ్చు గౌరవముకన్న 10 రెట్లు గౌరవము ఆచార్యుని పట్ల చూపవలెను. ఒక ఆచార్యునికిచ్చు గౌరవమునకు 100 రెట్లు గౌరవము తండ్రికి చూపవలెను. తండ్రికి ఇచ్చు గౌరవముకన్న 1000 రెట్లు ఎక్కువ గౌరవము తల్లిపట్ల చూపవలెను' అని ఈ శ్లోకము యొక్క భావము. ముందు చెప్పబడిన ప్రత్యక్ష దైవముల వరుస క్రమమును, ప్రాముఖ్యమును గూడ ఈ శ్లోకము తెలుపును. భారతదేశమున స్త్రీలకు అత్యున్నత స్థానము ఈయబడినదని ఈ క్రింది శ్లోకమును బట్టి తెలియును.

'యత్ర నార్యస్తు పూజ్యంతే – రమంతే తత్ర దేవతాః,
యత్రైతాస్తు న పూజ్యంతే – సర్వా స్తత్రాఫలాః క్రియాః.

ఈ శ్లోకములో 'స్త్రీలు పూజింపబడిన చోట లేదా గౌరవ భావముతో చూడబడిన చోట సకలదేవతలు సంతోషించి ప్రసన్నులగుదురు. తలపెట్టు కార్యములు సఫలములగును. స్త్రీలు ఎక్కడ గౌరవింపబడరో అక్కడ దేవతలయొక్క అనుగ్రహము లేక తలపెట్టిన కార్యములన్నియు నిష్ఫలములగును' అని స్త్రీల ప్రాముఖ్యము చెప్పబడినది. స్త్రీలలో కూడ మాతృమూర్తికి ప్రథమ స్థానము ఈయబడినది. జీవికి పుట్టుక నిచ్చినది, దేహము నిచ్చినది, పెంచినది కూడ తల్లియే. అట్టి తల్లిని ప్రథమ దైవముగా భావించుట సహేతుకము. కొడుకు సన్యాసమును స్వీకరించినపుడు అట్టి సన్యాసికడకు తండ్రి వచ్చినపుడు ఆ సన్యాసిరూపములో నున్న కొడుకునకు తండ్రియే నమస్కరించవలెను. కాని, తల్లి వచ్చినపుడు ఆ తల్లికి సన్యాసి రూపములో నున్న కొడుకు నమస్కరించుట తప్పుకాదు. సన్యాసియైన శంకరాచార్యుల వారు తల్లికి అపరకర్మలు చేసిన సంగతి గుర్తు

పెట్టుకొనవలెను. తల్లిని తిట్టువారు కలరు. అట్లు తిట్టుటకు కూడ తల్లి ఇచ్చిన శరీరము తప్ప వేరొక గతిలేదని మరువరాదు. దేవుడు లేడను సందేహము కలుగవచ్చునేమో కాని 'తల్లిలేదనువాడు తానే వుండడు' అని గుర్తించుకొనవలెను. అందువలన తల్లి యొక్క ప్రాముఖ్యము ఈ విధముగా ముందు చెప్పబడినది.

దేహము నిచ్చి పోషించిన తల్లి తరువాత శరీరరక్షణ, విద్యా బుద్ధులు చెప్పించుట, క్రమశిక్షణలో పెట్టుట చేసిన తండ్రిని రెండవ ప్రత్యక్ష దైవముగా భావించి, పూజించమని చెప్పబడినది. అటుపైన విద్యను చెప్పి, రెండవజన్మను ప్రసాదించిన ఆచార్యుని మూడవ ప్రత్యక్ష దైవముగా భావించి పూజించమని చెప్పబడినది. 'ఆచార్యుడు' అనగా ఉపాధ్యాయుడు మాత్రమే కాదు, ఉపాధ్యాయుడు క్రొత్త విషయములను తెలిపి, తెలియని విషయములను తేట పరచును. 'ప్రొఫెసర్' అను ఇంగ్లీషు పదమునకు 'ఆచార్యు'డని అనువదించుచున్నారు. అది తప్పు. ఆచార్యుడనగా తను చెప్పు విషయములను ఆచరించువాడు. ప్రాథమిక విద్యాలయములోని ఉపాధ్యాయుడైనను అన్ని విషయములు తెలిసి, ఇతరులకుచెప్పగలిగి, ఆ చెప్పిన వాటిని ఆచరించుచున్నచో ఆ ఉపాధ్యాయుడు గూడ ఆచార్యుడగును. నేటి విశ్వవిద్యాలయములలోని ప్రొఫెసర్లు చెప్పుదానికి ఆచరించు వాటికి సంబంధము ఉండనివారే ఎక్కువ. నిజముగా అట్టి ప్రొఫెసర్లు చెప్పునది ఆచరించుటయే జరిగినపుడు వారు గూడ ఆచార్యుడను పదమునకు అర్హులు. ఆచరణలేనివాడు ప్రొఫెసరు అవవచ్చునేమో గాని ఆచార్యుడని పిలిపించుకొనుటకు అనర్హుడు. అట్టి ఆచరణ పూర్వకమైన ఆచార్యుని చరణ కమల సేవనము చేయుమనుట చాల సముచితము, సమంజసము. మరియు, ఇట్టి ఆచార్యుని 'గురువు' అను పదముతో గూడ పిలువ వచ్చును.

> 'గు' కారో అంధకారస్తు, 'రు' కార స్తన్నిరోధకః,
> అంధకార నివృత్యాతు, గురు రిత్యభిధీయతే.

పై శ్లోకము 'గురు' పదమునకు వివరణ తెల్పును. 'గురు' పదము లోని "గు" కారము – గూడు కట్టుకొనిన అజ్ఞానాంధ కారమునకు ప్రతీక ఐనచో "రు"

కారము అట్టి అజ్ఞానాంధకారమును నిరోధించి, పారద్రోలి, జ్ఞాన ప్రకాశవంతము చేయుటకు ప్రతీక అని, ఈ విధముగా 'గురు' పదమును గూర్చి అర్థము చేసికొనవలెనని ఈ శ్లోక సారాంశము. మరియు 'ఈ గురువే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాత్మక స్వరూపము. సాక్షాత్తు పరబ్రహ్మ' అని కూడ భారతీయుల విశ్వాసము. అందుచేతనే.

'గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షా త్పరబ్రహ్మ, తస్మై శ్రీ గురవే నమః.

అని, గురుప్రార్థనను చేయుదురు. 'ఒక వేళ మనము తప్పుపని చేసినపుడు శివుడు కోపించినచో గురువు మనలను రక్షించుటకు నిలబడగలడు. కాని, గురువే కోపించినచో ఇంక ఎవరు ఆదుకొనగలరు ? అను అర్థములో -

'శివే రుష్టే గురుస్త్రాతా'
గురౌ రుష్టే న కశ్చన ?

అని అనుట కూడా గలదు. అందుచే ఆచార్యుని మూడవ ప్రత్యక్ష దైవముగా భావించి పూజించమని చెప్పబడినది.

భారతీయ సంప్రదాయములో అతిథి, అభ్యాగతులిద్దరును విష్ణుస్వరూపులే! అట్టివారిని దైవములుగా భావించి పూజించమని ఇక్కడ చెప్పబడినది. భగవానుడే మనపై కరుణకొలది మనింటిలో ఆతిథ్యమును స్వీకరించి మనలను తరింప చేయుటకు అతిథి రూపములో వచ్చు'నని భారతీయుల నమ్మకము. అతిథికి భోజనము పెట్టుట వలన మనజన్మ చరితార్థము ఐనదని భావించవలెను గాని, అతిథి మనకు ఋణపడినట్లు, కృతజ్ఞత తెలుపుకొనవలసిన అవసరము ఉన్నవానిగాను భావించరాదు. ఒకనికి అన్నము పెట్టినపుడు అన్నము పెట్టినట్లు గుర్తించుకొనరాదు. కాని, తిన్నవాడు ఆ విషయమును గుర్తించుకొనుట అతని సంస్కారమును తెలియ జేయును.

ఎంత పెద్దవారైనను ఎప్పుడైనను పొరపాటు చేయుట తటస్థింపవచ్చును. (To err is human) "ప్రమాదో ధీమతామపి" అనగా 'బుద్ధిమంతులు కూడ

పొరపాటు పడుటకు, చేయుటకు అవకాశము కలదు' అని దీని అర్థము. అందుచే అట్టి పెద్దవారు చేసిన ఆ పనులు కూడ నింద్యములే అగును. 'నింద్యములు కాని పనులనే నీవు చేయవలెను.ఇతరములు అనగా నింద్యములైన వాటిని నీవు చేయరాదనియు, ఈ విషయములో ఆచార్యుడు చేసిన పనులలో మంచి వాటినే చేయుమనియు, ఆచార్యుడైనను పొరపాటున చేయకూడని పనులు చేసినచో అటువంటి వాటిని చేయరాదనియు ఆచార్యుడే మొహమాటపడకుండ శిష్యునకు ఇక్కడ చెప్పుచున్నాడు.

ఎప్పుడైనను మన ఇంటికి మన కంటెను, మన ఆచార్యుని కంటెను శ్రేష్ఠమైన బ్రాహ్మణుడు వచ్చినపడు - ముందుగా నమ్రతతో, గౌరవపూర్వకముగా, కూర్చున్న ఆసనము నుండి లేచి, ఎదురేగి, తోడ్కొని వచ్చి, ఆసనములో కూర్చుండచేసి, ఆయన బడలిక తీరుటకు తగిన సపర్యలు చేయవలెను. అట్టి ఉత్తములకు ఏదైన సమర్పించవలెనని బుద్ధి కలిగినపుడు కడు శ్రద్ధాభక్తులతో సమర్పించవలెను. అశ్రద్ధ అవిధేయతను, ఉదాసీనతను నిర్లక్ష్యభావమును, వైముఖ్యమును పదవీ అధికారమదాంధత్వమును తెలియజేయును. అందుచేతనే "అశ్రద్ధయా అదేయమ్" అని చెప్పబడినది. మనకున్న సంపదను బట్టి, ఐశ్వర్యమును బట్టి సమర్పించవలెను, అంతేగాని తక్కువ ధనము కల్గిన వారు సమర్పించినట్లుగా సమర్పించరాదు. అనగా 'మన తాహతును బట్టి సమర్పించవలెను' అని అర్థము వచ్చుటకు "శ్రియాదేయమ్" అని చెప్పబడినది. ఇట్లు సమర్పించినపుడు - "నేను ఇంతే ఇచ్చుచున్నాను", అని సిగ్గుపడుచు, భగవంతుడు నాకు ఎక్కువ సంపదను అనుగ్రహించి ఉండినచో ఎక్కువ సమర్పించగల్గి వుండెడివాడను గదా' అని బిడియపడుచు సమర్పించవలెనను అర్థములో 'హ్రియాదేయమ్, భియాదేయమ్' - అని చెప్పబడినది. మరియు చిట్టచివరకు ఇచ్చెడిదెవరికో, అది ఏ విధముగా సద్వినియోగపడునో తెలుసుకొని సమర్పించుమను ఉద్దేశ్యముతో "సంవిదా దేయమ్" అని చెప్పబడినది.

ఎన్ని శాస్త్రములు చదివినను, ఎంతమంది పెద్దల ప్రసంగములు విన్నను, ఒక్కొక్కప్పుడు కర్మవిచికిత్స, అనగా - కర్మను గూర్చిన సందేహము గాని, వృత్త చికిత్స, అనగా - ప్రవర్తన, ఆచారముల విషయములో సందేహముగాని రావచ్చును.

అట్టి సందర్భములో కర్తవ్యనిర్వహణకు ఏమిచేయవలెనో ఇటుపై తెలుపుచున్నాడు. చక్కగా విమర్శించి విడమరచి, యుక్తమైన రీతిలో చెప్పగల సమర్థులును, ఇంకొకరు చెప్పకయే మంచిపనులు ఆచరించువారును, క్రూర స్వభావము లేని వారును, ధర్మము నందు ఆదరాభిమానములు కలవారును ఐన - బ్రాహ్మణులు - నీకు అందుబాటులో వున్నచో - నీవు సందేహపడు విషయములలో లేదా సందర్భములలో వారు ఏవిధముగా ఆచరించి, ప్రవర్తించుదురో నీవును ఆ విధముగా చేయుమని గురువు శిష్యునకు చెప్పును. ఇక్కడ అట్టి పెద్దలకు వాడిన విశేషములు చాల అవసరమైనవి. ఎంతో దూరములోనున్న పెద్దలనే ఆశ్రయించవలసిన పనిలేదు. అట్టి ప్రవర్తనాదులు కల్గినవారు దగ్గరలో అందుబాటులో ఉన్నచో వారినైనను అడగవచ్చును. వారు స్వయంప్రేరణచేతనే మంచి పనులు చేయువారుగా ఉండవలెను. క్రూర స్వభావమున్నచో - కోపము, క్రోధము కలిగి, ధర్మనిర్ణయమునకు అజ్ఞానపు పొర అడ్డువచ్చును. మరియు, వ్యక్తిగతమైన శత్రు భావమున్నపుడు కూడ ప్రతీకార వాంఛతో అధర్మమును చెప్పుటకూడ జరుగును. అందుచేతనే 'ధర్మమునందు ఆదరము కల్గిన వారు మాత్రమే' అను విశేషణము వేయబడినది. మరియు, ఒక్కొక్కప్పుడు దోషులని సంశయింపబడుచున్న వారి విషయములో కూడ ఏమి చేయవలెనను సందేహము రావచ్చును. అప్పుడు కూడ ఇంతకు పూర్వము చెప్పిన లక్షణములన్నియు కల్గిన బ్రాహ్మణులు - వారిపట్ల ఏ నిర్ణయము తీసుకుందురో అదే విధమైన నిర్ణయములు తీసుకొనుమని చెప్పును. అనగా 'చెప్పబడిన సల్లక్షణములు కల్గిన పెద్దల సలహాలు, నిర్ణయములు నీకు ఎల్లప్పుడును సన్మార్గమును చూపుటకు దోహదపడు గాక ! నీవును అట్టి వారి నిర్ణయమును స్వీకరించుటలో వెనుకాడక, మొహమాట పడకుందువు గాక ! అని దీని అర్థము.

'ఇంతవరకు నేను చెప్పినదంతయు నా ఆదేశముగా అనగా ఆజ్ఞగా, తీసుకొనుము' అని గురుభావముతో చెప్పి, "ఒక వేళ నీకు - విద్యనంతయు నేర్చిన తరువాత 'నన్ను ఇంకొకరు ఆజ్ఞాపించుటయా' అను భావము ఉన్నచో నేను చెప్పినదానిని ఉపదేశముగా అనగా సలహాగా తీసుకొనుము" (If you feel that it is too much to receive the order from me, take what all I have said as suggestion) అని, చాల మెత్తగా శిష్యుని యొక్క మంచిని కోరి చెప్పు

అర్థములో "ఏష ఆదేశః, ఏష ఉపదేశః "అను వాక్యములు విచిత్రమైన పద్ధతిలో ఈ సున్నితమైన ఉపనిషత్ మార్గములో చెప్పబడినవి. చిట్టచివరకు 'నేను ఇంతవరకు చెప్పినదంతయు వేదముల యొక్క సారాంశము. ఈ విధముగానే చేయుట, ఉపాసించుట మంచిది", అని శిష్యుని వాత్సల్యపూర్వకముగా వెన్నుతట్టి, భావిజీవితాశ్రమమైన గృహస్థాశ్రమమునకు పంపుట జరుగును.

ఈ అనుశాసనములో - 'మెట్ట వేదాంత విషయముగాక, ఆచరణ పూర్వకమైన, ఉపాసించదగిన విషయములను గురువు శిష్యునకు చెప్పు'నను మిషతో (నెపముతో) అందరికిని దైనందిన జీవితములో ఉపయోగపడు విషయములు ఈ శిక్షావల్లిలో చిట్టచివరకు చెప్పబడినవి.

***

## ఉత్తర శాంతి పాఠము

**మంత్రము :** *శం నో మిత్ర శ్శం వరుణః । శం నో భవ త్వర్యమా । శం న ఇంద్రో బృహస్పతిః । శం నో విష్ణు రురుక్రమః । నమో బ్రహ్మణే । నమ స్తే వాయో। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మావాదిషమ్ । ఋతమవాదిషమ్। సత్యమవాదిషమ్ । తన్మా మావీత్ । తద్వక్తారమావీత్ । ఆవీన్మామ్ । ఆవీద్వక్తారమ్। ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥*

**టీక :** ('శం నో మిత్ర శ్శం వరుణః' నుండి 'త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మాసి' అను మంత్రము వరకు పూర్వశాంతి పాఠములో తెలుపబడిన టీకను చూచుకొన వచ్చును. అటుపైన గల పదములకు టీక ఇవ్వబడును). త్వాం ఏవ = నిన్నే, ప్రత్యక్షం = ఎదుట కనపడు, బ్రహ్మ = బ్రహ్మమని, అవాదిషమ్ = పలికితిని, ఋతమ్ = ఋతముగా అనగా నిశ్చయాత్మకబుద్ధితో, అవాదిషమ్ = పలికితిని, సత్యమ్ = సత్యముగా, అవాదిషమ్ = పలికితిని, తత్ = అందుచే, మామ్ = నన్ను, ఆవీత్ = రక్షించెను, వక్తారం = ఆచార్యుని, ఆవీత్ = రక్షించెను, మామ్ = నన్ను, ఆవీత్ = రక్షించెను, వక్తారం = ఆచార్యుని, ఆవీత్ = రక్షించెను. ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః = తాపత్రయమునకు ఉపశమనము కలుగు గాక!

**తాత్పర్యము :** పూర్వశాంతి పాఠము నందు తాత్పర్యము, వివరణ పూర్తిగా ఈయబడినవి. ఇక్కడ కొన్ని క్రొత్త పదములు కలవు. అట్టి పదములకు మాత్రము తాత్పర్యము ఈయబడును పూర్వశాంతిపాఠములో 'బ్రహ్మవదిష్యామి' "ఋతం వదిష్యామి" అను భవిష్యత్కాల అర్థమును సూచించు పద ప్రయోగములు కలవు. ఇచ్చట 'బ్రహ్మావాదిషమ్' 'ఋతమవాదిషమ్' అను భూతకాల అర్థమును సూచించు పదప్రయోగములున్నవి. అందుచే తాత్పర్యము ఈ క్రొత్త పదములకు క్రింద తెలిపిన విధముగ మారును.

బ్రహ్మస్వరూపుడవగు ఓ వాయుదేవతా ! నిన్నే ప్రత్యక్ష బ్రహ్మగా చెప్పితిని. నిశ్చయాత్మక బుద్ధితో వచ్చు మాట రూపముగా నిన్నే చెప్పితిని. సత్యరూపమైన మాటగా నిన్నే చెప్పితిని. ఆ నీవు నన్ను రక్షించితివి. ఆచార్యుని రక్షించితివి. (అని రెండుమార్లు చెప్పును) మా ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆధిదైవిక తాప్రతయము శాంతింపబడుగాక!

**వివరణము :** పరబ్రహ్మ యొక్క అనుగ్రహము వలననే విఘ్నములు కలుగకుండ తన విద్యాభ్యాసమంతయు పూర్తి అయినదని విశ్వసించి, అందులకు కృతజ్ఞతాపూర్వకముగా – విద్యనేర్చుటకు ముందు తాను చేసిన ప్రార్థనాపూర్వక శాంతిపాఠమునే భూతకాలపద ప్రయోగములతో శిష్యుడు మరల ఈ ఉత్తర శాంతి పాఠమునందు చేయును. కావున, ఇంక వేరుగ వివరణము అవసరము లేదు.

**హరిః ఓం తత్సత్ ।**

శ్రీరస్తు

# తైత్తిరీయోపనిషత్తు

## ద్వితీయాధ్యాయము - బ్రహ్మావల్లి (ఆనందవల్లి)

## (టీకాతాత్పర్య వివరణములు)

### పూర్వ శాంతి పాఠము

*సహ నా వవతు । సహ నౌభునక్తు । సహ వీర్యం కర వావహై । తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ।*

**టీక :** సహనౌ = (గురుశిష్యులమైన) మా ఇద్దఱిని కూడ, (పరబ్రహ్మ) అవతు = సంరక్షించును గాక, సహనౌ = (గురుశిష్యుల మైన) మా ఇద్దఱిని కూడ, భునక్తు = అనుభవించి పాలించును గాక, సహ వీర్యం = కార్యదక్షత, సామర్థ్యమును గూడ, (కలిగి యుండి), కరవావహై = (పనులను) నిర్వర్తించెదము గాక, నౌ = మా యొక్క, అధీతం = అధ్యయనము చేయబడిన విద్య, తేజస్వి = తేజోవంతమైనది, అస్తు = అగుగాక, మా విద్విషావహై = (మా ఇరువురి మధ్య అనగా గురు శిష్యుల మధ్య) ద్వేషము కలుగకుండుగాక, ఓం శాన్తి, శ్శాన్తి, శ్శాన్తిః = ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయమునకు శాంతి కలుగుగాక !

**తాత్పర్యము :** (పరబ్రహ్మ) మా గురుశిష్యులిద్దఱిని సంరక్షించును గాక, (పరబ్రహ్మ) మా ఇరువురని అనుభవించి పరిపాలించును గాక. (మేమిద్దఱము) కార్యదక్షత, సామర్థ్యమును గూడ కలిగి యుండి, పనులను నిర్వర్తించెదము గాక, (మా ఇరువురి మధ్య) అభిప్రాయ భేద, ద్వేషాది భావముల కలుగకుండు గాక. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయమునకు శాంత్యోపశమనము కలుగుగాక !

**వివరణము :** ఇది ఒక చక్కని ప్రార్థన. విద్యారంగమున గురుశిష్యులు గాని, ఇద్దరు లేక ఇద్దరు మించి ఏదైన ఒక పనిని చేయుటకు ఉపక్రమించినపుడు గాని ఈ ప్రార్థన చేయుట చాల సమంజసముగాను, సార్థకముగాను ఉండును.

"సహ" అను పద ప్రయోగముచే పరమాత్మను ఏది కోరినను స్వార్థ బుద్ధితో గాక, తన తోటి వారికి కూడ తాను కోరినది అందవలెనను సదుద్దేశ్యము, సత్సంకల్పము, సహకార గుణము ద్యోతకమగును. 'సహనావవతు' అనగా 'సహ - నౌ - అవతు' అని పద విభాగము. మరియు, 'సహనౌ అవతు' అను వాక్యమును 'స', 'హ', నౌ, అవతు, అని విడదీసినచో మరింత వివరణ అవసరమగును. అనగా 'సహ' అను పదమును 'స', 'హ' అను అక్షరములుగా విడివిడిగా చదివినచో "ఈ 'స' 'హ' లు ఎవరు ? 'స' అను అక్షరము పురుషునకు, లేదా అయ్యవారికి, 'హ' అను అక్షరము ప్రకృతికి లేక అమ్మవారికి ప్రతీకలు. అందువలననే పురుష సూక్తము "సహస్రశీర్షా పురుషః ...." అని, "స" అను అక్షరముతో ప్రారంభింపబడును. అట్లే శ్రీ సూక్తము, (అమ్మవారి సూక్తము) "హిరణ్యవర్ణాం హరిణీమ్..." అని 'హ' అక్షర సంబంధమైన 'హి'తో ప్రారంభింపబడును. అనగా సమస్త విశ్వమునకు తల్లిదండ్రుల (Parents) వంటి వారును, ప్రజ్ఞ (Consciousness) పదార్థముల (Matter) వంటివారును, కేంద్రము (Centre), పరిధుల (Circumfernece వంటివారును, బీజ (Seed) - వృక్షముల (Tree) వంటివారును, ఉచ్ఛ్వాస నిశ్వాసముల వంటివారును అయిన - ఆదిదంపతులు మమ్ము రక్షించుగాక అని గూడ అర్థము వచ్చును.

ప్రతి వ్యక్తి యొక్క శ్వాసక్రియలో ఉచ్ఛ్వాసము నందు 'సో', నిశ్వాసము నందు'హం' అను ధ్వని పూర్వక అక్షరములు వినబడును. ఈ రెంటినీ 'సోఽహం' అను మంత్రముగా, మనలో నిరంతరము మన ప్రమేయము లేకపోయినను జరుగు అజపాగాయత్రీమంత్రముగా చెప్పుదురు. ఉచ్ఛ్వాసము - లీనమును (Involution), నిశ్వాసము - వ్యక్తమును (Evolution) తెలియజేయును. ఈ రెంటినీ జగత్తునకు తండ్రి - తల్లిగా, శివ - పార్వతులుగా భారతీయులు చెప్పుదురు. ఈ రెండక్షరముల 'సోహం' మంత్రమునే వామగతిగా చదివినచో 'హంసో' లేదా 'హంస' అగును. ఈ 'హంస' పక్షినే శరీర గృహమునకు యజమానియైన జీవునిగా చెప్పుదురు. తల్లిదండ్రులకు ప్రతీకలైన 'హం' 'సో' ల కలయికతో జీవుడు వ్యక్తమగునని సూచితము. కాబట్టి 'సహ నౌ అవతు' అనునపుడు 'జగజ్జననీ జనకులు మమ్ము రక్షించు గాక' అని ప్రప్రథముగా ప్రార్థన చేయబడినది.

"సహ" అను పదమునకు మరియొక అర్థమును చెప్పుకొనవచ్చును. 'సహ' అనునపుడు సహకారమును ధ్వనింప జేయును. ఈ 'సహకారము' మమ్ము రక్షించుకాక అను అర్థము వచ్చును. సహకార పదమేట్లేర్పడినది ? 'స' - ఉచ్ఛ్వాసమునకు, 'హ' - నిశ్వాసమునకు సంబంధించిన అక్షరములుగా ఇంతకు పూర్వము చెప్పబడినవి. పొరపాటు పడక నిరంతరము జరుగు ఈ ఉచ్ఛ్వాస, నిశ్వాసముల మధ్యనుండు సమన్వయ సంబంధమును 'సహకార' మందురు. ఈ సహకారము వలననే గదా జీవి బ్రతికి బట్టకట్ట గలుగునది. కావున, మన బ్రతుకునకు, రక్షణకు మొదటి సహకారము - ఈ ఉచ్ఛ్వాస, నిశ్వాసముల మధ్య ఉన్నది. అందుచే 'ఉచ్ఛ్వాస, నిశ్వాసల మధ్యనుండు సహకారమెట్లుండునో - అట్టి సహకారము మామధ్య (గురుశిష్యుల మధ్య) వర్తించి, మమ్ము రక్షించుగాక!' అని అర్థము అనగా 'మేము ఎన్నడును విడిపోకుండ ఉందుముగాక' (విడిపోకుండుట మానసికముగా అని గురుశిష్యుల పట్ల అర్థము చేసికొనవలెను) అని ప్రథమముగా విద్యారంభమున శిష్యునిచే ప్రార్థన చేయబడినది.

ముందుగా "అవతు" అనుటలో రక్షణ విషయము చెప్పబడినది. బ్రతికి బట్టకట్టినపుడే గదా ఏదైన చేయుట. అందుచే, ముందుగా మేము రక్షింపబడుదుము గాక' అని చెప్పబడినది. లేదా, ఇరువురిలో నున్నవాడు మా ఇద్దతిని రక్షించుగాక' అను అర్థమును కూడా చెప్పుకొనవచ్చును.

తరువాత "భునక్తు" అనుటలో అనుభవ విషయము చెప్పబడినది. అనుభవించుటను 'సాకుట లేదా పోషించుట' అను అర్థములో - 'పోషింప బడుటలోను, జీవితములో పొందు అనుభూతి విషయములోను మా ఇద్దతిలో నున్నవాడు ఒకే విధముగా ఇద్దతిని పోషించి, అనుభవించి, జీవించును గాక, ' అని చెప్పుకొనవలెను. ఇద్దతి మనస్సులు విడివిడిగా కాక ఇరువురి మధ్యన, ఇరువురిలోను ఉన్న వాని మనస్సు వర్తించి, వర్ధిల్లు(దుము) గాక" అని గూఢార్థము.

"సహవీర్యం కరవావహై" అనుటలో 'మా ఇద్దతిలోని పరమాత్మ వీర్యము చేతనే మా కర్మలు నిర్వహింపబడుగాక' అని చెప్పుకొనవలెను. ఇక్కడ వీర్యము

అనగా ఏ పని చేయుటకైనను కావలసిన చురుకుదనము, ప్రయత్నము, దక్షత, సామర్థ్యము అను అర్థములుగా గ్రహించవలెను.

"తేజస్వి నౌ అధీతం అస్తు" అనుటలో 'ఇద్దఱినీ వ్యక్తపరచు ఆ ఒకే తేజస్సు మా ఇద్దఱి చేత అధ్యయనమును చేయించుగాక', లేదా మాచే 'ఆ తేజస్సు అధ్యయనము చేయబడుగాక" అని గూడ అర్థము చేసుకొనవలెను.

"మా విద్విషావహై" అనుటలో మా ఇద్దఱి మధ్య ద్వేషభావము లేక ఒకే అభిప్రాయము వర్తించి ఏకమతము అనగా - ఐకమత్యము (మతము అనగా అభిప్రాయము. ఏకమతమునకు తద్ధిత రూపము ఐకమత్యము) వర్ధిల్లుగాక అని అర్థము చెప్పుకొనవలెను.

ఈ విధముగా ఇద్దఱి మధ్య కలుగవలసినవి కలిగి, తొలగివలసిన ఆధిభౌతిక, ఆధ్యాత్మిక, ఆధిదైవిక తాపత్రయము తొలగి, శాంతి వర్ధిల్లుగాక' అనుటతో ఈ సంప్రార్థనము ముగియును.

*****

**మంత్రము :** *బ్రహ్మవిదాప్నోతి పరమ్ । తదేషాఽభ్యుక్తా । సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ । యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్ । సోఽశ్నుతే సర్వా న్కామా న్సహ । బ్రహ్మణా విపశ్చి తేతి । తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః। ఆకాశా ద్వాయుః । వాయో రగ్నిః । అగ్నేరాపః । అద్భ్యః పృథివీ । పృథివ్యా ఓషధయః । ఓషధీభ్యోఽన్నమ్ । అన్నాత్పురుషః । స వా ఏష పురుషోఽన్న రస మయః । తస్యేద మేవ శిరః । అయం దక్షిణః పక్షః । అయముత్తరః పక్షః । అయ మాత్మా । ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ।* (1)

**టీక :** బ్రహ్మవిత్ + ఆప్నోతి + పరమ్ = బ్రహ్మవిదాప్నోతి పరమ్ = బ్రహ్మను తెలిసినవాడు ఆ పరబ్రహ్మనే పొందుచున్నాడు. తత్ + ఏషా + అభి + ఉక్తా = తదేషాభుక్తా = ఆ విషయమును గూర్చి ఈ మంత్రము చెప్పబడినది, సత్యం - జ్ఞానం - అనంతంబ్రహ్మ = సత్యమనియు, జ్ఞానమనియు, అనంత

మనియు ఈ బ్రహ్మను, యః = ఎవ్వడు, గుహాయాం = హృదయమను గుహ యందలి, పరమేవ్యోమన్ = అతి శ్రేష్ఠమైన దహరాకాశము నందు, నిహితం = ఉన్న (వానిగా), వేద = తెలుసుకొనునో, సః = వాడు, సర్వాన్ కామాన్ అన్ని కోరికలను, విపశ్చితా బ్రహ్మణా = బ్రహ్మను తెలిసిన ఆత్మ స్వరూపముతో, సః అశ్నుతే = ఒక్కసారిగా అనుభవించుచున్నాడు, తస్మాత్ = ఆ, ఏతస్మాత్ = ఈ, ఆత్మనః = ఆత్మ నుండి, ఆకాశః =ఆకాశము, సంభూతః = చక్కగా పుట్టెను, ఆకాశాత్ = ఆకాశము నుండి, వాయుః = వాయువు, వాయోః = వాయువు వల్ల నుండి, అగ్నిః = అగ్ని, అగ్నేః = అగ్నివల్లనుండి, పృథివీ = భూమి, పృథివ్యాః = భూమివల్ల నుండి, ఓషధయః = ఓషధులు, ఓషధీభ్యః = ఓషధుల నుండి, అన్నమ్ = అన్నము, అన్నాత్ = అన్నము వల్ల నుండి, పురుషః = పురుషుడు, అన్నరసమయః = అన్నరసమయునిగా (ఉండు), తస్య = ఆ పురుషునకు, ఇదం ఏవశిరః = ఈ శిరస్సే ఆ శిరస్సు, అయం దక్షిణః పక్షః = ఈ కుడిచేయి దక్షిణ పక్షము, అయం ఉత్తరః పక్షః = ఈ ఎడమ చేయి ఉత్తర పక్షము, అయం ఆత్మా = ఈ మధ్యనుండునది ఆత్మ, ఇదం పుచ్ఛం = ఈ తోక, ప్రతిష్ఠా = ప్రతిష్ఠ, తత్ + అపి = ఆ విషయమును గూర్చి, ఏషశ్లోకః = ఈ చెప్పుశ్లోకము, భవతి = అగుచున్నది.

**తాత్పర్యము :** బ్రహ్మను తెలిసినవాడు ఆ బ్రహ్మనే పొందుచున్నాడను విషయము గూర్చి ఈ మంత్రము చెప్పబడినది. అట్టి బ్రహ్మ - సత్యము, జ్ఞానము, అనంతమని, హృదయ దహరాకాశమునందు ఉన్నట్టి ఆత్మయేనని ఎవరు తెలుసుకొనునో వాడు తాను తెలిసిన జ్ఞానముతో సకల మనోరథములను ఒక్కసారే అనుభవించును. ఈ ఆత్మవల్ల నుండి ఆకాశము, ఆకాశము ద్వారా వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని వలన జలములు, జలముల నుండి పృథివి, పృథివి నుండి ఓషధులు, ఓషధుల నుండి అన్నము, అన్నము వల్ల నుండి పురుషుడు పుట్టును. ఆ పురుషుడు అన్న రసవికారము కలవాడు. ఆ పురుషునకు ఈ శిరస్సే శిరస్సు, ఈ కుడిచేయి దక్షిణ పక్షము, ఈ ఎడమ చేయి ఉత్తర పక్షము. ఈ మధ్యన ఉన్నది ఆత్మ, ఈ కనబడునది తోకవలె నుండి ప్రతిష్ఠను పొందుచున్నాడు. ఈ విషయములను గూర్చి ఈ మంత్రము చెప్పుచున్నది.

**వివరణము :** బాగుగా కాలిన పెనము పైన ఉన్న నీటి బిందువు ఏ విధముగా తన నామరూపములను పూర్తిగా పోగొట్టుకొని విశాలాకాశములోనికి లీనమగునో - అదే విధముగా బ్రహ్మవేత్త దేహమును విడిచినపుడు బ్రహ్మను పొందును. ఆ విధముగా పరమాత్మను పొందిన బ్రహ్మవేత్త తన వ్యక్తిగత అస్తిత్వమును ఆ పరమాత్మయందు కలిగి యుండునా ?' అని సందేహము రావచ్చును. కలిగి యుండదనియే సమాధానము. ఎందువల్లననగా - ఘటము బ్రద్ధలైనపుడు ఘటములోని చోటు బయట చోటులో లీనమగును. లీనమైన తరువాత ఘటమునకు 'తన చోటు' అని బరిగీసినట్లు వేరుగా బయట చోటులో వుండదు. నదులన్నియు వేరు వేరుగా ఉన్నపుడు వాటి యందలి నీరు ఇది గంగ, ఇది గోదావరి, ఇది కృష్ణ అని ఉండును. కాని, అవి అన్నియు సముద్రములో లీనమైనపుడు ఆ సముద్రములో ఈ మేరకు గంగ, ఈ మేరకు, గోదావరి, ఈ మేరకు కృష్ణ అని వుండదు. వాటి నామరూపములను పొగోట్టుకొని అన్నియు 'సముద్రము' అను పేరుతోనే పిలువబడును. వేసవి కాలములో నదులలోని నీరు ఇగిరి నీటియావిరియై మేఘములుగా మారినపుడు ఆ మేఘమునందు వాటి నామ రూపములను పోగొట్టుకొని ఆ మేఘము వర్షించినపుడు - గంగోత్రిలో పడిన మేఘపు నీరు మరల గంగాజలమని, నాసిక్ వద్ద పడిన నీరు గోదావరి అని, పడమటి కనుమలలో మహాబలేశ్వరము వద్ద పడిన నీరు కృష్ణ అని మరల వేరు వేరు పేర్లను పొందుట జరుగును. ఈ ఉదాహరణలను బట్టి బ్రహ్మవేత్త బ్రహ్మను పొందినపుడు ఆ బ్రహ్మయందు తన వ్యక్తిగత అస్తిత్వమును వేరుగా కలిగి యుండదని నిర్ధారణ అగుచున్నది.

ఈ బ్రహ్మమే సత్యము, జ్ఞానము, అనంతము అని అనుభూతిని పొందిన వాడు సర్వమును తెలిసినవాడగును. అనగా 'బ్రహ్మ - శాశ్వతుడు, నిత్యుడు, సనాతనుడు' అని తెలియవలెను. నిజమైన అస్తిత్వమును కలిగినదే - 'సత్యము'. మనము తెలసికొనుచు పోయి దేనియందు లీనమగుదుమో, అది 'జ్ఞానము', ఆద్యంతములు లేక ఎల్లప్పుడును ఉండుటయే గుణముగా కల్గుట -'అనంతము'. ఈ మూడు లక్షణములు చెల్లువాడు బ్రహ్మ. ఈ లక్షణములు చెల్లునది ఒకటి

గలదు. అదియే చోటు. మనలో గూడ హృదయమునందు ఈ చోటు గలదు. అందుచేతనే గుండెకాయలోని దహరాకాశమును హృదయకేంద్రముగను, ఆత్మకు స్థానముగను సమన్వయము చేయుదురు. 1. చోటులో ఇల్లు కట్టిన తరువాత ఇంటిగదిలో గూడ చోటు ఉండును. ఇల్లు పడిపోయినపుడు ఇంటిలోని చోటు చనిపోదు, బైటచోటులో లీనమగును. అందుచే ఈ చోటు యొక్క అస్తిత్వము సత్యము 2. గదిలోని చోటు బైటచోటులో లీనమగునని తెలియుటయే జ్ఞానము. 3. ఎన్ని జీవులు పుట్టినను, గిట్టినను తనలో (చోటులో) మార్పు ఉండక ఆద్యంత, వృద్ధిక్షయములు లేనిదై ఉండుట – అనంతత్వము. కావున, చోటు బ్రహ్మవంటిదని, బ్రహ్మకు ప్రతీక అని తెలిసికొనవలెను. ఇది తెలిసినవాడు అవసరమగు వానిని తన ప్రమేయము లేకుండగనే అనుభవించగల్గిన వాడగును. తన ప్రమేయము లేకుండ అనగా కావాలనుట, తిరస్కరించుటలతో సంబంధము లేకపోవుట. ఎందువల్లననగా కావాలనుకొనుట ఎంత మమకారభావమో అక్కరలేదని తిరస్కరించుట కూడా అంత అహంకార భావమును తెల్పును.

"యదృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే."

అని గీతాశాస్త్రము చెప్పును. కావున, ప్రాప్తించిన వాటికి సంతుష్టిని పొందువానికి అర్హతను బట్టి వానికి కావలసినవి వాటంతట అవి ఏర్పాటై కర్మబంధ మంటదు.

ఈ మంత్రములో పరమాత్మ నుండి జీవాత్మ ఎట్లు పుట్టుచున్నాడో సృష్టి క్రమ విధానముతో సమన్వయ పరచి వివరణ ఇవ్వబడినది. బృహ్మణత్త్వము అనగా విచ్చుకొను తత్త్వము గల ఆత్మ నుండి ఆకాశము, ఆకాశము వలన వాయువు, వాయువు వలన అగ్ని, అగ్ని వలన జలములు, జలము వలన పృథివి, పృథివి నుండి ఓషధులు, ఓషధుల నుండి అన్నము, ఆ అన్నమును తినుట నుండి జీవుడు ఉత్పత్తి అగుచున్నాడని క్రమము చెప్పబడినది. ఇది చాల అర్థవంతమైన, శాస్త్రీయమైన వివరణ. మన భారతీయులు – 'మనకు కనిపించి, నిర్దేశింప వీలగు దానిని 'భూతము' (Element) అని నిర్వచించిరి. కనిపించి, నిర్దేశించుటకు వీలగునట్టి

భూతము ఐదు స్థితులలో ఉండునని చెప్పిరి. 1. పృథివి (Solid) 2. ఆపస్సు (Liquid) 3. తేజస్సు లేదా అగ్ని (Illumination or Fire) 4. వాయువు (Gas) 5. ఆకాశము (Space). వీటి వరుస క్రమములో ఒక దాని కన్న ఒకటి సూక్ష్మము (Subtle). సృష్టి ప్రక్రియ – సూక్ష్మము నుండి స్థూలమునకు జరుగును. అందుచే, ఆకాశము నుండి స్థితులు మారుచు ఘన పదార్థమైన పృథివి ఏర్పడినదని, దాని నుండి పుట్టు ఓషధులను, అన్నమును తినుటచే పురుషుడు పుట్టి, పెరుగుచున్నాడని చెప్పబడినది. ఈ పురుషుని ధ్యేయము 'తాను ఎక్కడనుండి వచ్చినాడో అక్కడకు చేరుట' అని తెలుసుకొనవలెను. నిజమునకు జరుగునది కూడా అదియే. దీనికి ఈ క్రింది ఉదాహరణము చెప్పుకొన వచ్చును.

ఒక వెలుగుచున్న క్రొవ్వొత్తిని గమనించినచో అట్టడుగున ఘనపదార్థపు మైనము, దానిపైన కరుగుచున్న ద్రవరూపములో నున్న మైనము, దానిపైన వెలుగురూపములో నున్న మైనము, దానిపైన వాయు రూపములో నున్న మైనము కనబడి, ఆ వాయురూపములోని మైనము అంతకన్న పైన గల ఆకాశములో లీనమగుటను మనము చూచుచుందుము. అందుచే ద్రవ్యము మూడు స్థితులలో గాక ఈ ఐదు స్థితులలో ఉండునని భారతీయులు చెప్పుదురు. ఇది వారి విజ్ఞానమునకు నిదర్శనము. కంటితో చూడబడి, వ్రేలితో నిర్దేశింపవీలగు దానిని ద్రవ్యమని భారతీయులు చెప్పుదురు. ఈ నిర్వచనము ప్రకారము వెలుగు, చోట్లు గూడా ద్రవ్యము యొక్క సూక్ష్మతర, సూక్ష్మతమ స్థితులగును.

పదార్థమయుడుగా వ్యక్తమైన పురుషుని అన్నరసమయుడందురు. ఇక్కడ కొన్ని సమన్వయములు కలవు. అన్నరస పురుషునికి మన దేహమునకు సమన్వయమును చెప్పుచు, దేహమునకు కనబడు ఈ శిరస్సే వాని శిరస్సనియు, ఈ దక్షిణపక్షమే (బాహువు) వాని దక్షిణ పక్షము లేదా ఱెక్క అనియు, ఈ వామపక్షమే వాని వామపక్షము లేదా ఱెక్క అనియు, ఈ మధ్య భాగమే వాని ఆత్మ అనియు, మన నాభికి దిగువ మిగిలిన భాగమే వాని తోక అనియు, ఒక పక్షి ఆకారముతో సమన్వయపరచి ఇక్కడ చెప్పబడినది. (జీవుని హంస పక్షితో పోల్చి చెప్పుట కూడ కలదు గదా!) పరబ్రహ్మ నుండి – పదార్థమయ జీవుడు వ్యక్తమగునపుడు సరిగా

బ్రహ్మ మాదిరి లేదా నమూనా (Model) గానే చిన్న పన్నాలో (Small scale) సాధ్యస్థితి (Potential state)లో వున్నవి సిద్ధస్థితి (Manifested state) లోనికి మారి, ఒక మచ్చు (sample) లేదా అచ్చు (Mould) రూపముగా వ్యక్తమగునదియే ఈ అన్నరసమయుని రూపము. అనగా కొలతలు తేడా వుండవచ్చునేమో గాని నమూనా ఒకటే అని అర్థము. బైబిల్ గ్రంథమునందు చెప్పిన 'God made the man in his own shape and form' అను వాక్యమును ఇక్కడ చెప్పిన ఉపనిషత్తు మంత్రములతో సమన్వయ పరచుకొనవలెను. ఇది మరియొక సమన్వయము.

'విశాలానంతాకాశమువలె ఉండు పరబ్రహ్మకు - వ్యక్తమైన చిన్న పదార్థమయ జీవుడు 'ఒక చెట్టుకు విత్తనము వలె లేదా ఒక కొన వలె నుండును' అని చెప్పుచు, ఈ అన్నమయాత్మక పదార్థమయ జీవుడు బ్రహ్మకు పుచ్ఛము లేదా తోక (Extension) అని గూడ గౌణార్థములో అనగా గుణవాచకముగా సమన్వయ పరచుకొనవచ్చును. చెట్టులోనున్నవే విత్తనములో గూడ చిన్న పన్నా (Small scale)లో - Law of Correspondences and Correlationను అనుసరించి ఉండునని సమన్వయము చేసుకొనవలెనను అర్థములో ఈ శిరస్సే ఆ శిరస్సు, ఈ దక్షిణ పక్షమే ఆ దక్షిణ పక్షము, మొదలైన అర్థములను తెలుపు 'తస్యేదమేవ శిరః', 'అయం దక్షిణః పక్షః!...' మొదలైన మంత్రములు ఈ అనువాకమునందు చెప్పబడినవి. ఇది మరియొక సమన్వయము.

'తనను పూర్తిగా అనుకరించి తనకు సరిపోవు నమూనాతో (Model) తన వ్యక్తమునకు తోక వలె, (Like an extension) కొస మెఱుపువలె నుండు ఈ అన్నమయాత్ముని వలన పరబ్రహ్మ సృష్టి స్పష్టముగా వ్యక్తమై ప్రతిష్ఠనొందుచున్నది' అను అర్థములో 'ఇదంపుచ్ఛం ప్రతిష్ఠా అని అనువాకాంతమునందు చెప్పబడినది.

**మంత్రము : *అన్నా ద్వై ప్రజాః ప్రజాయన్తే । యాః కాశ్చ పృథివీగ్ం శ్రితాః। అథో అన్నే నైవ జీవన్తి । అథైనదపి యన్త్యన్తతః । అన్నగ్ం హి భూతానాం జ్యేష్ఠమ్ । తస్మా త్సర్వౌషధ ముచ్యతే । సర్వంవై తేఽన్నమాప్నువన్తి । యేఽన్నం బ్రహ్మోపాసతే । అన్నగ్ం హి భూతానాం జ్యేష్ఠమ్ । తస్మాత్సర్వౌషధ ముచ్యతే ।***

**అన్నా ద్భూతాని జాయన్తే । జాతాన్యన్నేన వర్ధన్తే । అద్యతేఽత్తి చ భూతాని । తస్మాదన్నం తదుచ్యత ఇతి । తస్మాద్వా ఏతస్మా దన్నరసమయాత్ । అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః । తేనైషపూర్ణః । సవా ఏష పురుషవిధ ఏవ । తస్య పురుష విధతామ్। అన్వయం పురుష విధః । తస్య ప్రాణ ఏవ శిరః । వ్యానో దక్షిణః పక్షః । అపాన ఉత్తరః పక్షః । ఆకాశ ఆత్మా । పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ॥ (2)**

**టీక :** అన్నాత్ = అన్నమువలన, ప్రజా ః = ప్రజలు, ప్రజాయన్తే వై = పుట్టుచున్నారు గదా ! యాః + కాః + చ = ఏవైతే, పృథివీం = భూమిని, శ్రితాః = ఆశ్రయించి ఉన్నవో (అవి అన్నియు అన్నము వలన పుట్టుచున్నవి), అథో = ఇంకను, అన్నేన +ఏవ = అన్నము చేతనే, జీవన్తి = జీవించుచున్నవి, అథ = ఇంకను, ఏతత్ = ఈ అన్నము ననుసరించి, అపి = మరల, యంతి + అంతతః = (దాని లోనికి) లయమును పొందుచున్నవి, అన్నం = అన్నము, భూతానాం = జీవులలో, జ్యేష్ఠమ్ = ప్రధాన లేదా శ్రేష్ఠమైనది, తస్మాత్ = (అగుట) వలన, సర్వౌషధమ్ = అందరికిని మందు వంటిదని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, యే = ఎవరు, అన్నమ్ = అన్నమును, బ్రహ్మ = బ్రహ్మముగా, ఉపాసతే = ఉపాసించుచున్నారో, తే = వారు, సర్వమ్ = సకలమైన, అన్నమ్ = అన్నమును, ఆప్నువంతి = పొందుచున్నారు, అన్నమ్ = అన్నమే, భూతానాం = జీవులలోపల, జ్యేష్ఠమ్ హి = ముందు పుట్టినది, తస్మాత్ = (అగుట) వలన, సర్వౌషధమ్ = సర్వులకు ఔషధమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, యే = ఎవరు, అన్నమ్ = అన్నమును, బ్రహ్మ = బ్రహ్మముగా, ఉపాసతే = ఉపాసించుచున్నారో, తే = వారు, సర్వమ్ = సమస్తమును, ఆప్నువంతివై = పొందుచున్నారు గదా, అన్నాత్ = అన్నమువలన, భూతాని = ప్రాణులు, జాయంతే పుట్టుచున్నవి, జాతాని = (అట్లు) పుట్టినవి (ప్రాణులు), అన్నేన అన్నము చేతనే వర్ధంతే = వృద్ధి పొందుచున్నవి, అద్యతే = ఆ (అన్నము) భూతములచేత రక్షింపబడుచున్నది. భూతాని = జీవులను, అత్తిచ = (అన్నము) తినుచున్నది గూడ, తస్మాత్ = అందువలన, తదన్నం = అది అన్నమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, (ఇతి = ఈ విధముగా) తస్మాత్ = ఆ, ఏతస్మాత్ = ఈ, అన్నరసమయాత్ = అన్నరసమయమైన ఆత్మకంటె, అన్యః = ఇతరుడగు, ప్రాణమయః

= ప్రాణమయుడగు, అంతరః = భేదముగలవాడగు, ఆత్మా = ఆత్మ (కలదు), తేన = అట్టి ప్రాణమయ ఆత్మ చేత, ఏషః = ఈ అన్నరసమయ ఆత్మ, పూర్ణః = పరిపూర్ణుడగును, సః = ఆ, ఏషః = ఈ (ప్రాణమయాత్మ), పురుషవిధ ఏవ = పురుషాకారుడే, వై = కదా, తస్య = ఆ అన్నరసమయుని యొక్క, పురుష విధతామ్ = పురుష విధత్వమును, అను = అనుసరించియే, అయమ్ = ఈ ప్రాణమయాత్మ, పురుషవిధః = పురుషవిధుడగుచున్నాడు. తస్య = ఆ ప్రాణమయ పురుషునకు, ప్రాణఃఏవ = ప్రాణమే, శిరః = శిరస్సు, వ్యానః = వ్యాన వాయువు, దక్షిణః పక్షః = దక్షిణ బాహువు (ఱెక్క), అపానః = అపాన వాయువు, ఉత్తరః పక్షః = వామ బాహువు (ఱెక్క), ఆకాశః = సమాన వాయువు, ఆత్మా = మధ్యభాగము, పృథివీ = భూమి, ప్రతిష్ఠా = ప్రతిష్ఠాకరమగు, పుచ్ఛం = తోక, తదపి = ఆ విషయమును గూర్చి, ఏషః = ఈ చెప్పబోవునట్టి, శ్లోకః = శ్లోక మంత్రము, భవతి = అగుచున్నది.

**తాత్పర్యము :** అన్నము నుండి ప్రజలు పుట్టుచున్నారు. అంతేకాక, ఈ పృథివిని ఆశ్రయించిన వన్నియు అన్నము వల్ల నుండియే పుట్టుచున్నవి. ఆ విధముగా పుట్టినవన్నియు అన్నము చేతనే జీవింపబడుచు, చిట్టచివరకు అన్నము నందే లీనమైపోవుచున్నవి. అన్నము ప్రాణులకంటె ముందుది అగుటవలన, ప్రాణులు అన్నముతో వృద్ధి చెంది, చివరకు ఆ అన్నములోనికే లీనమగుట జరుగును. అందుచే సకల ప్రాణులకును అన్నము ఔషధము వంటిది. ఈ విధముగా అన్న బ్రహ్మమును ఉపాసించువారు అన్నజాతమును పొందెదరు. ఈ అన్నము - భూతముల కంటె జ్యేష్ఠము, శ్రేష్ఠము అగుటవలన సర్వౌషధమగుచున్నది, మరియు, భూతముల చేత భక్షింపబడుచున్నదికనుకను, భూతములను భక్షించుచున్నదికనుకను అన్నమని చెప్పబడుచున్నది. ఈ అన్నము కంటె భిన్నముగాను, వేరైనదగు ప్రాణమయమైన ఆత్మగలదు. ఆ ప్రాణమయాత్మ ఈ అన్నమయాత్మకు పరిపూరకమై పరిపూర్ణమగును. అందువలన శిరము, పక్షము, మధ్యము, పుచ్ఛములచేత పక్షి ఆకారము గల అన్నమయాత్మకుని వలెనే ఈ ప్రాణమయాత్మకుడు కూడా పురుషవిధుడై ఉన్నాడు. ఆ పురుషాకారుడైన ప్రాణమయాత్మునకు ప్రాణము - శిరస్సు, వ్యానము = దక్షిణ పక్షము, అపానము - ఉత్తర పక్షము; సమాన వాయువు - ఆత్మ; భూమి - తోక అగును. ఈ విషయమును గూర్చియే ఈ మంత్రము చెప్పుచున్నది.

**వివరణము :** 'ప్రజ' అనగా 'చక్కగా పుట్టినది' అని అర్థము. సృష్టి ప్రక్రియ (Creation) వేరు, ప్రజా సంసర్గము (Production) వేరు. సృష్టి ప్రక్రియలో భౌతిక పదార్థములు ఉండవలసిన పనిలేదు కాని, ప్రజాసంసర్గము నందు ఉండవలెను. సృష్టి - ప్రజ్ఞాత్మకము, ప్రజా సంసర్గము - ద్రవ్యాత్మకము. ద్రవ్యాత్మకమైనప్పుడే 'చక్కగా పుట్టుట' అను ప్రక్రియకు నిండు అర్థము చేకూరును. ప్రదర్శనకై ఒక నాటకమును వ్రాయగోరి, ఒక కవి కథను, పాత్రలను, పాత్రల స్వభావాదులను, సన్నివేశములను, అంకముల విభజనను, కథాంతమును ఊహించుకొనుటతో ఆ కవి మనస్సులో ఆ నాటకమునకు సృష్టి ప్రక్రియ పూర్తగును. ఆ విధముగా ఊహించిన వాటిని కాగితముపై వ్రాయగలిగి, ఆ నాటకము ప్రదర్శన జరిగినపుడు మాత్రమే ఆ నాటకమునకు ప్రజాసంసర్గ భాగము గూడ పూర్తగును. కాని, కాగితముపై వ్రాయుటకు కాగితము, సిరా, కలము మొదలైనవి లేనిచో ప్రదర్శనకు వీలవదు. ఆ విధముగా వీలవని స్థితిలో ఆ నాటకమునకు సృష్టి ప్రక్రియ మాత్రమే జరిగనదని తెలుసుకొనవలెను. అప్పుడు ఆ కవి మనస్సెంట్లుండునో ప్రజాసంసర్గము లేనిచో సృష్టికర్తకు గూడ అట్లే ఉండును. అనగా సృష్టి ప్రక్రియకు ప్రజాసంసర్గము తోడైనపుడు మాత్రమే సృష్టికి నిండుదనము చేకూరి పరిపూర్ణమగునని అర్థము.

స్థావర, జంగమాత్మకమగు ప్రజా సమూహము పూర్తిగా ద్రవ్యాత్మకము. సూక్ష్మము నుండి స్థూలమునకు జరుగు సృష్టి ప్రక్రియలో చిట్టచివరి స్థితి పృథివీతత్త్వమునకు సంబంధించినది. ఇది అన్నమయకోశమునకు సంబంధించినది. అందుచే ప్రజలు పుట్టుట గాని, పెరుగుట గాని, లీనమగుట గాని - అన్నము నుండి, అన్నము వలన, అన్నములోనికి జరుగునని తెలుసుకొనవలెను. భర్త అన్నము తిని, భార్య అన్నము తిని జీవించువారైనచో వారిద్దఱికిని అన్నమును తిను కొడుకే పుట్టును. ఇందువలననే "యాఃకాశ్చ పృథివీగ్ం శ్రితాః, అన్నాద్వై ప్రజాః ప్రజాయన్తే" అని చెప్పబడినది. అనగా 'పృథివిని ఆశ్రయించినవారు ఆ పృథివికి సంబంధించిన అన్నము వలననే పుట్టుచున్నారు' అని అర్థము. ఈ అన్నము రసాయనిక ధాతువులుగా మార్పు చెందుచు, చిట్టచివరకు శుక్రముగా మారును. దాని నుండి మరల ద్రవ్యాత్మకమగు ప్రజ పుట్టును. పంచభూతముల మధ్య సంబంధమును భార్యాభర్తల

మధ్య సంబంధముతో పోల్చి చెప్పవచ్చును. ఈ పంచభూతములలో ప్రతి క్రింది భూతము భార్య వంటిదైనచో, దాని ప్రక్కనే పైన వున్న భూతము భర్తవంటిదగును. ఉదాహరణకు - పృథివి భార్యవంటిదైనచో ఆపస్సు భర్తవంటిది. అనగా పృథివి - క్షేత్రమును సమకూర్చగా, ఆపస్సు - (శుక్రము) బీజమును సమకూర్చును. ఇట్లే ఆపస్సును భార్యగా సమన్వయ పరచినచో తేజస్సు భర్త అగును. మరియు, తేజస్సు భార్య ఐనపుడు వాయువును భర్తగాను, వాయువు భార్య ఐనపుడు ఆకాశమును భర్తగాను సమన్వయపరచుకొనవలెను.

అన్నము ప్రజలచేత తినబడుటచేతను, ప్రజలను అన్నము తినుట చేతను దానికి ఆ పేరు వచ్చినది. దప్పిక ఐనపుడు నీటిని మనము త్రాగుదుము. అట్లని నీటిలోనికి దూకినపుడు ఆ నీరే మనలను త్రాగును. అదేవిధముగా ఆకలి వేసినపుడు అన్నమును తిందుము. మితిమీరి తినినచో ఆ అన్నమే మనలను తినును. అందుచే, పుట్టుటకు పెరుగుటకు, చివరకు లీనమగుటకు కూడ ఈ అన్నమే కారణమగుచున్నది. అందువలననే సర్వభూతములకు అన్నము శ్రేష్ఠము, జ్యేష్ఠము ఐన ఔషధము వంటిదని చెప్పబడినది. ఓషధులు అనగా ఉషస్సు స్థానమును పొందబడినవని అర్థము. సూర్యకిరణములు తెల్లగా ఉండును. 'ఆ సూర్యకిరణములను గుఱ్ఱములతో పోల్చి, అవి చెట్ల ఆకులందు ప్రవేశించినపుడు, ఆ సూర్యుడు హరిదశ్వుడగుచున్నాడని' మహాసౌరము, ఆదిత్యహృదయము చెప్పును. అనగా ఇది 'కిరణజన్య సంయోగక్రియ (Photo synthesis)కు, ఆకులలో పచ్చదనమునకు కారణమైన పత్రహరితము (Chlorophyll) ఉత్పత్తి యగుటకు సంబంధించిన' శాస్త్ర సమన్వయము. ఇదే విధముగా సూర్యకిరణములు చంద్రునిపై పడి చంద్రుని నుండి పరావర్తనము చెంది సస్యములు, ఓషధులు పెంపొందింపబడుచున్నవి. ఇక్కడ కూడ ఓషధీపతి ఐన చంద్రుని వలన ఈ ప్రజా సంసర్గ ప్రక్రియ నెరవేర్చబడుచున్నది. ఇది కూడ అన్నమునకు సంబంధించిన ప్రక్రియయే !

ఒక స్థితికి ఇంకొక స్థితికి మధ్య గల సంధిని అన్నము అనుట ఎక్కువ శాస్త్రీయము. "సర్వం వైతే ఽన్న మాప్నువంతి" అనగా సర్వులు అన్నమును పొందుచున్నారు. ఆకలి అను దేవతను మృత్యువుతో సంకేతించుదురు. పెరుగుటకు

లేదా పెంపొందింపబడుటకు ఆకలి ఉండవలెను. ఆకలి ఉన్నపుడు మరియొకటి తినబడవలెను. ఈ తినబడుటను మృత్యువు అని ఇక్కడ సమన్వయ పరచినచో - 'సర్వులును అన్నమును తిని, అన్నమును పొందుచున్నారు' అనుటకు అర్థము చెల్లును. నిజమునకు అన్నమయ శరీరుడు అన్నమును తినుట జరుగుచున్నది. ఐనను ఈ రెంటిని 'మనిషి' - 'అన్నము' అని వేరు వేరు పదములతో చెప్పుచుందుము. ఆభరణములను ధరించు స్త్రీ గూడా బంగారముతో చేయబడినచో, ఆ బంగారు ఆభరణములను ధరించుటలో వ్యామోహపడదు. రెంటికిని భేదమున్నట్లు భ్రమ కల్గినపుడే ధరించుట జరుగును. ఈ భ్రమ కల్గునట్లు చేయునదియే మాయ. అదే విధముగా అన్నము వేరు, మనిషి వేరుగా ఈ మాయవలన భ్రమ చెందుదుము. కాని, నిజమునకు రెంటికిని సారతః భేదములేదని గుర్తించవలెను. అందుచేతనే దానిని 'తత్' అను పేరుతో పరబ్రహ్మముగా "తస్మాత్ అన్నం తదుచ్యత ఇతి" అని మంత్రము చెప్పుచున్నది. ఇటుపైన ఈ అన్నమయాత్మకునికన్న వేరుగా ప్రాణమయాత్మకుడు ఉండునని, ఈ రెండును పరస్పర పరిపూరకములని, అందుచేతనే ప్రాణమయాత్మకునికికూడ అన్నమయాత్మకునికి చెప్పినట్లుగనే శిరస్సు, దక్షిణ పక్షము, ఉత్తర పక్షము, ఆత్మ, పుచ్ఛము వరుసగా ప్రాణము, వ్యానము, అపానము, ఆకాశము, పృథివి అను సమన్వయము చెల్లునని చెప్పబడినది. ఈ సమన్వయమును జాగ్రత్తగా అర్థము చేసుకొనవలెను.

ప్రాణము చైతన్యాత్మకము. అనగా Activity ని తెలియజేయును. ప్రాణమయాత్మకు ప్రధానమైనది ఈ చైతన్యము కనుకనే ప్రాణమయాత్మకు ప్రాణము (Activity) శిరస్సుగా, అనగా - ప్రధానమైన అంగముగా గౌణార్థములో అనగా గుణవాచకముగా చెప్పబడినది. 'వ్యానము' అనగా వ్యాపింప జేయుటకు లేదా విస్తరింప జేయుటకు కారణమైన బలము. దీనినే అపకేంద్రబలము లేదా కేంద్రమునుండి పరిధి వైపునకు పనిచేయు బలము (Centrifugal force) లేదా 'అపకర్షణ' అందురని ఇంతకు పూర్వపు అనువాకములో చెప్పబడినది. అదే విధముగా అపానమనగా వికర్షించగలుగుటకు, లేదా విడవగలుగుటకు కారణమైన బలము. దీనినే 'వికర్షణ బలము' (Force of out going or repulsion or expul-

sion) అందురు. ప్రాణబలముతో ఈ వ్యాన, అపాన బలములు సహకరించినపుడు చైతన్యము పరిపూర్ణమగును. లేనిచో ఏకగతి మార్గముగా (One way traffic) ఉండును. అందువలన వ్యాన, అపానములు ప్రాణమయాత్మకునకు దక్షిణ, ఉత్తర పక్షములగా చెప్పబడినవి. పక్షము అనగా బాహువు, లేదా రెక్క, చేయి అను (Hand) అర్థములు చెప్పుకొనవచ్చును. ఈ పక్షమనునదిగూడ గౌణార్థములోనే వాడబడినది. ఉదా: పనిలోసహాయపడు వ్యక్తులలో ప్రముఖ పాత్ర వహించు ఇద్దరు వ్యక్తులను ఉద్దేశించి ఆ పనిని నిర్వర్తించువాడు - 'ఈ ఇద్దరును నాకు రెండు చేతులవలె పనిచేసిరి' అనునపుడు, 'సరస్వతీదేవికి సంగీతము, సాహిత్యము రెండు కన్నులు లేదా రెండు వక్షములు' అనునపుడు గూడ చేతులు, కన్నులు, వక్షములనునవి గౌణార్థములో చెప్పబడినవే గదా! ఆంగ్లభాషలో గూడ ఈ పద్ధతి గలదు. ఉదా: These two persons are right hand and left hand to me అనునపుడు, Prime Minister is the pillar of India అనునపుడు, Rose is the queen of the garden అనునపుడు గూడ right hand, left hand, pillar, queen అనుపదములు Metaphor అను రూపకాలంకారము (figure of speech)లో చెప్పబడినవి. ఈ ఉదాహరణలలోని భావమును అర్థము చేసుకొను విధముగానే - 'ప్రాణమయాత్మక పురుషునకు ప్రాణము - శిరస్సు, దక్షిణ పక్షము - వ్యానము, ఉత్తర పక్షము - అపానము, అనినపుడు గూడ అర్థము చేసుకొనవలెను.

శరీరములోని చైతన్యమునకంతకు హృదయస్పందన మాతృక అగును. ఈ హృదయస్పందనము (Pulsation) వలననే ఊపిరితిత్తుల సంకోచ, వ్యాకోచములు; శ్వాసలోని ఉచ్ఛ్వాస, నిశ్వాసములు మొదలగు చైతన్యాత్మక వ్యాపారములు మనలో జరుగుచున్నవి. ఆ హృదయములో నున్నవాడే హృదయ స్పందన చేయించుచున్నాడు. ఆ హృదయములో నున్నది 'దహరాకాశము గారు' (Sample space in heart) అనవచ్చును. బయట ఉన్న చోటునకు (space) స్పందించు గుణముండును. (Space pulsates అనునది శాస్త్రీయ సత్యము.) బయటచోటునకు హృదయములోని చోటు (దహరాకాశము) నమూనాయే (Sample) కాబట్టి, ఆ స్పందించు గుణము ఈ దహరాకాశమునకు గూడ వుండును. అందువలన చైతన్యాత్మకమైన ప్రాణమయ

పురుషునకు ఈ దహరాకాశమును 'నాథుడు' లేదా 'ఆత్మ' (Supreme superior) అను అర్థములో 'ఆకాశ – ఆత్మా' అని చెప్పబడినది.

ఈ ప్రాణమయాత్మునిపై ఆధారపడుచు, ఉచ్ఛ్వాసము జరుగునపుడు ఈ పృథివీతత్త్వ దేహమునందు పొట్టపైకి లేచుట, నిశ్వాసము జరుగునపుడు పొట్ట లోపలకు సంకోచించుట మొదలగు చైతన్యాత్మక వ్యాపారములు నిర్వర్తింపబడుచున్నవి. పక్షి తన ఇష్ట ప్రకారము తోకను త్రిప్పును. అనగా తోకకు స్వాతంత్ర్యము లేదు. అనగా, పక్షికి తోక ఎటువంటిదో ప్రాణమయాత్మునకు ఈ పృథివ్యాత్మక దేహము అటువంటిదను గౌణార్థములో, ప్రాణమయాత్మునకు 'పృథివీపుచ్ఛం' అని చెప్పబడినదన్నమాట. ఇక ప్రతిష్ఠ సంగతి. నిజమునకు ప్రాణము మీద ఆధారపడినదైనను, లోకములో అందరికిని కనిపించుటకు వీలుగా నుండి, 'అన్ని పనులను చేయుచున్నది ఈ దేహమే' అను భ్రాంతి కలిగించును. అయినను దానిని ప్రతిష్ఠగా అనగా తన గొప్పతనమే అను పేరు పొందునది – ఈ పృథివ్యాత్మక దేహమేనని ఈ 'పృథివీపుచ్ఛం ప్రతిష్ఠా' అను మంత్రము అనువాకాంతమునందు చెప్పబడినది.

**మంత్రము :** ***ప్రాణం దేవా అనుప్రాణన్తి । మనుష్యాః పశవశ్చయే । ప్రాణో హి భూతానా మాయుః। తస్మా థ్సర్వా యుష ముచ్యతే । సర్వమేవత ఆయు ర్యన్తి। యే ప్రాణం బ్రహ్మోపాసతే । ప్రాణో హి భూతానా మాయుః । తస్మా థ్సర్వాయుష ముచ్యత ఇతి । తస్యైష ఏవ శారీర ఆత్మా । అన్యోఽన్తర ఆత్మా మనోమయః । తేనైష పూర్ణః । సవా ఏష పురుష విధ ఏవ । తస్య పురుష విధతామ్ । అన్వయం పురుష విధః। తస్య యజు రేవ శిరః । ఋుగ్దక్షిణః పక్షః । సామోత్తరః పక్షః । ఆదేశ ఆత్మా। అథర్వాఙ్గిరసః పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ॥*** *(3)*

**టీక :** ప్రాణం = ప్రాణమును, దేవాః = శరీరమునునడుపు శక్తి దేవతలందఱూ, అనుప్రాణన్తి + (ఈ) ప్రాణము ననుసరించియే పనిచేయుదురు. యే మనుష్యాః = ఏ మనుష్యులు, పశవః = పశువులు (గలరో) (వారును ప్రాణము ననుసరించియే పనిచేయు చున్నారు). ప్రాణః = ప్రాణము, భూతానాం = జీవులకు,

ఆయుః = ఆయుర్దాయము లేదా జీవనము, తస్మాత్ = అందువలన, సర్వాయుషమ్ = అందరికిని జీవనమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, తస్యపూర్వస్య = ఇంతకుముందు చెప్పిన అన్నమయాత్మునకు, శారీరః = అన్నమయ శరీరము నందు పుట్టిన, యః ఏషః = ఏ ప్రాణమయుడు కలడో, సః = వాడే, ఆత్మా = ఆత్మ, తస్మాత్ ఏతస్మాత్ ప్రాణమయాత్ = ఆ ఈ ప్రాణమయాత్మకుని కంటె, అన్యః = వేరైన, మనోమయః ఆత్మా = మనోమయుడగు ఆత్మ, అంతర = లోపలవుండు వాడు (కలడు), తేన = ఆ మనోమయాత్మ చేత, ఏషః = ఈ ప్రాణమయాత్మ, పూర్ణః = పరిపూర్ణుడు, లేక పరిపూరకుడు, సః ఏషః = ఆ ఈ మనోమయాత్మ, పురుష విధః ఏవ = పురుషాకారము గలవాడే, తస్య పురుష విధతామ్ అను = ఆ ప్రాణమయాత్మ యొక్క పురుషాకారము ననుసరించి, అయం పురుష విధః = ఈ మనోమయాత్మ (కూడ) పురుషాకారము కలవాడు, తస్య = ఆ మనోమయాత్మకునకు, యజుః = యజస్సు, శిరః = శిరస్సు, ఋక్ = ఋక్కు, దక్షిణః పక్షః = దక్షిణ పక్షము, సామ = సామము, ఉత్తరః పక్షః = ఉత్తర పక్షము, ఆదేశః = అనగా విధి వ్రాత, ఆత్మా = ఆత్మ, అథర్వాంగి రసః = అథర్వాంగిరునిచే కనుగొనబడినది, (వానికి), పుచ్ఛం ప్రతిష్ఠా = తోకవలె ప్రతిష్ఠ చెందుచున్నది, తదప్యేష శ్లోకోభవతి = ఆ విషయమును గూర్చియే ఈ మంత్రము అగుచున్నది.

**తాత్పర్యము :** శరీరమునునడుపు శక్తిదేవతలందఱును ప్రాణమును అనుసరించియే పనిచేయుదురు. మనుష్యులు, పశువులు కూడా ఈ ప్రాణమును అనుసరించియే పనిచేయుచున్నారు. కావున, 'ప్రాణము సమస్త భూతములకును జీవన కారకము' అని చెప్పబడుచున్నది. అందుచే, పూర్వము చెప్పబడిన అన్నమయాత్మకు ఈ ప్రాణమయుడు ఆత్మ. ఈ ప్రాణమయునికన్న వేరైన మనో మయాత్మకుడుకూడ లోన కలదు. ఆ మనో మయాత్మకుని చేతనే ఈ ప్రాణమయుడు పరిపూర్ణుడగుచున్నాడు. ఈ మనోమయాత్మకుడు కూడ ప్రాణమయాత్మకుని వలెనే పురుషాకారము కలవాడు. ఆ మనోమయాత్మకునకు యజుర్వేదము – శిరస్సు; ఋగ్వేదము – దక్షిణ పక్షము; సామవేదము – ఉత్తర పక్షము; ఆదేశము – ఆత్మ; అథర్వాంగిరుడను మహర్షి చేత కనుగొనబడిన అథర్వణ వేదము ఈ మనో

మయాత్మకునకు తోక (Model or Sample) వలె ఉండి ప్రతిష్ఠాకరమగుచున్నది. ఈ విషయమును గూర్చియే ఈ మంత్రము చెప్పుచున్నది.

**వివరణము :** ఇంతకు పూర్వపు అనువాకములో అన్నమయాత్మకుని ప్రాముఖ్యము చెప్పబడినది. సమస్త భూతములకు అన్నము ఆధార భూతమని, సర్వౌషధమని చెప్పబడినది. ఈ అనువాకములో అంతకన్న మిన్న ఐనదియు, అన్నమయ పురుషుడు గూడ ఆధారపడి వుండునదియు నైన ప్రాణమయాత్మకుని గూర్చి చెప్పబడుచున్నది. పైకి చూచుటకు శరీరము కదులుచున్నదని అనిపించినప్పటికి, దానంతటది కదలలేదని, ఏదో ఒక శక్తి దీనిని నడిపించుచున్నదని పరిశీలన మీద తెలియును. నిజముగా శరీరమే దానంతటది కదలగలదన్నచో శవము కూడా కదలవలెను గదా! కాబట్టి, శరీరము దానంతటది కదులుటలేదు. శవమునకు - జీవికి తేడా ఏదైతే ఉన్నదో అది శరీరమును నడిపించుచున్నదని తెలుసుకొనవలెను. ఈ తేడాయే ప్రాణము, ప్రాణము యొక్క ఉనికి శ్వాసను బట్టి తెలియును. అందుచే శ్వాస ప్రాణమని సమన్వయపరచినచో ఈ ఉచ్ఛ్వాస, నిశ్వాసాత్మకమైన ప్రాణము వలననే శరీరము కదులుచున్నదని తెలియును. శరీరమునకు ఈప్రాణ ప్రదాత ఎవరు ? శరీరము రాగి తీగ వంటిది, ప్రాణము విద్యుత్తువంటిది. ప్రాణప్రదాత ఐన సూర్యుని చుట్టును అయస్కాంత ధర్మము గల భూమి తిరుగుచుండుటచే విద్యుదయస్కాంత ప్రేరణ (Electro magnetic induction) వలన మధ్యనున్న చోటులో విద్యుత్తు (Electricity) అను ప్రాణము (Vital Force) పుట్టును. దానిని భూమిపైన గల భూతములన్నియు స్వీకరించి ప్రాణులగును. 'సూర్యుడు' అను కట్టుగుంజచుట్టును భూమి మొదలైన గ్రహములు పశువుల వలె తిరుగుచుండుట వలననే ఈ గ్రహముల మీద ప్రాణులను 'పశువులు' అనుట కూడ జరిగినది. ఈ పశువులన్నిటికి ఈశుడు లేక పతి - 'పశుపతి' అని శైవపురాణము చెప్పును. అందుచేతనే "మనుష్యాః పశవశ్చయే" అను మంత్రములో "మనుష్యులు, పశువులు కూడ ఈ ప్రాణముపైననే ఆధారపడుచున్నారు. ఈ ప్రాణమే వారికి ఆయుర్దాయము, జీవనము," అని చెప్పబడినది. అందుచే, పూర్వము చెప్పిన అన్నమయాత్మక శరీరమునకు ప్రస్తుతము ప్రతిపాదించిన ప్రాణమయాత్మకుడు - ఆత్మ అని తెలుసుకొనవలెను.

మరల ఈ ప్రాణమయాత్ముని కంటె భిన్నమైన, మరింత సూక్ష్మముగా లోపల నుండు మనోమయాత్ముడు కలడు. ఆ మనోమయాత్ముని చేతనే ఈ ప్రాణమయాత్ముడు పరిపూర్ణుడగును. ఆ ప్రాణమయుని వలెనే ఈ మనోమయుడు కూడ పురుషాకారుడు. కాని, ఈ మనోమయునకు యజుర్వేదము – శిరస్సు, అని చెప్పబడినది. శిరస్సు (Brain) సంకల్పములకు కేంద్రము. యజుర్వేదము కూడ కర్మాచరణాత్మకము. కర్మలు సంకల్పముల ననుసరించి జరుగును కాబట్టి, మనోమయునకు శిరస్సు యజుర్వేదమని చెప్పబడినది. "ఋక్ దక్షిణ. పక్షః" అనగా దక్షిణ పక్షము 'ఋగ్వేదము' అని అర్థము. 'ఋక్' అనగా ఋకారము. గొంతులో స్పందనవలన పుట్టు రేఫము (Trill)ను 'ఋ' కారము అందురు. నాలుక చివర పుట్టు రేఫమును 'ర' కారమందురు. వాక్కునకు నాంది – ఈ మొదటి రేఫము అనగా ఋకారము (దీనినే 'రిషభము' అందురు. వృషభము యొక్క రంకె ధ్వనిలో ఈ 'రిషభము' ఉండునని సంగీతకారుల నిర్ణయము) ఈ ఋకార సహకారముతోనే ఏవాక్కైనను ఉచ్చరింపబడును. అందుచేతనే "వాగేవ ఋక్" అనిరి. ఇట్టిది దక్షిణ పక్షము కాగా, సామవేదము ఉత్తర పక్షమగును. వాస్తవమునకు రిషభము ఒక్కటియే అన్ని వాక్కులుగా వ్యక్తమవలేదు. శ్వాస దానికి జతపరుపబడినపుడు మిగిలిన అక్షరములన్నియు నాలుక, దంతములు, తాలువు, పెదవుల సహాయముతో ఉచ్చరింపబడును. కావున, ఏ అక్షరము వ్యక్తమగుటకైనను ఒక ప్రక్క రేఫము, రెండవ ప్రక్క శ్వాస జతపరుపబడవలెను. శ్వాసయే ప్రాణము. "ప్రాణః సామవేదః"అను దానిని బట్టి శ్వాస సామవేదమును సూచించును. అందుచే ఈ మనోమయాత్మకుని సంకల్పము వ్యక్తమగుటకు ఋక్సామలు దక్షిణ, ఉత్తర పక్షములవలె (ఱెక్కలవలె) వర్తించునవి గౌణార్థముగా సంకేతింపబడినవి.

'ఆదేశ ఆత్మా' అనగా 'ఈ విధముగా వ్యక్తమవవలెను' అను ఆదేశమే ఈ మనోమయునకు ఆత్మ అని అర్థము. దీనిని అర్థము చేసుకొనుట కష్టము. భూమి సూర్యుని చుట్టును ఎందుకు తిరుగుచున్నది ? ధర్మమునకు కట్టుబడి. పంచదార ఎందుకు తియ్యగా ఉన్నది ? 'తియ్యగా ఉండవలెను' అను సత్యమునకు కట్టుబడి. అనగా భూమిపట్లను, పంచదార పట్లను ఈ ధర్మము, సత్యములు ఆదేశములవంటివి. అందుచే వాటి ఆ యా ధర్మములకు అట్టి ఆదేశము 'ఆత్మ" అగును. అదేవిధముగా

మనోమయ పురుషునకు 'ఈ విధముగా ఉండవలెనని చెప్పు ఆదేశము' – ఆత్మ అగును. "అథర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా" – అథర్వాంగిరుడనగా అథర్వుడు. ఈ అథర్వుడు అథర్వణాత్మకుడు. అనగా అథర్వణ వేదము చేత సంకేతుడు. 'నిర్మాణము ఇట్లుండవలెను' అని చెప్పగా దాని ప్రకారము నిర్మాణమును జరుపువాడు అథర్వుడు. 'ఇట్లుండవలెను' అని చెప్పిన వాడు ముందు ఉండగా, ఆ ప్రకారముగా ఉండి చేయువాడు తరువాత ఉండును. అధికారి 'ఈ విధముగా' చేయవలెనని చెప్పగా, క్రింది ఉద్యోగి 'ఆ విధముగా' చేయును. అందుచే ముందుండు 'అధికారిపై ఈ ఉద్యోగి ఆధారపడి తరువాత ఎట్లుండునో, మనోమయ పరుషునకు ఈ అథర్వుడు ఆ విధముగా ఉండును' అను అర్థములో "అథ" (తరువాత) అను ఉపసర్గతో 'అథర్వుడు' అనుట జరిగినది. అనగా సంకల్పములు – ముందుగాను, ఆచరణలో వ్యక్తమగుట – ఆ తరువాతను జరుగును. కాబట్టి, సంకల్పుడు – మనస్సు అవగా, ఆచరణ – అథర్వుడగును. స్వతంత్రుడు కాకపోవుటచేతను, తరువాతి వాడు (sub-ordinate) అగుటచేతను ఈ అథర్వుని పుచ్ఛముతో అనగా తోకతో గౌణార్థముగా పోల్చిరి. ఈ అధర్వునినే 'అంగీరసుడు' అని కూడ అందురు. ఈ 'అథర్వ' పదము నుండి 'అథర్వణ' పదము పుట్టినది. దాని నుండి యజ్ఞములో 'అథర్వుడు' అను పేరు పుట్టినది. మనస్సులోని సంకల్పము అథర్వుని వలన కల్పలోకములో జరుగునపుడే సంకల్పమునకు ప్రతిష్ఠ చేకూరును కావున, 'అథర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా' అని చెప్పబడినది.

**మంత్రము : *యతో వాచో నివర్తంతే । అప్రాప్య మనసా సహ। ఆనందం బ్రహ్మణో విద్వాన్ । న బిభేతి కదాచనేతి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య। తస్మాద్వా ఏతస్మాన్మనోమయాత్ । అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః । తేనైష పూర్ణః సవా ఏష పురుషవిధ ఏవ । తస్య పురుష విధతామ్ । అన్వయం పురుష విధః। తస్య శ్రద్ధేవ శిరః । ఋతం దక్షిణః పక్షః । సత్యముత్తరః పక్షః । యోగ ఆత్మా।మహః పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ॥*** *(4)*

**టీక :** యతః = ఎవనివల్ల నుండి, వాచః = వాక్కులు, మనసా సహ = మనస్సుతో కూడ, అప్రాప్య = కూడి వుండక, నివర్తంతే = వెనుకకు తిరుగుచున్నవో

(అట్టి), బ్రహ్మణః = బ్రహ్మము యొక్క, ఆనందం = ఆనందమును, విద్వాన్ = ఉపాసించుచున్నవాడు, కదాచన = ఒకప్పుడును, నబిభేతి = భయపడడు, తస్య పూర్వస్య = ఇంతకు పూర్వము చెప్పిన ప్రాణమయాత్మునకు, శారీరః = ప్రాణమయ శరీరమునందు పుట్టిన, ఆత్మా ఏషః ఏవ = మనోమయాత్మ ఇతడే ! తస్మాత్ ఏతస్మాత్ మనోమయాత్ = ఆ ఈ మనోమయాత్మ కంటె, అన్యః = వేరైనట్టి, అంతరః ఆత్మా = లోపలనుండు ఆత్మ, విజ్ఞానమయః వై = విజ్ఞానమయుడు గదా, తేన = ఆ విజ్ఞానమయుని చేత, ఏషః = ఈ మనోమయాత్మ, పూర్ణః = పరిపూర్ణుడు, సః ఏషః = ఆ ఈ విజ్ఞానమయాత్మః, తస్య = ఆ మనోమయాత్మ యొక్క పురుష విధతామ్ = పురుష విధానమును, అను = అనుసరించి, పురుష విధః = పురుషవిధుడగుచున్నాడు, తస్య = ఆ విజ్ఞాన మయాత్మకు, శ్రద్ధా ఏవ శిరః = శ్రద్ధయే శిరస్సు, ఋతమ్ = ఋతము, దక్షిణః పక్షః = దక్షిణ పక్షము, సత్యమ్ = సత్యము, ఉత్తరః పక్షః = ఉత్తర పక్షము, యోగః = ఈ రెంటి కలయిక, ఆత్మా = ఆత్మ, మహః = మహత్తత్వము, పుచ్ఛం ప్రతిష్ఠా = తోకగా ప్రతిష్ఠ చెందుచున్నది, తదప్యేష శ్లోకోభవతి = ఆ విజ్ఞానమయుని గూర్చియే ఈ మంత్రము అగుచున్నది.

**తాత్పర్యము :** మనస్సుతో సహా వాక్కులు సైతము ఎవని నుండి వానిని పొందకయే వెనుకకు మరలుచున్నవో - అట్టి బ్రహ్మ యొక్క ఆనందమయ స్వరూపమును ఉపాసించు వానికి - దేనివలనను భయము లేదు. ఇంతకు పూర్వము చెప్పబడిన ప్రాణమయాత్మునకు ప్రాణమయ శరీరమునందు పుట్టినవాడు మనోమయాత్మ. మరియు, ఈ మనోమయాత్మకంటె వేరుగా విజ్ఞానమయాత్ముడు గూడ లోనగలడు. వానిచేతనే మనోమయుడు పరిపూర్ణుడగుచున్నాడు. ఈ మనోమయాత్మ పురుషాకార విధానమువలెనే ఈ విజ్ఞానమయుడు కూడ పురుష విధత్వమును పొందుచున్నాడు. అతనికి శ్రద్ధ - శిరస్సు, ఋతము - దక్షిణ పక్షము, సత్యము - ఉత్తర పక్షము, యోగము - ఆత్మ అగుచు, మహత్వము - తోకగా ప్రతిష్ఠ చెందుచున్నాడు ఆ విజ్ఞానమయుని గూర్చియే ఈ మంత్రము చెప్పుచున్నది.

**వివరణము :** ఇంతకు పూర్వపు అనువాకములో మనోమయ శరీరుని గూర్చి చెప్పబడినది. ప్రాణమయుని కంటె ఇతను పైవాడు. కారణమేమనగా ఉచ్ఛ్వాస, నిశ్వాసముల మీద ఆధారపడినది ప్రాణము కాగా, సంకల్పము మీద ఆధారపడినవి ఉచ్ఛ్వాస నిశ్వాసములు. జీవునికి శ్వాస ప్రాణకారణముకాగా, జీవుని ఉత్పత్తికి – తల్లిదండ్రుల 'దాంపత్యము వహించవలె'నన్న ఒకనాటి సంకల్పము కారణమగును. ఆ సంకల్పము వారి మనస్సుల నుండి పుట్టినది కాని వారి శ్వాసనుండి కాదు. అందుచే శ్వాస, దానిమీద ఆధారపడిన ప్రాణము ఈ రెండునూ – సంకల్పమునకు స్థానమైన మనస్సుమీద ఆధారపడినవే. అందుచే, 'ప్రాణమయుని కన్న మనోమయుడు మరింత సూక్ష్మమైన వాడు, మిన్న ఐనవాడు' అని చెప్పబడినది. ఈ అనువాకములో ఈ మనోమయుని కన్న, 'విజ్ఞానమయుడు' అను మరియొక పురుషుని ప్రతిపాదించుట జరుగును.

మనస్సును, వాక్కును కూడ చేరలేని, నిర్వచించలేని, ఒక వేళ చేరినను ప్రవేశింపలేక వెనుకకు తిరుగుచోట బ్రహ్మము యొక్క ఆనంద స్వరూపము ఉండును. దేనిని గురించి ఐనను చెప్పవలసీనపుడు గాని, వర్ణించవలసినపుడు గాని ఈ వాక్కు మనస్సులు కావలసి యుండును. కాని, ఆనందమును గూర్చి చెప్పవలసి వచ్చినపుడు ఈ రెండును పనికిరావు. ఇవి ఆనందము యొక్క పొలిమేరలకు వెళ్ళగలుగునేమో గాని లోనికి ప్రవేశించలేవు. అందుచే, ఇక్కడ 'యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ" అని చెప్పబడినది. దీనిని అర్థము చేసుకొనుటకు ఈ క్రింది ఉదాహరణను చెప్పుకొనవచ్చును.

"ఈ రోజు మీ ఇంటిలో ఏమి కూర" ? అని ప్రశ్నించగా "కాకర కాయ" అని ఒకడు సమాధానము చెప్పును. "కాకరకాయ ఎట్లుండును"? అని ప్రశ్నించగా రెండవవాడు వర్ణించును. "దాని రుచి ఎట్లుండును" ? అని మరల ప్రశ్నించగా "చేదుగా నుండును" అని రెండవవాడు సమాధానము చెప్పును. "అయినచో ఆ కూర నీకేల ఇష్టము ?" అని ప్రశ్నించినచో సమాధానము ఏదియు లేదు. "ఆ కూర నాకు ఇష్టము గనుక" అని ప్రశ్నయే సమాధానముగా చెప్పుకొనవలసిన స్థితి ఇది. ఇట్టి స్థితి వద్దనే అతనికి ఆ కూరవలన ఆనందము కలుగుచున్నది. అందుచే

దీనిని ఆనందమయ స్థితి అందురు. అట్టి ఆనందమయుని గూర్చి తరువాత అనువాకములో చెప్పబడును. అతనిని వాక్కులుగాని, మనస్సుగాని చేరలేక అనగా నిర్వచింపలేక, వెనుతిరుగును. అనగా ఇది - 'ప్రశ్నయే సమాధానముగా వెనుకకు మరలు చోటు' అని ఇక్కడ అర్థము చెప్పుకొనవలెను ఇట్టి ఆనందమయుని ఉపాసించువాడు దేనికిని భీతిచెందడు. విజ్ఞానమయకోశమునకు ఇటు - మనోమయుడు, అటు ఆనందమయుడు ఉండును. అనగా ఎరుగున్నవాటికి, అనుభూతికి మధ్య తెరవలె విజ్ఞానమయుడు ఉండును, జనన, మరణాతీత స్థితి యందు జీవించువాడు ఆనందమయుడుగా ఉండును. జననమైనను, మరణమైనను అతనిని బాధించవు. 'మరణమే బాధించనపుడు ఇంక దేనివల్ల భీతి చెందును ?' అను అర్థములో "న బిభేతికదాచ నేతి" అని చెప్పబడినది.

విజ్ఞానమయుడు మనోమయాత్ముని లోనే ఉండును. మనోమయాత్మునిలో నున్న, మనోమయాత్ముని కన్న భిన్నమైన విజ్ఞానమయాత్ముని చేత మనోమయుడు పరిపూర్ణుడగును. ఈ విజ్ఞానమయుడు గూడ ఆ మనోమయునివలెనే పురుష విధత్వమును పొందును. ఈ విజ్ఞానమయాత్మునకు శిరస్సు - శ్రద్ధ అని చెప్పబడినది. విజ్ఞానము అనగా విశేష జ్ఞానము. ఆ జ్ఞానము శ్రద్ధావంతునికే లభించును. (శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్ - గీత). ఎడతెగని ఏకాగ్రత, ఆసక్తులను శ్రద్ధ (Spirit of Constancy) అందురు. విజ్ఞానమయునికి శ్రద్ధ - శిరస్సు. అనగా 'విజ్ఞాన సముపార్జనకు శ్రద్ధ శిరస్సువలె ముఖ్యము అని అర్థము' (శ్రద్ద శిరస్సు వంటిది అని గుణవాచకముగా చెప్పబడినది). దక్షిణ పక్షము ఋతమనియు, ఉత్తర లేక వామపక్షము సత్యమనియు చెప్పబడినది. శాస్త్రానుసారము బుద్ధితో నిశ్చయింపబడిన విషయమును 'ఋత' మందురు. ఈ విధముగా చెప్పబడిన ఋతము వాక్కాయముల చేత అనుష్ఠితమైనచో దానిని సత్యమందురు. ఉదాహరణ : 'పంచదారలో ఈ ఈ అణువులు పరిమాణువులు కలిసి ఈ ఈ నిర్మాణములో ఉండుటచే పంచదార తియ్యగా నుండవలెను' అని శాస్త్రకారులు నిర్ధారించిన దానిని ఋతమందురు. పంచదారను నాలుకమీద వేసుకొని తియ్యగా నుండునని తెలుసుకొను విషయమును సత్యమందురు. ఈ ఋతము, సత్యములు విజ్ఞానమయునికి కుడి, ఎడమ పార్శ్వముల వంటివి. అనగా కుడి,

ఎడమ చేతులవంటివి అనగా చాల ముఖ్యము అని అర్థము. (మనము గూడ ఒక ముఖ్యుడు దూరమైనచో నా కుడిచేయి పోయినట్లుగా ఉన్నది అందుము. అనగా అంత ముఖ్యము అని అర్థము). ముఖ్యముగా విజ్ఞానమయునికి అటు సిద్ధాంతము ఇటు ప్రయోగము రెండును ముఖ్యము. ఇవి రెండును ఇచ్చట ఋతము, సత్యములతో పోల్చబడినవి. ఈ ఋతము, సత్యములను రెండు ఎద్దులను కొనినచో, ఆ రెండింటిని కాడికి కుడి, ఎడమల సంధించినచో అనగా యోగించినచో (అనగా జతచేసినచో) విజ్ఞాన పురుషుని జీవన యానము సాగును. అట్టి 'యోగము' విజ్ఞాన పురుషునికి 'ఆత్మ' వలె పనిచేయునని అర్థము. అందుచేతనే "యోగ ఆత్మా" అని చెప్పబడినది. ఎంతో శ్రద్ధతో, సత్యము చెడకుండా ప్రకృతి తన యందు అంతర్యామిని సౌందర్యవంతముగా వివిధ ఆకార, పుష్పపరిమళములతో అలంకరించుచున్నట్లు – విజ్ఞాన పురుషునికి ఆత్మజ్ఞాన సాధన కొఱకై శ్రద్ధా, సత్యములను యోగించిన విజ్ఞానమయుడు ఆత్మ జ్ఞానము సిద్ధించి మహాతేజస్వంతుడగును. ఆత్మజ్ఞానము సిద్ధించిన విజ్ఞానమయాత్ముడు నడుచుచుండగా అతని వెనుక అతని కీర్తి, తేజస్సు, గొప్పతనములు మహానుభావ లక్షణములుగా "మహః" అను గుణవిశేషములతో తోకవలె వెన్నంటి, పేరు ప్రక్కన డిగ్రీలు, బిరుదులు ఖ్యాతిని చేకూర్చునట్లు ప్రతిష్ఠను చేకూర్చునను అర్థములో 'మహః పుచ్ఛం ప్రతిష్ఠా' అను మంత్రము అనువాకాంతము నందు చెప్పబడినది.

**మంత్రము :** ***విజ్ఞాన యజ్ఞం తనుతే । కర్మాణి తను తేఽపిచ । విజ్ఞానం దేవా స్సర్వే । బ్రహ్మ జ్యేష్ఠ ముపాసతే । విజ్ఞానం బ్రహ్మ చేద్వేద । తస్మాచ్చేన్న ప్రమాద్యతి । శరీరే పాప్మనో హిత్వా । సర్వాన్కామా న్థ్సమశ్నుత ఇతి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య । తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞాన మయాత్ । అన్యోఽన్తర ఆత్మాఽఽనన్దమయః । తేనైష పూర్ణః। సవా ఏష పురుష విధ ఏవ । తస్య పురుష విధతామ్। అన్వయం పురుషవిధః। తస్యప్రియ మేవ శిరః । మోదో దక్షిణః పక్షః । ప్రమోద ఉత్తరః పక్షః । ఆనంద ఆత్మా । బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి॥***

**టీక :**విజ్ఞానం = విజ్ఞానము, యజ్ఞం తనుతే = యజ్ఞమును చేయుచున్నది, అపిచ = మరియు, కర్మాణి = విహిత కర్మలను, తనుతే = చేయుచున్నది, సర్వేదేవాః

= దేవతలందఱును, జ్యేష్ఠమ్ = పెద్దది ఐన, విజ్ఞానం బ్రహ్మ = విజ్ఞానమను బ్రహ్మమును, ఉపాసతే = ఉపాసించుచున్నారు, విజ్ఞానం బ్రహ్మ = విజ్ఞాన బ్రహ్మమును, వేదచేత్ = తెలిసికొని, తస్మాత్ = విజ్ఞాన బ్రహ్మమునుండి, న ప్రమాద్యతిచేత్ = పొరపాటుపడని యెడల, శరీరే = శరీరము నందు గల, పాప్మనః = పాపములను, హిత్వా = వదలి, సర్వాన్ కామాన్ = సమస్త కామములను, సమశ్నుతే = పొందుచున్నాడు, యః = ఏ విజ్ఞానమయుడు (ఇప్పుడు చెప్పబడినాడో) (సః = ఆ) ఏషః ఏవ = ఈ విజ్ఞానమయుడే, తస్య పూర్వస్య = వెనుక చెప్పబడిన మనోమయునకు, శారీరః = మనోమయ శరీరమందు పుట్టిన, ఆత్మా = ఆత్మ, తస్మాత్, ఏతస్మాత్ విజ్ఞానమయాత్ = ఆ ఈ విజ్ఞానమయుని కంటె, అన్యః = ఇతరుడగు, ఆనందమయః = ఆనందమయుడు, అంతరః = లోపల ఉండు వాడగు, ఆత్మా = ఆత్మ, తేన = చేత, ఏష పూర్ణః = ఈవిజ్ఞానమయుడు పరిపూర్ణుడగుచున్నాడు, స ఏషః = ఆ ఈ ఆనందమయుడు, పురుష విధః ఏవవై = పురుషాకారము గలవాడే అగుచున్నాడు, తస్య = ఆ విజ్ఞానమయునియొక్క, పురుష విధతామ్ అను = పురుషా కారత్వమును అనుసరించి, అయం = ఈ ఆనందమయుడును, పురుష విధః = పురుష విధత్వమును పొందుచున్నాడు, తస్య = ఆ ఆనందమయునకు, ప్రియం ఏవ = ప్రియమే, శిరః = శిరస్సు, మోదః = మోదమే, దక్షిణః పక్షః = దక్షిణ పక్షము, ప్రమోదః = ప్రమోదము, ఉత్తరః పక్షః = ఉత్తర పక్షము, ఆనందః = ఆనందము, ఆత్మా = ఆత్మ, బ్రహ్మ = బ్రహ్మము, పుచ్ఛం ప్రతిష్ఠా = తోకగా కలిగి ప్రతిష్ఠ చెందుచున్నాడు, తదప్యేష శ్లోకోభవతి = ఆ ఆనందమయుని గూర్చియే ఈ మంత్రము అగుచున్నది.

**తాత్పర్యము :** విజ్ఞానమే అనగా విజ్ఞానవంతుడే యజ్ఞమును అనగా నిష్కామ కర్మను ఆచరించుచున్నాడు. మరియు, లౌకిక కృత్యములు గూడ విజ్ఞానము చేతనే చేయబడుచున్నవి. దేవతలందఱు ఈ విజ్ఞాన బ్రహ్మనే అందరికంటె పెద్దగా ఉపాసించుచున్నారు. ఇట్టి విజ్ఞాన బ్రహ్మను సరిగా అర్థము చేసుకొనుటలో పొరపడనిచో శరీరములో ఉన్నపుడే అందలి పాపములను వదలి, సమస్త కామములను పొందవచ్చును. ఈ విజ్ఞానమయుడు పూర్వానువాకములో చెప్పిన

మనోమయ శరీరునకు ఆత్మ. విజ్ఞానమయుని కంటె వేరుగాను, విజ్ఞానమయుని లోపలగాను సూక్ష్మమైన ఆత్మగా ఆనందమయుడు గూడ గలడు. విజ్ఞానమయుడు వానిచే పరిపూర్ణుడగుచున్నాడు. అందుచే విజ్ఞానమయుని పురుషాకారత్వమును అనుసరించియే ఈ ఆనందమయుడు గూడ పురుషాకారుడగుచున్నాడు. ఆ ఆనందమయ పురుషునకు ప్రియమే – శిరస్సు, మోదమే – దక్షిణ పక్షము, ప్రమోదము – ఉత్తర పక్షము, ఆనందము – ఆత్మగాను ఉండి బ్రహ్మత్వమును పొందిన స్థితిని తోకగా కలిగి ప్రతిష్ఠను పొందుచున్నాడని ఈ మంత్రము చెప్పుచున్నది.

**వివరణము :** పూర్వానువాకములో విజ్ఞానమయుని శరీరము గూర్చి చెప్పబడినది. మనోమయుని కంటె ఇతను పైవాడు. కారణమేమనగా మనస్సంకల్పమునకు ముందు ఒక ప్రణాళిక ఉండవలెను. ఉదాహరణ : ఇంటి నుండి బయలుదేరుటకు మనస్సు సంకల్పింపగా "ఎక్కడకు బయలుదేరవలెను? ఎవరిని కలుసుకొనవలెను ? ఏమి చేయవలెను?" అను ఒక ప్రణాళిక వుండును. ఆ ప్రణాళికా వివరములే విజ్ఞానము. అందుచే మనస్సంకల్పము కన్న విజ్ఞానము ముందుగా నుండును. ఈ కారణము వలన మనోమయుని కన్న విజ్ఞానమయుడు మున్నుగాను, మిన్నగాను ఉండవలెనని ప్రతిపాదింపబడినది. అట్టి విజ్ఞానమయుని వలననే యజ్ఞార్థ కర్మలన్నియు నిర్వహింపబడును. మనము చేయు అన్ని పనులు మనకోసము కాదు, యజ్ఞార్థమ అని ఈ విజ్ఞానము మన వ్యక్తిగత కర్మలను గూడ పరబహ్మమునందు విస్తరింప చేయును. కర్మలను అర్థవంతము చేయును. ఈ ఉద్దేశ్యముతోనే "విజ్ఞానం యజ్ఞం తనుతే, కర్మాణి తను తే పిచ" అని ఈ మంత్రములో చెప్పబడినది.

దేవతలందఱు ఈ విజ్ఞాన బ్రహ్మనే జ్యేష్ఠునిగా ఉపాసన చేయుచున్నారని చెప్పుటలో చాల అర్థమున్నది. తాపీ పనివాడు గాని, వడ్రంగిగాని, లేదా కూలీగాని, కూలీలపై మేస్త్రీగాని, ఒక ఇంటిని కట్టునపుడు అందరును ఇంటి ప్లానును బ్లూ ప్రింట్‌గా ఇచ్చిన ఇంజనీరు చెప్పిన ప్రకారమే చేయుదురు. వారందఱు ఇంజినీరునే తమ పనులకన్నిటికి అధికారిగా, జ్యేష్ఠునిగా ఉపాసింతురు. అదే విధముగా శరీర నిర్మాణములో కంటికి సంబంధించిన దేవత, చెవికి సంబంధించిన దేవత ఈ విధమైన దేవతలందఱు, శరీరములో ఎన్ని కన్నులుండవలెనో, ఎన్ని చెవులుండవలెనో,

ఎన్ని పళ్ళు ఉండవలెనో నిర్ణయించుట విజ్ఞానమయుడైన ఒకని నిర్ణయ ప్రకారమే జరుగును. అట్టివాడు లేనిచో రెండు కన్నులకు బదులు మూడు కన్నులు, ఒక గుండెకు బదులు మూడు గుండెలు ఈ విధముగా ఇష్టము వచ్చిన రీతిలో, అస్తవ్యస్తముగా రావచ్చును. ఇంటిని కట్టునపుడు బ్లూప్రింట్‌లో గూడ కిటికీల సంఖ్య, ద్వారముల సంఖ్య, గోడల పొడవు, మందము మొదలైన వివరములనన్నిటిని ఇంజనీరు తెలుపును. అదే విధముగా శరీరములో అవయవదేవతలందరిపైన పనిచేయు విజ్ఞానమయుని నిర్ణయ ప్రకారమే అన్నియు ఏర్పాటగును. అందుచేతనే "విజ్ఞానం దేవాస్సర్వే బ్రహ్మ జ్యేష్ఠ ముపాసతే" అనగా, విజ్ఞాన బ్రహ్మను సర్వదేవతలు జ్యేష్ఠునిగా ఉపాసించుచున్నారని చెప్పబడినది.

విజ్ఞానమును తెలుసుకున్నంత కాలము, దాని ఆధిక్యమును పొరపడనంత కాలము శరీరము నందు గల పాపములను విడిచి సమస్త కామములను పొందుచున్నాడని చెప్పబడినది. సైకిలు స్వారిలో బ్యాలెన్స్ చెడనంత కాలము క్రిందపడుట జరుగదు. మంచుగడ్డ ఉష్ణోగ్రత సున్నా డిగ్రీలు దాటక ఉంచబడునట్లు చేయునంత కాలము అది మంచుగడ్డ స్థితిలో నుండును. 'చాలకాలము సున్నా డిగ్రీల వద్దనే ఉంచితిమి గదా !' అని ఒక సమయములో ఉష్ణోగ్రతను పెంచినచో అది మంచుగడ్డగా ఉండుట జరుగదు. అదే విధముగా ఇంజనీరు చెప్పునదేమి అని స్వంత నిర్ణయము తీసికొనినపుడు ఇంటికి బదులు బందులదొడ్డి రావచ్చును. అదే విధముగా విజ్ఞానమును బ్రహ్మగా గుర్తించనపుడు శరీరములోని అవయవములు గూడ అవకతవకలుగా రావచ్చును. అందుచే విజ్ఞానమును బ్రహ్మగా తెలుసుకొన్నంత కాలము దేనియందును పొరపాటు జరుగుట ఉండదని ఇక్కడ చెప్పబడినది. "శరీరే పాప్మనో హిత్వా" అను మంత్రము నందు శరీరము నందలి పాపములను వదలి అని చెప్పబడినది. 'పురుషుడు బ్రహ్మ అగుచుండగా శరీరములో ఈ పాపాత్ముడెవరు?' అను శంక రావచ్చును. దీపములో – వత్తి, చమురు, అగ్ని ఇవి అన్నియు విడివిడిగా మంచివే. కాని, అవి అన్నియు కలిసి దీపము వెలుగుచున్నపుడు పొగ, మసి, ఏర్పడును. అట్లే యజ్ఞోపవీతములో దారములు, దారములలోని ప్రత్తి ఇవి అన్నియు మంచివే. కాని, చిక్కుపడినపుడు "చిక్కు" అనునది క్రొత్తగా వచ్చినది. ఇది

నిజమునకు దారమునందు గాని, ప్రత్తి యందు గాని లేదు. అందుచేత శరీర నిర్మాణములో గూడ అన్ని అవయవములు విడివిడిగా మంచివే కాని, అవి ఒక భౌతిక శరీరముగా రూపొందినపుడు - దీపమునకు 'మసి' వలె, యజ్ఞోపవీతము నందు 'చిక్కు' వలె పాపము లేర్పడును. వీటిని తిట్టుకొనరాదు. భగవద్గీతలో 'కృష్ణుడు' పాపములు గూడ నేనే అనినాడు. ఐన మరి ఏమి చేయవలెను ? గాజు చిమ్నీ కంటిన మసిని తుడిచి వాడుకొనునట్లు, చిక్కును విడదీసి యజ్ఞోపవీతమును ధరించినట్లు - శరీరములో పుట్టిన పాపములను వదలి, శరీరమును సత్కర్మకై వినియోగించవలెననియు, మరియు చిట్టచివరకు - వాసయోగ్యము కాని అద్దె ఇంటిని మార్చి క్రొత్త యింటిని ఎట్లు ఎన్నుకొందుమో అట్లే శరీరము వాస యోగ్యము కానపుడు ఆ పాపశరీరమును వదలి వేరొక క్రొత్త శరీరమును ఎన్నుకొనవలెనను అర్థమును గూడ ఇక్కడ చెప్పుకొనవచ్చును. ఈ విధముగా విజ్ఞాన బ్రహ్మయందు పొరపాటు పడక శరీరమునందలి పాపములను వదలిన వాడు సమస్త కామములను పొందుచున్నాడు. అనగా యజ్ఞార్థముగా పనిచేయుచున్నాడు కావున, సర్వ సౌకర్యములు కల్పింపబడునని అర్థము. కోరికలు ఉండకూడదు. కాని, కోరికలు వాటంతట అవి తీరుచున్నపుడు అనుభవించుట తప్పుగాదు. గవర్నమెంటు ఆఫీసులో ప్రజలకు కావలసిన పనులు చేయుచున్నపుడు కలెక్టరు గారికి నౌకర్లు, డ్రైవర్లు, కారులు, రైలు ప్రయాణములో రిజర్వేషన్లు తను కోరకుండగనే ఏర్పాటై కోరికలు తీరుచున్నవి. అట్టివి అనుభవించుట తప్పుగాదు. ఇట్టి అర్థములో "సర్వాన్ కామాన్ సమశ్నుత ఇతి" అనగా సమస్త కామములను చక్కగా పొందుచున్నాడని ఇక్కడ చెప్పబడినది.

ఇంతకు పూర్వము మనోమయుని గూర్చి చెప్పినట్లుగానే విజ్ఞానమయుడు గూడ మనోమయ శరీరునకు అంతరము లోని ఆత్మగా అర్థము చేసుకొనవలెను.

విజ్ఞానమయుని కంటె విజ్ఞానమయునిలో సూక్ష్మముగా వాని ఆత్మవలె, వానికన్న వేరగు ఆనందమయుడు ఒకడున్నాడని, ఆ ఆనందమయుని చేతనే విజ్ఞానమయుడు పరిపూర్ణుడగుచున్నాడని ఇచ్చట ప్రతి పాదింపబడును. ఈ ఆనందమయుడు విజ్ఞానమయుని కన్న పైవాడుగా - ఇంజినీరు కన్న ఇంటి

గృహస్థుగా– ఈ ఆనందమయుని – విజ్ఞానమయుని పైవాడుగా ఊహించవలెను. ఇంజనీరుని 'ఎందుకు ఈ కిటికీలు ? ఎందులకు ఈ ఇల్లు?' అని ప్రశ్న వేసినచో దాని సమాధానము ఇంటి గృహస్థు చెప్పును. ఇంటిలో ఇంజనీరు ఉండడు. గృహస్థే ఉండును. ఈ గృహస్థుయొక్క కష్టఫలమైన డబ్బుతోనే ఇంటికి సంబంధించిన కిటికీలు, ద్వారములు, గోడలు; ఇంజనీరు, మేస్త్రీ తదితర కూలీలకు జీతములు ఏర్పాటగుచున్నవి. అట్లే ఈ ఆనందమయునివలననే విజ్ఞాన, మనో, ప్రాణ, అన్నమయులు తయారుచేయబడి, వానిపై ఆధారపడి ఉన్నారని తెలుసుకొనవలెను. 'ఎందులకు ఈ ఇల్లు ?' అని ప్రశ్న వేసినపుడు 'ఇంటిలో ఉండి ఆనందించుటకు' అన్నదే సమాధానము. అందుచే, ఏ పనియొక్క ధ్యేయమైనను ఆనందమే ! అది అన్నిటికి తుది మెట్టు. ప్రపంచములో జరుగు సుఖ, దుఃఖ సన్నివేశములన్నియు ఈ ఆనందమయస్థితిలో నున్నవానికి ఆనందమునే చేకూర్చును. హరిశ్చంద్ర నాటకమును చూచుచున్నపుడు, దుఃఖ సన్నివేశములు వచ్చినపుడు గూడ, పాత్రధారులు చక్కగా నటించునపుడు ప్రేక్షకుడు చూచి ఆనందించుట మన మెఱిగిన విషయమే ! అనగా నాటకములో దుఃఖ సన్నివేశములను చూచుట కూడ తన ఆనందమునకే అని తేలుచున్నది. ఇది క్రీడ (Play) వంటిది. పసిపిల్లవాడు నడుచుచున్నపుడు, క్రిందపడుట జరుగును. ఐనను మరలలేచి, నడచి, ఆడుకొనక మానడు. వానిని 'పడినావు గదా మరల నడచుట ఎందులకు?' అని అడిగినచో సమాధానము చెప్పక మరల నడుచును. అనగా నడచుట, పడుట, ఆడుట ఇవి అన్నియు అతని క్రీడలోని భాగములే. అట్లే ప్రపంచములోని సుఖములు, దుఃఖములు ఈ ఆనందమయునికి అనుభూతిభాగములేతప్ప మంచి, చెడ్డలు కావు.

'ఈ ఆనందమయ పురుషునికి ప్రియమే శిరస్సు' అని చెప్పబడినది. అనగా ఇతని శిరస్సునందు అనగా ఆలోచనా కేంద్రము నందు మోసము, కుటిలత, లౌక్యము ఉండవు. కేవలము ప్రేమ ఉండును. అనగా Unifier గా ఉండును గాని Utiliser గా వుండడు. అందరికిని శుభము జరుగుట ఇతనికి ముఖ్యము, 'మనిషికి శిరస్సు ఎంత ముఖ్యమో ఈ ఆనందమయునికి, ప్రేమ అంత ముఖ్యము' అను అర్థములో "తస్య ప్రియ మేవ శిరః" అని చెప్పబడినది. ఇతనికి మోదము – దక్షిణ

పక్షమని, ప్రమోదము - ఉత్తర పక్షమని చెప్పబడినది. మోదమనగా సంతోషము. ప్రమోదమనగా మిక్కిలి సంతోషము. ఉదాహరణ : మామిడి పండు ఎదురుగా ఉన్నపుడు దానిని కొని తినవచ్చునని తెలిసినపుడు కలుగునది మోదము. దానిని కొని స్వంతము చేసికొనినపుడు కలుగునది ప్రమోదము. స్వంతమైన తరువాత తినునపుడు కలుగునది ఆనందము. అందుచే ఇక్కడ ఆనందమయునికి మోదము, ప్రమోదము దక్షిణపక్షము, ఉత్తరపక్షముల వంటివి కాగా ఆనందము ఆత్మవంటిదను అర్థములో "మోదో దక్షిణః పక్షః ప్రమోద ఉత్తరః పక్షః ఆనంద ఆత్మా" అని చెప్పబడినది. అనగా ఇష్టవస్తు దర్శనము, ఇష్టవస్తు ప్రాప్తి, ఇష్ట వస్తు అనుభవములను వరుసగా ఈ మోద, ప్రమోద, ఆనందములుగా చెప్పవచ్చును. ఈఆనంద మయాత్మకుడు నిరంతరము బ్రహ్మానందస్థితిలో ఉండును. అట్టి బ్రహ్మానందస్థితి ఈ ఆనందమయునికి తోకవలె అనగా పేరునకు ప్రక్కగా డిగ్రీ లేదా బిరుదు (title) వలె ఉండి ప్రతిష్ఠను పొందుచుండును లేదా, బ్రహ్మానందమునకు జీవులలోని ఆనందమయుడు తోక (extended sample of Bilss) వంటివాడు అని గూడ అర్థము చెప్పుకొనవచ్చును.

**మంత్రము : అసన్నేవ స భవతి । అస ద్బ్రహ్మేతి వేద చేత్ । అస్తి బ్రహ్మేతి చేద్వేద । సంత మేనం తతో విదురితి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య। అథాతోఽను ప్రశ్నాః। ఉతావిద్వానముం లోకం ప్రేత్య । కశ్చన గచ్ఛతీ 3 । ఆహో విద్వా నముం లోకం ప్రేత్య । కశ్చి త్సమశ్ను తా3ఉ । సో ఽకామయత। బహుస్యాం ప్రజాయేయతి । స తపో తప్యత । సతపస్తప్త్వా। ఇదగ్ం సర్వ మసృజత । యదిదం కించ । తథ్సృష్ట్వా । తదేవాను ప్రావిశత్ । తదను ప్రవిశ్య। సచ్చత్యచ్చాభవత్ । నిరుక్తం చానిరుక్తం చ । నిలయనం చానిలయనం చ। విజ్ఞానం చావిజ్ఞానం చ । సత్యం చానృతం చ సత్యమభవత్ । యదిదం కించ। తథ్సత్యమిత్యాచక్షతే । తదప్యేష శ్లోకో భవతి ॥** *(6)*

**టీక :** బ్రహ్మ = బ్రహ్మము (లేదా సర్వాంతర్యామి), అసత్ = లేదు, ఇతి = అని, (యః = ఎవడైన) వేదచేత్ = తెలిసికొనినచో, సః = వాడు, అసన్ ఏవ = లేనివాడే, భవతి = అగుచున్నాడు, బ్రహ్మ = బ్రహ్మము (లేదా సర్వాంతర్యామి) అస్తి ఇతి = కలడని, వేదచేత్ = తెలిసికొనిన యెడల, తతః = అందువలన (సః =

వాడు), సంతం = ఉన్నవానినిగనే, విదుః = తెలుసుకొనుచున్నారు, యః = ఎవడైతే (ఆనందయుడైన బ్రహ్మముగా తెలుసుకొనబడుచున్నాడో), సః = వాడు, ఏషః = ఏవ = తెలుసుకొనబడువాడే, తస్య = పూర్వస్య = పూర్వము ప్రతిపాదింపబడిన వాని, శరీర = శరీరముగా గల, ఆత్మా = ఆత్మ, (ఏషః = వీడే) అథ = అటుపై, అతః = (ఆచార్యోపదేశానంతరము శిష్యునకు కొన్ని సందేహములు కలుగవచ్చును) కావున, అనుప్రశ్నాః = అను ప్రశ్నములు (వివరింపబడుచున్నవి.) అవిద్వాన్ = అవిద్వాంసుడు. ప్రేత్య = మరణించి లేదా ఈ లోకమును విడిచి, అముం లోకం = ఈ పరమాత్మను, గచ్ఛతీ3 ఉత = పొందునా (లేక పొందదా), కశ్చిత్ విద్వాన్ = విద్వాంసుడగువాడు, ప్రేత్య = మరణించి లేదా ఈ లోకమును విడిచి, అముం లోకం = ఈ పరమాత్మను, ఆహోసమశ్నుతా ఉ = పొందునా పొందడా, సః = ఆ బ్రహ్మము, బహు = అనేకముగా, స్యాం = కావలయును, ప్రజాయేయ = పుట్టవలయును, (అని), ఇతి = ఈ విధముగా, అకామయత = కోరెను, సః = ఆ బ్రహ్మము, తపః = తపస్సును, అతపత్యత = చేసెను, సః = ఆ బ్రహ్మము, తపః = తపస్సును, తప్త్వా = చేసి, ఇదమ్ = ఈ కనబడుచున్న, సర్వమ్ = సమస్తమగు జగత్తును, అసృజత = సృజించెను, యత్ = ఏ, ఇదం కించ = ఈ సృజింపబడినది గలదో, తత్ = దానిని, సృష్ట్వా = సృజించి, తత్ ఏవ = ఆ సృజించిన దానినే, అను ప్రావిశత్ = అను ప్రవేశము చేసెను, తత్ = ఆ సృజింపబడిన దానిని, అనుప్రవిశ్య = ప్రవేశించి, సత్ చ త్యత్ అభవత్ = ('ఏది ? ఏమి?' అని ఒకరినొకరు ప్రశ్నించుకొను ప్రశ్నలకు సమాధాన స్వరూపముగా) అంతర్యామిగా అయ్యెను, నిరుక్తంచ = నిర్వచింప వీలైనదిగాను, అనిరుక్తంచ = నిర్వచింప వీలులేనిదిగా, నిలయనంచ = ఆశ్రయము గలదిగాను, అనిలయనంచ = నిరాశ్రయమైదిగాను గూడ, విజ్ఞానంచ = విశేషముగా తెలియబడిన జ్ఞానముగాను, అవిజ్ఞానంచ = విశేషముగా తెలియబడని దానినిగాను గూడ, సత్యంచ = సత్యమైనదానిగాను, అనృతంచ = అసత్యమైనదాని గాను గూడ, సత్యమ్ = ఈ సత్యము (బ్రహ్మము), అభవత్ = అయెను, యత్ = ఏ, ఇదం కించ = ఈ చెప్పబడిన కొంచెము, తత్ = అదియే, సత్యం ఇతి = బ్రహ్మమని, ఆచక్షతే = పలుకుచున్నారు. తదప్యేష శ్లోకోభవతి = ఆ విషయమే ఈ మంత్రము చెప్పుట అగుచున్నది.

**తాత్పర్యము :** ఎవడు బ్రహ్మను లేదా సర్వాంతర్యామిని లేడనుచున్నాడో వాడును ఆ అనుచున్న క్షణములో లేనివాడే అగును. సర్వాంతర్యామి ఉన్నాడని తెలుసుకొనిన క్షణములో వాడును ఉన్న వానిగనే అగుచున్నాడు. ఈ తెలుసుకొనుచున్న వాని శరీరము నందలి ఆత్మే ఆ బ్రహ్మ. ఇటుపైన కొన్ని ప్రశ్నల ప్రసక్తి ఉండును. అవిద్వాంసుడు ఈ లోకమును విడిచి పరమాత్మను పొందునా ? తిరిగి ఈ లోకమును పొందునా ? విద్వాంసుడు ఈ లోకమును విడిచి పరమాత్మను పొందునా తిరగి ఈ లోకమును పొందునా ? (ఈ ప్రశ్నల తరువాత పరమాత్మ నుండి సృష్టి వచ్చిన విధమును గురించి చెప్పబడును.) పరమాత్మ ఒక్కడు అనేకముగా కావలయునని కోరెను. అందులకై తపస్సు చేసెను. తపస్సు చేసి, ఈ కనబడుచున్న సమస్త జగత్తును సృజించెను. ఈ కించిత్ జగత్తును సృష్టించి, ఈ సృష్టించిన దానినే అను ప్రవేశించెను. అట్లు సృజించిన ప్రపంచమును ప్రవేశించి 'ఏది ?' 'ఏమి ?' అని ఒకరి నొకరు వేయు ప్రశ్నలకు సమాధాన స్వరూపముగా అయ్యెను. నిర్వచింప వీలైనదిగాను, వీలులేనిది గాను; ఆశ్రయము కలదిగాను, లేనిదిగాను; విశేషముగా తెలియబడు జ్ఞానముగాను, తెలియబడిన జ్ఞానముగాను; సత్యాసత్యములుగాను గూడ, సత్యమైన సర్వాంతర్యామి అయ్యెను. ఆ కనబడు కించిత్ ప్రపంచమే బ్రహ్మ స్వరూపమని పలుకుదురు. ఈ విషయములే ఈ మంత్రము నందు చెప్పబడుచున్నవి.

**వివరణము :** ఈ అనువాకములో సర్వాంతర్యామి అస్తిత్వమును గూర్చి చర్చింపబడును. ఎంతో శాస్త్రీయముగా, హేతువాద బద్ధముగా, విజ్ఞానాత్మకముగా ఈ చర్చ జరుగును మొట్టమొదటగా 'ఈ ప్రపంచముగా విచ్చుకొనిన బ్రహ్మము ఒకడు ఉన్నాడు' అని ఎవడు తెలసుకొనునో ఆ తెలుసుకొనిన క్షణములో వాడును ఉన్నాడనియు, లేడనిన క్షణములో వాడును లేడనియు, ఏకపక్షముగా దబాయించి చెప్పినట్లు అనిపించును. దీనిని అర్థము చేసికొనుటకు కొన్ని ఉదాహరణలను చెప్పుకొనవలెను. ముందుగా దేవుని అస్తిత్వమునుగూర్చి అజ్ఞాన భావములు కలుగకుండుటకు కొన్ని ఉదాహరణలు వివరింపబడును.

దేవుడు (సర్వాంతర్యామి) లేడని కొందరు సిద్ధాంతీకరించి చెప్పుచునే ఆ లేనిదేవుని తిట్టుచుందురు. వారి అజ్ఞానమునకు ఇంతకన్న వేరే నిదర్శన మక్కఱలేదు,

దేవుడు లేనపుడు, ఆ లేని దేవుని తిట్టుట - మానసిక అనారోగ్యలక్షణమును, దేవుడు ఉన్నపుడు తిట్టుట - తన సిద్ధాంతమునకు వ్యతిరేకతను తెలియజేయును. కావున, ఏ విధముగా చూచినను తిట్టుట అజ్ఞానమే అగును.

మరికొందరు దేవుడు (God) లేడనుచునే "Anti God Association" అని ఒక సంఘమును పెట్టుదురు. లేడని చెప్పినపుడు ఆ లేనివానికి వ్యతిరేకముగా ఒక సంఘమును పెట్టుట అర్థము లేని విషయము.

ఒకడు ఒక వస్తువు ఉన్నదని చెప్పినను, లేదని చెప్పినను - ఆ వస్తువు ఉన్నదియే అగును. వాని పట్ల ఆ వస్తువు నిజముగా లేకపోవుట అనగా - ఆ వస్తువు ఉన్నట్లుగాని లేనట్లుగాని వానికి తెలియక పోవటమే ! అంతకు పూర్వము ఉన్నదానిని గుఱించి మాత్రమే అది వున్నట్లుగాని, లేనట్లుగాని చెప్పగలుగుట జరుగునని గ్రహించవలెను. ఇట్టి విషయమే భగవద్గీతలో "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" అని చెప్పబడినది. దీని వివరణ రాబోవు అనువాకములో తెలుపబడును. ఇక ప్రస్తుతానువాకమునకు సంబంధించిన మంత్రముల భావము ఉదాహరణ ప్రాయముగా వివరించబడును.

శనగపిండితోనే తయారైన ఒక జంతిక (చక్రము) ఒక రోజున ఒళ్ళు క్రొవ్వెక్కి 'అసలు శనగపిండిలేదు' అని అనినదనుకొనుడు. వెంటనే తెలియబడు విషయమేమనగా - ఆ జంతిక కూడ లేకపోవుట. కారణము ? శనగపిండి లేనిదే జంతిక రాదు కదా ! అదే జంతిక 'శనగపిండి వున్నది'. అన్న క్షణములో ఆ జంతికకు కూడ వుండుటకు అవకాశముండును. ఇట్లే బంగారపు గొలుసులోని ఒక చిన్నరింగు బంగారము లేదనినపుడు తాను గూడ వుండదు. బంగారము ఉన్నదన్నపుడు తాను కూడ ఉండుటకు అవకాశముండును. మట్టితో చేయబడిన ఒక కుండను చూచి 'ఇది కుండ' అనినపుడు - ఆ మట్టి 'పోనిస్తూ' అని ఊరుకొనుట చూచి మనము ఇంకను బరితెగించి - కుండలో మట్టి వున్నదని గూడ అందుము. దీనిని వ్యుత్క్రమదృష్టి (Vision of inversion) అందురు. మట్టి శాశ్వతమైన దైనను, తాత్కాలికమైన కుండకు ప్రాధాన్యమిచ్చుట జరిగినది. ఈ ఉదాహరణలో సర్వాంతర్యామిని మట్టితోను, కుండను ఈ దైహికజీవిగాను పోల్చి అర్థము చేసికొనవచ్చును.

పై ఉదాహరణలో జంతిక, రింగు, కుండ - ఇవి విరూపణము చెందవచ్చునేమో గాని అవి వరుసగా శనగపిండి, బంగారము, మట్టితో చేయబడి, నిండినవే గదా ?

'సర్వాంతర్యామి ఉన్నాడా ? లేడా ?' అను ప్రశ్న 'చక్కెర తీపిగా వుండునా? వుండదా ?' అను ప్రశ్న వంటిది. చక్కెర తినుచున్న వాడు తీపిగా నుండునని ఎట్లునూ చెప్పును. ఒక వేళ తిననివాడు తీపిగా ఉండదని చెప్పినచో పంచదార తీపి వుండక మానదు కదా ! ఒక గదిలో ఒకడు నిద్రించుచున్నాడు, మరియొకడు మెలకువగా ఉన్నాడను కొనుడు. అప్పుడు ఆ గదిలోనికి ఒక తేలువచ్చినచో గదిలో తేలు ఉన్నట్లా ? లేనట్లా ? మెలకువగా ఉన్నవానికి తేలు ఉండును. ప్రక్కనే నిద్రపోవువానికి తేలువుండదు. సరిగా ఈ ఉదాహరణయే తేలుకు బదులు సర్వాంతర్యామిని, మెలకువగా ఉన్నవానికి బదులు విద్వాంసుని, నిద్రపోవు వానికి బదులు అవిద్వాంసుని ప్రతిక్షేపించి విమర్శించుకొనినచో ఈ మంత్రములో చెప్పిన విషయము ఎంత శాస్త్రీయమైనదో, హేతువాదబద్ధమైనదో, విజ్ఞానాత్మకమైనదో తెలియును. రేఖాగణిత ప్రకారము గూడ ఈక్రింది విధముగా వివరించ వచ్చును. వృత్తలేఖిని ఒంటికాలి కొనను పుస్తకముపై అన్చి, పెన్సిలు ఉన్న కాలి కొనను పుస్తకముపై అన్చి, పెన్సిలు ఉన్నకాలి కొను గుండ్రముగా త్రిప్పినచో వృత్తపరిధి ఏర్పడును. ఈ పరిధి మీద అనంతమైన బిందువులుండును. ఆ బిందువులన్నియు ఏర్పడుటకు ప్రస్తుత ఉదాహరణములో ప్రారంభ ఆధార బిందువు కేంద్రమే గదా! వాస్తవమునకు ఆ కేంద్రము వద్ద వృత్తలేఖిని కాలిని నొక్కబట్టి ఈ పరిధి, దానిపై బిందువులు వచ్చినవి. అటువంటిది పరిధిలోని ఒక బిందువు అసలు ఆ కేంద్ర బిందువునే లేదనుట దాని అజ్ఞానమును తెలియచేయును, ఈ ఉదాహరణలో కేంద్రము దేవుడు లేక సర్వాంతర్యామి ఐనచో, అనంత బిందువులతో కూడిన వృత్తపరిధిని అనేక జీవభూత వస్తుజాలముతో గూడిన ఈ ప్రపంచముగా గుర్తించవలెను. పైథాగరస్ ఈ విషయమును 'Centre is the begining and ending of the circle' అని చెప్పెను. మరియొక ఉదాహరణ : ఒక మనిషి కలగనుచున్నాడను కొనుడు. కలలో కనపడు వ్యక్తులు, వస్తువులు, సన్నివేశములవు, ఈ కనపడు ప్రపంచము వంటివి.

కలగను వాడు దేవుని వంటివాడు. కలలోని ఏ వస్తువైనను కలగనువాడు లేడనినచో తాను కూడ ఉండదు కదా! ఇట్టి ఉదాహరణలతో ఇన్ని విధములుగా ఈ మంత్రమును సమన్వయపరచుకొనవచ్చును. అటువంటి సర్వాంతర్యామి కూడ ఈ శరీరములోని ఆత్మగానే ఉండును. ఆయనకు మరల ప్రత్యేకమైన దివ్యాత్మ వుండదు. ప్రతివ్యక్తి- మొత్తములో ఒక యూనిట్ కాబట్టి ఆ 'మొత్తము వానికి' మరల వేరొక ఆత్మవుండదు. సినిమా తెరపై హీరో, హీరోయిన్, విలన్ మొదలైన వారందరికి ఆకృతులలో ఏ తెరవున్నదో వారందరకును ఉన్న నేపథ్యము నకు గూడ అదే తెర వర్తించును గాని వేరొక ప్రత్యేకమైన తెర వుండదు. ఈ అర్థములో "తస్యైష ఏవ శారీర ఆత్మా యః పూర్వస్య" అను మంత్రము చెప్పబడినది. మరియు, ముందు చెప్పిన విజ్ఞానమయునికి ఈ ఆనందమయుడు ఆత్మ అని గూడ చెప్పుకొనవచ్చును.

తరువాత రెండు ప్రశ్నలు ఈ మంత్రములో వేయబడినవి. ఇవి రెండును పైన ప్రతిపాదించిన సర్వాంతర్యామి తత్త్వమునకు అనుబంధమైన ప్రశ్నలు, విద్వాంసుడు మరణించి, అనగా ఈ లోకమును విడిచి పరమాత్మలోకమును చేరునా, తిరిగి ఈ లోకమునే చేరునా ? అట్లే అవిద్వాంసుడు మరణించి అనగా ఈ లోకమును విడిచి, పరమాత్మ లోకమును చేరునా, తిరిగి ఈ లోకమునే చేరునా ? ఈ రెండు ప్రశ్నలకు ఈ మంత్రములో సమాధానము చెప్పినట్లు అగుపడదు. కాని మనమే ముందు చెప్పిన విషయములను బట్టి సమాధానములను రాబట్టుకొనవలెనని ఉద్దేశించినాడని అనుకొనవలసి యుండును.

ఇంతకు పూర్వపు తేలు ఉదాహరణలో – విద్వాంసుని మెలకువతో ఉన్నవాని తోను, అవిద్వాంసుని – నిద్రపోవుచున్న వానితోను, తేలును పరమాత్మతోను పోల్చినచో అవిద్వాంసుడు అనగా నిద్రపోవు వాడు నిద్రపోవుచున్నంత వరకు గదిలోని తేలు లోకము (సర్వాంతర్యామి లోకము) లోనికి వెళ్ళడు. తన సుషుప్తిలోకములోనే తానుండును. అనగా, అవిద్వాంసుడు పరమాత్మ లోకమును చేరలేడని అర్థము. అనగా, తాను మరణించి ఈ లోకమును విడిచినను మరల మరల ఈ లోకములోనే పుట్టుచు గిట్టుచు ఉండును, మెలకువగా ఉన్నవాడు (అనగా 'తేలు అను పరమాత్మను గుర్చి తెలుసుకున్న విద్వాంసుడు) తేలును (పరమాత్మను) గుర్తించుట జరుగును.

అనగా తేలులోకమున ఉండును. అనగా విద్వాంసుడు మరణించి ఈ లోకమును విడిచినపుడు గూడ పరమాత్మ లోకములో నుండగలడు. ఇక్కడ పరమాత్మ లోకమనగా ఆనంద లోకము. విద్య, అవిద్య అనగా విజ్ఞానమునకు ఇటువైపు, అటువైపు ఉండునవి. ఈ విజ్ఞానమయ కోశమును దాటి ఆనందమయకోశమును చేరుట అతికష్టము. ఈ విజ్ఞానకోశములో నున్నంత వరకు తెలియచున్నట్లే వుండును గాని తెగదు. ఎవడో ఒకడు దాటి వెళ్ళుట జరుగును. వాడు మాత్రము ఆనందమయకోశములోనికి అడుగుపెట్టి "ఓహో" అనియు "ఆహా" అనియు అక్కడ ఆనందానుభూతిని పొందునని చెప్పనుద్దేశ్యముతో "ఆహో విద్వానముం లోకం ప్రేత్య కశ్చిద్భమశ్నుతా ఉ" అను మంత్రము ఇచ్చట చెప్పబడినది. మరియు, అవిద్వాంసుడు 'చచ్చిపోవును'. విద్వాంసుడు 'చచ్చివుండును' అనగా He is aware of his conciousness even if he were to die. అని అర్థము . ఒక వేళ విద్వాంసుడు ఈ లోకమును వదలి పెట్టినను ఆనందమయుడైన పరమాత్మను అనుభవించును సుమా ! అని అర్థము. మంత్రములోని 'ఉ' అను అక్షరమునకు 'సుమా' అని అర్థము'.

ఇటుపైన ఒంటిగింటి రామలింగమువలె వున్న పరమాత్మ ఈ కనపడు ప్రపంచముగా ఎట్లయ్యెనో వివరింపబడును. ఒక్కడుగానున్న పరమాత్మ అనేకముగా కావలయునని కోరుకొనెను. అందులకు తపస్సు చేసెను. తపస్సు చేసి, ఈ కనపడుచున్న సమస్త జగత్తును సృజించెను. సృజించి, ఆ సృజించనదానినే అనుప్రవేశించెనని చెప్పబడినది. వర్షఋతువులో ఆకాశమునందు దట్టముగా పట్టిన మేఘము అనుగ్రహముతో వర్షించినపుడు వర్షబిందువు లేర్పడును. అదే విధముగా అనేకముగా కావలయునని కోరిన పరమాత్మ నుండి ఇంతమందితో ఈ ప్రపంచము ఉద్భవించినదని సమన్వయపఱచు కొనవచ్చును. మేఘుడుగా నున్నపుడు ఒక్కడే (Uni) ఉండి, వర్ష బిందువులుగా మారినపుడు అనేకము (Verse)గా మారుట జరిగినది. కలను కనక పూర్వము – కలగనువాడు ఒక్కడే ! కలను కనినపుడు ఆ కలలో తానే అనేకముగా అగుట జరుగును. అట్లే పరమాత్మగా ఉన్నపుడు ఒక్కడే (Uni). ప్రపంచముగా మారినపుడు అనేకముగా మారుట జరిగినది. అనగా (Uni has become verse, and hence there is Universe) అనగా విశ్వము.

పరమాత్మ ఇట్లనుకొనుట సృష్టికి సంకల్పము. మరల అనేకమును ఒకనిగా అవవలెనని కోరుట సృష్టికి వికల్పము లేక ప్రళయమునకు సంకల్పము. పరమాత్మ యొక్క ఈ సంకల్ప, వికల్పములే సృష్టి, ప్రళయములుగా గుర్తించవలెను. ఒక మనిషి ఎంతో మందిగా, ఎన్నో సన్నివేశములుగా అగు కలనుకనుటతో - పరమాత్మ సృష్టి సంకల్పమును, అదే మనిషికి మెలకువ వచ్చుటతో - ప్రళయమును అర్థము చేసికొనవలెను. స్వప్నములోని వారందఱు ఆ మనిషి మనసుతో చేయబడినవారే ! ఇది నిజమునకు మిథ్య. మెలకువచ్చినపుడు వారందఱును కలనుకనువాని మనస్సులో లీనమగుట జరుగును. ఇది యదార్థము. ఇదే విధముగా పరమాత్మ సృష్టిగా మారినపుడు ఆ సృష్టిలోనిదంతయు మిథ్య, ప్రళయములో అది అంతయు లీనమై పరమాత్మ ఒకడుగా నిల్చుట సత్యము. ఈ దృష్టితోనే శంకరాచార్యుల వారు "బ్రహ్మాసత్యమ్ జగన్మిథ్య" అనిరి.

మనిషి నుండి వాక్కు ఎట్లు పుట్టునో పరమాత్మ నుండి ఈ ప్రపంచము అట్లు వ్యక్తమైనది. భగవంతుడు ఉచ్చరించిన అక్షర సంబంధ - మహావాక్యమే ఈ కనబడు సృష్టి. ఈ మహావాక్యములోని పదములు, అక్షరములే స్థావరజంగ మాత్మకములు. ఆ మహావాక్యమును గుఱించి ఇక్కడ చెప్పబడుచున్నది. ఆ వాక్యము "సోఽకామయత, బహుస్యాం ప్రజా యేయేతి" అని ఇక్కడ చెప్పుకొనవచ్చును. అనగా 'ఇంతమందిగా అవవలెనని పరమాత్మ కోరెను' అని అర్థము. పరమాత్మ ఈ విధముగా అనుటలో సృష్టి వ్యక్తమైనదని మనము సమన్వయపఱచు కొనవలెను. పదమునకు - పదములోని అక్షరములకు, వాక్యమునకు - వాక్యములోని పదములకు, వాక్యార్థమునకు - వాక్యమునకు మధ్య గల సంబంధమెటువంటిదో సృష్టికారునకు - సృష్టికి మధ్య గల సంబంధము అటువంటిదని తెలుసుకొనవలెను. సరిగా ఇదే విధముగా బైబిల్ నందు John's revealation - "First there was the word. The word was with the God. He uttered forth the word. And hence, there is the world" అని వ్రాయబడి ఉండును. దీనికి తెలుగులో "ఆదిలో ఒక వాక్యముండెను. అది ఆయన చెంతనే ఉండెను. ఆయన దానిని ఉచ్చరించగా ఈ ప్రపంచము ఉద్భవించెను" అని చెప్పుదురు. ఆదిలో ఉన్నది 'word' అనగా 'పదము' అని చెప్పుకొన్నను, లేదా 'వాక్యము' అని చెప్పుకొన్నను

'అక్షరము' అని చెప్పుకొన్నను తప్పుకాదు గాని అక్షరమని చెప్పుకొన్నచో ఎక్కువ సమంజసముగా నుండును. ఎందువలన అనగా – అక్షరము ముందు లేనిదే పదము గాని వాక్యము గాని ఎట్లు వచ్చును. కాబట్టి ఆదిలో 'అక్షరము' ఉండెను. అని చెప్పుకొనిన ఎక్కువ సమంజసముగ నుండును. భగవద్గీతో అక్షరమనియే చెప్పబడినది. ఆ అక్షరము పేరును 'ఓం' అని – 'ఓమిత్యేకా క్షరం బ్రహ్మ" అను శ్లోకములో చెప్పబడును. బ్రహ్మ అనగా బృహ్మణము చెందువాడు. అనగా చక్కగా విచ్చుకొనువాడు. అనగా సృష్టిగా విస్తరించువాడు. ఎవరీ బ్రహ్మ ? అక్షరుడు. అనగా నశించని వాడు. అక్షరమనగా Letter or Alphabet అని కూడా అర్థము ఉన్నది. ఆ అక్షరము ఏదనగా "ఓం" అని భగవద్గీత సమాధానము చెప్పును, పతంజలి యోగసూత్రములలో కూడ "తస్యవాచకః ప్రణవః" అని చెప్పబడును. "The verbal expression of God is Pranava" అనగా ఆ బ్రహ్మము పేరు ప్రణవము అని దీని అర్థము. ప్రణవమనగా ఓంకారము అను అర్థమే కాక – ప్ర = ఒకటి, నవ = తొమ్మిది. కాబట్టి, ప్రణవమనగా "ఒకటి నుండి తొమ్మిది" అని అర్థము గూడ గలదు. సృష్టిని నవబ్రహ్మలు చేయుదురు. అనగా ప్రజాపతుల సంఖ్య కూడ తొమ్మిది. వీరే ఒకటి నుండి తొమ్మిదివరకు గల అంకెలు. కాబట్టి సృష్టి అంతయు ఈ 'ఒకటి నుండి తొమ్మిది వరకు గల' అక్షరము నుండి విచ్చుకొనును. అనగా ప్రణవము నుండి ఉద్భవించునని మనము సమన్వయపఱచుకొనవలెను. (ఈ 'ప్రణవము', 'ఓం'లకు సంపూర్ణముగా శిక్షావల్లిలో వివరణ ఈయబడినది). ఈ కారణముల వలన భగవద్గీతలోని ఈ వివరణ ఎక్కువ హేతుబద్ధమని, ఎక్కువ శాస్త్రీయమని చెప్పుకొనవలసి వచ్చును.

పరమాత్మ ఒక్కడు, ఇంతమందిగా ఉండు సృష్టిగా మారు ప్రక్రియను గూర్చి భగవద్గీతలోని నాలుగవ అధ్యాయమైన జ్ఞానయోగములో మొట్టమొదటనే రెండు శ్లోకములు కలవు అవి –

1. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।
   వివస్వాన్ మనవే ప్రాహ, మను రిక్ష్వా కవేఽ బ్రవీత్ ॥

2. ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్ష యో విదుః ।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప ॥

మొదటి శ్లోకమునకు - "నేను" మంత్రమును మొదట సూర్యునకు చెప్పితిని. అతడు మనవునకు చెప్పెను. మనువు ఇక్ష్వాకునకు చెప్పెను". అని అర్థము. ఇక్కడ 'మంత్రమును చెప్పితిని' అని ఉన్నది గాని ఏ మంత్రము నిచ్చెను? శ్లోకమంతయు వెతికినను ఆ మంత్రము ఏదియో తెలియదు. కాని శ్లోకములోనే కలదు. అది "అహం, అవ్యయమ్" అను చోట కలదు. వ్యయము కానిది - అవ్యయము. అనగా క్షరము కానిది. అనగా అక్షరము. అదే "నేను" (I am). బైబిల్ నందు Burning bushను గూర్చి మోసెస్ చెప్పిన "I am that I am"ను ఈ 'నేను'తో సమన్వయము చేసికొనవలెను. ఈ "నేను" మొదట సూర్యునికి ఉపదేశింపబడినది. (Solar Initiation) అనగా మనలోని ప్రజ్ఞకు 'నేను' ఉపదేశింపబడినది. అటుపైన సూర్యుని వలన మనువునకు అనగా మనలోని ప్రజ్ఞ నుండి 'మనస్సు'నకు ఉపదేశము (Lunar Initation) జరిగినది. అటుపైన మనువు నుండి ఇక్ష్వాకువునకు ఉపదేశము జరిగినది. అనగా మనస్సు నుండి భౌతిక శరీరమునకు ఉపదేశము (Planetry Initiation) జరిగినది. ఇక్కడ మరికొంత వివరణ అవసరము. ప్రళయ స్థితిలో ప్రపంచమంతయు పరమాత్మలో లీనమై పరమాత్మ ఒక్కడు ఉండును. అట్టి పరమాత్మను నిద్రించుచున్న మనిషితో పోల్చినచో, పరమాత్మ నుండి సృష్టి ఏర్పడు ప్రక్రియను - నిద్రించుచున్న మనిషి మేల్కొను ప్రక్రియతో పోల్చవచ్చును. ఇది మూడు అంచెలుగా జరుగును. ముందు మనిషి యొక్క ప్రజ్ఞ మేల్కొనుట, అటుపైన మనస్సు మేల్కొనుట, అటుపైన శరీరము మేల్కొనుట జరుగును. నిద్రించుచనున్నపుడు భార్య, పిల్లలు, స్నేహితులు, ద్రస్సు, అడ్రస్సు, ఉద్యోగము, జీతము మొదలైనవన్నియు వానిలో లీనమై వాడొక్కడే ఉండును. దీనిని యోగస్థితితో పోల్చవచ్చును. అనగా ఇది 'అన్నియు లీనమై ఒకటిగా ఉన్న యోగము'. ప్రజ్ఞ, అటుపైన మనస్సు, ఆపైన భౌతిక దేహము మేల్కొలుపబడుటతో పూర్తిగా మెలుకువ వచ్చి ఒకటిగా వున్న యోగస్థితి నష్టమై భార్య, బిడ్డలు, స్నేహితులు, జీతము, డ్రస్సు, అడ్రసులతో నిండిన ప్రపంచములోనికి మారెను. దీనినే "యోగోనష్టః" అను మాటల కర్థముగా చెప్పుకొనవలెను. అనగా నిద్రించుచున్న

ఒకడు ఇంతమందిగా అగుప్రక్రియగా యోగస్థితి నష్టమైనదని అర్థము చెప్పుకొనవలెను. అంతేకాని, కృష్ణుడు చెప్పిన యోగము 'కొంతకాలము బాగున్నది, అటుపైన భ్రష్టుపట్టి, నష్టమైనది' అను అర్థమును చెప్పుకొనరాదు. ఇది పరమ ఆధ్యాత్మికమైన విషయము. కృష్ణుడు వేరుగ ఒక యోగమును, పార్టీని, జెండాను ఏర్పరచలేదు ('పరన్తప!' అనగా అర్జునా ! అని సంబోధన).

ప్రస్తుత ఉపనిషత్తులోని 'సో உకామయత బహుస్యాం ప్రజాయేయేతి" అను మంత్రమునకు భగవద్గీతలోని ఈ రెండు శ్లోకములకు పైన ఇచ్చిన "యోగం, అహం, అవ్యయమ్, ... యోగోనష్టః" అను పదములతో అన్వయించి అర్థము చేసికొనవలెను.

"సతపో உతప్యత । సతపస్తప్త్వా ।
ఇదగ్ం సర్వమసృజత । యదిదంకించ ।
తత్సృష్ట్వా । తదేవాను ప్రావిశత్ । తదనుప్రవిశ్య !"

పై మంత్రములలో ఒక్కొక్క క్రియ రెండు రెండు సార్లు వేర్వేరు రూపములలో వాడబడినది. అతప్యత - తప్త్వా, అసృజత - సృష్ట్వా, అను ప్రావిశత్ - అను ప్రవిశ్య, అనునవి ఆ క్రియల యొక్క జంటరూపములు. భూత కాలక్రియలను, భూతకాల అసమాపక క్రియలను ఈ జంటలు తెలుపును. సృష్టి అంతయు జరిగెను – అట్లు జరిగి, అను ఈ రెంటి మధ్య చెప్పబోవు విషయముండును. అనగా ఇంగ్లీషులో 'Occurred - Having occurred'. అనుటవంటివి. ఇది ఒక చిత్రమైన పద్ధతి. తాతముత్తాతకథలను మనుమలు, మునిమనుమలచే చెప్పించుట భారత ఇతిహాసములో మనకు బాగుగ తెలియును. అదేరకమైన పద్ధతిలో సృష్టిని గురించి భూతకాల అసమాపకక్రియలతో ఇక్కడ చెప్పుట జరిగినది.

చోటులో ఒక చోట ఉష్ణోగ్రత పెరిగి, వెలుగై అటుపైన వెలుగరవ్వలు ఏర్పడినచో ఆ ఒక్కొక్క వెలుగురవ్వ ఒక్కొక్క సూర్యునిగా అగును. ఈ మొత్తము చోటులో ఒక వేడి కణమును లేదా ఒక వెలుగు రవ్వను ఏర్పఱచు ప్రక్రియను తపస్సు అనవచ్చును. ఈ విధముగా 'చోటు అను పరబ్రహ్మ తన నుండి వేరు వేరు వెలుగు రవ్వలు - అను జీవ ప్రజ్ఞలను ఉద్భవింప చేయుటకు తపస్సును చేసెను,

ఆ విధముగా తపస్సు చేసి' అని చెప్పుటకు 'స తపోతప్యత' 'సతపస్తప్త్వా' అని చెప్పబడినది.

ఈ కనపడు కాస్త ప్రపంచమును సృజించెనని చెప్పుటకు "యదిదంకించ, ఇదగ్ం సర్వమసృజత" అని చెప్పబడినది. మనము గూడ ఒకరికి ఒకపనిని అప్పచెప్పినపుడు పని అంతయు అప్పచెప్పినను "ఈ కాస్తపని చేసి పెట్టుము" అని అందుము, ఇక్కడ 'కాస్త' అనునపుడు మొత్తము పనియే అగును. అట్లే 'యదిదంచకించ' అనుచోట ఈ కాస్త ప్రపంచమును అనునట్లుగా అర్థము చేసుకొనవలెను. మరియు, ఈ భూత కాల అసమాపకక్రియలలో 'చేసెను - చేసి' మొదలైనవి ఉపయోగించుటలో ప్రతిసృష్టికి ముందు ఇట్లే జరుగునని, అవి ఎప్పుడునూ ఇదే విధముగా జరుగుచునే ఉండునని తెలుపును. అనగా సృష్టి యొక్క ఆవర్తన ధర్మమును (Periodicity) తెలుపును. ఈ సృష్టి జరుగుటను Light of objectivity is born from the subjective darknessగా అర్థము చేసుకొనవలెను. దీనినే ఐతరేయ బ్రాహ్మణములో birth of obejctivity అనగా 'ఐతరేయము' అనగా 'ఇతరము యొక్క పుట్టుక' అనిరి. అనగా పరమాత్మ ఒక్కసారి 'నేను' అనుట తోడనే ఒక్కొక్క - చోటునుండి 'నేను' 'నేను' 'నేను' అని పెక్కు నేనులు వ్యక్తమగుట. అనగా చోటు అను పొలములో 'నేను' అను విత్తనములు వేసి "మేనులు" అను చేనులను పండించుకొనుట అను విధముగా ఈ సృష్టి ప్రక్రియను అర్థము చేసుకొనవలెను.

"తత్సృష్ట్వా। తదేవాను ప్రావిశత్" - ఈ ప్రపంచమును సృష్టించి, దానిలో తను ప్రవేశించును. అనగా "తానువేరు, ప్రపంచము వేరు, తనలో నున్నది వేరు, ఈ ప్రపంచములో ఉన్నది వేరు" అనునట్లుగా కాక - "తానే. ఈ ప్రపంచము, తనలో ఉన్నదే ఈ ప్రపంచములో ఉన్నది, ప్రపంచములో తాను ఉన్నాడు" అను పద్ధతిలో ఈ ప్రపంచమును సృష్టించెను. అనగా శనగపిండి, నెయ్యి, పంచదారలతో లడ్డూలను చేసినట్లుగాక, 'నీరు మంచుముక్కలుగా మారుట' అను ప్రక్రియగా అర్థము చేసుకొనవలెను. Bottomless Bottles ని అనగా అడుగులేని సీసాలను గోదావరిలో ముంచినచో ప్రతిసీసాలోను గోదావరి వేరు వేరుగా ఉన్నట్లు, ప్రతిజీవిలోను తానే ఉండునట్లుగా ఈ సృష్టి ప్రక్రియను నెరపెను.

"సచ్చత్యచ్చాభవత్' - పరబ్రహ్మ నిర్గుణుడని చెప్పుదురు. ఇట్లు చెప్పుట కన్న గుణాతీతుడు అని చెప్పుట ఎక్కువ సమంజసము. విత్తనములో చెట్టు కనిపించనంత మాత్రమున విత్తనము వృక్షతత్త్వ రహితము కాదు గదా! విత్తనములో రాబోవు చెట్టుయొక్క వృత్తాంత మంతయు గుప్తముగా (Latent or potential) నిక్షిప్తమై సాధ్య స్థితిలో వున్నది. అట్లే గ్లాసులోని నీటిలో పంచదార, పటిక బెల్లము, ఉప్పు పూర్తిగా కరిగి లీనమై ఉన్న స్థితిలో ఆ నీటిని చూచి, అందు ఏమియు లేవనుకొని నిర్గుణత్వముతో పోల్చుట పొరపాటే అగును. మరల స్ఫటికీకరణము (Recrystallisation) జరిగినపుడు అవి అన్నియు బయటపడును. అట్లే సృష్టి అంతయు గుప్తముగా పరమాత్మ యందు ప్రళయ స్థితిలో నుండగా పరమాత్మ నిర్గుణుడు అనరాదు. నిజమునకు ఏమియు లేనిదానినుండి ఏదియు రాదు. ఏమియు లేనట్లు కనపడు ప్రళయస్థితిలో నున్న పరమాత్మ నుండి అన్నియు ఉన్నట్లు కనపడు (From seeming nothingness to apparent something) సృష్టి ఏర్పడుచున్నట్లుగా భావించవలెను. ఈ సృష్టి, ప్రళయములు రెండును ఆ పరమాత్మ యందే జరుగును. కాని, వాటికి పరమాత్మ అంటక అతీతుడుగా నుండును. అనగా పరమాత్మ గుణాతీతుడే కాని కేవలము నిర్గుణుడు, సగుణుడు కాదు. అనగా 'గుణము, నిర్గుణము ఎవరియందు చెరియొక 50 శాతమో ఆయనను పరమాత్మ' అని అనవచ్చును. అట్టి గుణాతీతుడైన పరమాత్మను అర్థము చేసికొనుటకు అతని అస్తిత్వమును గూర్చి ఏది ? ఏమి? అని ఒకరి నొకరు ప్రశ్నలు వేసికొనినచో - ఆ ప్రశ్నలకు సమాధానముల స్వరూపముగా అంతర్యామి ఈ సృష్టిగా మారెను - అను అర్థమును ఇక్కడ చెప్పుకొనవలెను.

"నిరుక్తం చానిరుక్తంచ" - పరమాత్మ గుణము, నిర్గుణముల రెంటికి అతీతుడు. అట్టి పరమాత్మ నిర్వచించుటకు వీలైనట్లుగాను, వీలులేనట్లుగాను ఉండునను అర్థములో ఈ మంత్రము చెప్పబడినది. వ్యక్తమైన పరమాత్మ స్వరూపమును సృష్టిగా చూసి మనము నిర్వచించగలము. కాని, అవ్యక్తమైన పరమాత్మను నిర్వచించుటకు కుదరదు. మరియు, అతడు ఆనందమయుడు. ఆనందమును ఏ మాటలతోను నిర్వచింపలేము. ఒక మధుర పదార్థమును తినువాడు

తను పొందు ఆనందమును ఎదుటి వానికి నిర్వచింపలేడు. ఇది కేవలము ఎవరికి వారికి అనుభూతికి సంబంధించినదే. అందుచేతనే ఇంతకు పూర్వము ఆ ఆనందమయుని గూర్చి "యతో వాచో నివర్తంతే, అప్రాప్యమనసాసహ" అని చెప్పుట జరిగినది. "నాయమాత్మా ప్రవచనేన లభ్యః" అని గూడ పరమాత్మను గురించి ఇచ్చిన మంత్రము. అందుచే నిర్వచించుటకు వీలైనట్లు, వీలుకానట్లు ఉండు రెండు లక్షణములు ఎవరికి చెల్లునో అతడు 'పరమాత్మ', 'పరబ్రహ్మము' అని బ్రహ్మవేత్తలు పలుకుదురు.

"నిలయనం చానిలయనంచ" నివాసము కలిగినవాని గాను నివాసము లేని వానిగాను అర్థము చేసికొనవలెను. 'ఈ చోటు' అను పరబ్రహ్మ మన దహరాకాశములో ఉన్నప్పుడు మన శరీరమను గృహమును నిలయముగా కలిగినవాడగుచున్నాడు. బైట ఉన్నచోటుగా ఉన్నపుడు అనిలయుడుగా ఉన్నాడు కాబట్టి, నిలయము, అనిలయము రెండును ఎవరికి చెల్లునో అతనిని పరమాత్మగా తెలుసుకొనవలెనని అర్థము.

"విజ్ఞానం చావిజ్ఞానంచ" – విజ్ఞానమునకు లొంగినట్లు, లొంగనట్లు ఈ రెండును పరమాత్మకు చెల్లును. ఏదో ఒక శాస్త్ర చర్చతో మనకు పరమాత్మ తెలిసినట్లే అనిపించును. కాని, చివరకు ఆ విజ్ఞానమునకు ఆవలగా లొంగని రీతిలో పరమాత్మ ఉండును. మరియు విశేషమైన జ్ఞానము ఉండుటకవకాశము కలిగిన నర, యక్ష, కిన్నెర, దేవతలలోను, విజ్ఞాన రహితమైన పాషాణాది ఖనిజ సంపదలో కూడ పరమాత్మ ఉండగలడని గూడ అర్థమును చెప్పుకొనవచ్చును.

"సత్యం చానృతంచ" – సత్యమనగా మనకళ్ళకు కనబడునది. అసత్యమనగా మనకళ్ళకు కనబడనిది. అని అర్థము చెప్పుకొనినచో ఈ రెండును కలిసి నిజమైన సత్యమని, ఆ నిజమైన సత్యమే పరబ్రహ్మ అని ఈ మంత్రము చెప్పును.

ఉదాహరణ : ఒక తరగతిలో ఒకవైపు కొందరు బాలురు, వారికి ఎదురుగా రెండవ వైపు మరికొందరు బాలురు ఉన్నారనుకొనుడు. అట్టి తరగతిలో వారిరువురికి మధ్య ఉపాధ్యాయుడు ఒక నాణెమును దాని బొమ్మను – మొదటి బాలురవైపునకును,

బొరుసును – రెండవవైపు వారికిని కనపడునట్లు పట్టుకొని, 'నాణెమనగా నేమి ?' అని ప్రశ్నవేసినచో, మొదటి వైపు వారికి బొమ్మకనపడుటచే నాణెమనగా 'బొమ్మ' అనుట వారికి సత్యము, బొరుసు అసత్యము. రెండవ వైపు వారికి బొరుసు కనపడటుచే నాణెమనగా 'బొరుసు' అనుట వారికి సత్యము, బొమ్మ అసత్యము. వాస్తవమునకు నాణెమనగా బొమ్మ బొరుసు కలిపి యున్నదే నాణెము కాబట్టి – ఇద్దరికిని నిజమైన సత్యము ద్యోతకము కావలెనన్నచో, వారికి తెలిసిన సత్యము, సత్యము కానట్లుకనబడు అసత్యము – ఈ రెండును కలిసి సత్యమగునని గ్రహించవలెను. ఈ అర్థములో "సత్యం చ అనృతం చ అపిసత్యమభవత్" అను మంత్రము చెప్పబడినది. ' ఈ విధముగా ఈ సృష్టిలో పరమాత్మ అస్తిత్వము చెల్లుచున్నదని చెప్పుచున్నారు' అని ఈ అనువాకాంతమునందు "తథ్సత్యమిత్యాచక్షతే" అని చెప్పబడినది.

**మంత్రము :** ***అస ద్వా ఇద మగ్ర ఆసీత్ । తతో వై సదజాయత । తదాత్మనగ్గ్ం స్వయమకురత । తస్మా త్త థ్సుకృత ముచ్యత ఇతి । యద్వైత థ్సుకృతమ్। రసోవై సః । రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వాஉஉనన్దీ భవతి । కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ । య దేష ఆకాశ ఆనందో న స్యాత్ । ఏష హ్యేవానన్దయాతి । యదాహ్యేవైష ఏతస్మి న్నదృశ్యే உనాత్మ్యే உనిరుక్తే உనిలయనే உభయం ప్రతిష్ఠాం విందతే । అథసో உభయం గతోభవతి । యదా హ్యేవైష ఏతస్మిన్నుదర మంతరం కురుతే । అథ తస్యభయం భవతి। తత్త్వేవభయం విదుషో உమన్వానస్య । తద ప్యేష శ్లోకో భవతి॥*** *(7)*

**టీక :** ఇదమ్ = ఈ కనపడు ప్రపంచము, అగ్రే = ఇంతకు ముందు, అసత్ వై = గుప్త రూపములో లేదా సాధ్య స్థితిలో, అసీత్ = ఉండెను, తతః = అట్టి సాధ్యస్థితి నుండి, సత్ = ఈ కనపడు నామరూపాత్మక ప్రపంచము, అజాయత = పుట్టెను, తత్ = ఆ సాధ్యస్థితిలోని బ్రహ్మము, ఆత్మానం = ఈ నామరూపాత్మక ప్రపంచమును, స్వయం అకురుత = తనంతట తాను చేసెను లేదా తననుగా చేసెను, తస్మాత్ = అందువలన, తత్ = ఆ సాధ్య స్థితిలోని బ్రహ్మమే, సుకృత ఇతి = దీనికర్త అని లేదా కర్తృకమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, సుకురుతం = అట్టి కర్తయగు, లేదా కర్తృకమగు, తత్ = ఆ బ్రహ్మము, యత్ వై = ఏదికలదో, సః = వాడు లేక

అది, రసః = రసస్వరూపము లేదా రసస్వరూపుడగు, అయం = ఈ బ్రహ్మ, రసమ్ హి ఏవా = రసమునే, లబ్ధ్వా = పొంది, ఆనందీ = ఆనందము కలవాడు, భవతి = అగుచున్నాడు, యత్ = ఎందువలన, ఏషః = ఈ, ఆనందః = ఆనందము, ఆకాశే = దహరాకాశము నందు, నస్యాత్ = లేనియెడల, కః ఇ ఏవ = ఎవరు, అన్యాత్ = అన్న, ప్రాణ, మనో, విజ్ఞానమయాత్ముడు కాక ఇంకొకడు, కః = ఎవడు, ప్రాణ్యాత్ = స్వీకరించును, ఏషః హి ఏవ = వీడే, ఆనందయాతి = ఆనందపెట్టుచున్నాడు, ఏషః = వీడు, యదాహిఏవ = ఎప్పుడైతే, అదృశ్యే = కనపడనట్టియు, అనాత్మ్యే - శరీరస్థితుడైనట్టియు, అనిరుక్తే = నిర్వచింపవీలు లేనట్టియు, అనిలయనే = నివాసము లేనివాడైనట్టియు, ఏతస్మిన్ = ఈ పరబ్రహ్మమునందు, అభయం = భయంలేని, ప్రతిష్ఠాం, = స్థిరస్థితిని, విందతే = పొందుచున్నాడో, అథ = అటుపైన, సః = వాడు, అభయం = అభయమును, గతః భవతి = పొందినవాడగుచున్నాడు, యదా = ఎప్పుడు, ఏషః = వీడు, ఏతస్మిన్ = ఈ బ్రహ్మమునందు, ఉదరమంతరం = కించిత్ భయమును, కురుతేహి = చేయునో, అథ = అప్పుడు, తస్య = వానికి, భయం = భయము, భవతి = అగుచున్నది, అమన్వానస్య = 'బ్రహ్మ కంటె భిన్నముగా లేదు' అని తలంచని, విదుషః = విద్వాంసునకు కూడ, తత్ తు ఏవభయం = అదేభయము అగును), తదప్యేష శ్లోకోభవతి = ఆ విషయమును గూర్చియే ఈ మంత్రము అగుచున్నది.

**తాత్పర్యము :** ఈ కనపడు ప్రపంచము ఇంతకుముందు అవ్యక్తస్థితిలో బ్రహ్మముగా నుండెను. ఆ అవ్యక్త బ్రహ్మము నుండి ఈ నామరూపాత్మకమగు ప్రపంచము పుట్టెను. ఆ అవ్యక్తబ్రహ్మ ఈ వ్యక్త ప్రపంచమును తానే, లేదా తనను గానే చేసెను. అందువలన ఆ బ్రహ్మమే ఈ వ్యక్త ప్రపంచమునకు స్వయంకర్తృకమని చెప్పబడుచున్నది. ఈ స్వయంకర్తృకమగు బ్రహ్మము రసస్వరూపము. ఆ బ్రహ్మము రసమునే పొంది ఆనందించుటలో తనని తానే రసమయునిగా అనుభవించుచున్నాడు. ఈ దహరాకాశములో అట్టివాడే లేని యెడల ఎవడు ఈ అన్న, ప్రాణ, మనో, విజ్ఞాన మయాత్మకుని ఆనందపెట్టగలడు ? కనబడనట్టియు, శరరీహితుడైనట్టియు, నిర్వచింప వీలులేనట్టియు, నిలయరహితుడై నట్టియు ఐన దహరాకాశ బ్రహ్మమునందు

ఈ ఆనందమయాత్మకుడు భయము లేని స్థితిని పొంది, నిత్య భయరహితుడగును. ఈ పరబ్రహ్మమునకు తనకు స్వల్పభేదమును ఊహించినాడు భయమును పొందుచున్నాడు. విద్వాంసుడైనను బ్రహ్మముకంటె భిన్నముగా తనను గుర్తించినచో అట్టి భయమునే పొందుచున్నాడు. ఆ విషయమును గూర్చియే ఈ మంత్రము అగుచున్నది, అనగా చెప్పుచున్నది.

**వివరణము :** సాధారణముగా ఏదైన వస్తువు మన కళ్ళకు కనబడుచున్నప్పుడు అది ఉన్నట్లుగాను, కనబడనప్పుడు లేనట్లుగాను మనము చెప్పుదుము. కాని, ఇట్లు చెప్పుట అంత సత్యము కాదు. గ్లాసులో పంచదార ఉన్నప్పుడు గ్లాసులో పంచదార ఉన్నదని అందుము. అదే గ్లాసులో నీరు పోయగా పంచదార కరిగి ఉన్నప్పుడు గ్లాసులో పంచదార కనబడదు. అట్టి స్థితిలో పంచదార లేదనుట అజ్ఞానమగును. కరిగి వుండనపుడు వున్న పంచదార స్థితిని సిద్ధస్థితి (Manifested state) అందురు. నీటిలో చక్కగ కరిగి లీనమై ఉన్న పంచదార స్థితిని సాధ్యస్థితి (Potential state) అందురు. ఇదే విధముగా ఈ కనపడు ప్రపంచమంతయు బ్రహ్మము యొక్క సిద్ధస్థితి. ప్రళయములో ఈ ప్రపంచమంతయు ఆ బ్రహ్మమునందు లీనమై ఉండును. అట్టి బ్రహ్మమునే అవ్యక్త బ్రహ్మము అందురు. ఈ అవ్యక్త బ్రహ్మ లేనట్లు అనిపించినను ఆ స్థితి నుండియే దృశ్య ప్రపంచము వ్యక్తమగును. వేదమునందు అవ్యక్త బ్రహ్మమును 'అసత్' అనియు, వ్యక్తమైన దృశ్య ప్రపంచమును 'సత్' అనియు చెప్పుదురు. 'సత్', 'అసత్' లను 'భావము' 'అభావము' లని గూడ అనవచ్చును.

భావము, అభావములను గూర్చి భారతీయులు వేదాంత, తర్కశాస్త్రములలో చాల నిశితమైన అభిప్రాయములు చెప్పిరి. 'భావము' అనగా 'పుట్టుట' లేదా 'భౌతికముగా ఉండగల్గు స్థితి' అను అర్థములు చెప్పుకొనవచ్చును. 'భవము' నుండి ఏర్పడిన మాట 'భావము' కాబట్టి, కళ్ళకు ఎదురుగా కనబడగల్గు వస్తువు స్థితిని ఆ వస్తువు యొక్క 'భావస్థితి' అని, ఆ విధముగా కనబడలేని వస్తువు స్థితిని ఆ వస్తువు యొక్క 'అభావస్థితి' అనియు చెప్పుకొనవచ్చును. ఈ అభావ స్థితినే 'లేమిడి' అని గూడ అందురు.

ఒక గురువు తన శిష్యుని పిలిచి – 'ప్రక్కగదిలో ఒక మరచెంబు ఉన్నది పట్టుకుర'మ్మనెను. ఆ శిష్యుడు ప్రక్కగదిలోనికి వెళ్ళి తిరిగి వచ్చి 'లేద'నెను. అప్పుడు

గురువు – 'లేదని ఎట్లు చెప్పగల'వనెను. 'నేను స్వయముగా వెదికితిని. ఆ చెంబులేదు' – శిష్యుడనెను. అప్పుడు గురువు శిష్యునితో 'లేని చెంబును ఎట్లు వెదకితి' వనెను. శిష్యుడు కొంచెము తత్తరపడి, సమాధానము చెప్పుటకు తడబడెను. అప్పుడు గురువు శిష్యునితో –

"ఏదైన ఒక వస్తువును వెదుకునపుడు భౌతికముగా ఆ వస్తువు మన బుద్ధిలో వుండకపోయిననూ, ఆ వస్తువు యొక్క ఆకార పరిమాణాదులు మన బుద్ధిలో వుండును. ఆ విధముగా మన బుద్ధిలో వున్న ఆ వస్తువును ఆధారముగా చేసికొని బయట భౌతికముగా అట్టి వస్తువు ఉన్నదీ లేనిదీ వెదుకుట జరుగును. కాబట్టి "బుద్ధిలో నున్న వస్తువును దాని అభావ స్థితిగాను, బయట భౌతికముగా నుండు అదే వస్తువును దాని భావస్థితిగాను అర్థము చేసుకొనవలెను." కావున, ఒక వస్తువునకు 'భావస్థితి' 'అభావస్థితి' – ఇవి రెండును ఉన్నవని తెలిసికొనుము" అని చెప్పెను.

అభావములో గూడ నాలుగు విధములుండునని చెప్పిరి.

**1. ప్రాగభావము 2. ధ్వంసాభావము 3. అన్యోన్యాభావము 4. అత్యంతాభావము. వీటి వివరణ గూడ అవసరము.**

**1. ప్రాగభావము :** (ప్రాక్ + అభావము) అనగా, ఒక వస్తువు తయారవబడి ప్రపంచములోనికి భౌతికముగా రాక పూర్వము అది లేదు కదా! ఆ విధమైన ఆ వస్తువు యొక్క లేమిడిని (అభావస్థితిని) 'ప్రాగభావము' అందురు. ఉదా: ఒక పెన్ను తయారుకాబడక పూర్వము ఆ పెన్ను యొక్క లేని స్థితి.

**2. ధ్వంసాభావము :** (ధ్వంస + అభావము) అనగా, ఒక వస్తువు తయారవబడి ధ్వంసమై ప్రపంచములో దాని ఉనికి లేనపుడు గూడ ఆవస్తువు లేదు గదా! అపుడు లేకపోవు ఆ వస్తువు యొక్క స్థితిని ధ్వంసాభావమందురు. ఉదా: కుండ పగిలిన తరువాత గూడ అది వుండదు గదా ! ఆ విధముగా కుండ యొక్క లేని స్థితి అన్నమాట !

**3. అన్యోన్యాభావము :** (అన్యోన్య + అభావము) అనగా ఒక వస్తువు వేరొక వస్తువు వలె ఉండలేకుండు స్థితిని 'అన్యోన్యాభావము' అందురు. ఉదా: పెన్ను పుస్తకము వలె ఉండలేదు. అనగా పుస్తకము వలె ఉండలేని పెన్ను యొక్క స్థితిని పెన్ను యొక్క 'అన్యోన్యాభావము' అని తెలుసుకొనవలెను.

**4. అత్యంతా భావము :** (అత్యంత + అభావము) అనగా పూర్తిగా ఉండుటకు వీలులేని వస్తువు యొక్క లేమిడిని ఆ వస్తువు యొక్క 'అత్యంతా భావము' అందురు. ఉదా: గొడ్రాలి బిడ్డ. (ఉండుటకు అసలు వీలు లేదు గదా) కుందేటి కొమ్ము మొదలగునవి.

[(భావము - అభావములను గూర్చి భారతీయులకు గల ఇట్టి నిశిత, నిశ్చితాభి ప్రాయములను విదేశీయ శాస్త్రజ్ఞులు గూడ గ్రహించిరి. గామా (g) కిరణముల శోషణ ప్రక్రియలో జంట సృష్టి (Electron positron pair formation) దృగ్విషయమును వివరించునపుడు Diarc అను శాస్త్రజ్ఞుడు పైన చెప్పిన భావము, అభావములకు సంబంధించిన విషయములను మనసులో పెట్టుకొని అంతరిక్షములో అభావ స్థితి నుండి ఎలక్ట్రాను అదృశ్యమైన ఖాళీ ప్రదేశమును 'డిరాక్ హోల్' (Dirac hole) అనుచు, దానిని ఒక ఊహాకణముగా ప్రతిపాదించెను. ఆ కణము యొక్క భౌతిక స్థితిని అనగా భావస్థితిని ఆండర్సన్ (Anderson) అను శాస్త్రజ్ఞుడు విశ్వకిరణముల (Cosmic rays) ఉనికిని వివరించునపుడు ప్రాయోగికముగా అవిష్కరించెను. ఆ కణము పేరు పాజిట్రాన్ (Positron).]

"నాసతో విద్యతే భావో, నాభావో విద్యతేసతః" అనగా 'లేని దానికి ఉనికి లేదు, ఉన్నదానికి లేమి లేదు' అని భగవద్గీత కూడ చెప్పును. అందుచే ఇప్పుడు కనబడు ప్రపంచ రూపముగా నున్న బ్రహ్మ లేకపోవుట, లేనటువంటి బ్రహ్మ ప్రపంచముగా వ్యక్తమగుట జరుగదు. ఈ ప్రపంచమంతయు తనలోనే తానుగా ఆ బ్రహ్మము ఉండెను, మరల 'తనతోనే తనను స్వయముగా ఈ ప్రపంచముగా చేసెను'. (It has made itself from itself by itself) అను అర్థములో "తదాత్మానగ్గ్ం స్వయమకురుత" అను మంత్రము చెప్పబడినది. ఆ విధముగా

జరుగుట వలననే ఈ ప్రపంచము ఆ బ్రహ్మము యొక్క 'స్వయం కర్తృక'మని చెప్పబడుచున్నది. ఇది ఒక విశిష్టమైన కృత్యము. ఈ కృత్యము నందు పనిచేయువాడు లేదా తయారు చేయువాడు, తయారుచేయబడునది ఒకటే. 'ఇంకొకరి మీద ఆధార పడక, ఆశ్రయించక, ఇంకొక ముడిసరుకుతో నిమిత్తము లేక, తనకు తానే, తననే పెట్టుబడిగా పెట్టుకొని ఈ ప్రపంచముగా వ్యక్తమగుట ఒక విశిష్టమైన కృత్యము' అను అర్థములో "తస్మాత్ తత్సుకృత ముచ్యత ఇతి" అని చెప్పబడినది. (ఉదా: సాలెపురుగు గూడు కట్టునట్లు).

తనకు తానే ఈ ప్రపంచముగా మారు ఆ బ్రహ్మము రసస్వరూపుడు. ఆ విధముగా ప్రపంచముగా వ్యక్తమగుటలో ఆనందమును పొంది పూర్తిగా ఆనందమయుడగు చున్నాడు. పంచదారను తినునపుడు పొందు తీపి రుచి యొక్క అనుభూతి, మరియు, ఆనందము ఎక్కడ నుండి వచ్చినవి. పంచదారకు దానంతట దానికి తీపిలేదు. నాలుకకు కూడ దానంతట దానికి తీపిలేదు. కాని నాలుకపై పంచదారను వేసుకొనినప్పుడు చక్కని తీపి రుచి యొక్క అనుభూతి పొంది, ఆనందించుట జరుగుచున్నది. పంచదారకు దానంతట దానికి తీపి వున్నను లేదా నాలుకకు దానంత దానికి తీపి తెలిసినను, ఒక శవము యొక్క నాలుకపై పంచదారను వేసినపుడు కూడ అట్టి అనుభూతి కలిగి ఆనందించుట జరుగవలెను. కాని, ఇట్లు జరుగదు. కాబట్టి, నిజమైన రుచి, దానికి సంబంధించిన అనుభూతి అటు పంచదారకు, ఇటు నాలుకకు సంబంధించినవి కాక, ఆ రెండును ఏ పదార్థముతో చేయబడినవో అట్టి బ్రహ్మము యొక్క ఆనందమయునికి సంబంధించినవిగా తెలుసుకొనవలెను. ఈ క్రింది ఉదాహరణ ఈ విషయమును వివరించును.

పంచదార చిలకను చూచినపుడు పిల్లవానికి ఆనందము కలుగును. అప్పుడా పిల్లవానికి ఆనందకారణము పంచదార చిలక అని సాధారణముగా అనుకొందుము. కాని, ఇది సరికాదు. ఆ పంచదార చిలకను చూచుచున్నపుడు పిల్లవానికి తనలో ఏ చోటునందు మార్పు వచ్చునో ఆ చోటు నిజమైన ఆనంద కారణమగును. వాస్తవమునకు ఆ చోటు - బింబము, పంచదార చిలక - ప్రతిబింబము అగును. కాని, మన దృక్పథము సరిగా దీనికి వ్యతిరేకముగా నుండును.

పంచదార చిలకను బింబమని, మనలో దానిని చూసినపుడు మార్పు కలుగుచోటును ప్రతిబింబమని అందుము. దీనిని వ్యుత్క్రమ దృష్టి (Vision of inverson) అందురు. పంచదార చిలక బదులు ఏ తీపి పదార్థమును లేదా ఇష్టమైన వస్తువును చూచినను పిల్లవానిలో అదేచోట మార్పు వచ్చి, ఆనందము కలుగును. కాబట్టి, పిల్లవానిలో ఈ చోటు - బింబము, బాహ్యప్రపంచములోని తీపి పదార్థము లేదా ఇష్టమైన వస్తువు మొదలైనవి - ప్రతిబింబములు అగును. ఈ చోటును మనలోని బ్రహ్మ యొక్క ఆనందస్వరూపముగా తెలుసుకొనవలెను. పరబ్రహ్మ యొక్క ఈ ఆనంద స్వరూపమొక్కటే బింబమనియు, ప్రపంచములోని మిగిలిన వస్తువులన్నియు - ప్రతిబింబములనియు తెలుసుకొనవలెను. "విశ్వం దర్పణ దృశ్యమాననగరీ" అనుశ్లోకమును గాని, "ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడైతోచు" అనుపద్యమునుగాని పైన చెప్పిన విధముగా అర్థము చేసుకొనవలెను. కాబట్టి, 'అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయాత్మకుడుగా వ్యక్తమైన ఆ బ్రహ్మ తప్ప ఇట్టి ఆనందానుభూతిని ఎవరు పొందగలరు' అను అర్థములో "రసోవైసః, రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా ఉ_ఉనన్దీభవతి, కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్" అను మంత్రము చెప్పబడినది.

మనలో ఆనందమును పొందువాడు ఎవడు ? మనలో అతనికి స్థానమెక్కడ? అన్నియు ఉన్నట్లుగా కనపడు ఈ ప్రపంచము ఏమియు లేనట్లుగా కనపడుదాని నుండి (From seeming nothingness to apparent some-thing) వ్యక్తమగును. నియమిత ఘనపరిమాణమును, ద్రవ్యరాశిని కలుగు భౌతిక పదార్థమంతయు అవి రెండును లేనట్లు కనబడు ఆకాశమునుండియే ఉత్పన్నమగును. "ఆకాశాద్వాయుః... అద్భ్యఃపృథివీ" అని ఇంతకు పూర్వమే ఈ వల్లిలో చెప్పబడినది. అందుచే, పృథివ్యాపస్తేజో వాయువ్యాత్మకమగు ఈ ప్రాణి గూడ అట్టి ఆకాశము నుండియే ఉత్పన్నమవవలెను. అట్టి ఆకాశము దహరాకాశముగా ప్రతిజీవిలోను ఉండును. మనలో బ్రహ్మను గూర్చి 'వీడు' అని చెప్పగల్గునట్టి చోటుగా, ఈ దహరాకాశమును అర్థము చేసుకొనవలెను. మనిషికి డ్రస్సు, అడ్రస్సు ఎటువంటివో ఈ దహరాకాశమునకు ఈ శరీరము అటువంటిదని తెలుసుకొనవలెను. ఈ

దహరాకాశాత్మక ఆనందమయపురుషుడే మనలో ఆనందమును పొందువాడు. అట్టి కనపడని శరీర రహితుడైన, నిర్వచింపవీలులేని, ఆధారరహితుడైనట్టి పరబ్రహ్మ యొక్క అంశయే ఈ జీవుడని తెలుసుకొనినప్పుడు ఎన్నడును భయమును పొందడు. రెంటికి ఏ మాత్రము భేదము గుర్తించినను విద్వాంసుడైనను భయమును పొదును. అనగా, ఈ సమస్త ప్రపంచము, ఆ బ్రహ్మమేనని, మరల వేరొక రెండవ వస్తువు లేదని తెలిసిననాడు భయపడుట ఉండదు. భయపడువాడు, భయపెట్టువాడు లేదా భయపెట్టునది వేరుగా ఉన్నపుడు భయము ఉండును. అనగా, తాను కాక వేరొకటి ఉన్నపుడు గాని, మరియొకరి వలన గాని తనకు భయము కలుగవచ్చును. కాని, అన్నియు బ్రహ్మము యొక్క అంశములే అని తెలిసినపుడు భయము కలుగదు గదా! మన కుడిచేయి ఎడమచేతిని చూచి భయపడదు. అవి రెండును ఒకే మనిషికి సంబధించినవగుటయే గదా ఇందులకు కారణము. ఎంత విజ్ఞానవంతుడైనను ఈ విషయము తెలియనిచో తన నుండి వ్యక్త బ్రహ్మ ప్రపంచమును వేరుగా చూచి భయపడుట జరుగును. చోటులో సూది మొన ఉంచినచో, ఆ సూది మొన ఎంత చోటును ఆక్రమించునో దానిని "ఉదరము" అందురు. ఈ మాత్రము తేడా చూచిననూ భయమును పొందుట జరుగునను అర్థములో 'యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమంతరం కురుతే, అథ తస్యభయంభవతి, తత్త్వేవ భయం విదుషో ఉమన్వానస్య" అను మంత్రములలో చెప్పబడినది. 'పరిస్థితుల వల్ల భయము కలుగుచున్నది కదా ? అని సందేహము రావచ్చును. అట్టి పరిస్థితులు అంతకు పూర్వము మనము పడిన కక్కుర్తివలన ఏర్పడి, మనము భయపడవలసిన అవసరమునకు దారితీయునని తెలుసుకొనవలెను. అనగా, మనలో లొసుగు, కక్కుర్తి లేనినాడు భయపడవలసిన అవసరముండదని అర్థము.

(దైవ విగ్రహములకు 'అభయముద్ర' 'వరదముద్ర' అని రెండు రకముల ముద్రలు (చేతి అభినయములు) వుండును. వారిని సేవించినపుడు మనము ఏమి చేసినను భయము కలుగదని, కావలసివన్నియు ప్రసాదింపబడి లోటు ఉండదని కొందఱు అనుకొందురు. కాని, ఇది సరిగాదు. భయపడు పనులను మనలోని ఏ ప్రవృత్తి వలన మనము చేయుదుమో ఆ ప్రవృత్తిని మనలో లేకుండ చేయునది

అభయముద్ర అనియు, మన అర్హతను బట్టి ఎప్పుడు ఏవి కావలసియుండునో వాటిని ఏర్పాటుచేయునది వరదముద్ర అనియు గ్రహించవలెను.)

**మంత్రము :** భీషాఽస్మా ద్వాతః పవతే । భీషోదేతి సూర్యః । భీషాఽస్మా దగ్ని శ్చేంద్రశ్చ । మృత్యు ర్ధావతి పంచమ ఇతి । సైషాఽఽనందస్య మీమాంగ్ంసా భవతి। యువాఽస్యా త్సాధు యువా ఽధ్యాయకః । అశిష్ఠో ధృఢిష్ఠో బలిష్ఠః। తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్ । స ఏకో మానుష ఆనందాః। స ఏకో మనుష్య గంధర్వాణా మానందః । శ్రోత్రియస్య చాకామహతస్య। తే యే శతం మనుష్య గంధర్వాణా మానందాః । స ఏకః పితృణాంచిరలోకలోకానా మానందః । శ్రోత్రియస్య చాకామహతస్య । తే యేశతం పితృణాంచిరలోకలోకానా మానందాః । స ఏకః పితృణాంచిరలోకలోకానా మానందః । శ్రోత్రియస్య చాకామహతస్య । తే యేశతం పితృణాం చిరలోక లోకానా మానందాః । స ఏక ఆజానజానాం దేవానా మానందః । శ్రోత్రియస్య చాకామహతస్య । తే యే శతం కర్మదేవానాం దేవానా మానందాః । స ఏకో దేవానా మానందః । శ్రోత్రియస్య చాకామహతస్య । తే యే శతం దేవానా మానందాః । స ఏక ఇంద్రస్యానందః । శ్రోత్రియస్య చాకామహతస్య । తే యే శతమింద్రస్యానందాః । స ఏకో బృహస్పతేరానందః। శ్రోత్రియస్య చాకామహతస్య । తేయే శతం బృహస్పతే రానందాః। స ఏకః ప్రజాపతే రానందః । శ్రోత్రియస్య చాకామహతస్య । తే యే శతం ప్రజాపతే రానందాః । స ఏకో బ్రహ్మణ ఆనందః । శ్రోత్రియస్య చాకామహతస్య । స య శ్చాయం పురుషే । యశ్చాసా వాదిత్యే । స ఏకః। స య ఏవం విత్ । అస్మాల్లోకా త్ప్రేత్య । ఏత మన్నమయ మాత్మాన ముపసంక్రామతి । ఏతం ప్రాణమయ మాత్మాన ముపసంక్రామతి । ఏతం మనోమయ మాత్మాన ముప సంక్రామతి । ఏతం విజ్ఞానమయ మాత్మాన ముపసంక్రామతి । ఏత మానందమయ మాత్మాన ముపసంక్రామతి । తదప్యేష శ్లోకో భవతి ॥ (8)

**టీక :** అస్మాత్ = పరబ్రహ్మము వల్ల నుండి, భీషా = భయముచేత, వాతః = వాయువు, పవతే = వీచుచున్నది, సూర్యః = సూర్యుడు, భీషా = భయముచేత, ఉదేతి = ఉదయించుచున్నాడు, అగ్నిః చ = అగ్నియును, ఇంద్రఃచ ఇంద్రుడును,

అస్మాత్ = ఈ పరమాత్మవల్ల నుండి, భీషా = భయముచేతనే, (వారి వారి బాధ్యతలను నిర్వర్తించుచున్నారు), పంచమః = ఐదవవాడగు, మృత్యుః = మృత్యుదేవతయు, ధావతి = పోవుటను నిర్వర్తించుచున్నాడు, ఆనందస్య = ఆనందము యొక్క, సా + ఏషా = ఆ ఈ, మీ మాంస = విచారణ, భవతి = అగుచున్నది, యువా = యౌవనము కలవాడును, సాధు యువా = యువకుడై సాధుత్వము కలవాడును, అధ్యాయకః = అధ్యయనము చేయువాడును (వేదాధ్యయనము), ఆశిష్ఠః = భోగ్యవస్తువులను సకాలము నందు అనుభవించువాడును. ద్రఢిష్టః = దృఢతముడును, బలిష్ఠః = బలవత్తముడును, స్యాత్ = కలిగయున్న, తస్య = వానికి, ఇయంపృథివీ = ఈ భూమి, సర్వా = అంతయు, విత్తేన = ధనముచేత, పూర్ణా = పొందబడినది, స్యాత్ = అయి, (ఉండునో అట్టివాని ఆనందము), ఏకః = ఒకటి, లేదా ప్రమాణము (ఐన) ఆనందః = ఆనందము, మానుషః = మనుష్యసంబంధమైనది (ఆనందమగును), తే = ఆ, మానుషాః = మనుష్య సంబంధములగు, ఆనందాః = ఆనందములు, శతం = నూరు, మనుష్యగంధర్వాణాం = మనుష్య గంధర్వులకు, ఏకః = ఒకటియగు, ఆనందః = ఆనందమగుచున్నది, అకామహతస్య = కామము చేత హతుడు కాని, శ్రోత్రియస్యచ = శ్రోత్రియునకు కూడ, (అనగా శ్రుతుల మార్గములను అనగా వేదమార్గములను అనుసరించి జీవించువానికి) (ఇటుపైన ఇదే విధమైన అర్థములతో ఆనందమునకు సంబంధించిన మానములు ఇవ్వబడును. తాత్పర్యములో ఇవి తెలుపబడును).... పురుషే = పురుషుని యందు, అయం = ఈ ఆనందస్వరూపమగు పరమాత్మ, యః = ఎవడో, సఃచ = వాడును, యః చ ఆదిత్యే = సూర్యుని యందు ఎవడున్నాడో, సః చ = వాడును, ఏకః = ఒక్కడే, యః = ఎవడు, ఏవంవిత్ = ఈ విధముగా తెలుసుకొనుచున్నాడో, సః = వాడు, అస్మాత్ లోకాత్ = ఈ లోకమునుండి, ప్రేత్య = విడచి, ఏతం = ఈ, అన్నమయం = అన్నమయుడగు, ఆత్మానాం = ఆత్మను, ఉపసంక్రామతి = పొందుచున్నాడు, అట్లే ప్రాణమయుడగు, మనోమయుడగు, విజ్ఞానమయుడగు, ఆనందమయుడగు ఆత్మను, ఉపసంక్రామతి = పొందుచున్నాడు, తదప్యేష శ్లోకోభవతి = ఆ విషయమును గూర్చియే ఈ మంత్రము అగుచున్నది.

**తాత్పర్యము :** పరబ్రహ్మమునకు భయపడి వాయువు వీచుచున్నాడు. సూర్యుడు ఉదయించుచు, అస్తమించుచున్నాడు. అగ్ని, ఇంద్రుడు, ఐదవవాడగు యముడు కూడ ఆ పరబ్రహ్మమునకు భయపడి వారి వారి పనులను నిర్వర్తించుచున్నారు. ఇక ఇటుపైన ఆనందము యొక్క మీమాంస లేదా చర్చ జరుగును. యువకుడును, సాధుత్వము కలవాడును, వేదాధ్యయనమును చేయువాడును, శిష్టాచార సంపన్నుడును, దృఢవంతుడను, బలవంతుడును, కోరికలు తీరి ఈ భూమినంతను పొందిన వాడును ఐన ఒకని యొక్క ఆనందము మానుష ఆనందము అగును. దీనిని ఒక ప్రమాణముగ తీసుకొనినచో, ఇట్టి వంద మానుషానందములు ఒక మనుష్య గంధర్వానందమగును. కోరికలచే బాధింపబడని శ్రోత్రియుడు కూడ ఇట్టి ఆనందమును పొందును. వంద మనుష్య గంధర్వానందములు ఒక దేవ గంధర్వానందమునకు సమానము. కోరికలచే బాధింపబడని శ్రోత్రియుడు దానిని గూడ పొందును. వంద దేవగంధర్వా నందనములు చిరలోకలోకులకు, పితరులకు ఒక ప్రమాణ ఆనందమగును. చిరలోకలోకుల, పితరుల నూరు ఆనందములు ఆజానజులగు దేవతల యొక్క ఒక ఆనందమునకు సమానము. ఆజానజులగు దేవతల నూరు ఆనందములు కర్మ దేవులగు దేవతల యొక్క ఒక ఆనందమునకు సమానము. కర్మదేవులగు దేవతల నూరు ఆనందములు దేవతల యొక్క ఒక ఆనందమునకు సమానము. దేవతల యొక్క నూరు ఆనందములు దేవతల యొక్క ఒక ఆనందమునకు సమానము. దేవతల యొక్క నూరు ఆనందములు ఇంద్రుని యొక్క ఒక ఆనందమునకు సమానము. నూరు ఇంద్రానందములు ఒక బృహస్పత్యానందమునకు సమానము. నూరు బృహస్పత్యానందములు ఒక ప్రజాపత్యానందమునకు సమానము. నూరు ప్రజాపత్యానందములు ఒక బ్రహ్మానందమునకు సమానము. ఇట్టి ఆనందము లన్నియు కోరికలచే బాధింపబడని శ్రోత్రియుడు కూడ పొందును. ఇన్ని విధములుగా పురుషుని యందు ఆనందమును పొందు ఆనందస్వరూపుడైన వాడు ఎవడో, ఈ కనబడు సూర్యునిలో ఉన్నవాడును వాడే ! ఎవరు ఈ విధముగా తెలుసుకొని, ఈ లోక విషయములందు ఆపేక్ష లేనివాడగునో - వాడు ఈ అన్నమయుడగు ఆత్మను, ప్రాణమయుడగు ఆత్మను, మనోమయుడగు ఆత్మను, విజ్ఞానమయుడగు ఆత్మను, ఆనందమయుడగు ఆత్మను పొందుచున్నాడని ఈ మంత్రము చెప్పుచున్నది.

**వివరణము** : ఈ అనువాకమునందు ఆనందము యొక్క కొలతలు, ప్రమాణములు చెప్పబడును. దీనికిముందు మనలో ఆనందమును అనుభవించు వానియొక్క వైశిష్ట్యము చెప్పబడును. మొట్టమొదటనే అట్టి ఆనంద స్వరూపుడైన పరబ్రహ్మవల్ల నుండి వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు చివరకు మృత్యుదేవత కూడ భయపడుచు, వారి వారి విధ్యుక్తధర్మములను నిర్వర్తించుచున్నారని చెప్పబడుచున్నది. 'భయపడుట' అనునది చిత్రమైన పద్ధతిలో వాడబడినది. మనము తప్పనిసరిగా చేయవలసిన పనులను చేసితీరుచుందుము. ఆకలి వేసినప్పుడు అన్నమును తినుచుందుము. నిద్రవచ్చినపుడు నిద్రపోవుదుము. ఇవి తప్పనిసరిగా మనము చేయుపనులు. ఇవి చేయకుండ ఉండలేము. ఈ పనులు మనపట్ల ఎటువంటివో వాయువునకు వీచుట, సూర్యునకు - ఉదయాస్తమానములు మొదలైనవి గూడ వారికి అటువంటివే ! అట్లే, ఉప్పు ఉప్పుగానుండక తప్పకపోవుట, పంచదార తియ్యగానుండక తప్పకపోవుట, నీరు పల్లమునకే ప్రవహించక తప్పకపోవుట మొదలైనవన్నియు వాటి వాటి సహజ ధర్మములు. 'ఎవరికో భయపడి అవి ఆయా ధర్మములను నిర్వర్తించు చున్నవా ? అని ప్రశ్న రావచ్చును. మనము ఆనందమును పొందుటకు మనలోనికన్ను - చూచుచు, చెవి - వినుచు, ముక్కు - వాసన చూచుచు, నాలుక - రుచి చూచుచు. చర్మము - స్పర్శ సుఖమును పొందుచు ఉండవలెను. అప్పుడు మనలోని మనస్సు వీటిద్వారా ఆనందమును పొందును. ఐనచో, 'మనస్సునకు భయపడి ఈ జ్ఞానేంద్రియములు వాటి వాటి పనులను నిర్వర్తించుచున్నవా?' అను ప్రశ్న ఎటువంటిదో ప్రస్తుత విషయము నందలి ప్రశ్నకూడ అటువంటిదే. ఈ ప్రశ్నలకు సమాధానము ఒక్కటే ! ఆనందమును పొందుట పరమావధి. అది పొందుటకు ఎన్నో రకములుగా విధ్యుక్త ధర్మములు పాటింపబడవలెను. అట్లు పాటించువారు వేరు వేరుగా నున్నను అనుభవించువాడు ఒక్కడే! ఆయన పేరు "Cannot be otherwise" గారు అనవచ్చును. ఈయనయే మనలో వున్న బ్రహ్మానందము గారు. 'ఈ ఒక్కని యొక్క చెప్పుచేతలలో మిగిలినవి వాటి వాటి విధ్యుక్తధర్మములను నిర్వర్తించును' అను ఉద్దేశ్యముతోనే ఈయనకు భయపడి అవి పనిచేయుచున్నవని చెప్పుట జరిగినది. అంతేగాని, భయమనగా అతను కొట్టునని, దెబ్బలు తగులునను ఉద్దేశ్యముతో కాదు. 'సత్యము' అను ధర్మమునకు

ప్రభువు ఆనందమయుడగు పరమాత్మ అగుచుండగా – ప్రపంచముగా వ్యక్తమైన ఆ పరమాత్మ యొక్క సమస్తాంశములు సత్యసామ్రాజ్యస్థాపనకై నిర్వర్తించు బాధ్యతలే వాటి వాటి సహజధర్మములని ఈ మంత్రము యొక్క సారాంశము.

ఇటుపైన ఆనందమును గూర్చి మీమాంస ఉండును. ఒక విషయమును గూర్చి ఇదమిత్థమని ప్రయత్నము చేయుటను 'మీమాంస' అందురు. ఆనందమును గూర్చి, దానిలో గల పొరలవంటి చిన్న చిన్న ఆనందముల గూర్చి ఇచ్చట చెప్పబడును. ఒక యువకుడును, సాధు స్వభావముగలవాడును, వేదాధ్యయనము చేయువాడును, శిష్టాచార సంపన్నుడును, ధృడగాత్రుడను, బలిష్ఠుడును, సర్వభూమిని తనధనముగా భావించి పరిపూర్ణత చెందినవాడును ఐన ఒకడు పొందు ఆనందమును ఒక ప్రమాణ ఆనందముగా తీసుకొనిరి. దీనినే ఒక మానుష ఆనందము అందురు. ఇది ఒక రూపాయి నోటు వంటిది. ఒక రూపాయి నోటుకు కొన్ని రెట్లు విలువ గల రూపాయిల నోట్లు గూడా వుండును. అదే విధముగా ఈ మానుషానందమునకు కొన్ని రెట్లు ఎక్కువలో ఉండు ఆనందములు గూడ ఇక్కడ ప్రతిపాదింపబడును.

ప్రమాణ ఆనందమయునకు చాల నియమ విశేషణములు చెప్పబడినవి. ఆనందమును పొందువాడు ముసలివాడైనచో వయోధర్మములవలన వచ్చు ఇబ్బందులు ఆనందమునకు అడ్డుపడును. కాబట్టి యువకుడనియు, యువకుడైనను కోపిష్ఠి, క్రూరుడు ఐనచో ఇబ్బందులపాలై ఆనందమునకు తానే అవరోధమును కల్పించుకొనును. కాబట్టి సాధువై ఉండవలెననియు, నిత్యము అధ్యయనము చేసినవాడై ఉండవలెననియు (అట్లు చేయనిచో యుక్తాయుక్త వివేచన, ధర్మాధర్మ విచక్షణ, న్యాయా న్యాయ విచారణ లేనివాడై, నిత్యానిత్యములు తెలుసుకొనలేక ఆనందమునకు తానే అవరోధముగా తయారగును). ఎంత చదివినను చదివిన దానిని ఆచరణలో పెట్టనిచో అది వృథా అగును కాబట్టి అధ్యయనము చేయవలసిన వాటిని ఆచరణలో పెట్టు శిష్టాచార సంపన్నుడగ ఉండవలెననియు ఇక్కడ చెప్పబడినది. మరియు, ధృఢమైన గాత్రము అనగా దెబ్బలను తట్టుకొనగలుగు శరీరమును కలిగి యుండవలెను. ఒక వేళ దెబ్బ తగిలినను తక్కువ కాలములోనే దాని ఫలితము నుండి తట్టుకొని, యథాస్థితిని పొందు శరీరమని చెప్పుటకు ధృఢిష్ఠ పదము

వాడబడినది. ధృఢత్వము భౌతిక శరీరమునకు సంబంధించినదై వుండగా, బలము కేవలము శరీరమునకే కాక ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయములకు కూడ వర్తించును. కొందరు శరీరముచే సన్నగా ఉన్నను సంకల్ప బలము, ఆత్మబలము ఎక్కువగా నుండువారు ఉందురు. ఇక్కడ బలమను పదము ఆ అర్థములో వాడబడినది.

'జగమునంతయు ఏలకలిగినవాడును' అను అర్థముతో పాటు 'ఈ పృథివినంతను ధనమయమను భావముతో పరిపూర్ణుడైనవాడు' అను అర్థమును "పృథివీసర్వావిత్తస్య పూర్ణాస్యాత్" అను మంత్రమునకు చెప్పుకొనవలసి యుండును. "ధనమగ్నిర్ధనంవాయుః ధనం సూర్యోధనంవసుః" అని శ్రీ సూక్తఫలశ్రుతి చెప్పును గదా! ఇన్ని గుణవిశేషణములు కలవాడు పొందు ఆనందము ఒక మానుష ఆనందము అని ప్రమాణముగ తీసుకొనబడినది. ఇట్టి ఆనందము కోర్కెలచే పీడింపబడని శ్రోత్రియునకు కూడ సిద్ధించునని "శ్రోత్రియస్య చాకామహతస్య" అని చెప్పబడినది. అంతేకాక, ఇంక ముందు ముందు గూడ అన్నిరకముల ఆనందములును కోర్కెలు లేని శ్రోత్రియునకు దక్కగలవని ప్రతిసారి నొక్కి వక్కాణింపబడుట జరుగుచుండును. ఇక్కడ కామము అనగా కేవలము స్త్రీ పురుష సంబంధమునకే పరిమితము కాదు, ఇంద్రియములకు సంబంధించిన ఏ విషయ వాంఛలైనను కామమే అగును. ఇటుపైన మానుషానందము కన్న మిన్నయైన ఆనందములు కలవనియు, అవన్నియు మానుషానందమునకు కొన్ని వందల, వేల రెట్లుగా ఉండుననియు చెప్పబడును. చిట్టచివరకు అన్నిటి కన్న మిన్నయైన ఆనందము బ్రహ్మానందముగా చెప్పబడును. ఇది అన్ని ఆనందములకు తుది మెట్టు. ఇది వెయ్యిరూపాయలనోటు అనుకొనినచో మిగిలిన ఆనందములు వందరూపాయలు, యాభై రూపాయలు, ఇరవై రూపాయలు, వగైరాల వంటివి. అనగా మిగిలిన ఆనందములు గూడ బ్రహ్మానందములోని భాగములే కాని వేరుకాదు. మనము అత్యంత సంతోషమును తెలుపు విషయమును గాని, సన్నివేశమును గాని బ్రహ్మాండముగ నున్నదనియో లేదా బ్రహ్మానందముగా నున్నదనియో అందుము. ఇక్కడ చెప్పిన మనుష్య గంధర్వ దేవగంధర్వ, చిరలోక లోక పితర, ఆజానజదేవ, కర్మదేవ, దేవ, ఇంద్ర, బృహస్పతి, ప్రజాపతి, బ్రహ్మానందములన్నియు కోర్కెలు లేని

శ్రోత్రియుడు గూడ పొందునని చిట్టచివరకు మరల ప్రస్తావించబడెను. ఒక వస్తువును కోరుట ఎప్పుడు జరుగుననగా ఆ వస్తువు – మనము వేరైనపుడు. ఆ వస్తువును మననుండి వేరుగా గుర్తించినంతవరకు ఆ వస్తువును పొందవలెనన్న అభిలాష పెరుగుచుండును. అప్పుడు మనకు దానికి దూరము పెరుగుచుండును. అట్లుగాక, ఈ ప్రపంచములో 'అన్యము అనునది లేదు' అను భావము ఆచరణాత్మకముగా కలిగినచో, అప్పుడు 'తను దేనిలోని భాగమో, ఈ కనపడునవన్నియు కూడ దానిలోని భాగములే' అని తెలియును. అప్పుడు ఈ విశ్వమంతయు ఒకే పరమపురుషునిగా పరబ్రహ్మముగా గుర్తించుట జరిగి ఇతరమును పొందవలెనను కోరికకు తావుండదు. ఇట్టి స్థితిలో ఉన్నవాని యోగక్షేమములను "నేను" వహించును. అనగా ఆ ఒక్క "నేను" అను పరమపురుషునిదే తనలోని అంశముల బాధ్యత అగును. ఈ అర్థములోనే "అనన్యాశ్చింతయంతోమాం ... వహామ్యహం" అని భగవద్గీతలో చెప్పబడినది. అట్టి స్థితిలో వున్న వాని ఆనందమే బ్రహ్మానందము. కోరికలు లేకపోవుట చేతనే కదా ఇది సిద్ధించినది. అందుచేతనే, శ్రోత్రియస్యచాకామహతస్య' అనగా కోరికలు లేని శ్రోత్రియుడు ఈ చెప్పబడిన ఆనందములన్నిటిని అనుభవించు'నని చెప్పబడినది. 'అంశగా ఈ ఆనందమును అనుభవించువాడు, ఈ మొత్తమునకు ఆనంద స్వరూపుడైన పరబ్రహ్మ ఒక్కడే' అను అర్థములో 'సయశ్చాయంపురుషే। య శ్చా సా వాదిత్యే। స ఏకః" అని చెప్పబడినది. అట్టి స్థితిలో ఈ భౌతిక ప్రపంచములోనే ఉన్నప్పటికిని, ఈ లోకమును విడిచి ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయాత్మకమైన లోకములను తాను పొందగలడు. మంచి సంగీతమును వినుచున్నపుడు మనము కూర్చున్న చోటును, ప్రక్కనున్న మనుష్యులను, పాడుచున్న గాయకుని – ఈ అన్నిటినీ విడిచి ఆనందమయ లోకములో ఉండుట ఎఱిగిన విషయమే గదా ! ఈ విషయమును గూర్చియే ఈ అనువాకాంతములో "ఏత మన్నమయమాత్మాన ముపసంక్రామతి... ఏత మానందమయ మాత్మాన ముపసంక్రామతి" అని చెప్పబడినది.

**మంత్రము : *యతో వాచో నివర్తంతే। అప్రాప్యమనసా సహ। ఆనందం బ్రహ్మణో విద్వాన్। నబిభేతి కుత శ్చనేతి। ఏతగ్ం హవావ న తపతి। కి మహగ్ం సాధు నా కరవమ్। కి మహం పాప మకరవమితి। స య ఏవం విద్వానేతే ఆత్మానగ్గ్ం స్పృణుతే। ఉభేహ్యేవైష ఏతే ఆత్మానగ్గ్ం స్పృణుతే। య ఏవం వేద। ఇత్యుపనిషత్ ॥*** *(9)*

**టీక :** యతః = ఎవనినుండి,వాచ: వాక్కులు, మనసా సహ = మనస్సుతో గూడ, అప్రాప్య ఏవ = పొందకయే, నివర్తంతే = మరలుచున్నవో, (అట్టి) బ్రహ్మణః = బ్రహ్మము యొక్క, ఆనందం = ఆనందమును, విద్వాన్ = ఎఱిగినవాడు, కుతశ్చన = దేనివల్లనుండియు, నబిభేతి = భయపడదు, అహం = నేను, సాధు = పుణ్యకర్మలను, కిం+ న+ అకరవమ్ = కింనాకరవమ్ = ఏలచేయకపోతిని, ఇతి = ఇట్లనెడి (చింత), ఏతం = ఇట్టి బ్రహ్మవేత్తను, న తపతి హావావ = తపింపచేయజాలదుగదా, యః = ఎవ్వడు, ఏవం = ఈ విధముగా, వేద = తెలుసుకొనుచున్నాడో, సః ఏషః = ఆ ఇతడు, ఏతే ఉభే = ఈ పుణ్యపాపముల రెంటిని, ఆత్మానాం = ఆత్మను గూర్చి, స్పృణుతే = బలపరుచుచున్నాడు, ఉపనిషత్ = ఉపనిషత్తు, ఇతి = ఇది (సమాప్తమైనది)

**తాత్పర్యము :** మన మనస్సులుగాని, వాక్కులుగాని, ఎవని వరకు వెళ్లి, అతనిని పొందకయే వెనుకకు మరలునో అట్టి బ్రహ్మము యొక్క ఆనందమును ఎఱిగినవాడు దేనివల్ల నుండియు భయపడదు. అట్టివానిని తన చిట్టచివర స్థితిలో గూడ "పుణ్యకర్మలను ఏల చేయక పోతిని ? పాపకర్మలను ఏల చేసితిని ?" అను ప్రశ్నలు బాధింపవు. ఈ బ్రహ్మను తెలిసినవాడు ఈ పుణ్య పాపములు రెంటిని పరమాత్ముని లీలావిశేషముగనే భావించును. ఈ విషయములను తెలుసుకొనుచున్న వాడు ఎవడో అతనిని గుఱించియే ఈ ఉపనిషత్ చెప్పబడుచున్నది.

**వివరణము :** ఆత్మశబ్దవాచ్యుడైన పరబ్రహ్మము వాక్కులకు అందువాడు కాదు. మనస్సునకు కూడా లొంగువాడు కాదు. ఈ వాక్కులు, మనస్సు పరబ్రహ్మము వఱకు వెళ్లునేమో గాని అతనిని ప్రవేశించలేవు. "నాయమాత్మా ప్రవచనేన లభ్యః" అని ఇందులకే చెప్పబడినది. దీని అర్థమేమనగా వాక్కులచేతగాని, మనస్సు చేతగాని భగవంతుని నిర్వచింపలేము. అతడు ఆనందమయుడు. మనము ఆనందమును పొందునపుడు ఆ ఆనందమును - రంగు, రుచి, వాసన మొదలైన వాటితో 'ఆనందమనగా ఇది' అని నిర్ణయించగలమా ! నిద్రపోవుచున్నపుడు పొందు సుఖానుభూతిని వాక్కులతోను, మనస్సుతోను నిర్ణయింపగలమా ? ఇది ఎట్లు అసాధ్యమో ఆనందమయుడైన పరబ్రహ్మను నిర్వచించుటగాని, నిర్ణయించుటగాని అట్లే అసాధ్యము' అను అర్థములో మనస్సు, వాక్కు గూడ అతనిని పొందకయే వెనుతిరిగునని అనువాక ప్రారంభములో చెప్పబడినది. ఇట్టి ఆనందమయుడైన బ్రహ్మను అనుభూతిగా ఆనందించువాడు దేనికిని భయపడదు. నిద్రలో సుఖమును

అనుభవించువాడు ఇతర చింతలు గాని, భయములు గాని ఏవిధముగా పొందడో ఇట్టి స్థితిని పొందిన వాడు గూడ ఆనందలోకములోనే ఉండును గాని, క్రింది లోకములోనికి దిగజాఅడు. మరియు, ఆ స్థితిలో ఉన్నవానికి తన భార్యాబిడ్డల విషయముగాని, తన డిగ్రీలు గాని, జీతము గాని, సన్మాన, అవమానములు గాని, ఇతరులు మెచ్చుకొనుట – తిట్టుకొనుటలు గాని; తాను 'ఇవి చేసితిని', 'అవి చేయలేదు' అను శంకలు గాని ఏమియును ఉండవు. వీటన్నిటికి అతడు అతీతుడుగా పరమాత్మలో ఐక్యమై ఆనందలోకములోనే విహరించును. ఇట్టి పరమాత్మలోకములో అన్యమనునది లేక కేవలము ఆనందస్థితి వర్తించును. ఈ స్థితినే 'కైవల్యము' లేదా 'మోక్షము' అందురు. ఈ స్థితిని 'ఆత్మానందము', 'బ్రహ్మానందము' అని గూడ అందురు. ఈ స్థితిని మచ్చుకి ప్రతిరోజు నిద్రలో మనము అనుభవించుచున్నాము. (The conditioned will will be absorbed and become one with the unconditioned Will in the state of this experience). అట్టి స్థితిలో పొందువాడు వేరు, పొందబడునది వేరు అని ఉండక తానే బ్రహ్మము, బ్రహ్మమేతానై ఉండును. కాబట్టి, 'అట్టివానిని గూర్చియే ఈ ఉపనిషత్తు చెప్పబడుచున్నది'. అను అర్థములో "య ఏవం వేద ఇత్యుపనిషత్" అను మంత్రము చెప్పబడినది. అంతేకాని 'ఎవరైతే దీనిని తెలుసుకొనునో' అను సవాలు (ఛాలెంజ్) కాదు. ఇటుపైన మరల ఉత్తరశాంతి పాఠముగా 'సహనావవతు' మంత్రము చెప్పబడును.

## ఉత్తర శాంతి పాఠము

**సహ నా వవతు । సహ నౌభుక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తి ః ।**

**ఈ శాంతి పాఠమునకు టీకా తాత్పర్య వివరణములు ముందే తెలుపబడినవి. కావున మరల ఇక్కడ తెలుపుట లేదు.**

**హరిః ఓం తత్సత్ ।**

# తైత్తిరీయోపనిషత్తు

## తృతీయాధ్యాయము - భృగువల్లి

### (టీకాతాత్పర్య వివరణములు)

### పూర్వశాంతి పాఠము

*ఓం సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ।*

**టీక :** సహ నౌ = (గురుశిష్యులమైన మా ఇద్దఱిని కూడ, (పరబ్రహ్మ) అవతు = సంరక్షించును గాక, సహ నౌ = (గురుశిష్యులమైన) మా ఇద్దఱిని కూడ, భునక్తు = అనుభవించి, పాలించును గాక, సహవీర్యం = కార్యదక్షత, సామర్థ్యమును గూడ, (కలిగి యుండి) కరవావహై = (పనులను) నిర్వర్తించెదము గాక, నౌ = మా యొక్క, అధీతం = అధ్యయనము చేయబడిన విద్య, తేజస్వి = తేజోవంతమైనది, అస్తు = అగుగాక, మా విద్విషావహై = (మా ఇరువురి మధ్య అనగా గురుశిష్యుల మధ్య) ద్వేషము కలుగకుండుగాక, ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః = ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయమునకు శాంతి కలుగు గాక!

**తాత్పర్యము :** (పరబ్రహ్మ) మా గురుశిష్యులిద్దఱిని సంరక్షిచును గాక. (పరబ్రహ్మ) మా ఇరువురిని అనుభవించి పరిపాలించును గాక. (మేమిద్దఱము) కార్యదక్షత, సామర్థ్యమును గూడ కలిగి యుండి, పనులను నిర్వర్తించెదము గాక. (మా ఇరువురి మధ్య) అభిప్రాయ భేద, ద్వేషాది భావములు కలుగకుండుగాక. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయమునకు శాంత్యోపశమనము కలుగుగాక!

**వివరణము :** ఇది ఒక చక్కని ప్రార్థన, విద్యారంభమున గురుశిష్యులు గాని, ఇద్దఱు లేక ఇద్దఱు మించి ఏదైన ఒక పనిని చేయుటకు ఉపక్రమించునపుడు గాని ఈ ప్రార్థన చేయుట చాల సమంజసము గాను, సార్థకముగాను ఉండును.

"సహ" అను పదప్రయోగముచే పరమాత్మను ఏది కోరినను స్వార్థబుద్ధితో గాక, తన తోటివారికి కూడ తాను కోరినది అందవలెనను సదుద్దేశ్యము, సత్సంకల్పము, సహకార గుణము ద్యోతకమగును. 'సహ నా వవతు' అనగా 'సహ - నౌ - అవతు' అని పదవిభాగము. మరియు, 'సహనౌఅవతు' అను వాక్యమును 'స', 'హ', నౌ, అవతు, అని విడదీసినచో మరింత వివరణ అవసరమగును. అనగా 'సహ' అను పదమును 'స', 'హ', అను అక్షరములుగా విడివిడిగా చదివినచో ఈ 'స', 'హ'లు ఎవరు ? 'స' అను అక్షరము పురుషునకు, లేదా అయ్యవారికి, 'హ' అను ప్రకృతికి లేక అమ్మవారికి ప్రతీకలు - అందువలననే పురుషసూక్తము" సహస్ర శీర్షా పురుషః...." అని, 'స' అను అక్షరముతో ప్రారంభింపబడును, అట్లే శ్రీసూక్తము, (అమ్మవారి సూక్తము) "హిరణ్యవర్ణాం హరిణీమ్..." అని 'హ' అక్షర సంబంధమైన 'హి' తో ప్రారంభింపబడును. అనగా సమస్త విశ్వమునకు తల్లి దండ్రుల (Parents) వంటివారు, ప్రజ్ఞ (Consciousness) - పదార్థముల (Matter) వంటివారు, కేంద్రము - పరిధుల (Seed) వంటివారు,. బీజ (Seed) - వృక్షముల (Tree) వంటివారు, ఉచ్ఛ్వాస - నిశ్వాసముల వంటివారును అయిన ఆదిదంపతులు మమ్ము రక్షించుగాక అని గూడ అర్థము వచ్చును.

ప్రతివ్యక్తి యొక్క శ్వాసక్రియలో ఉచ్ఛ్వాసమునందు 'సో', నిశ్వాసమునందు 'హం' అను ధ్వని పూర్వక అక్షరములు వినబడును. ఈ రెంటినీ 'సో ఽ హం' అను మంత్రముగా, మనలో నిరంతరము మన ప్రమేయము లేకపోయినను జరుగు అజపాగాయత్రీమంత్రముగా చెప్పుదురు. ఉచ్ఛ్వాసము - లీనమును (Involution), నిశ్వాసము - వ్యక్తమును (Evolution) తెలియ జేయును. ఈ రెంటినీ జగత్తునకు తండ్రి - తల్లిగా, శివపార్వతులుగా భారతీయులు చెప్పుదురు. ఈ రెండక్షరముల 'సో ఽ హం' మంత్రమునే వామగతిగా చదివినచో 'హంసో' లేదా 'హంస' అగును. ఈ 'హంస' పక్షినే శరీర గృహమునకు యజమానియైన జీవునిగా చెప్పుదురు. తల్లిదండ్రులకు ప్రతీకలైన 'హం' 'సో'ల కలయికతో జీవుడు వ్యక్తమగునని సూచితము. కాబట్టి 'సహనౌ అవతు' అనునపుడు 'జగజ్జననీ జనకులు మమ్ము రక్షించుగాక' అని ప్రప్రథమముగా ప్రార్థన చేయబడినది.

ముందుగా "అవతు" అనుటలో రక్షణ విషయము చెప్పబడినది బ్రతికి బట్టకట్టినపుడే గదా ఏదైనను చేయుట. అందుచే, ముందుగా మేము రక్షింపబడుదుము గాక' అని చెప్పబడినది. లేదా, ఇరువురిలో నున్నవాడు మాఇద్దఱిని రక్షించుగాక' అను అర్థమును కూడ చెప్పుకొనవచ్చును.

తరువాత "భునక్తు" అనుటలో అనుభవపూర్వకమైన పరిపాలన విషయము చెప్పబడినది. పరిపాలనమనగా 'సాకుట లేదా పోషించుట' అను అర్థములో - 'పోషింపబడుటలోను, జీవితములో పొందు అనుభూతి విషయములోను మా ఇద్దఱిలో నున్న వాడు ఒకే విధముగా ఇద్దఱిని పోషించి, అనుభవించి జీవించుగాక', అని చెప్పుకొనవలెను. ఇద్దఱి మనస్సులు విడివిడిగా కాక ఇరువురి మధ్య, ఇరువురిలో ఉన్న వాని మనస్సు వర్తించి, వర్ధిల్లు (దుము) గాక" అని గూఢార్థము.

''సహవీర్యం కరవావహై'' అనుటలో 'మా ఇద్దఱిలోని పరమాత్మవీర్యముచేతనే మా కర్మలు నిర్వహింపబడుగాక' అని చెప్పుకొనవలెను. ఇక్కడ 'వీర్యము' అనగా ఏ పని చేయుటకైనను కావలసిన చురుకుదనము, ప్రయత్నము, దక్షత, సామర్థ్యము అను అర్థములుగా గ్రహించవలెను.

"తేజస్వి నౌ అధీతం అస్తు" అనుటలో 'ఇద్దఱినీ వ్యక్తపరుచు ఆ ఒకే తేజస్సు మా ఇద్దఱి చేత అధ్యయనమును చేయించును గాక' లేదా మాచే 'ఆ తేజస్సు అధ్యయనము చేయబడుగాక' అని గూడ అర్థము చేసుకొనవలెను.

"మా విద్విషావహై" అనుటలో మా ఇద్దఱి మధ్య ద్వేషభావము లేక ఒకే అభిప్రాయము వర్తించి ఏకమతము అనగా - ఐకమత్యము (మతము అనగా అభిప్రాయము. ఏక మతమునకు తద్ధిత రూపము ఐకమత్యము) వర్ధిల్లుగాక అని అర్థము చెప్పుకొనవలెను.

ఈ విధముగా ఇద్దఱి మధ్య కలుగవలసినవి కలిగి, తొలగవలసిన ఆధిభౌతిక, ఆధ్యాత్మిక, ఆధిదైవిక తాపత్రయము తొలగి, శాంతి వర్థిల్లుగాక' అనుటతో ఈ సంప్రార్థనము ముగియును.

**మంత్రము :** భృగు ర్వై వారుణిః । వరుణం పితర ముపససార । అధీహి భగవో బ్రహ్మేతి । తస్మా ఏతత్ప్రో వాచ । అన్నం ప్రాణం, చక్షు శ్శ్రోతం మనో వాచ మితి । తగ్ం హోవాచ । యతో వా ఇమాని భూతాని జాయన్తే । యేన జాతాని జీవన్తి। యత్ప్రయన్త్య భి సంవిశన్తి । తద్విజిజ్ఞానస్య । త ద్బ్ర హ్మేతి । స తపోఽతప్యత । స తపస్తప్త్వా ॥ (1)

**టీక :** వారుణిః = వరుణుని పుత్రుడైన, భృగుః = భృగువు, వరుణం = తండ్రియైన వరుణుని, ఉపససారవై = దగ్గఱకు వెళ్ళెను, (బ్రహ్మను గూర్చి అనుభవింప చేయు విద్యను) అధీహి ఇతి = అధ్యయనము చేయించవలసినది (అని అడిగెను), (అప్పుడు తండ్రి), అన్నం ప్రాణం చక్షుః శ్శ్రోత్రం మనః వాచమ్ ఇతి = అన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కు ఇవి (బ్రహ్మప్రాప్తికి ప్రవేశమార్గములని), ఏతత్ప్రోవాచ = ఈ విధముగా పలికి, యతః = ఎవనివలన, ఇమాని భూతాని = ఈ భూతములు, జాయన్తే = పుట్టుచున్నవో, జాతాని = పుట్టిన భూతములు, యేన = ఎవనిచేత, జీవన్తి = జీవించుచున్నవో, అభిసంవిశన్తి = ఏకత్వమును పొందుచున్నవో, తత్ = అది, బ్రహ్మ ఇతి = బ్రహ్మమని, ఉవాచ హ = చెప్పెను. ('దానిని గూర్చి తెలుసుకొనుము' అని ప్రోత్సహించెను) సః = భృగువు, తపః అతప్యత = తపస్సు చేసెను, సః = ఆ భృగువు, తపః తప్త్వా = తపము చేసి-

**తాత్పర్యము :** వరుణుని యొక్క పుత్రుడగు భృగువు తండ్రి దగ్గఱకు వెళ్ళి 'ఓ పితృదేవా ! నాకు బ్రహ్మవిద్యను ఉపదేశింపుము' అని కోరెను. అప్పుడు ఆ తండ్రి "నాయనా అన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కు ఇవి బ్రహ్మప్రాప్తికి ద్వార భూతములు. ఎవనివలన ఈ సమస్తభూతములు పుట్టుచు, ఎవనిచేత జీవించుచు, ప్రళమునందు దేనిని జేరి తాదాత్మ్యమును పొందుచున్నవో అది బ్రహ్మమని తెలుసుకొనుము" అని ఉపదేశపూర్వకముగా చెప్పుటతో – ఆ భృగువు ఆ విషయమై తపస్సు చేసెను. అవిధముగా తపస్సుచేసి – (తరువాత అనువాకములో అన్వయము).

**వివరణము :** తైత్తిరీయోపనిషత్తులోని, ప్రధానమైన మూడు వల్లులలో,

మూడవదైన ఈ భృగువల్లిలో "కనబడు సృష్టిలోని సమస్త భూతముల ఉనికికి కారణము ఎవరు?" అను ప్రశ్నకు సమాధానము ఎంతో విజ్ఞానాత్మకముగా వివరింపబడును.

'కారణము' నుండి 'కార్యము'నకు సృష్టి వ్యక్తమగును, మన మెఱుగున్న ఉదాహరణలో చెప్పవలెనన్నచో పంచభూతాత్మకమైన 'మన దేహము' అను కార్యమునకు 'మన తండ్రి' కారణమగుచున్నాడు. అందువలననే ఈ భృగువల్లిలోని బ్రహ్మనుగూర్చిన ప్రశ్న అనగా 'కారణము'ను గూర్చినప్రశ్న 'కార్యరూపములోనున్న కొడుకైన - భృగువు, వేయగా 'కారణరూపములోనున్న తండ్రైన - వరుణుడు దానిని వివరించును. ఈ సంభాషణారూపములోని వివరణ అందుచేతనే చక్కని వేదార్థప్రతిపాదకమైనది. మరియు, ఈ భృగువు, వరుణుడు భార్గవ గోత్రోద్భవులు. అనగా, తెల్లని తేజస్సునకు సంబంధించిన వంశములోని వారు. మనలో వీరికి సంభంధించిన ధాతువు శుక్రము. తండ్రి శుక్రమునుండి - పుత్రుని పంచభూతాత్మకమైన దేహము ఉద్భవించును. అనగా, శుక్రబిందువు - 'కారణము', పుత్రుని దేహము - 'కార్యము'. ఈ రెంటికి వరుసగా 'తండ్రీ - కొడుకులుగా' - 'వరుణుడు - భృగువు' అనువారలు సంకేతములుగా తీసుకొనబడిరి.

మనలో వెన్నెముకకు అడుగుభాగమున మూలాధార చక్రము (Base centre) వద్ద మనకు పశ్చిమ దిక్కు వుండును. ఈ మూలాధారము నందే సమస్త ద్రవ్యసృష్టికి కేంద్రము ఉండును. యోగదండమునకు అనగా, వెన్నెముకకు పై అగ్రమునందు భ్రుకుటికి (కనుబొమ్మల మధ్యభాగము) ఎదురుగా ఆజ్ఞాచక్రము (Eye brow centre) వుండును. ఇది మనదేహమునకు తూర్పుదిశను తెలియచేయును. ఇది 'సంకల్పము'నకు, 'ప్రజ్ఞ'కు గుర్తుకాగా, అడుగున వున్న మూలాధార చక్రము 'కల్పము'నకు, 'ద్రవ్యము'నకు కేంద్రమగును. సంకల్పము కల్పముగా, లేదా ప్రజ్ఞ ద్రవ్యముగా మారుటలో కారణ - కార్యములవలె; తండ్రీ - కొడుకులవలె; శుక్రబిందువు - పిండములవలె మూలాధార కేంద్రము వద్ద ఈ వరుణుడు - భృగువులు సంకేతింపబడిరి. అందుచే, కార్యమునకు సంకేతింపబడిన భృగువు, కారణముగా సంకేతింపబడిన వరుణుని తన సందేహమును ప్రశ్నగా అడిగి

తెలుసుకొనుట ఎంతయో సముచితము. మరియు, 'కొడుకు తన సందేహములను తండ్రి ద్వారా తెలుసుకొనవలెను, తండ్రి పరంపరాగతముగా వచ్చుచున్న విద్యా విషయములను కొడుకునకు ఉపదేశపూర్వకముగా అందీయవలెను' అను సంప్రదాయము గూడ ఇచట పాటింపబడుచున్నది.

భృగువు - తన తండ్రియైన వరుణుని సమీపించి బ్రహ్మమును ఉపదేశింపుమని కోరగా - "అన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కు ఇవి బ్రహ్మప్రాప్తికి ద్వార భూతములు, వీటి ద్వారా బ్రహ్మమును తెలుసుకొనవలెను, మరియు మనము ఏ విషయము తెలుసుకొనవలెనన్నను ఈ చెప్పబడినవి ఉపకరణములగును. అందుచే, నీకున్న వీటిని ఉపయోగించి బ్రహ్మమునెఱుంగుటకు ప్రయత్నింపుము", అని తండ్రి కొడుకునకు ఉపదేశించెను. మరియు ఇంకొక విధమైన ఉపదేశమును గూడ చేసెను. అది ఏమనగా "ఈ కనపడు సమస్త భూతముల ఉనికికి కారణము ఏది" అను ప్రశ్నకు సూటిగా ఆలోచించినచో ఇవి ఎవని నుండి పుట్టి, ఎవని వలన పోషింపబడి, చివరికి ఎవనిలోనికి లీనమగుచు తాదాత్మ్యస్థితిని పొందుచున్నవో అట్టి వానిని బ్రహ్మముగా తెలసికొనుము" అని సలహా ఇచ్చుట. ఇది తండ్రి కొడుకునకు సలహాను ఉపదేశపూర్వకముగా చేయుట మాత్రమే! ఈ సలహాను అనుసరించి స్వానుభవపూర్వకముగా పూర్తి సమాధానమును పొందుట కొడుకైన భృగువు బాధ్యత. అందుచే భృగువు సూక్ష్మమైన ఈవిషయమై తపస్సు చేసెను. 'తపస్సు చేసి' అను అర్థములో 'సతపస్తప్త్వా' అను మంత్రము ఈ అనువాకములో చెప్పబడినది. 'ఎంత కాలము తపస్సు చేసెను ? అని ప్రశ్న వేసుకొనినచో 'ఈ ప్రశ్నకు సరైన సమాధానము వచ్చుటకై జాతి ఎంత కాలము తపన (Fiery aspiration) చెందినదో - అంతకాలము తపస్సు చేసి' అని అర్థమును చెప్పుకొనవలసి యుండును.

తపస్సు అనగా తపన చెందుట. అనగా ఒక విషయమును తెలుసుకొనుటకై అనుక్షణము ఆ విషయముపై బుద్ధిని రాపాడించుట. ఇట్లు చేయుటలో వ్యక్తిగత మనస్సు (Individual mind) విశ్వాత్మక మనస్సు (Cosmic mind)తో శ్రుతి లేదా సంధానము (tune) అగుట జరుగును. ఈ సంధానమును లేదా

(Tuning)ను తపస్సుగా భావించవచ్చును. ఇట్టి సంధానము జరిగినపుడు విశ్వములో లీనమై వున్న శాశ్వత సత్యములు వ్యక్తిగత మనస్సునకు స్ఫురించును. ఈ క్రింద తెలుపబడిన ఉదాహరణలు ఈ విషయమును వివరించును.

"ఒక వస్తువు ఒక ద్రవములో మునిగి యున్నపుడు ఆ వస్తువు కొంత భారమును కోల్పోయినట్లగుపడును. ఆ విధముగా కోల్పోయినట్లగుపడు భారము – ఆ వస్తువుచే తొలగింపబడిన ద్రవభారమునకు సమానము" అనునది భౌతిక శాస్త్రములో ఆర్కిమెడీస్ సూత్రము. "వస్తువు కోల్పోయినట్లు అగుపడు భారము – ఆ వస్తువుచే తొలగింపబడిన ద్రవభారమునకు సమానమగునని ఎవరు చెప్పిరి?" అని ఒక విద్యార్థిని అడిగినచో – అప్పుడు ఆ విద్యార్థి – ' మా టీచరు చెప్పిరి' అనును. ఆ టీచరును 'మీకెవరు చెప్పిరి ?' అని అడిగినచో 'సైన్సు టెక్స్టు పుస్తకములో ఉన్నది' అనును. ఆ టెక్స్టు పుస్తకమును వ్రాసిన గ్రంథకర్తను అడిగినచో 'ఒక ఇంగ్లీషు సైన్సు పుస్తకము నుండి అనువదించితిని' అని చెప్పును. ఇదే విధముగా ఆ ఇంగ్లీషు సైన్సు పుస్తకమును వ్రాసిన వారిని – "చేపా చేపా ఎందుకెండలేదు..." అని పాతకథలో అడుగునట్లు అడుగుచూ పోయినచో చిట్టచివరకు ఆర్కిమెడీస్ వద్దకు వెళ్ళి ఆగవలసి యుండును. ఆ ఆర్కిమెడీస్‌ను గూడా 'నీకెవరు చెప్పిరి ?' అని అడిగతిమనుకొనినచో అప్పుడు ఆ ఆర్కిమెడీస్ ఏమి చెప్పును ? తను చెప్పక పూర్వము ఆ సూత్రము ఎక్కడను లేదు గదా ! ఆ సూత్రములోని ఈ విషయము వెలుగులోనికి వచ్చుటకు ఈ క్రింద తెలిపిన విధముగా జరిగి వుండవలెనని ఊహించవలసి యుండును.

మన అందఱివలెనే ఆర్కిమెడీస్ గూడ ఒక రోజు నూతిలోబక్కెట్టు వేయుట గాని లేదా స్నానమాడునపుడు తాను స్నానపు తొట్టెలో వున్నప్పుడు గాని (రెండవదే నిజమునకు జరిగినది) బక్కెట్టు నీటిలో మునిగి యున్నపుడు లేదా తానా నీటిలో మునిగి యున్నపుడు కొంత బరువు తగ్గినట్లు అనిపించివుండును. (బరువు తగ్గినట్లు అనిపించుట మనకు గూడ జరుగును. అంతవఱకు మనకు ఆర్కిమెడీస్‌కు తేడాలేదు. అటుపైన సూత్రములో చెప్పబడిన విషయమే – 'ఆర్కిమెడీస్ – ఒక విజ్ఞానశాస్త్రవేత్త' అను విషయమును తెలియజేయును) "బరువు తగ్గినట్లనిపించుటకు గల కారణమేమై

వుండునా?" అనియు, 'ఈ తగ్గినట్లుగుపడు భారము ఎంత ఉండవచ్చును ?" అనియు సందేహములు మనలను పీడించవు గాని ఆర్కిమెడీస్ విజ్ఞానశాస్త్రవేత్త అగుటచే అతనిని పీడించినవి. ఆ విషయముపై తన బుద్ధిని విశ్వాత్మక మనస్సుతో (Cosmic Mind) సంధానపఱచి ఆ విషయమునకు సమాధానము తెలుసుకుతీరవలెనని తపన చెందగా – 'కోల్పోయినట్లగుపడు భారము బహుశః మునిగిన వస్తువుచే తొలగింపబడిన ద్రవభారమునకు సరిపోవచ్చునేమో' అని అనిపించుట జరిగివుండవచ్చును. ఈ విధముగా అనిపించుటనే 'అంతః స్ఫురణము' అందురు. స్ఫురణమును తెలుగులో 'తట్టుట' అనవచ్చును. ఈ విధముగా విషయమును తెలుసుకొనుటకై తపన చెందుటను 'తపస్సు' గాను, తత్ఫలితముగా స్ఫురించు సత్యమును 'తపః ఫలము' గాను చెప్పుకొనవచ్చును.

మరియొక ఉదాహరణ : మనము నివసించు ప్రదేశము నందలి అంతరిక్షములో – ఆకాశవాణి ప్రసార కార్యక్రమములు, దూరదర్శిని ప్రసార కార్యక్రమములు – విద్యుదయస్కాంత తరంగరూపములలో లీనమై వుండును. అవి వున్నట్లు మనము గ్రహింపలేము. కాని, మనవద్ద వున్న రేడియో గ్రాహకమును (Radio receiver) లేదా 'టీవీ' సెట్‌ను ఆ ప్రసార కేంద్ర పౌనఃపున్యము (Frequency)నకు ట్యూన్ (Tune)చేసినచో – ఆ కార్యక్రమములను మనమును వినగలము, చూడగలము. అదే విధముగా మన వ్యక్తిగత మనస్సునకు అంతరిక్షములోని విశ్వాత్మక మనస్సునకు తపస్సు ద్వారా శ్రుతి కుదిరనపుడు, అనగా Tuning జరిగినపుడు విశ్వములో అంతర్లీనమై ఉండు సత్యములు మన బుద్ధులకు కూడ స్ఫురించును. ఇటుపైన భృగువు స్వానుభవముతో తన తపఃఫలముగా ఏమి తెలుసుకొనెనో అంచెలంచెలుగా చెప్పబడును.

**మంత్రము : అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ । అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । అన్నేన జాతాని జీవన్తి । అన్నం ప్రయన్త్యభిసంవిశన్తీతి । తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితర ముపససార । అధీహిభగవో బ్రహ్మేతి । తగ్ంహోవాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపోఽతప్యత। స తపస్తప్త్వా। (2)**

**టీక :** (ఈ కనపడు సమస్త భూతములు) అన్నాత్ ఏవ = అన్నము వలన నుండియే, జాయన్తేఖలు = పుట్టుచున్నవి గదా, జాతాని = పుట్టిన (భూతములు), అన్నేన = అన్నము చేతనే, జీవన్తి = జీవించుచున్నవి గదా, అన్నం = అన్నము నందే, ప్రయన్తి = లీనమగుచు, అభిసంవిశన్తి = తాదాత్మ్యమును పొందుచున్నవి కదా, ఇతి = (అని) ఈ విధమైన (హేతు బుద్ధికి తపః ఫలముగా తట్టగా), అన్నం = అన్నమును, బ్రహ్మఇతి = బ్రహ్మమని, వ్యజానాత్ = తెలుసుకొనెను, తత్ = ఆ విధముగా, విజ్ఞాయ = తెలుసుకొని, పునః = మరల, పితరం వరుణం = తండ్రియగు వరుణుని, అధీహిభగవో బ్రహ్మ = ఓ పితృదేవా ! బ్రహ్మను గూర్చి నాకు ఉపదేశింపుము, ఇతి = ఈ విధముగా (అని) ఉపససార ఏవ = సమీపించిన వాడాయెను, తమ్ = (ఆ విధముగా తనను సమీపించిన) అతనిని = (చూచి), తపసా = తపస్సు చేత, బ్రహ్మ = బ్రహ్మమును, విజిజ్ఞాసస్వ = తెలుసు కొనుము, తపః = తపస్సే, బ్రహ్మఇతి = బ్రహ్మమని, ఉవాచ హ = పలికెను, సః = ఆ భృగువు, తపః అతప్యత = తపస్సు చేసెను, సః = ఆ భృగువు, తపస్తప్త్వా = తపస్సు చేసి –

**తాత్పర్యము :** తండ్రి చేసిన ఉపదేశానుసారము బ్రహ్మమును తెలుసుకొనుటకు భృగువు తపస్సు చేసెను. 'అన్నము నుండియే సమస్త భూతములు పుట్టుచు, అన్నము వలననే పెరుగుచు, అన్నము లోనికే లీనమగుచున్నవి కదా' అని తెలుసుకొని, అన్నమునే బ్రహ్మముగా అభిప్రాయపడెను. మరల తండ్రివద్దకు వెళ్ళి బ్రహ్మమును గూర్చి ఉపదేశింపమని ప్రార్థించెను. అప్పుడు తండ్రి పుత్రునితో 'తపస్సు చేత కొంత సాధించినావు గదా! కనుక ఆ తపస్సు చేతనే మరల బ్రహ్మమును తెలుసుకొనుము. ఆ తపస్సునే బ్రహ్మముగా గుర్తించుము' అని ఉపదేశించెను. అప్పుడు భృగువు మరల తపస్సు చేసెను. తపస్సు చేసి – (ఇటుపైన తరువాత అనువాకములో అన్వయము).

**వివరణము :** భృగువు బ్రహ్మము విషయమై తపస్సు చేసినపుడు, ఈ సమస్త భూతములకు మూలకారణము అన్నముగా అభిప్రాయపడెను. జీవులందఱు ఆహారమును తినిన తల్లిదండ్రుల నుండి పుట్టి, ఆహారమును తాము తినుట వలన

పెరుగుచు, చివరకు ఆహారముగా వచ్చు ఓషధులకు మూలకారణమైన పంచభూతములలోనికి లీనమగుచున్నారు. కావున, సమస్త భూతముల ఉనికికి కారణముగా అన్నము అనియే అభిప్రాయపడెను. ఈ విధమైన అభిప్రాయము కలుగట సహజమే ! 'జీవుల యొక్క ఉనికికి కారణము మొట్ట మొదటగా వారి అన్నమయాత్మకమైన దేహమే' అని అనిపించుట పూర్తిగా సత్యము కాకపోయినను మొట్టమొదటగా తట్టు సత్యము అనుటలో సందేహము లేదు.

"విద్యుద్దీపము కాంతి నిచ్చుటకు, రేడియోపాడుటకు, ఫ్యాను తిరుగుటకు కారణము ఏమై ఉండునా ?" అని ఆలోచించినపుడు కంటికి ఎదురుగా కనబడు బల్బు, రేడియో, ఫ్యాను మొదలైనవే వరుసగా కారణములుగా మొదట అనిపించుట సహజము, అనగా - ద్రవ్యాత్మక కోశమే లేదా అన్నమయ కోశమే ఈ సమస్త సృష్టికి - గోచరమగు ప్రథమకారణముగా అనిపించును. భృగువునకు కూడ ఇదే విధముగా అన్నమే బ్రహ్మముగా అనిపించెను.

అన్నమును బ్రహ్మగా అభిప్రాయపడిననూ, ఎందులకో తనకు అనిపించినది సత్యము కాకపోవచ్చునని అనుమానము భృగువునకు కలిగి, తన తండ్రిని సమీపించి, తాను తెలుసుకొనిన విషయము ఎంతవఱకు సత్యమో నిర్ణయించి, బ్రహ్మమును ఉపదేశించవలసినదిగా ప్రార్థించెను. (ఈ విధముగా సందేహపడుటకు గల కారణము తరువాత అనువాకములో చెప్పబడును). అప్పుడు, వరుణుడు పుత్రుని నిరుత్సాహపఱచక "నాయనా ! నీవెట్లును బ్రహ్మను గూర్చి తెలుసుకొను సరియైన మార్గములోనే ఉంటివి. నీలో ఈ సందేహమును పుట్టించినవాని మీదనే మనస్సును లగ్నముచేసి, తపస్సు చేసినచో నీకే - సత్యము, సమాధానము వ్యక్తమగును" అని ఉపదేశించెను. అప్పుడు భృగువు మరల తపస్సు కొనసాగించెను.

**మంత్రము : ప్రాణో బ్రహ్మేతి వ్యజానత్ । ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । ప్రాణేన జాతాని జీవన్తి । ప్రాణం ప్రయన్త్యభిసంవిశన్తీతి । తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితర ముపససార । అధీహిభగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపోఽతప్యత । స తపస్తప్త్వా ॥ (3)**

**టీక :** ప్రాణాత్ ఏవ = ప్రాణము వలననే, ఇమానిభూతాని = ఈ కనపడు సమస్త భూతములు (అనగా ద్రవ్యాత్మకమైన సృష్టి), జాయన్తే ఖలు = పుట్టుచున్నవి గదా, జాతాని = (అ విధముగా) పుట్టినవి, ప్రాణేన = ప్రాణము చేత, జీవన్తి = జీవించుచున్నవి, ప్రాణం = ప్రాణమునే, ప్రయన్తి + అభిసంవిశన్తి = పొందుచున్నవి, ఇతి = ఈ కారణము వలన, ప్రాణః = ప్రాణము, బ్రహ్మ + ఇతి = బ్రహ్మము అని, యజానాత్ = తెలుసుకొనెను, తత్ = ఆ విషయమును, విజ్ఞాయ = తెలుసుకొని, పునః = మరల, అధీహిభగవో బ్రహ్మేతి = ఓ భగవత్ స్వరూపుడా ! బ్రహ్మమునుపదేశింపుమని, పితరం = తండ్రియైన, వరుణం = వరుణుని, ఉపససార= సమీపించెను, తం = సమీపించిన పుత్రుని ఉద్దేశించి, (వరుణుడు) తపసా బ్రహ్మ = తపస్సు చేత బ్రహ్మను, విజిజ్ఞాసస్వ = తెలుసుకొనుము, తపోబ్రహ్మేతి = తపస్సే బ్రహ్మము అని, ఉవాచ హ = పలికెను, సః = ఆ భృగువు, తపః = అతప్యత = తపము చేసెను, సః = ఆ భృగువు, తపః తప్త్వా = తపస్సు చేసి – (ఇటుపైన తరువాత అనువాకములో చెప్పబడును).

**తాత్పర్యము :** 'ప్రాణము వలననే ఈ కనపడు ద్రవ్యాత్మకమైన సమస్త భూతములు పుట్టుచు, ప్రాణముచేతనే జీవించుచు, చివరకు ప్రాణములోనికే లీనమగుచున్నవి కదా' అను విషయము తపస్సులో తట్టి ప్రాణమునే బ్రహ్మమని భృగువు అభిప్రాయపడెను. కాని, మరల ఎందులకో సందేహపడి భగవత్స్వరూపుని వంటి తండ్రి అయిన వరుణుని సమీపించి బ్రహ్మమునుపదేశింపుమని ప్రార్థించెను. అప్పుడు వరుణుడు తపస్సు చేత బ్రహ్మమును తెలుసుకొనమని, తపస్సే బ్రహ్మ అని చెప్పగా భృగువు మరల తపస్సు చేసెను.

**వివరణము :** క్రిందటి అనువాకములో సమస్త ద్రవ్యముల ఉనికికి ప్రత్యక్షముగా కనబడు అన్నమయాత్మక కోశమే కారణమనియు, అందుచే – అన్నమే బ్రహ్మ అనియు అభిప్రాయపడెను. తండ్రి మరల తపస్సు చేయుమని ప్రోత్సహించినపుడు ఆ ఆజ్ఞమేరకు తపస్సు చేయగా సత్యమునకు మరింత దగ్గరకు చేర్చు విషయము స్ఫురించెను. భూతముల దేహములన్నియు కదులుటకు, పెరుగుటకు ప్రాణము ముఖ్యము కదా ! ప్రాణము లేని దేహము చైతన్య రహితమైన

శవమే గదా ! అందుచే, అన్నమయాత్మక దేహమునకు తప్పనిసరిగా ప్రాణము కారణమై తీరవలెను' అని ప్రాణమునే బ్రహ్మముగా భృగువు అభిప్రాయపడెను.

విద్యుద్దీపము కాంతినిచ్చుటకు, రేడియోపాడుటకు, ఫ్యాను తిరుగుటకు కారణములను వరుసగా బల్బు, ఫ్యాను, రేడియో అనుకొని ఎవరైన కుగ్రామ కాపురస్థుడు వాటిని తీసుకొని తన ఇంటిలో పెట్టుకొనినచో అవి పనిచేయవు గదా! అప్పుడు ఇవికాక, ఇవి పనిచేయుటకు వేరొక కారణము ఉండి తీరవలెనని, అది నిజమైన విద్యుత్తు అని తరువాత తెలుసుకొనును. అట్లే భృగువు కూడ ప్రాణము లేనపుడు - భూతముల దేహములు పనిచేయవని, కావున, ప్రాణము బ్రహ్మమై ఉండవలెనని అభిప్రాయపడెను. ఈ విధముగా తెలసుకొనిననూ, మరల ఎందులకో తాను తెలుసుకొనినది సరియైన సత్యము కాకపోవచ్చునని సందేహపడి, తండ్రిని సమీపించి, బ్రహ్మోపదేశమును చేయమని కోరెను (ఈ సందేహమునకు గల కారణము తరువాత అనువాకములో చెప్పబడును). తండ్రియైన వరుణుడు గూడ కొడుకును నిరుత్సాహపరచక, కొడుకు సరైన మార్గములోనే ఉన్నందున అదే మార్గమును కొనసాగించవలసినదని ప్రోత్సహించెను. (ఏ తండ్రియైనను కొడుకును ఈ విధముగా ప్రోత్సహించుట నేర్చుకొనవలెను. అంతేకాని, "నీకు ఏమీ తెలియదు, నీది మట్టిబుఱ్ఱ" అని నిరుత్సాహపరచరాదు, 'తనంతట తానే ఎఱుగున్న విషయములతో ఎఱుగవలసిన ధ్యేయమును, సత్యమును పొందునట్లు చేయుట ఆర్షసంప్రదాయ మార్గము' అని ఈ భృగుపల్లి చెప్పు ముఖ్య సందేశము).

**మంత్రము : మనో బ్రహ్మేతి వ్యజానాత్ । మనసో హ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । మనసా జాతాని జీవన్తి । మనః ప్రయన్త్యభిసంవిశంతీతి । తద్విజ్ఞాయ। పునరేవ వరుణం పితర ముపససార । అధీహిభగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ । తపసాబ్రహ్మ విజిజ్ఞా సస్వ । తపోబ్రహ్మేతి । సతపోఽతప్యత । స తపస్తప్త్వా ।** *(4)*

**టీక :** మనసః = మనస్సు వల్ల నుండియే, ఇమానితాని = ఈ కనబడు భూతములు, జాయన్తే హి ఖలు = పుట్టుచున్నవి గదా, జాతాని = (ఆ విధముగా) పుట్టినవి, మనసా జీవన్తి = మనస్సు చేత జీవించుచున్నవి, మనః ప్రయన్తి అభిశంవిశన్తి

= మనస్సు నందే లీనమగుచున్నవి, ఇతి = ఈ కారణము వలన, మనో(బ్రహ్మేతి = మనస్సే బ్రహ్మమని, వ్యజానాత్ = అభిప్రాయపడెను, తద్విజ్ఞాయ = ఆ విధముగా తెలుసుకొని, పునః = మరల, అధీహి భగవో బ్రహ్మేతి = భగవత్స్వరూపుడా ! (ఓ తండ్రీ) బ్రహ్మమునుపదేశింపుమని, పితరం = తండ్రియైన, వరుణం = వరుణుని, ఉపససార = సమీపించెను, తం = (ఆ విధముగా సమీపించిన) పుత్రుని ఉద్దేశించి, తపసా బ్రహ్మ విజిజ్ఞా సస్వ = తపస్సు చేత బ్రహ్మమును తెలుసుకొనుమని, తపో బ్రహ్మేతి = తపస్సే బ్రహ్మమని, ఉవాచ హ = (వరుణుడు) పలికెను, సః = ఆ భృగువు, తపః = అతప్యత = తపస్సు చేసెను, సః = అతడు, తపః తప్త్వా = తపస్సు చేసి - (తరువాత అనువాకములో సమన్వయము).

**తాత్పర్యము :** మనస్సు నుండియే ఈ భూతములన్నియు పుట్టుచు జీవించుచు, చివరకు మనస్సులోనికి లీనమగుట కూడ జరుగుచున్నదను సత్యము ద్యోతకమై మనస్సునే బ్రహ్మముగా భృగువు అభిప్రాయపడెను. ఐనను, తనకు కల్గిన ఈ అభిప్రాయము సంపూర్ణ సత్యము కాకపోవచ్చునని సందేహపడి, మరల తండ్రిని బ్రహ్మము నుపదేశించుమని కోరెను. అందుకు తండ్రి - 'తపస్సు చేత తెలుసుకొను ఈ ప్రయత్నమును కొనసాగించుము' అని ఉపదేశించగా భృగువు మరల తపస్సు చేసెను.

**వివరణము :** దేహముల ఉనికికి, పెరుగుదలకు ప్రాణమును కారణముగా గుర్తించినను, ఆ ప్రాణము జీవిలో వ్యక్తమగుటకు ముందు జీవి యొక్క తల్లిదండ్రుల మనస్సంకల్పము ఉండి తీరవలయు ననియు, ఇదియునుగాక - ఈ విషయములన్నియు ఆలోచించుటకును, మూలకారణమును తెలుసుకొనుటకై చేయు తపస్సులోను దేనిని లగ్నము చేయవలెనో - అట్టి మనస్సు తప్పనిసరిగా ప్రాణము కన్న ముందు స్థితిగా ఉండవలెననియు అనిపించి మనస్సే బ్రహ్మముగా భృగువు అభిప్రాయపడెను.

క్రిందటి అనువాకములో అన్నమయకోశము బల్బు, రేడియో, ఫ్యానుల వంటిదని, ప్రాణమయకోశము ఆ బల్బు, రేడియో, ఫ్యానుల గుండా ప్రవహించు

విద్యుత్తు వంటిదని చెప్పబడినది. ఈ విద్యుత్తుకు పుట్టుకస్థానమైన కారణము మన ఇంటిలో లేదు. వీధిలోని విద్యుత్తు స్తంభపు తీగల నుండి మన ఇంటిలోనికి ఈ విద్యుత్తు వచ్చును. అట్లే, మనలోని ప్రాణమునకు గూడ, ప్రాణముకన్నపైన లేదా ముందు స్థితిగా ఒకటి వుండవలెను. ఇదియే 'మనస్సు' లేక 'మనోమయకోశము' అని ఈ అనువాకములో చెప్పబడినది. అనగా 'ఇంటిలోని విద్యుత్తుకు - వీధిలోని విద్యుత్ స్తంభపు తీగలు ఎట్లు కారణమగునో, మనలోని ప్రాణమునకు - మనస్సు ఆ విధముగా కారణమగును' అని సమన్వయమును చేసుకొనవలెను. అందుచేతనే మనస్సే బ్రహ్మమై ఉండవచ్చునని భృగువు అభిప్రాయపడెను.

మనస్సును బ్రహ్మ అనుకొనుట కూడ సమంజసమే ! మనస్సు లేనిదే సంకల్పము లేదు. సంకల్పములేనిదే తల్లిదండ్రుల దాంపత్యము లేదు. దాంపత్యము లేనిదే జీవికి ప్రాణప్రతిష్ఠ లేదు. ఈ కారణముగా సమస్త భూతముల ఉనికికి మనస్సే మూలకారణమైన బ్రహ్మముగా భృగువు అభిప్రాయపడెను. కాని, ఇది కూడ సరియైన మూలకారణమై ఉండదని తనకే ఎందులకో సందేహము కలిగి, మరల తండ్రిని ప్రార్థించగా - అందులకు తండ్రి 'తపస్సు చేతనే సమాధానమును రాబట్టుకొని, సందేహ నివృత్తి చేసుకొని, సత్యమును గ్రహించుము' అని ఉపదేశించగా భృగువు అట్లే చేసెను.

**మంత్రము :** ***విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్ । విజ్ఞానాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే । విజ్ఞానేన భూతాని జాయంతే । విజ్ఞానేన జాతాని జీవంతి । విజ్ఞానం ప్రయంత్యభిసంవిశంతీతి । తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితర ముపససార। అధీహి భగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ । తపసా బ్రహ్మవిజిజ్ఞాసస్వ । తపోబ్రహ్మేతి। స తపోఽతప్యత । స తపస్తప్త్వా ॥ (5)***

**టీక :** విజ్ఞానాత్ ఏవ = విజ్ఞానము వలననే, ఇమాని భూతాని ఈ కనపడు భూతములన్నియు, జాయంతే హి = పుట్టుచున్నవి గదా, జాతాని = (ఆ విధముగా) పుట్టిన భూతములు, విజ్ఞానేన = విజ్ఞానము చేత, జీవన్తి = జీవించుచున్నవి, ప్రయన్తి విజ్ఞానం అభిసంవిశన్తి = విజ్ఞానము నందే లీనమగుచున్నవి, ఇతి = ఈ కారణము వలన, విజ్ఞానం = విజ్ఞానమును, బ్రహ్మ ఇతి = బ్రహ్మమని,

యజానాత్ = తెలుసుకొనెను, తద్విజ్ఞాయ = ఆ విధముగా తెలుసుకొని, అధీహి భగవో బ్రహ్మేతి = భగవత్స్వరూపుడా బ్రహ్మమునుపదేశింపుమని, పునః = మరల, పితరం = తండ్రిఐన, వరుణం = వరుణుని, ఉపససార = దరిచేరెను, (అప్పుడు ఆ వరుణుడు), తపసా = తపస్సు చేత, బ్రహ్మ విజిజ్ఞాసస్వ = బ్రహ్మమును తెలుసుకొనుము, తపోబ్రహ్మేతి = తపస్సే బ్రహ్మము (అని), తం ఉవాచ హ = ఆ భృగువునకు ఉపదేశించెను, సః = ఆ భృగువు, తపః అతప్యత = తపస్సు చేసెను. సః తపః తప్త్వా = అతడు తపస్సు చేసి – (తరువాత అను వాకములో సమన్వయము)

**తాత్పర్యము :** ఈ కనబడు పంచభూతాత్మక జగత్తంతయు విజ్ఞానము వల్లనుండియే పుట్టి, పెరిగి, చివరకు దానిలోనికే లీనమగుచున్నది కదా!' అను విషయము ద్యోతకమై విజ్ఞానమే బ్రహ్మమని భృగువు తెలుసుకొనెను, మరల ఎందులకో విజ్ఞానముగూడ బ్రహ్మము అయి వుండదని సందేహము కలిగి, తండ్రిని సమీపించి బ్రహ్మమును ఉపదేశింపుమని ప్రార్థించెను. ఆ తండ్రి ఐన వరుణుడు పూర్వము వలెనే తపస్సు చేసి తెలుసుకొనమని ప్రోత్సహించగా భృగువు మరల తపస్సు చేసెను.

**వివరణము :** క్రిందటి అనువాకములో అన్నమయాత్మక ద్రవ్యమునకు, ప్రాణమయాత్మక శక్తికి మనస్సే కారణభూతముగా (Mind is the origin and source of life force and matter) అనిపించినప్పటికి, మరల తపస్సు చేయుటతో మనస్సు కన్న పైన ఇంకొక కారణము ఉండి తీరవలెనని భృగువునకు అనిపించెను. మనస్సు కన్న పైన కారణమును 'బుద్ధి' అని గ్రహించెను. కారణమే మనగా పంచేంద్రియముల ద్వారా మనస్సు విషయములను గ్రహించిననూ, చివరకు కర్తవ్యమును తేల్చి చెప్పునది బుద్ధి. అనగా, మనస్సు ప్లీడరు వంటిదైనచో (Representing Faculty) బుద్ధి జడ్జి వంటిది (Deciding Faculty). బుద్ధి ఉండగా మనస్సు నుపయోగించు జీవులను – బ్లేడు వుండగా కత్తిపీటతో గడ్డము గీసుకొనుటకు ప్రయత్నించువారుగా అనుకొనవచ్చును. అనగా, మనస్సున కన్న బుద్ధికి ఎక్కువ నైశిత్యమున్నదని తెలియవలెను. ఈ బుద్ధి (Intellect) విజ్ఞానమయాత్మకము. జీవించుట – శ్వాసమీద ఆధారపడి వుండును. ఆ శ్వాస – ఉచ్ఛ్వాస, నిశ్వాసాత్మకము. ఉచ్ఛ్వాసము నందు ప్రాణ వాయువును (Oxygen) మాత్రమే పీల్చి, నిశ్వాసమునందు

బొగ్గుపులుసు వాయువును (Carbondioxide) వదలునట్లుగా చేయవలెను. చదువు వచ్చినను - రాక పోయినను, ఈ విషయము తెలిసినను - తెలియకపోయినను, పసివారైనను - పెద్దవారైననూ, మనస్సు సరిగా పనిచేయు మంచివారలోనైనను - మనస్సు సరిగా పనిచేయని పిచ్చివారి లోనైనను, ఈ విధమైన శ్వాస ప్రక్రియను జరిపించు విజ్ఞానదేవతలు వారిలో తప్పక ఉండి తీరవలెనని భృగువు తన తపస్సువలన తెలుసుకొనెను. బయటవున్న విజ్ఞానదేవతలకు, వ్యక్తి లోపల వున్న విజ్ఞానదేవతలకు సంధానము చేయునది యే బుద్ధి. ఈ సంధాన ప్రక్రియనే 'దేవాదేవేషు శ్రయధ్వం' అని మహన్యాసములో చెప్పుదురు.

క్రిందటి అనువాకములో ప్రాణమును - విద్యుత్ప్రవాహముతోను, మనస్సును - వీధిలోని విద్యుత్ స్తంభపు తీగలతోను పోల్చి, అర్థము చేసికొనుట జరిగినది. వీధిలోని విద్యుత్ స్తంభపు తీగలకు కూడా విద్యుత్తు దానంతటది ఆ తీగలకు రాదు. ఈ తీగలోని విద్యుత్తునకు ముందు స్థితి పవర్ హౌస్‌లో ఉండును. ఆ పవర్ హౌస్ (Power house) నుండి వీధిలోని విద్యుత్తు స్తంభపు తీగలకు విద్యుత్తు వచ్చును. అట్లే, మనలోని మనస్సునకు గూడా ముందు ఒకటి వుండవలెనని, అదియే 'బుద్ధి' లేక 'విజ్ఞానమయకోశము' అని ఈ అనువాకములో ప్రతిపాదించబడినది. అనగా 'విద్యుత్ స్తంభపు తీగలకు పవర్ హౌస్ ఎటువంటిదో మనస్సునకు ఈ బుద్ధి అటువంటిది' అని సమన్వయము చేసుకొనవలెను. ఈ కారణము వలన బుద్ధియే బ్రహ్మమై ఉండవచ్చునని భృగువు అభిప్రాయపడెను.

బుద్ధిని బ్రహ్మగా అనుకొనుట గూడ సమంజసమే ! కారణమేమనగా ఈ బుద్ధియొక్క విజ్ఞానమువల్లనే - మనిషి కడుపున మనిషి, కుక్కలకడుపున కుక్క పక్షుల కడుపున పక్షి పుట్టును. ఏ విత్తనము నుండి ఆ విత్తనము తాలూకు మొక్క లేక చెట్టు ఆ యా విశిష్ట లక్షణములతో, రంగు, రుచి,వాసనలతో మొలకెత్తి ఉత్పత్తి చెందుచుండుట; మనిషికి ఎన్నివ్రేళ్లు - వీటి ఆకారములు ఎట్లుండవలెనో అట్లే ఉండుట - ఇవి అన్నియు ఈ విజ్ఞానమునకు సంబంధించినవే ! అందుచేతనే, ఈ విజ్ఞానము బ్రహ్మమై వుండునని భృగువు అభిప్రాయపడెను.

'ఎన్ని మెట్లు దాటి దాదాపు ఇక సత్యమును చేరినట్లే' అని అనిపించిననూ, భృగువునకు మరల ఎందులకో ఈ విజ్ఞానమునకు పైన ఇంకొక కారణము ఉండి

తీరవలెనని సందేహము కలిగి నివృత్తి చేసుకొనుటకు తండ్రిని కోరగా, తండ్రి మరల తపస్సు చేతనే సాధించుమని తనయుని ప్రోత్సహించెను. తండ్రి మాటపై భృగువు మరల తపస్సు చేసెను.

**మంత్రము : ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్। ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। ఆనందేన జాతాని జీవంతి। ఆనందం ప్రయంత్యభిసంవిశంతీతి। సైషాభార్గవీ వారుణీ విద్యా। పరమే వ్యోమన్ప్రతిష్ఠితా। య ఏవం వేద ప్రతితిష్ఠతి। అన్నవానన్నాదో భవతి।మహాన్భవతి ప్రజయా పశుభి ర్బ్రహ్మవర్చసేన। మహాన్కీర్త్యా।** *(6)*

**టీక :** ఆనందాత్ ఏవ = ఆనందము వల్లనుండియే, ఇమాని భూతాని = ఈ కనబడు పాంచభౌతిక జీవరాసులన్నియు, జాయంతే హి ఖలు = పుట్టుచున్నవి కదా, జాతాని = (ఆ విధముగా) పుట్టినవి, ఆనందేన = ఆనందముచేత, జీవంతి = జీవించుచున్నవి, ఆనందం ప్రయంతి అభిసంవిశన్తి = చివరకు ఆనందము నందే తాదాత్మ్యమును పొందుచున్నవి. ఇతి =ఈ కారణము వలన, ఆనందో బ్రహ్మేతి = ఆనందము బ్రహ్మ అని, వ్యజానాత్ = తెలుసుకొనెను, సా ఏషా = అట్టి ఈ, విద్యా = విద్య, వారుణీ - భార్గవీ = వారుణీభార్గవీ (విద్య), పరమేవ్యోమన్ = ఆకాశము నందు, ప్రతిష్ఠితా = ప్రతిష్ఠింపబడినది (గా), యః = ఎవ్వడు, ఏవం = ఈ విధముగా, వేద = తెలుసుకొనునో, సః = వాడు, ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠుతుడగు చున్నాడు, అన్నవాన్ భవతి = అన్నము కలవాడగుచున్నాడు, అన్నాదః (భవతి) = అన్నాదుడగుచున్నాడు, ప్రజయా = పుత్ర, పౌత్రాదిక సంతానము చేతను, పశుభిః = పశుగణముచేతను, బ్రహ్మవర్చ సేన = బ్రహ్మతేజస్సు చేతను, మహాన్ భవతి = మహాశ్రేష్ఠుడగుచున్నాడు, కీర్త్యా = యశస్సుచేతను, మహాన్ = గొప్పవాడు (అగుచున్నాడు).

**తాత్పర్యము :** 'ఆనందము వల్లనుండియే ఈ కనబడు పంచభూతాత్మక జగత్తంతయు పుట్టి, జీవించుచు, చివరకు దానియందే తాదాత్మ్యమును పొందుచున్నది గదా!' అను సత్యము భాసించి ఆనందమునే బ్రహ్మగా భృగువు తెలుసుకొనెను.

ఇంతవరకు చెప్పబడిన ఈ విద్యను 'భార్గవీ వారుణీ విద్య' అందురు. ఇది ఆకాశమునందు ప్రతిష్ఠితమై ఉన్నది. ఈ విధముగా దీనిని తెలుసుకొనువాడు సుప్రతిష్ఠితుడై అన్నము చేత, పుత్రపౌత్రాదికము చేత, పశుగణము చేత, బ్రహ్మ తేజస్సు చేత వర్ధిల్లి, మంచి కీర్తిమంతుడగుచున్నాడు.

**వివరణము :** క్రిందటి అనువాకములో విజ్ఞాన ప్రణాళికను అనుసరించి పంచభూతాత్మక జగత్తు, పెరిగి లయమగుచున్నదని, అందుచే విజ్ఞానమే బ్రహ్మ అని భృగువు అభిప్రాయపడినట్లుగా చెప్పబడినది. కళ్ళకు స్పష్టముగా కనబడు అన్నమయ కోశముతో ప్రారంభించి, సూక్ష్మాతిసూక్ష్మమైన విజ్ఞానమయకోశము వరకు ఎక్కడికక్కడికే, ఏ కోశమునకు ఆ కోశమును మూలకారణ కోశముగా భ్రమపడుచు, చివరకు విజ్ఞానమయ కోశము చేరువరకు భృగువు తపస్సు కొనసాగించెను. కల్తీలేని అన్నము లేదా ఆహారము ఆరోగ్యమునకు ఎట్లు దారితీయునో – కల్తీలేని విజ్ఞానము ఆనందమునకు అట్లు దారితీయును. విజ్ఞానమయకోశమును అనుభూతిని పొందిన భృగువునకు 'ఈ విజ్ఞానము నందలి లెక్కలు, ప్రణాళికలు, నియమములు, నిబంధనలు, ఇవి అన్నియు దేనికి ? ఇవి ఇట్లుండుటకు గల కారణమేమి ? మరొక విధముగా వుండుటకు వీలు లేదా ? పంచదార ఎందుకు తియ్యగానుండవలెను ? ఉప్పు ఎందుకు ఉప్పగా నుండవలెను ? వాటి ఈ విజ్ఞాన విషయములకు కారణమేది?' మొదలైన ప్రశ్నలు పుట్టెను. అట్లే, 'ఒక మనిషికి ఒక ప్రత్యేకమైన విషయము గాని, వస్తువు గాని, కూర గాని ఎందులకు ఇష్టమగుచున్నది ?' అను ప్రశ్నలకు కూడా ఈ విజ్ఞానమయ కోశము నుండి సమాధానము లేదు కాని, ఈ ప్రశ్నలన్నియు కలిగినపుడు అవి ఎంతవరకు వెళ్ళి మరల అవే ప్రశ్నలు సమాధాన రూపములో వచ్చునో అట్టి కోశము మరియొకటి కలదని, ఆ కోశముతోనే ఈ విజ్ఞాన, మనో, ప్రాణ, అన్నమయ కోశములు తయారు చేయబడి దానిలో చిల్లర భాగములుగా ఉండి ఉండవచ్చునని ఆ కోశము ఆనందమయకోశము' అని అభిప్రాయపడెను. 'మనిషి జీవించుటగాని, ఆస్తిని పెంచుకొనుట గాని, వస్తువులను అమర్చుకొనుట గాని, సినిమాలు, నాటకములు మొదలైనవి చూచుట గాని దేనికొఱకు ?' అని ప్రశ్నవేసి కొనినపుడు 'ఆనందము కొఱకు' అని సమాధానము వచ్చును. నాటకమును

చూచుచున్నపుడు నాయికా నాయకులకు కష్టములువచ్చి కన్నీరు పెట్టుకొనినపుడు, వారిని చూచి తానును కన్నీరు పెట్టుకొనుచూ, బాధపడుచూకూడా చివరకు ఆనందమునే పొందును. అందుచే, ఈ ఆనందము సుఖదుఃఖాతీతమైనది. అట్లే, పసిపిల్లలు ఆడుకొనునపుడు - పరుగెత్తుట, దాగుకొనుట, దుముకుట, క్రిందపడుట, ఏడ్చుట, మరలలేచి పరుగెత్తుట, కొట్టుకొనుట, కలియుట మొదలగునవన్నియు వారి ఆటలో భాగములే ! ఇది అంతయు బయట నుండి చూచు పెద్దలకు అర్థము లేనట్లు అనిపించిననూ ఆడుకొనువారికి మాత్రము అవన్నియు క్రీడలోని భాగములే! అట్లే, భగవంతునికి కూడా ఈ సమస్త సృష్టి వ్యాపారము - క్రీడయే ! పసిపిల్లలకు ఆనందము కొఱకు క్రీడ ఎట్లో - భగవంతునికి ఆనందము కొఱకు ఈ సృష్టి అట్లు, ఒక మనిషిని 'నీకు వంకాయకూరే ఎందుకు ఇష్టము ?' అని ప్రశ్నవేసినపుడు 'వంకాయకూర ఇష్టము కాబట్టి' అనునదియే సమాధానమెట్లగునో, 'పంచదార ఎందుకు తియ్యగానుండును'? అని ప్రశ్నవేసినపుడు ఎంత రసాయనిక శాస్త్ర సాంకేతిక పద ప్రకోపమును రుద్దుచూ కోప్పడిననూ - అది తియ్యగా నుండుటకు కారణమును చెప్పినట్లవదు. తీపిగా తప్ప మరియొక రకముగా ఉండలేక పోవుటయే నిజమైన కారణము. ఐనచో 'అట్లుండుట ఎందులకు ?' అని ప్రశ్న వేసినపుడు 'ఆ విధముగా ఉండుట దానికి ఆనందము కాబట్టి' అనియే సమాధానమును చెప్పుకొనవలసి యుండును. ఈ విధముగా మనకు కలిగెడి ప్రశ్నలన్నింటికి - అవియే కొద్దిగా రూపము మారి సమాధానములగు చోట ఈ ఆనందమయ కోశము వర్తించును. వందరూపాయల నోటులో 50 రూపాయల నోటు, 20 రూపాయల నోటు, పదిరూపాయల నోటు, ఐదు రూపాయల నోటు కూడా ఏ విధముగా ఇమిడి పోయి వుండునో అట్లే, ఈ ఆనందమయకోశములో విజ్ఞాన, మనో, ప్రాణ అన్నమయ కోశములు ఇమిడి వుండును. ఇవి చిరుతిండ్లవల్ల పొందు ఆనందముల వంటివి గాను, ఆనందమయ కోశమును మృష్టాన్న భోజనము వంటిది గాను, సమన్వయ పరచుకొనవచ్చును. కాబట్టి ' ఈ కనపడు పంచభూతాత్మక జగుత్తనకంతకు మూలకారణము ఈ ఆనందము' అని తెలుసుకొనవలెను. అందుచే ఈ ఆనందమునే బ్రహ్మగా తెలుసుకొని భృగువు బ్రహ్మానంద స్థితిని పొందెను.

విద్యుత్తునకు మూలకారణమును గూర్చి తెలుసుకొను ఉదాహరణలో కూడ పవర్ హౌస్ నుండి విద్యుత్తు వచ్చుచున్నది. కాబట్టి, ఆ పవర్ హౌస్‌ను విద్యుత్తునకు మూలకారణముగా తెలుసుకొన బడినట్లుగా చెప్పబడినది. మరియు, ఈ పవర్‌హౌస్ విజ్ఞానమయ కోశముతో సమన్వయ పరచబడినది. 'ఈ పవర్ హౌస్‌నకు విద్యుత్తు ఎక్కడనుండి వచ్చినది?' అను ప్రశ్న పుట్టినపుడు ఏదైన సమాధానము వచ్చినచో అది విద్యుత్తునకు మూలకారణముగా చెప్పుకొనవచ్చును. Hydro electric project నందలి పవరుహౌస్‌లోనికి విద్యుత్తు ఎట్లు వచ్చుచున్నది ? కొంత ఎత్తునుండి నీరు వేగముతో వచ్చి Turbines లోని చక్రములను త్రిప్పినపుడు, అయస్కాంత విద్యుద్వాహకముల మధ్య సాపేక్ష వేగము కలిగి విద్యుత్తు పుట్టుచున్నది. ఇది అంతకు పూర్వము ఇటు వాహకములోగాని, అటు అయస్కాంతములో గాని లేదు. చోటులో విద్యుద్వాహక అయస్కాంతముల మధ్య వేగము వలన ఈవిద్యుత్తు పుట్టుటకు దారి తీసినదని చెప్పుకొనవచ్చును. అనగా, చోటులో అవ్యక్తముగా నున్న విద్యుత్తు నీటివేగము వలన తిరుగుట ద్వారా వ్యక్తస్థితిని పొందినదని చెప్పుకొనవలెను. కావున, చిట్టచివరకు విద్యుత్తునకు మూలకారణము లేదా విద్యుత్తు అవ్యక్తముగా ఉండు ప్రదేశము – 'చోటు' లేదా 'ఆకాశము' అని తేలును. 'పంచభూతాత్మక జగత్తున కంతకు మూలకారణము ఆనందము' అని ఈ అనువాకములో ఇంతకు పూర్వము ప్రతిపాదింపబడినది. ఈ ఆనందము హృదయమునకు సంబంధించినది. హృదయములో దహరాకాశము ఉండును. అందుచే, అటు విద్యుత్తు పరముగా ఆలోచించినపుడు దాని మూలకారణము – 'ఆకాశము' అని ఎట్లు తేలినదో – 'సృష్టికి మూలకారణమైన ఆనందము గూడా ఈ దహరాకాశమునకు సంబంధించినదే' అని తేలుట ఈ రెంటికి గల సామ్య, సమన్వయములను తెలుపును.

ఇంతవరకు అంచెలంచెలుగా చెప్పబడిన ఈ విద్యను తండ్రియగు వరుణుని ప్రోత్సాహము వలన కొడుకైన భృగువు పొందిన ఆనంద విద్యగా, భార్గవీ – వారుణీ విద్యగా చెప్పుదురు. ఈ విద్య తండ్రి నుండి కొడుకునకు సంక్రమించిన విద్య. తండ్రి – కొడుకు అగుటలో ఆనందము కలుగును కాబట్టి, ఈ ఆనందమయ కోశవిద్యలో అనుభవమగు ఆపేక్ష, ప్రేమల వలన తండ్రి – కొడుకు అగుట జరిగి, ఆనందమునకు దారితీయును. ఇది హృదయసంబంధమైనది. అందుచేతనే, ఈ

విద్య "పరమేవ్యోమన్ ప్రతిష్ఠితా" అనగా, హృదయాకాశమునందు ఉన్నట్లుగా చెప్పబడినది, జగత్తునకు – ఆకాశములోను, వ్యక్తికి – హృదయములోని ఆకాశమైన దహరాకాశమునందును ఈ ఆనందమున్నట్లు సమన్వయపరచు కొనవలెను. ఇద్దరు వ్యక్తుల మధ్య ఆనందము ఎక్కడ వున్నది ? అను ప్రశ్న వచ్చినపుడు 'వారిద్దరి మధ్య ఉన్న చోటులో ఉన్నది' అని చెప్పుకొనవలసి యున్నది. ఆ చోటును వీరు మంచిగా చేసుకొనినచో 'సుఖం', చెడ్డగా చేసికొనినచో 'దుఃఖం' అగును. ఈ రెండు పదములను 'సు + ఖం', 'దు + ఖం' అని విడదీసినచో 'సు' అనగా మంచి, 'ఖం' అనగా చోటు, 'దుః' అనగా చెడ్డ, 'ఖం' అనగా చోటు అను చక్కని వ్యుత్పత్త్యర్థములు కూడ వచ్చును.

ఎవడు ఈ చెప్పబడిన విద్యను తెలుసుకొనునో వాడు ప్రతిష్ఠితుడగును. అనగా 'ఈ సమస్త సృష్టికి ఆనందము మూలకారణమని తెలుసుకొనినవాడు అసలైన సత్యమును గ్రహించినవాడగును' అని అర్థము. అనగా, చెక్కు చెదరని సమాధానమును పొంది, అస్థిరత్వము లేనివాడగును' అని అర్థము. ఇట్టి ఆనందమయ కోశములో వర్తించువానికి నిరంతరము ఆనందము తప్ప వేరొకటి వుండదు. ఎక్కువ – తక్కువ అను ప్రశ్నలుగాని, ఉన్నది – లేదు అను విచారము గాని లేక తనకు – అవసరమగు అన్న పానీయాదులతో, పాడిపంటలతో, పుత్రపౌత్రాదికములతో, మంచి బ్రహ్మవర్చస్సుతో వర్ధిల్లి కీర్తిమంతుడగును. 'అన్నవాన్ అన్నాదో భవతి' అనునపుడు 'మనిషికి కావలసిన అన్నమును తాను పొందుచు, ఇతరులకు సమకూర్చుటలో ఆనందమును పొందును' అని అర్థమును చెప్పుకొనవలెను. 'మహాన్ భవతి' అనునపుడు గొప్పవాడు, ధనవంతుడు అను అర్థములుకాక మహనీయమైన లేదా, అందరికిని నచ్చు మంచితనము కలవాడని అర్థము చెప్పుకొనవలెను. 'ప్రజయా పశుభిః' అనునపుడు 'సత్సంతానమును కలిగి, దేశ అభ్యున్నతికి వారు తోడ్పడెడివారిగా కారణభూతుడగును' అనియు, 'పశుభిః' అనునపుడు 'సంపదలను పెంపొందించు గొప్పవృషభాది పశుగణము చేత' అను అర్థమును, 'బ్రహ్మవర్చసేన' అనునపుడు 'చక్కగావిషయమును వివరించగల్గిన బ్రహ్మణశక్తి వలన కలుగు ముఖకాంతులతో' అనియు, 'మహాన్ కీర్త్యా' అనునపుడు 'ఈ బ్రహ్మవిద్యా విషయములోని ఈ

ఆనందమయకోశ అనుభూతిని ఎడతెరిపి లేక పొందుచు ఉండును' అనియు అర్థములను చెప్పుకొనవలెను.

ఈ భృగువల్లి యందు భృగువు అవలంభించిన విద్యాపద్ధతి చిత్రమైనది. గణిత శాస్త్రములోగాని, రేఖా గణిత శాస్త్రములోగాని ఒక ధ్యేయమును చేరుటకు లేదా ఒక విషయమును సాధించుటకు రకరకముల పద్ధతులుండును. కంప్యూటర్లలో గూడ వివిధ పద్ధతులుండును. కాని, ఈ భృగువల్లిలో అనుసరించిన పద్ధతి విశిష్టమైనది. బ్రహ్మ విద్యలో ఆత్మదర్శన జ్ఞానమునకై (Subjective knowledge) ఇట్టి సూటిపద్ధతినే సాధారణముగా అవలంబించుదురు. ఈ పద్ధతినే 'తపస్సు' అందురు. మొదటి అనువాకములో ఈ తపస్సు గుఱించి ఇంతకు ముందే చెప్పబడినది. "మన ఇంటిలోని రేడియో, టీవీలను - ప్రసార తరంగదైర్ఘ్యము (Wave length) లేదా పౌనఃపున్యము (Frequency)తో శ్రుతి (tune) చేసినపుడు, ప్రసార కేంద్ర సమాచారమును మన రేడియో, దూరదర్శన యంత్రములు గూడ ఎట్లు గ్రహించునో - అదేవిధముగా వ్యక్తిగత మనస్సును (Individual mind) - విశ్వాత్మక మనస్సు(UNiversal mind)తో శ్రుతి చేసినపుడు సత్యము తట్టును. దీనినే 'తపస్సు' (Fiery Aspiration)గా అర్థం చేసుకొనవచ్చును" అని చెప్పబడినది.

ఈ భృగువల్లి యందు భృగువు పైన తెల్పిన పద్ధతిని అవలంబించుట వలన సత్యమును చేరగలిగెను. ఈ సత్యమును చేరు మార్గములో ప్రతి మెట్టు వద్ద తాత్కాలిక సత్యమును తెలిసికొని, మరల అది సరికాదని, అనుభవమున్న తండ్రిని అడిగెను. తండ్రియైన వరుణుడు కొడుకు యొక్క తపనకు లోలోననే సంతోషపడి, తను ఏ మాత్రము అసలైన సత్యమును బయటపెట్టక, ఆ తపస్సునే కొనసాగించి తెలుసుకొనుమనెను. కారణమేమనగా - ఒక సమస్య వచ్చినపుడు శిక్షకుడు దాని పరిష్కార మార్గమును చెప్పివేసినచో శిక్షితుడు జ్ఞానములో ఎదుగుటకు అవకాశము తక్కువగును. (Wisdom grows not in a solved problem but in solving a problem) ఈపద్ధతి పిల్లల యెడ అవలంబించినచో తెలివితేటలు గల పిల్లల విషయములో వారంతకు వారే విషయములను తెలిసికొని సమస్యలను పరిష్కరించుకొనగల్గునట్లు చేయవచ్చును. ఈ విధముగా చేయుటవలన వారిధీశక్తికి

పదును పెట్టి, వారిలో నిక్షిప్తమై వున్న నైపుణ్య, దక్షతలను, (Innate skill and talents) సృజనాత్మకశక్తిని (Creativity) పెంపొందింప జేయువచ్చును. (దేవేంద్రనాథ్ ఠాకూరు తన పిల్లల యెడ ఈ పద్ధతినే అవలంబించెడివాడు. వినాయక చవితి పండుగ వచ్చినపుడు ఆయన తన పిల్లలకు రేగడి మట్టిని (బంక మట్టిని) ఇచ్చెడివాడేగాని, మట్టివినాయకునిబొమ్మ బజారులో కొని పట్టుకు వచ్చెడివాడు కాదు. వారికిచ్చిన మట్టితో పిల్లలు తమంతట తామే వినాయకుని తయారు చేసుకొనెడివారు. రవీంద్రనాథ్ ఠాకూరు చిత్రకారుడు గాను, శిల్పిగాను, విశ్వకవీంద్రునిగాను తయారగుటకు తండ్రియైన ఈ దేవేంద్రనాథ్ ఠాకూరు యొక్క ఇట్టి దృక్పథము చాల దోహదపడినది.)

అన్నమయ (Physical), ప్రాణమయ (Vital), మనోమయ (Mental), విజ్ఞానమయ (Intellectual), ఆనందమయ (Bliss), కోశములను గూర్చి, వాటి మధ్య గల సంబంధములను గూర్చి ఇంత వఱకు చెప్పబడినది. యోగసాధకుడు తన దైనందిన జీవితములో ఆచరించవలసిన కొన్ని సాధన రహస్యములు ఇటుపైన చెప్పబడును.

**మంత్రము :** ***అన్నం న నిన్ద్యాత్ । తద్వ్రతమ్ । ప్రాణో వా అన్నమ్ । శరీర మన్నాదమ్ । ప్రాణే శరీరం ప్రతిష్ఠితమ్ । శరీరే ప్రాణః ప్రతిష్ఠితః। తదేత దన్న మన్నే ప్రతిష్ఠితమ్ । స య ఏత దన్న మన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవా నన్నాదో భవతి । మహాన్భవతి ప్రజయా పశుభి ర్బ్రహ్మవర్చసేన । మహా న్కీర్త్యా ॥*** (7)

**టీక :** అన్నమ్ = అన్నమును, నవిన్ద్యాత్ = నిందించవద్దు, తత్ = అది, వ్రతమ్ = వ్రతము వంటిది, ప్రాణః వా అన్నమ్ = ప్రాణమే అన్నము, శరీరమన్నాదమ్ = శరీరము అన్నాదము, ప్రాణే = ప్రాణమునందు, శరీరమ్ = శరీరము, ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠింపబడి ఉన్నది, శరీరే = శరీరము నందు, ప్రాణః = ప్రాణము, ప్రతిష్ఠితః = ప్రతిష్ఠితమై ఉన్నది (లేదా కూర్చబడి ఉన్నది), తత్ = అందువలన, ఏతత్ = ఈ ప్రాణ, శరీరముల జంట, అన్నే = అన్నమునందు, ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠితమగుచున్నది, యః = ఎవ్వడు, ఏతత్ = ఈ జంటను, అన్నే = అన్నమునందు, ప్రతిష్ఠితమ్ =

ప్రతిష్ఠితమైనదని, వేద = తెలుసుకొనుచున్నాడో, సః = వాడు, ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠితుడగుచున్నాడు, అన్నవాన్ = అన్నమును కలిగినవాడు, అన్నాదః = అన్నమును పొందువాడును, ఇచ్చువాడును, భవతి = అగుచున్నాడు, ప్రజయా = పుత్రపౌత్రాదికము చేత, పశుభిః = పశుసంపదచేత, బ్రహ్మవర్చసేన = బ్రహ్మవర్చస్సు చేత, మహాన్ = మహనీయుడై, కీర్త్యా = కీర్తిచేత, భవతి = అగుచున్నాడు.

**తాత్పర్యము :** అన్నమును నిందించకూడదు. ఈ నియమమును వ్రతముగా పాటించవలెను, ప్రాణమే - అన్నము. శరీరమే - అన్నాదము. ప్రాణమునందు - శరీరము, శరీరమునందు - ప్రాణము ప్రతిష్ఠితమై ఉన్నవి. అందుచే ఈ ప్రాణ శరీరములు అన్నమునందు ప్రతిష్ఠితమగుచున్నవిగా తెలుసు కొనువాడుకూడ ప్రతిష్ఠితుడగును. అంతేగాదు, అన్నమును కల్గినవాడు, అన్నమును ఇచ్చువాడు, అన్నమును పొందువాడుగా కూడ అగును. మరియు, చక్కని సంతానముచేత, పుష్కలమైన పశుసంపద చేత, స్వచ్ఛమైన వర్చస్సు చేత, కీర్తి చేత మహనీయుడగును.

**వివరణము :** ఈ అనువాకములో మనము తినెడి అన్నముపట్ల మనము పాటించవలసినసాధనా రహస్యములలో ఒక రహస్యము చెప్పబడుచున్నది. 'అన్నమును నిందించకూడదు' అనునది మొదటి రహస్యము. భృగువు బ్రహ్మజ్ఞానమును పొందుట తపస్సుద్వారా సాధించెను. ఈ తపస్సు చేయుటకు పంచభూతాత్మకమైన శరీరము ఉండవలెను. ఈ శరీరము అన్నముచే తయారైనది. మరియు, బ్రహ్మజ్ఞానమును పొందుటలో తొలిమెట్టైన అన్నమయకోశము భృగువునకు మొదటి గురువుగా పనిచేసెను. అందుచే గురువును ఎట్లు నిందించకూడదో అన్నమును గూడా అట్లు నిందించకూడదు. 'అన్నం న నిన్ద్యాత్' అను దానికి అన్నమును నిందించరాదని, నిందించుచు అన్నమును భుజించరాదని రెండు విధములైన అర్థములు చెప్పుకొనవలెను. అనగా, చేసిన పదార్థములలో కొంచెము ఉప్పు, కారములలో - తేడా ఉండి, రుచి తగ్గిననూ - వాటిని, వాటిని చేసిన వారిని తిట్టరాదు. తనకు నచ్చనిచో - నచ్చినదానిని తినవలెనే గాని, నచ్చని దానిని తిట్టరాదు. అన్నమును తినుటకు ముందు ఎవరిపైనను కోపముగాని,

అసూయా ద్వేషాదులుగాని వున్నచో - అన్నమును తినునపుడు వారు గాని, వారి సంబంధమైన సన్నివేశములు గాని గుర్తు వచ్చి కోపముతో తిట్టుకొనుచు భోజనము చేయరాదు. లేనిచో భోజనముతోపాటు తిట్లను గూడ తినినట్లగును. ఆ తిట్లు అసూయ వలన, ద్వేషము వలన పుట్టినవిగాబట్టి, అన్నమును తినుట వలన తాను ఎట్లు పెరుగునో - ఆ తిట్లు తినుటవలన ఆ అసూయాద్వేషాదులు కూడా తనలో అదేరీతిని పెరుగును. కొందరు వస్తాదులు తాము తినబోవు రొట్టెలను - పిండిని తయారుచేయునప్పటి నుండి ఎంతో శ్రద్ధతో ఇదేగదా మన బలమునకు కారణము' అను దృష్టితో వాటిని తయారు చేసి తిందురు. ఆ సమయములో అవాంఛనీయమైన ఏ విషయములు వారి మనస్సులలో ఉండవు. అందువలననే వారికి ఆ విధముగా తిన్న ఆహారము పూర్తిగా వంటబట్టును.

ఇక్కడ మరియొక విషయమును గూడ చెప్పుకొనవలెను. మనము అన్నపానీయాదులను తీసికొను విధానము, అప్పటి పరిస్థితులు గూడ మనపై ప్రభావమును చూపును. తల్లి పానీయమును ఇచ్చినపుడు త్రాగుదుము. అట్లే, స్నేహితుడు ఇచ్చినపుడును త్రాగుదుము. అట్లే, బట్టల షాపులో షాపు యజమాని ఇచ్చినపుడు గూడ త్రాగుదుము. కాని, ఈ మూడు పరిస్థితులో మనము త్రాగిన పానీయమునకు చాల భేదము ఉండును. షాపు యజమాని మన పెరుగుదలను, ఆరోగ్యమును కాంక్షించి పానీయమును ఈయడు. తరువాత మనము కొనిన బట్టలకు బిల్లు వేయునపుడు ఈ పానీయమునకగు ఖర్చును కూడ కలిపివేయును. అట్లే, స్నేహితుడు అతిథి మర్యాదలను (Hospitality and formalities) దృష్టిలో పెట్టుకొని మనకు పానీయములను ఇచ్చును. కాని, షాపు యజమాని ఇచ్చునదానికన్న నయమే! ఈ రెంటికీ పూర్తిగా భిన్నముగా తల్లి ఇచ్చిన పానీయము మన పెరుగుదలను, ఆరోగ్యమును ఆకాంక్షించి ఉండును. అట్లే, మనము హోటలులో మరికొంచెము అన్నము ఎక్కువ తినుచున్నపుడు సర్వరు, హోటలు యజమాని గూడ ఏదో తాము నష్టపోవుచున్నట్లు, బాధ వారిలో అంతర్లీనమై వుండును. కాని, తల్లి ప్రేమతో ఆహారమును పెట్టునపుడు మనము ఎంత తిన్నచో అంత సంతోషించును. ఆ విధముగా తినిన అన్నము - మనకు వంటబట్టుటయే గాక తినుచున్నపుడు తల్లి

చూపు ఆపేక్ష, ప్రేమ, అనురాగములను గూడ మనలో పెంపొందింపచేయును. అందుచే, అన్నమును తిను విషయములో దానిని తీసుకొను విధాన పరిస్థితుల ప్రభావము మనపై ఉండునని గ్రహించవలెను.

'అన్నమును నిందించరాదు' అను నియమమును వ్రతముగా పాటింపవలెనని నిర్ధారింపబడినది. వ్రతము, నోము మొదలైన విషయములుగా చెప్పినపుడు ఎక్కువ శ్రద్ధాభక్తులతో నియమము పాటింపబడును. భారతీయ సంప్రదాయములలో ఆచారకాండ వెనుక ఉన్న శాస్త్రీయత అంతయు ఈ వ్రతనియమాది అనుష్ఠాన పూర్వకముగానే చెప్పబడినది. "పూజయేత్ అశనం నిత్యం" అనియు, "పూజితం అశనం నిత్యం బలమూర్జం చ ఇచ్ఛతి, అపూజితంతు తద్భుక్తమ్ తదుభయోర్నాయో దిదమ్." అనగా, 'అన్నమును నిత్యము పూజింపుము. అట్లు పూజింపబడిన అన్నము శరీరమునకు బలమును, శక్తిని తేజస్సును ఇచ్చును. పూజించని అన్నము అనగా అగౌరభావముతో చూడబడిన అన్నము ఎంత తిన్నను శక్తి, బలము, వర్చస్సులనీయవు' అని పెద్దలు చెప్పిరి.

శరీరము కన్న ప్రాణము గొప్పదని, అన్నము కన్న ప్రాణము గొప్పదని అభిప్రాయపడుట సరిగాదు. 'ప్రాణమే - అన్నము', మరియు 'శరీరమే - అన్నాదము' అగుట వలన ప్రాణ, శరీరములు ఈ అన్నము ద్వారా సంధానింపబడుచున్నవి. అనగా ఈ శరీరము అన్నమును తినును. ప్రాణము నందు శరీరము స్థాపింపబడి ఉండును. అందుచే ప్రాణమును శరీరము నుండి వేరుగా అర్థము చేసుకొనుట పొరపాటు. ఈ జంట - అన్నముతో సంధానింపబడి అన్నము నందు ప్రతిష్ఠింప బడుచున్నదని తెలసికొనిన వాడు తాను గూడా అదేవిధముగా ప్రతిష్ఠితుడగును. 'తిష్ఠ' అనగా స్థిరత్వమును పొందిన స్థితి'. 'ప్రతిష్ఠిత' అనగా చక్కగా స్థిరత్వమును పొందిన స్థితి. ప్రాణ, శరీరముల మధ్య సంబంధము ఎంత స్థిరముగా చెక్కుచెదరక వుండునో తాను గూడ అంత చెక్కుచెదరని వానిగా వుండునని దీని అర్థము. ఇట్టివాడు అన్నమును కల్గినవాడు, గ్రహించువాడు, ఇచ్చువాడు అగుచు, అందటి హృదయములను స్పృశించిన వాడగుటచే దయా దాక్షిణ్య సేవా ఆపేక్షలు కల్గినవాడై చక్కని సంతానముచేత గో, వృషభాది పశుసంపదచేత, చక్కని వర్చస్సుతో మహనీయుడై

కీర్తిమంతుడగును. 'అన్నమును నిందించుకుండుట' అను నియమమును ఆచరణలో పెట్టువానికి ఈ చెప్పబడిన ఫలితములు దక్కును. ఇటుపైన మరియొక నియమమును గూర్చి చెప్పబడును.

**మంత్రము : అన్నం న పరిచక్షీత । తద్వ్రతమ్ । ఆపో వా అన్నమ్ । జ్యోతి రన్నాదమ్ । అప్సు జ్యోతిః ప్రతిష్ఠితమ్ । జ్యోతి ష్యాపః ప్రతిష్ఠితాః । తదేత దన్నమన్నే ప్రతిష్ఠితమ్ । స య ఏత దన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవా నన్నాదో భవతి । మహా న్భవతి ప్రజయా పశుభి ర్బ్రహ్మవర్చసేన । మహా న్కీర్త్యా ॥** *(8)*

**టీక :** అన్నము = అన్నమును, న పరిచక్షీత = పారవేయతగదు, తత్ = అది, వ్రతమ్ = వ్రతము, ఆపః = ఉదకములు, అన్నం వై = అన్నము కదా, జ్యోతిః = జ్యోతిస్సు, అన్నాదమ్ = అన్నాదము, అప్సు = జలములందు, జ్యోతిః = జ్యోతిస్సు, ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠితమగుచున్నది, జ్యోతిషి = జ్యోతిస్సునందు, ఆపః = ఉదకములు, త్రిష్ఠితా = ప్రతిష్ఠితములై ఉన్నవి, తత్ = అందువలన, ఏతత్ = ఈ జ్యోతిస్సు, ఆపస్సుల జంట, అన్నే = అన్నమునందు, ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠిత మగుచున్నది, (మిగిలిన పదములకు పూర్వానువాకమునందు అర్థము లీయబడినవి)

**తాత్పర్యము :** 'అన్నమును పారవేయవలదు'. ఈ నియమమును వ్రతముగా పాటింపవలయును. ఉదకములే అన్నము. జ్యోతిస్సు అన్నాదము. అన్నాదమనగా అన్నమును తినునది. జలములందు – జ్యోతిస్సు అనగా అగ్ని, అగ్నియందు – జలములు ప్రతిష్ఠితములై ఉన్నవి. ఈ అగ్ని, ఉదకముల అను సంధానము అన్నము వల్ల జరుగచు, అన్నము నందు ప్రతిష్ఠితమగుచున్నదను విషయమును తెలిసినవాడు కూడ ప్రతిష్ఠితుడగుచున్నాడు. అంతియే గాక,అన్నము కల్గినవాడై ... కీర్తిమంతుడగుచున్నాడు.

**వివరణము :** అన్నము విషయములో పాటింపవలసిన రెండవ నియమమును ఈ అనువాకములో చెప్పుచున్నాడు. 'అన్నమును పారవేయకుండుట' ఈ రెండవ నియమము. అనగా, కావలసినది మాత్రమే వడ్డించుకొని, వడ్డించుకొనిన

వన్నియు పారవేయకుండా తినుట. అన్నమును తయారు చేయుటలో కాని, ఒక చోట చేర్చుటలో గాని వృథాగాకుండా చూడవలెను. (There must not be any waste in preparation and procurement of food). మనకు నచ్చని పదార్థమని ముందే తెలిసినపుడు వడ్డించునపుడు ముందే వద్దనవలెనను గాని వడ్డించిన తరువాత పారవేయరాదు. భోజన కాలమునకు ప్రాప్తమైన ఆహారమును స్వీకరించడమే యుక్తముగాని, మంచిది కాదని పారవేయుట యుక్తము గాదు. ఈ నియమమును గూడ వ్రతదీక్షగా పాటింపవలెను. మనము దేనివల్ల వృద్ధి అగుచున్నామో దానిని చేతులారా పారవేయుట మన వృద్ధికిమనమే అడ్డుపడుట అగును. ఇట్లు అన్నమును పారవేసిన వానికి - పారవేయునపుడు తెలియదు గాని "ఏ రకమైన ఆహారమైనను తినుటకు ఉన్నచో చాలును" అనెడి పరిస్థితి తన ముందు జీవితములో ఎదుర్కొనవలసి వచ్చును.

సాధారణముగా శుభకార్యములయందు, విందులయందు అన్నమును సగము తిని, సగము పారవేయుట జరుగుచుండును. పైగా, ఆ విధముగా పారవేయుట వలన ముష్టివారికి, అన్నములేని వారికి తృప్తి జరుగునని గొప్పగా చెప్పుకొనుచుందురు. ముష్టివారికి నిజముగా అన్నమును పెట్టదలచుకొన్నచో సగము తినినది, ఎంగిలి చేసినది, పాడై పారవేయుస్థితిలో ఉన్నదానిని, వారి ముఖమున కొట్టుటకన్న ఎంగిలి చేయని, పాడవని అన్నమును పెట్టుటయే ధర్మము. వండిన అన్నమును తాను ఎంగిలి చేయకుండ తినగా ఇంకను మిగిలినచో, అట్టి అన్నమును అవతల పారవేయక ఇతరులకు పెట్టవచ్చును. కావున, ఎట్టి పరిస్థితులలోనైను అన్నము సద్వినియోగ మగుట చూడవలెను గాని, వృథా కానీయరాదని తెలుసుకొనవలెను.

తీసుకొనిన పానీయములు జఠరాగ్నిచే అరుగుచున్నవి. కావున, జలములు - అన్నము కాగా, ఆ జలములను అగ్ని తినుచు అన్నాదము అగుచున్నది. జలమునందు అగ్ని వున్నదను విషయము చిత్రమనిపించును. ఉదజని, ఆమ్లజని (Hydrogen & Oxyen) కలిసి నీటి ఆవిరిగా ఏర్పడినపుడు కొన్నివేల కెలోరీల ఉష్ణశక్తి పుట్టును. ఇది జలమునందు నిక్షిప్తమై ఉండును. అందుచేతనే జలమునందు అగ్ని ఉన్నదని ఇచ్చట చెప్పబడినది. శరీరములో ఉష్ణాధిక్యత వలన తాపము పుట్టి

స్వేదము బహిర్గతమగును. అనగా, జలరూపములో నున్న చెమట - దేహమునకు తాపమును కల్గించిన అగ్ని నుండి జనించినదని - దీనిని బట్టి తెలియును. అందుచేతనే ఇచ్చట జ్యోతిస్సునందు జలములు ప్రతిష్ఠితమైనవని చెప్పబడినది. ఇవి రెండునూ ఒక దానికొకటి అన్నము, మరియు అన్నాదము అగుచున్నవి. ఈ విషయమును తెలిపినవాడు అన్నమును కలిగినవాడై, అన్నమును అరగించుకొనగల జఠరాగ్నిని కలిగి, అన్ని విధములుగ పూర్వము చెప్పినట్లు యశస్సుతో వర్ధిల్లును.

**మంత్రము : అన్నం బహు కుర్వీత । తద్వ్రతమ్ । పృథివీ వా అన్నమ్। ఆకాశో௨న్నాదః । పృథివ్యా మాకాశః ప్రతిష్ఠితః । ఆకాశే పృథివీ ప్రతిష్ఠితా । తదేత దన్న మన్నే ప్రతిష్ఠితమ్ । స య ఏత దన్న మన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవానన్నాదో భవతి । మహా న్భవతి ప్రజయా పశుభి ర్బ్రహ్మవర్చ సేన । మహా న్కీర్త్యా ॥** **(9)**

**టీక :** అన్నం = అన్నమును, బహుకుర్వీత = సమృద్ధిపరచవలెను, తత్ = అది, వ్రతమ్ = వ్రతము, పృథివీ = భూమి, అన్నం వా = అన్నముగదా, ఆకాశః = ఆకాశము, అన్నాదః = అన్నాదము, పృథివ్యాం = భూమియందు, ఆకాశః = ఆకాశము, ప్రతిష్ఠితా = ప్రతిష్ఠితమై ఉన్నది, ఆకాశే = ఆకాశమునందు, పృథివీ = భూమి, ప్రతిష్ఠితా = ప్రతిష్ఠితమై ఉన్నది, తత్ = అందువలన, ఏతత్ =ఈ (భూమి, ఆకాశముల) జంట, అన్నే = అన్నమునందు, ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠితమై ఉన్నది, (మిగిలిన పదములకర్థములు పూర్వానువాకములో కలవు).

**తాత్పర్యము :** 'అన్నమును సమృద్ధి చేయవలెను' ఈ నియమమును వ్రతముగా పాటింపవలెను. భూమి యే అన్నము, ఆకాశము అన్నాదము. భూమియందు - ఆకాశము, ఆకాశమందు - భూమి ప్రతిష్ఠితమగుచున్నవి. ఇవి ఒక దానికొకటి అన్నము, అన్నాదములు. ఈ విషయము తెలిసినవాడు తాను గూడ ప్రతిష్ఠితుడై పూర్వము చెప్పినట్లు అన్ని విధములుగా వర్ధిల్లి కీర్తిమంతుడగును.

**వివరణము :** అన్నమును గూర్చి మరియొక నియమము చెప్పబడుచున్నది. అన్నమును సమృద్ధి చేయవలెను. "అన్నమును ఎక్కువగా

సంపాదించవలెను" అనుటకన్న "అన్నమును ఎక్కువ తయారుచేయవలెను. లేదా సమృద్ధి చేయవలెను" (Try not to earn food but to produce it) అనుట సరియైన పద్ధతి. 'సంపాదించుట' అన్నది నోట్ల కట్టలకు చెల్లును కాని, అన్నము విషయములో సరికాదు. అన్నమునకు సంబంధించిన పంటను పండించక నోట్లకట్టలను సంపాదించుటకు ప్రాధాన్యమిచ్చినచో - ద్రవ్యోల్బణము వచ్చి సంచులతో నోట్ల కట్టలను తీసుకువెళ్ళి, జేబునకు సరిపడు తినుబండారమును కొనుక్కొన వలసినదుస్థితి ఏర్పడును. అందుచే, ఏదేశ ప్రభుత్వమైననూ తిండి గింజలను పండించుటకు ముందు ప్రాధాన్యమిచ్చి, అటుపైన మిగిలిన ద్రవ్యముల ఉత్పత్తికి, ఎగుమతికి ప్రాధాన్యమీయవలెను. ఆ ఎగుమతి కూడ మన దేశప్రజలకు సరిపడగా మిగిలిన వాటినే ఎగుమతి చేయవలెను. అన్న పానీయములకు సంబంధించిన వాటిని - 'ఎక్కువ డబ్బులు వచ్చును గదా' అని స్వదేశ ప్రజలకు అందకుండా విదేశములకు పంపినచో - నోట్లకట్టల ఎదురుగా కూర్చుని అన్నమునకు బాధపడవలసి వచ్చును. అందుచే, ఎప్పుడునూ నోట్ల కట్టల మీద గల దృష్టి నుండి సంపదను పెంపొందించుట వైపు మన దృక్పథము మారవలెను. (We have to change our out look from money to wealth) ఒక వ్యక్తికి డబ్బునిచ్చి సంతృప్తి పరచ లేమేమోగాని అన్నమును పెట్టి సంతృప్తి పరచవచ్చును. అందువల్ల, తృప్తి - అన్నమువల్ల వచ్చును గాని, డబ్బువలన రాదు. అందుచేతనే ఇచ్చట 'అన్నమును సమృద్ధి చేయుము' అను నియమము చెప్పబడెను. సమృద్ధి చేయుటలో ఒళ్ళు దాచుకొనకుండా, కష్టపడి సాధించుట తప్పుకాదు. కష్టపడకుండా సంపాదించవలెనను మార్గము మాత్రము తప్పు. అందుచే, ప్రతి వారును అన్నమును సమృద్ధి చేయుటలో ఎక్కువ పాలుపంచుకొనినచో ప్రజలకు తిండికి లోటు ఉండదు.

భూమి - ఆకాశమునందును, ఆకాశము - భూమి యందును ప్రతిష్ఠితమై ఉన్నవని ఇచ్చట ప్రతిపాదింపబడెను. ఆధ్యాత్మికముగా చెప్పుకొన్నచో దీనిలో కొంత సాంకేతిక (Symbolic) రహస్యము కలదు. ఇచ్చట 'భూమి' - అనగా 'దేహము', 'ఆకాశ' మనగా - 'చోటు'. జీవి యొక్క దేహము ఆకాశములో నున్నది. ఈ దేహము లోపల దహరాకాశము ఉన్నది. అందుచే - 'చోటు, దేహములు' అనగా ఆకాశము - భూమి' ఒకదానిలో ఒకటి ప్రతిష్ఠితమై ఉన్నవి' అని చెప్పబడినది. ఇది ఎట్లనగా

చోటులో చెంబు వున్నపుడు, ఆ చెంబులో మరల చోటువుండును గదా, నల్లబల్లపై ఒక వృత్తమును గీసినపుడు - నల్లబల్లయందు వృత్తము, వృత్తములోపల మరల నల్లబల్ల వుండును గదా! ఈ విధముగా జీవి పట్ల కూడా అర్థము చేసికొనవలెను. 'ఆకాశము నందు - దేహము, దేహమునందు - దహరాకాశము ప్రతిష్ఠితమై, ఈ జంటవలన ఆ జీవి సుప్రతిష్ఠితుడగుచున్నాడు' అను అర్థములో "ఎవరు దీనిని తెలుసుకొనుచున్నాడో వాడునూ ప్రతిష్ఠితుడగు చున్నాడు" అని చెప్పబడినది. ఇట్టివాడు సుప్రతిష్ఠితుడు అగుటయే గాక ఇంతకు పూర్వము చెప్పినట్లు అన్నాదిక సదుపాయములతో వర్థిల్లి కీర్తిమంతుడగును. కేవలము బాహ్యార్థము మాత్రమే కావలెనన్నచో భూమి నుండి అన్నమునకు సంబంధించిన పంట పండుచున్నది. భూమి యందలి జలములను, ద్రవ్యములను సంవత్సర యజ్ఞములో ఆకాశము గ్రహించుచున్నది. అందుచే ఆకాశమునకు - భూమి అన్నము. ఆకాశము నుండి సూర్యరశ్మిని, మేఘముల ద్వారా వర్షమును భూమి గ్రహించి పంటను పండించుచున్నది. అందుచే ఆకాశము భూమికి అన్నమగును. అన్నము ఈ విధముగా రెంటిని సంధించుచున్నది' అని చెప్పుకొనవచ్చును.

**మంత్రము :** *న కంచన వసతౌ ప్రత్యాచక్షీత । తద్వ్రతమ్ । తస్మా ద్యయా కయా చ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్। అరాధ్యస్మా అన్న మిత్యాచక్షతే। ఏతద్వై ముఖతో ఉన్నగ్ం రాద్ధమ్ । ముఖతోఉస్మా అన్నగ్ం రాధ్యతే । ఏతద్వై మ్ధ్యతో ఉన్నగ్ం రాద్ధమ్ । మధ్యతో స్మా అన్నగ్ం రాధ్యతే । ఏతద్వా అన్తతో ఉన్నగ్ం రాద్ధమ్ । అన్తతో స్మా అన్నగ్ం రాధ్యతే । య ఏవం వేద । క్షేమ ఇతి వాచి। యోగక్షేమ ఇతి ప్రాణాపానయోః । కర్మేతి హస్తయోః । గతి రితి పాదయోః । విముక్తి రితి పాయౌ। ఇతి మానుషీస్సమాజ్ఞాః । అథ దైవీః। తృప్తి రితి వృష్టౌ । బలమితి విద్యుతి । యశ ఇతి పశుషు । జ్యోతి రితి నక్షత్రేషు । ప్రజాతి రమృత మానన్ద ఇత్యుపస్థే । సర్వమిత్యాకాశే । తత్ప్రతిష్ఠేత్యుపాసీత। ప్రతిష్ఠావా న్భవతి । తన్మహ ఇత్యుపాసీత । మహాన్భవతి । తన్మన ఇత్యుపాసీత । మానవా న్భవతి । తన్నమ ఇత్యుపాసీత । నమ్యన్తే స్మైకామాః । తద్బ్రహ్మేత్యుపాసీత । బ్రహ్మవాన్భవతి। తద్బ్రహ్మణః పరిమర ఇత్యుపాసీత । పర్యేణం మ్రియన్తే ద్విషన్త స్సపత్నాః । పరియే*

ఉ ప్రియాభ్రాతృవ్యాః । స యశ్చాయం పురుషే । యశ్చాసా వాదిత్యే । స ఏకః । స య ఏవం విత్ । అస్మాల్లోకా త్ప్రేత్య । ఏత మన్నమయ మాత్మాన ముపసంక్రమ్య । ఏతం ప్రాణమయమాత్మాన ముపసంక్రమ్య । ఏతం మనోమయ మాత్మాన ముపసంక్రమ్య । ఏతం విజ్ఞానమయ మాత్మాన ముపసంక్రమ్య । ఏత మానన్దమయ మాత్మాన ముపసంక్రమ్య । ఇమా న్లోకా న్కామాన్నీ కామరూప్యను సంచరన్ । ఏత థ్సామ గాయ న్నాస్తే । హా3వు హా3వు హా3వు । అహ మన్న మహమన్న మహమన్నమ్। అహ మన్నాదో3ఉ హ మన్నాదో3ఉ హ మన్నాదః । అహగ్గ్శ్లోకకృ దహగ్గ్ శ్లోకకృ దహగ్గ్ శ్లోకకృత్ । అహమస్మి ప్రథమజా ఋతా3స్య । పూర్వం దేవేభ్యో అమృతస్య నా3భాయి । యో మా దదాతి స ఇదేవ మా3వాః । అహమన్న మన్న మదన్త మా3ద్మి । అహం విశ్వంభువన మభ్యాభవా3మ్ । సువర్ణజ్యోతీః । య ఏవం వేద । ఇత్యుపనిషత్ । *(10)*

**టీక:** వసతౌ = వసించుటకువచ్చిన, కంచన = ఎవ్వనిని, న ప్రత్యాచక్షీత = వలదనకూడదు, తత్ = ఆ విధముగా చేయుట, వ్రతమ్ = వ్రతదీక్ష కావలెను, తస్మాత్ = అందువలన, యాయాకయా చ విధయా = ఏదో ఒక విధానము చేత, అన్నమ్ = అన్నమును, బహు = సమృద్ధిగా, ప్రాప్నుయాత్ = (నివాసమునందు) ఉండునట్లు చూడవలెను, అన్నమ్ = అన్నము, అస్మై = (ఇంటికి వచ్చిన వాని కొఱకు, అరాధి = సిద్ధముగా నున్నది, ఇతి= అని, ఆచక్షతే = పలుకుచున్నారు (పలుకవలెను), అన్నమ్ = అన్నము, ఏతత్ ఈ రాద్ధమ్ = ఇదిగో సిద్ధమైనది (అని), ముఖతః = నోటితో అనుచున్నాడో, అస్మై = అట్టి వానికి, ముఖతః = ముందే, అన్నమ్ = అన్నము, రాధ్యతే = పొందబడుచున్నది, అన్నమ్ = అన్నము, ఏతత్ ఈ రాద్ధమ్ = ఇదిగో సిద్ధమైనది (అని), మధ్యతః = మధ్యమముగా, (ఇచ్చునో), అస్మై = (అట్టి) వాని కొఱకు, మధ్యతః = మధ్యమదశలో, అన్నమ్ = అన్నము , రాధ్యతే = పొందబడుచున్నది, అంతతః = అంతమునందు, అన్నం = అన్నము, ఏతత్ రాద్ధమ్ = సిద్ధమైనదని (అనుచున్నాడో), అస్మై = (అట్టి) వాని కొఱకు, అన్తతః = అంత్యదశలో, అన్నమ్ = అన్నము, రాధ్యతే = పొందబడుచున్నది, యః = ఎవ్వడు, ఏవం = ఈ విధముగా, వేద = తెలుసుకొనుచున్నాడో, (వాని),

క్షేమ ఇతి వాచి = వాక్కునందు క్షేమము ఉండును, యోగక్షేమములు, (వెన్నంటినిల్చును), కర్మేతి హస్తయోః = పనుల కొఱకు చేతులువుండిపోవును,గతిరితి పాదయోః = పాదములలో గమనము స్థాపింపబడును, విముక్తి రితి పాయౌ = అనవసరమైన వాటిని పాయువు విసర్జించినట్లు అనవసర దురభిప్రాయములను వదలి పెట్టును, ఇతిమానుషీః = ఇవి మనుష్యసంబంధమైన, సమాజ్ఞాః = జ్ఞానాత్మక ఉపాసనము, అథ = ఇటుపైన, దైవీః = ఆధిదైవిక ఉపాసనలు, (చెప్పబడును), తృప్తి రితి వృష్టౌ = తృప్తియే – వృద్ధి, బల మితి విద్యుతి = విద్యుత్తు – బలము, యశ ఇతిపశుషు = పశువులందు యశస్సు, జ్యోతిః ఇతి నక్షత్రేషు = నక్షత్రముల యందు ప్రకాశము, ఉపస్థే = జననేంద్రియము నందు, ప్రజాతిః అమృతమ్ = సంతానోత్పత్తి వలన తండ్రికి అమృతత్వము సిద్ధించి, ఆనన్దమ్ = ఆనందముతో నుండుట, సర్వమిత్యాకాశే = సర్వము ఆకాశమునందే ప్రతిష్ఠితమై ఉన్నదని, తత్ = ఆ బ్రహ్మము ఐన ఆకాశము, ప్రతిష్ఠా ఇతి = సర్వమునకు ప్రతిష్ఠయని, ఉపాసీత = ఉపాసించవలెను, (అప్పుడు వాడు) ప్రతిష్ఠావాన్ = ప్రతిష్ఠకలవాడు, భవతి = అగుచున్నాడు, తత్ = ఆ బ్రహ్మమైన ఆకాశమును, మహః ఇతి = మాహాత్మ్యగుణము కలదానిగా, ఉపాసీత = ఉపాసించవలెను, (అప్పుడు వాడు), మహాన్ భవతి = మహనీయుడగుచున్నాడు, తత్ = ఆ బ్రహ్మమైన ఆకాశమును, మనః ఇతి = మానవ స్వరూపమని, ఉపాసీత = ఉపాసించవలెను, (అప్పుడు వాడు), మానవాన్ భవతి = సమర్థుడగును, తత్ = ఆ బ్రహ్మమైన ఆకాశమును, నమఃఇతి = నమనగుణము అనగా, వినయగుణము కలదానిగా, ఉపాసీత = పాసించవలయును, అస్మై = (ఈ విధముగా) ఉపాసించు వానికి, కామాః = భోగ్యమైనవన్నియు, నమ్యన్తే = లోబడుచ్నునవి లేదా పొందబడుచున్నవి, తత్ = ఆ బ్రహ్మమైన ఆకాశమును, బ్రహ్మేతి = బృహ్మాణ శక్తి రూపమని, ఉపాసీత = ఉపాసించవలెను, (అప్పుడు హాడు), బ్రహ్మవాన్ = బ్రహ్మ సమానుడు, భవతి = అగుచున్నాడు, తత్ = బ్రహ్మమైన ఆకాశమును, బ్రహ్మణః = బ్రహ్మమునకు, పరిమర ఇతి = పరిమరమని, ఉపాసీత = ఉపాసించవలెను, పర్యేణం = అట్టివానిని, ద్విషన్తః = ద్వేషించునట్టి, సపత్నాః = ప్రత్యర్థులు, మ్రియన్తే = లోబడుచున్నారు, అప్రియాః = అప్రియులగు, భ్రాతృవ్యాః

= సోదరతుల్యులును, పరిభ్రమియ న్తే = లొంగుచున్నారు, పురుషే = పురుషుని యందు, యః చ = ఏ ఆత్మకలడో, సః అయమ్ = ఆ ఈ ఆత్మయు, ఆదిత్యే = ఆదిత్యుని యందు, లేదా సూర్యుని యందు, యః చ = ఏ ఆత్మకలడో, అసౌ = ఈ ఆత్మయు, సః ఏకః = ఒక్కడే, యః = ఎవ్వడు, ఏవంవిత్ = ఈ విధముగా తెలుసుకొనునో, సః = వాడు, అస్మాత్ లోకాత్ = ఈ లోకమునుండి, ప్రేత్య = విడిచి, ఏతమ్ అన్నమయమ్ = ఈ అన్నమయుడగు, ఆత్మానం = ఆత్మను, ఉపసంక్రమ్య = పొంది, అట్లే, ప్రాణమయ, విజ్ఞానమయ ఆనందమయాత్మకుని పొంది, ఇమాన్లోకాన్ = ఆ లోకములను, అనుసంచరన్ = సంచరించుచు, కామాన్నీ = కామానుసారమగు అన్నము గలవాడై, కామరూపి = కామరూపియై, అనుసంచరన్ = సంచరించుచు, ఏతత్ సామగాయన్ = ఈ చెప్పబోవునట్టి సామగానము చేయుచు, ఆస్తే = ఉండును, హా౩వు = ఆశ్చర్యము గదా, (మూడుసార్లు) అహం = నేను, అన్నమ్ = అన్నస్వరూపుడను, (మూడుసార్లు), అహం = నేను, అన్నాదః = అన్నాదుడను లేదా అన్నము తినువాడను (మూడుసార్లు), శ్లోకకృత్ = శ్లోకకృత్తుఅనగా ఈ చెప్పువానిని, (అగుచున్నాడను), అహం = నేను, ఋతస్య = ఋతముకంటె, దేవేభ్యః = దేవతలకంటె, పూర్వమ్ = ముందు, ప్రథమజాః = మొదట పుట్టినవాడను, అస్మి = అగుచున్నాడను, అమృతస్య = అమృతమునకు, నాభిః = నాభిమాత్రుడను (అగుచున్నాను), యః = ఎవ్వడు, మా = నన్ను, దదాతి = ఇచ్చుచున్నాడో, స ఇత్ = వాడే, ఏవం = ఈ విధముగా (నన్ను), అవా = సంరక్షించును, అహం = నేను, అన్నమ్ = అన్నమును, అదన్తమ్ = తినువానిని, అద్మి = తినుచున్నాను, అహం = నేను, విశ్వంభువనం = సమస్త ప్రపంచమును, అభ్యభవామ్ = తిరస్కరించి అతిక్రమించుచున్నాను, సువర్ణ జ్యోతీః = (నేను) సువర్ణ దీప్తి మంతుడను, యః = ఎవ్వడు, ఏవం = ఈ విధముగా, వేద = తెలుసుకొనునో, ఇతి = ఈ, ఉపనిషత్ = ఉపనిషత్తు (వానిని గురించియే చెప్పబడినది).

**తాత్పర్యము** : 'గృహమునందు వసింపవచ్చిన వానిని ఎవ్వనిని నిషేధింపరాదు'. ఈ నియమమును వ్రతముగా పాటింపవలెను. ఇందులకై ఏదో ఒక విధానము వలన అన్నము సమృద్ధిగా నుండునట్లు తగిన ఏర్పాటులో ఉండవలెను.

వచ్చినవారెవరికైనను 'ఇదిగో అన్నము సిద్ధముగా నున్నది' అని చెప్పగల్గు నట్లుండవలెను. ఈ విధముగా జీవితము మొదటి నుండి చెప్పగల్గు వానికి మొదటి నుండి అన్నాదికమునకు లోటు వుండదు. జీవితము మధ్యభాగము నుండి ప్రారంభించు వానికి – మధ్యభాగము నుండియే అన్నాదికమునకు లోటు ఉండదు. జీవిత అవసాన దశలో దీనిని అనుసరించినపుడు - అవసనాదశనుండే అన్నాదికమునకు లోటు వుండదు. ఆ అన్నాదికము కూడా తాను పెట్టిన ఆహారమును బట్టి ఉత్తమ, మధ్యమ, అధమ ఫలితములలో వచ్చుచుండును. ఈ విషయమును తెలిసి జీవితమును సమన్వయపరచుకొనవలెను. వాక్కునందు యోగక్షేమములు – ప్రాణాపానముల జంటవలె కలసి వుండునని, పాదములు ధర్మాభిముఖముగా చరింపవలెనని, అనవసరమైన దురభిప్రాయదులను మల, మూత్రములవలె విసర్జించవలెనని గ్రహించవలెను. ఇవి మనుష్య సంబంధమైనవి. ఇక, దైవ సంబంధమైనవి. జ్ఞానప్రాప్తికరమైనవి చెప్పవలెన్నచో – తృప్తి – వృద్ధినిచ్చునని, బలము విద్యుత్తునందదివిగా వినియోగపడవలెనని, పశువులు – కీర్తికారకములని, నక్షత్రములందలి స్వయంప్రకాశమువలె వెలుగొందవలెనని, 'సంతానోత్పత్తితో అమృతత్వవంతుడై ఆనందమును పొందవలెనని, సర్వము ఆకాశమునందే వున్నదని తెలుసుకొనవలెను లేదా ఉపాసించవలెను. ఆకాశము సర్వమునకు ప్రతిష్ఠయని ఉపాసించినవాడు తానునూ ప్రతిష్ఠితుడగును. ఆకాశమును మహత్వ గుణము గలదిగా ఉపాసించిన వాడు తానునూ మహనీయుడగును. ఆకాశమును మనన స్వరూపము గలదిగా ఉపాసించిన వాడు తానునూ మనన సమర్థుడగును, ఆకాశమును నమనగుణము గలదిగా ఉపాసించు వానికి కావలసినవి చేకూరు చుండును. ఆకాశమును ఉపాసించువాడు తానునూ బ్రహ్మాణశక్తి గలిగి బ్రహ్మాంతవాడగును. ఆకాశమును బ్రహ్మామునకు పరిమరమని ఉపాసించువానికి ద్వేషించునట్టి ప్రత్యర్థులు తొలిగిపోవుదురు. కావలసిన వారైనను, అప్రియులైనచో – తొలగిపోవుదురు. పురుషుని యందలి ఆత్మ, ఆదిత్యుని యందలి ఆత్మ ఒక్కటే అని తెలుసుకొనువాడు ఈ లోకమును విడిచి అన్నమయాత్మను, ప్రాణమయాత్మను పొంది భూర్భువస్సువరాది లోకములన్నిట సంచరించగలిగి, కావలసిన అన్నము గలవాడై, ఇష్ట రూపముతో సంచరించుచూ – 'ఆహా! ఎంత ఆశ్చర్యము? నేను అన్న స్వరూపుడను, నేను అన్నాదుడను, నేను ఇట్లనగలుగు శ్లోకకృత్తును. నేను ఈ జగత్తు కంటె, నిశ్చయాత్మకసత్యముకంటె, దేవతల కంటె ముందువాడను,

మొదటివాడను, అమృతమునకు మూలబిందువు వంటివాడను. అన్న స్వరూపుడనగునన్ను ఎవడు అన్నార్థులకు ఇచ్చునో వాడే నన్ను సంరక్షించును. నేను అన్నమును తినువానిని తినుచున్నాను. నేను సమస్తవిశ్వమును అతిక్రమించి అతీతుడుగా ఉన్నాను, నేను సువర్ణ దీప్తిమంతుడను.' అని సామగానము చేయును. ఈ విధముగా ఎవడు తెలుసుకొనునో వాని కొఱకే, ఆ తెలుసుకొను వానిని గూర్చియే ఈ ఉపనిషత్తు చెప్పబడినది.

**వివరణము :** క్రిందటి అనువాకమువరకు అన్నమును గూర్చి వ్యక్తిగతముగా పాటింపవలసిన వ్రతనియమములు చెప్పబడినవి. ప్రస్తుత అనువాకములో మన ఇంటికి వచ్చెడు వారి పట్ల మనము ఆచరింపవలసిన కొన్ని వ్రత విశేషములు చెప్పబడును. "ఎవరైనను మన ఇంటికి విశ్రమించుటకు గాని, శ్రమదీర్చుకొనుటకు గాని, నిద్రించుటకు గాని వచ్చినపుడు 'ఉండుటకు వీలులేదు', అని అనరాదు." అను నియమము చెప్పబడినది. ఇది చోటు పట్ల మనము తెలుసుకొనవలసిన పరమ సత్యము. మనము ఎన్ని ఋణములైనను తీర్చుకొన గలమేమోగాని, చోటు యొక్క ఋణమును తీర్చుకొనలేము. మన దేహ ఘనపరిమాణము ఎంతవుండునో అంతచోటు (our own volume of space) మనము ప్రపంచమునకు ఋణపడి వున్నాము. మనము ఎక్కడ వున్నను, ఎప్పుడు ఏ స్థితిలో ఉన్నను ప్రపంచములోని ఈ చోటు మేరకు ఆక్రమించుకొనుచున్నాము. ఇది డబ్బు ఇచ్చికొనినది కాదు. అనగా, స్వంతము కాదు. కావున చోటుపట్ల మనము ఈ విధముగా ఋణపడి వున్నాము. ఈ చోటు మనది కాదు. మన తాత తండ్రులది కూడ కాదు. మనము చనిపోవునంత వరకు చోటు పట్ల మన ఈ ఋణము తీరనిదే ! ఒక వేళ ఇంటిలో ఉన్నపుడు ఆ 'ఇంటి స్థలము మనము కొన్నదే కదా' అని అనుమానము రావచ్చును. కాని "ఆ ఇల్లు వున్న స్థలము యొక్క పొడవు వెడల్పు వలన ఏర్పడు భూవైశాల్యమును కొంటిమి గాని, ఎత్తును బట్టి వచ్చు చోటును కొనలేదు గదా" అని తెలుసుకొనవలెను. అసలు ఈ చోటు మొట్టమొదట ఎవనిదీ కాదు గదా ! మొట్ట మొదటివాడు ఉచితముగా ఆక్రమించుకొనినదే గదా ! అని తెలుసుకొనవలెను. కాబట్టి ఇంటిలోని చోటు మనస్వంతము గాదని గ్రహించి, ఎవరైన వచ్చి ఉండుటకు అడిగినపుడు మనము ఆ చోటును ఎట్లు వినియోగించు కొనుచున్నామో వారికిని అట్టి అవకాశము ఈయవలెనని ఈ మంత్రమునకు అర్థము.

ఇంటికి వచ్చిన వానికి లేదనకుండా "అన్నము ఇదిగో సిద్ధముగా ఉన్నది. రండి' అని ఆతిథ్యమును ఇచ్చుటకు సరిపడు అన్నము సిద్ధముగా నుండునట్లు ఏదో ఒక విధమైన పద్ధతిని ఏర్పాటు చేసుకొనవలెను. ముఖ్యముగా 1) అన్నము తినని వారు 2) ఆకలితో నున్నవారు, 3) మనము తినుచున్నప్పుడు వచ్చినవారు ఐనచో తప్పక వారికి అన్నము పెట్టి తీరవలెను. 'ఎవరికి అన్నము పెట్టవలెను?' అను ప్రశ్నకు 'ఈ పై చెప్పిన మూడును - సరిపోవువానికి' అని సమాధానముగా గ్రహించవలెను.

తల్లిని, తండ్రిని, ఆచార్యుని మాత్రమే కాక మన ఇంటికి అవాంతరముగా వచ్చిన 'అతిథి'ని గూడ దైవముగా ఆరాధించవలెనని శిక్షావల్లిలో అనుశాసన అనువాకము నందు చెప్పబడినది. తల్లి, తండ్రి, గురువులకు మనము ఎట్లును ఋణపడి వుందుము. కాని, అతిథికి ఆ విధముగా ఋణపడి లేకపోయినను ఆ అతిథి యందు గూడ దైవ భావమును కలిగి యుండమని చెప్పుట భారతీయుల సంస్కార బుద్ధిని తెలియజేయును. అటువంటి అతిథి ఎప్పుడైన మన ఇంటికి వచ్చినపుడు పొమ్మనరాదు. పగలువచ్చిన అతిథి కన్న సాయంకాలము, రాత్రి పూటలలో వచ్చు అతిథులను అసలు పొమ్మనరాదు. రాత్రికి వారు పడుకొనుటకు ఎక్కడకని పోగలరు ? (పూర్వపు రోజులలో హోటల్సు, లాడ్జీలు వుండెడివికావు. మనము వారి వూరు వెళ్ళినపుడు గూడ మనలను వారు అట్లే ఆదరించి అతిథి మర్యాదులు చేయుదురు. కాబట్టి, ఎవరు ఏవూరు వెళ్ళినను హోటలు, లాడ్జీలు, లేకపోయినను ఇబ్బంది పడెడివారు కాదు. మరియు, హోటలు వాడు భోజనము పెట్టుటలో చూపు ప్రేమ, ఆపేక్షలకన్న గృహస్థు - అతిథిని దైవముగా చూచునుగాబట్టి - ఎక్కువ ప్రేమ, శ్రద్ధలను చూపును).

సాధారణముగా మిగిలిన దేశములలో అతిథులకు అన్నము పెట్టిన తరువాత, ఆ అతిథులు (Guests) గృహస్థు (Host)నకు కృతజ్ఞతలు (Thanks) చెప్పుకొందురు. కాని, భారతదేశములో 'అతిథి ఇంటికి వచ్చుటను 'ఒక వరముగా, గొప్ప అవకాశముగా భావించి, వారికి అన్నమును పెట్టిన తరువాత ఆ అతిథులకే గృహస్థు కృతజ్ఞతలు చెప్పును. (మిగిలిన దేశములకు భారతదేశమునకు భేదమును

చెప్పు' మనగా వివేకానందుడు ఒక విదేశస్థునకు ఈ విషయమును చెప్పెను). ఇది భారతీయుల సంస్కారమునకు ఉత్తమ నిదర్శనము.

ఒకరికిపెట్టు అన్నమునుబట్టి మనకు అన్నము లభించును. ఈ ధర్మసూక్ష్మములో మూడు రకములైన విషయములు చెప్పబడినవి. ముఖతః, మధ్యతః, అంతతః అను మూడు పదములు ప్రయోగింపబడినవి. ఈ ఒక్కొక్క పదమునకు రెండు, మూడు అర్థములు కలవు. నోటితో అన్నమును తినుట ప్రారంభించిన నాటి నుండి అనగా 1) అన్నప్రాశననాడు, 2) జననమరణముల మధ్యగల జీవితకాలమందు 3) శరీరమును వదలివేయుచు పంచభూతములలో దేహము కలియుచున్నపుడు, ఈ మూడు స్థితులలోను అన్నము వలన తాను ఆరాధింపబడినాడని, అనగా అనుసంధానింపబడినాడని తెలుసుకొనుట ఒక సత్యము. పుట్టినప్పటి మొదటిస్థితి నుండి ఇంకొకరికి అన్నము పెట్టుస్వభావము ఉన్నచో మొదటినుండి తాను అన్నమునకు లోటులేనివాడగునని, మధ్యవయస్సు నుండి ప్రారంభించినచో మధ్య వయస్సు నుండి, చివరిదశలో ప్రారంభించినచో చివరిదశలోను అన్నమునకు లోటులేనివాడగునని తెలుసుకొనుట రెండవ సత్యము. అన్నము పెట్టునపుడు గూడ మొదటిరకమైన అన్నమును, ఉత్తమోపచారములతో, అడిగిన వెంటనే పెట్టినచో అట్టి రకమైన అన్నమే, అట్టి ఉత్తమోపచారములతో తానునూ పొందుననీ, మధ్యరకమైన దానిని పెట్టినచో మధ్యరకమైన దానినే పొందునని, మూడవరకమైన భోజనమును పెట్టినచో మూడవరకమైన భోజనమే పొందునని తెలుసుకొనుట మూడవసత్యము. అనగా 'నీవు పెట్టినదానిని బట్టి నీకు గిట్టును' (As you sow so you reap) అని ఈ మంత్రములకు అర్థము (బ్యాంకులో వేసుకున్న డిపాజిట్ ధనమును బట్టి తీసుకొనుట (Withdraw) ఆధారపడి ఉండునని మనకు తెలిసిన విషయమే గదా!)

"To every action there is always an equal and opposite reaction" అను దానిని భౌతిక శాస్త్రములో న్యూటన్ మూడవ గమన సూత్రముగా చెప్పుదురు. "ప్రతి చర్యకు దానికి సమానముగాను, వ్యతిరేకదిశలోను పనిచేయు ప్రతీకార చర్య ఉండును."అని ఈ సూత్రము యొక్క అర్థము. 'మనము ఒకరికి

పెట్టినదానిని బట్టి మనకు గిట్టును' అని ఇంతకు పూర్వము చెప్పిన విషయములోను, 'చేసుకున్న వారికి చేసకున్నంత మహాదేవా' అను సామెతలో చెప్పిన విషయములోను, 'As you sow, so you reap', 'The more you gie the more you have' అను ఇంగ్లీషు సామెతలలో చెప్పిన విషయములోను అంతర్లీనమై వున్న సత్యమును భారతీయుల కర్మ సిద్ధాంత సారాంశముగా గ్రహించవలెను. కర్మ సిద్ధాంతములో రెండు అంశములు ఇమిడి వుండును, అవి ఒకదానికొకటి పరిపూరకములే (Complimentary) గాని విరుద్ధములు కావు. ఆ రెంటిని 1) విధివ్రాత 2) పురుష ప్రయత్నము అనవచ్చును. వీటి అవగాహన సరిగాలేకపోయినచో కర్మసిద్ధాంతము మెట్ట వేదాంతమునకే దారితీయును గాని అందలి సూక్ష్మమైన ఆధ్యాత్మిక దృక్పథమును అర్థము చేసుకొనుట జరుగదు. అందువలన ఒక బీజగణిత శాస్త్రోదాహరణ ద్వారా ఆ విషయము ముందు వివరింపబడును.

x అను రాశి యొక్క విలువ మీద y అను వేరొక రాశి యొక్క విలువ ఆధారపడినపుడు $y = f(x)$ అనగా, 'y' అనురాశి 'x'అను రాశి యొక్క ప్రమేయము ('y' is a function of 'x') అని వ్రాయుదురు. 'మన పూర్వకర్మను బట్టి ప్రస్తుత (వర్తమాన) ఫలితములు ఉండును' అని కర్మసిద్ధాంతము చెప్పును. నిన్న అమితముగా తినిన ఆహారమును బట్టి నేడు అజీర్తిగాని, కడుపులో నొప్పిగాని వాంతులుగాని వచ్చుట జరుగుననునది తెలిసిన విషయమేగదా ! కాబట్టి, ఈ కర్మసిద్ధాంతమును సంకేతపూర్వకముగా – నేడు = f (నిన్న) అని వ్రాయవచ్చును. లేదా – వర్తమానము = f (భూతకాలము) అని, వ్రాయవచ్చును. రేపు వచ్చుసరికి 'నేడు' – 'నిన్న' అగును 'రేపు' – 'నేడు' అగును కాబట్టి, అపుడు ఇదే కర్మసిద్ధాంతమును – రేపు = f (నేడు) అని వ్రాయవచ్చును. దీనిని బట్టి నేడు మనము చేసిన పనులను బట్టి రేపటి మన జీవితము ఆధారపడును లేదా వర్తమానజీవితమును బట్టి భవిష్యజ్జీవితము ఆధారపడి వుండునని ఈ కర్మ సిద్ధాంతము చెప్పును.

పై బీజగణిత ప్రకారము వివరించిన కర్మసిద్ధాంతమును జాగ్రత్తగా అర్థము చేసుకొనవలెను $y = f(x)$ అని వ్రాసినపుడు, x యొక్క విలువ మీద y విలువ ఆధారపడునని అర్థముగదా ! ఒక వేళ x యొక్క విలువ మారినచో y విలువ

గూడా మారును. ఒక ఉదాహరణ చెప్పుకొనినచో కర్మ సిద్ధాంతములోని సునిశితమైన ఆధ్యాత్మిక విషయము, పురుష ప్రయత్నము యొక్క ప్రమేయము, ఆవశ్యకత అర్థమగును. లేనిచో ఇట్టి కర్మసిద్ధాంతము మెట్ట వేదాంతము లోనికి దారితీయవచ్చును.

వివాహమై ఐదు సంవత్సరములైన భార్యాభర్తలున్నారు. వారికొక కూతురు గూడ గలదు. వారి కాపురము మఱియొక ఐదు సంవత్సరముల తరువాత ఎట్లుండునో తెలుసుకొనుటకు కంప్యూటర్‌ను ఉపయోగించినచో సమాధానము వచ్చును. కాని, ఆ కంప్యూటర్‌కు ఆ భార్యాభర్తల ప్రస్తుత పరిస్థితులను in putగా feed చేసినచో దానిని బట్టి ఐదు సంవత్సరముల తరువాత వారి కాపురము ఎట్లుండునో outputగా సమాధానము వచ్చును. ప్రస్తుత పరిస్థితులు -

1. భర్త ఇంటికి రోజూ ఆలస్యముగా వచ్చుచున్నాడు.
2. కొన్ని కొన్ని రోజులు ఇంటికి గూడా వచ్చుట లేదు.
3. జీతమును గూడా సక్రమముగా ఇంటి ఖర్చులకు వాడుట లేదు.
4. భార్యకై పండగలకు గూడ క్రొత్త చీర మొదలగునవి కొని పెట్టుట లేదు.
5. భార్య చదువుకొన్నదైనను చాల సహనముతో వుండి సర్దుకు పోవుచున్నది. కాని అప్పుడప్పుడు భర్త ప్రవర్తనకు విసుగు, కోపము గూడా వచ్చుచున్నది.

ఈ ప్రస్తుత పరిస్థితులను కంప్యూటర్‌కు Inputగా feedచేసినచో '5' సంవత్సరముల తరువాత ఆ భార్యాభర్తలిరువురు విడాకులు తీసుకొందురు" అని కంప్యూటర్ సమాధానమును చెప్పును ! ఇది విధి వ్రాత వంటిది. ఈ సమాధానము వచ్చునని మనము తేలికగానే ఊహించవచ్చును గూడా ! అయితే 'ఇట్లు జరుగుట తప్పదా?' అని ప్రశ్న. Is it destined ? ఇది జరుగకుండుటకు అవకాశము గలదు. ఎప్పుడు ? ఈ రాబోవు 4 సంవత్సరములలో భర్త ప్రవర్తనమారి ఇంటికి రోజూ వచ్చుట, ఇంటి సంగతులను పట్టించుకొనుట, పండుగలకు - భార్యకు, పిల్లకు బట్టలుకొనుట మొదలైన మార్పులు వచ్చినచో - '5 సంవత్సరములలోపునే వారికి ఒక పిల్లవాడు గూడ పుట్టవచ్చును. ఇంటిలోనికి క్రొత్తసామానుకొనుట

మొదలైనవి గూడ జరుగవచ్చును' అని కంప్యూటర్ సమాధానము ఇవ్వవచ్చును. ఇది పురుష ప్రయత్న ఫలితము. దీనిని బట్టి 'వారి జీవితము ఇక ఇంతే ! విడాకులు తప్పవు' అని చెప్పుట తప్పుగదా ! కర్మ సిద్ధాంతముపై సరియైన శాస్త్రీయ అవగాహన కలవారు ఆ విధముగా చెప్పరు. జ్యోతిశ్శాస్త్రము గూడా 'Stars will condition you but not compel you' అనియే చెప్పును. అనగా, 'గ్రహములు ప్రతికూల పరిస్థితులను తెలియచెప్పును గాని, నిన్ను ప్రతికూలమును సృష్టించుకొనమని ప్రలోభపెట్టవు' అని అర్థము. కావున, పురుష ప్రయత్నము వల్ల ఎన్నో మార్పులు వచ్చుటకు అవకాశము గలదని తెలుసుకొనవలెను. ఒక పాము ఎదురుగా వచ్చుచున్నపుడు – 'మన గీతలో అది కఱవాలని వ్రాసి వున్నచో అది కఱవక మానదు, వ్రాసి లేనిచో కఱవదు' అని అక్కడే నిలబడి మెట్టవేదాంతమును ఎవ్వరును చెప్పరు. ప్రక్కకు తొలగి తప్పించుకొను పురుష ప్రయత్నమును చేయుదురు. అట్లే, ఒకడు రాయిని మనవైపు విసిరినపుడు మనగీతలో అది తగలవలెనని వ్రాసి ఉన్నచో తగులును,బొప్పి కట్టవలెనని వ్రాసి యున్నచో బొప్పికట్టును లేనిచో లేదు' అని అక్కడనే నిలబడరు. దెబ్బనుండి తప్పించుకొను పురుష ప్రయత్నమును తప్పక చేయుదురు. పురుష ప్రయత్నమును చేసిననూ విపత్కర పరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చినచో వాటిని తన పూర్వకర్మ ఫలితముగా, అనుభవించవలసిన విధివ్రాతగా జమకట్టుకొనుట సరియైన పద్ధతి. అంతేగాని, తాను ఏమియు చేయక, కూర్చుండి విధివ్రాతను తిట్టుకొనుట తప్పు. అనగా విధివ్రాతను హెచ్చరిక (Warning) గాను, పురుష ప్రయత్నమును అందుకు తీసికొను జాగ్రత్త (Precaution) గాను అర్థము చేసికొనవలెను. అందుచేతనే ఇవి రెండును ఒకదానికొకటి పరిపూరకములని చెప్పబడినవి.

పైన వివరించిన విషయములను బట్టి మానవుని యొక్క ప్రస్తుత, తక్షణ ప్రవర్తన, ప్రయత్నములను బట్టి రాబోవు కాలములో వాని జీవిత విధానము మారునని చెప్పుటకు సందేహపడరాదు. అందువలననే ప్రస్తుత, తక్షణ ప్రవర్తనల విషయమై జాగ్రత్తగా ఉండవలెనని ఈ తైత్తిరీయోపనిషత్తునందలి శిక్షావల్లిలోని చివరి అనువాకమునందు ఆచార్యుడు శిష్యునకు అనుశాసన పూర్వకముగా ఉపదేశము

చేయును. ఈ భృగువల్లిలో గూడ ఈ చివరి అనువాకములో ఇదే విషయము - మనోవాక్కాయకర్మల పట్ల వహించవలసిన జాగ్రత్తను గుఱించి చెప్పబడినది. (ఏది ఎట్లు జరుగవలెనో అట్లే జరుగునన్నపుడు - నీతివాక్యములు, సూక్తులు, పెద్దల మాటలు, అనుభవములు అన్నియు దండగయే కదా!) కావున, ఈ విషయమును యోగసాధకుడు తెలిసికొని, వాక్కులను కూడా జాగ్రత్తగా ఉపయోగించవలెను. వాఙ్నియమమును కలిగి అసరమైనపుడు మాత్రమే వాక్కులను ఉపయోగించినచో వాక్కులకు సిద్ధికలిగి, భావి జీవితము క్షేమంకరముగా ఉండి ఇతరులకిచ్చు సలహాలు సత్ఫలితములను ఇచ్చును.

'యోగము' అనగా లేనిదానిని పొందుట. ఆ పొందుటలో గూడా అన్నిటి సమన్వయమును సాధించి పొందుట. 'క్షేమ' మనగా 'ఆ పొందిన దానిని నిలబెట్టుకొనుట' ఈ యోగక్షేమములు రెంటిని ప్రాణాపానముల వలె విడదీయరాని జంటగా యోగసాధకుడు పొందునని, వానిపాదములు సన్మార్గములోనే ధర్మాభిముఖముగా చరించునని, ఇతర మార్గముల ప్రభావములకు లోనుకావని, ఇది ధ్యేయమును పొందుటలో ముఖ్యమైన ఉపయోగమని ఉపాసించవలెనను అర్థములో "క్షేమ ఇతివాచి ... కర్మేతి హస్తయోః" అని చెప్పబడినది.

సాధారణముగా ఇతరులపై దురుహాలను, దురభిప్రాయములను నిర్లక్ష్య వైముఖ్యములను కలిగి యుండుట సామాన్య మానవుని లక్షణము. ఇట్టి దురూహా, దురభిప్రాయ, నిర్లక్ష్య, వైముఖ్యాది దుర్లక్షణములు అనవసరమైనవి. 'మన శరీరములోని మూత్ర, పురీషములను ఎట్లు విసర్జింతుమో అట్లు ఈ పై దుర్లక్షణములను విసర్జించి విముక్తిపొందవలెను' అను అర్థములో 'విముక్తి రితి పాయౌ' అని చెప్పబడినది. ఇంతవరకు బాహ్యముగా మనిషి ఉపాసించవలసిన కొన్ని విషయములు చెప్పబడినవి. ఇక ముందు దైవీ సంపత్తికి సంబంధించిన, జ్ఞానప్రాప్తి కారకములైన ఉపాసనములు చెప్పబడును.

మనిషి సుఖమయ జీవితమును పొందుటకు తృప్తి చాల అవసరము. మనము చేయవలసిన ప్రయత్నము పూర్తిగా చేసి అందువలన వచ్చిన ఫలితమును స్వీకరించుట మంచి లక్షణము. ఒక్కొక్కప్పుడు ఎంతకష్టపడిననూ ఆశించిన

ఫలితమును పొందలేకపోవచ్చును. అసలు ఫలితమును ఆశించుట సరియైన పద్ధతికాదు. వచ్చిన ఫలితమును స్వీకరించుటయే చేయవలెను 1. యదృచ్ఛా లాభసంతుష్టో......... 2. కర్మణ్యే వాధికారస్తే ........ గీతాశాస్త్రము) ఉన్న ఆదాయమునుబట్టి ఖర్చు చేసుకొనుట, లేనిదానికి దురాశ పడకుండుట నియమ ములుగా గలవానికి జీవితము సుగమముగానుండును. తిన్న దానిని తృప్తిగా తినవలెను గాని లేనిదానిని గూర్చి ఆరాటపడరాదు. కాబట్టి ఈ తృప్తి లేనిచో మనిషి జీవితములో సుఖశాంతులు ఉండవను ఉద్దేశ్యముతో 'తృప్తి రితి వృష్టౌ' అని చెప్పబడినది.

తీగలలో విద్యుత్తు నిక్షిప్తముగా నుండి రేడియోను పలికించి, విద్యుచ్ఛా మరములను ఎట్లుత్రిప్పగలదో అట్లే మనలో బలము కళ్ళకి కనపడక పోయిననూ మనచే పలికించుట, నడిపించుట, మొదలగు కార్యములను చేయును కావున- బలమును విద్యుత్తుతో సమన్వయ పరచుచు 'బల మితి విద్యుతి' అని చెప్పబడినది.

కీర్తి ప్రతిష్ఠలను - సంపదను వినియోగించు పద్ధతినిబట్టి పొందుదురని, 'సంపద' అనగా 'ఇతరులకు కూడ సంతోషమును కల్గించునది, సుఖమును చేకూర్చునది, అభివృద్ధికి కారణమగునది' అని భారతీయుల అభిప్రాయము. అందుచేతనే ధనమనగా నోట్లకట్టలు కాదని - అగ్ని, వాయువు, సూర్యుడు, భూమి, పశువులు మొదలైనవి నిజమైన ధనము లేక సంపద - అని (ధనమగ్ని ర్ధనం వాయుః ధనం సూర్యో ధనం వసుః ......' అని శ్రీ సూక్త ఫలశ్రుతి) అందుచేతనే ఎవరినైనా దీవించునపుడు 'ప్రజయా పశుభి ర్బృహ్మ వర్చసేన...' అనగా సత్సంతానముతో , గో, వృషభాది పశుగణముతో, స్వచ్ఛమైన వర్చస్సుతో వర్ధిల్లుమని భారతీయులు దీవించెడివారు. ఒకరికి దానమిచ్చునపుడు గూడ అభివృద్ధి కారకములైన పశువులను ఇచ్చి తమ కీర్తి ప్రతిష్ఠలను పెంపొందించుకొనెడివారు. అందుచే ఇక్కడ 'యశ ఇతి పశుషు' అని చెప్పబడినది.

'తారలు' అను ఉద్దేశ్యముతో ఇచ్చట నక్షత్రములు అన్న పదము వాడబడినది. వాస్తవమునకు రాశిచక్రములో 27వ వంతును'నక్షత్రమ'ని, ఆకాశములో కనపడుచుక్కలు 'తారల'ని తెలియవలెను. కాని, ఇక్కడ నక్షత్రములనగా 'తారలు' అను అర్థమునే చెప్పుకొనవలెను. ఈ తారలు చంద్రునివలె, గ్రహములవలె కాక

స్వయంప్రకాశమైనవి. (Self Luminous Bodies). సూర్యుడు మనకు అతి దగ్గరగా ఉన్న తారయే ! మనలో వెలుగు (Inner light) అనగా ఆత్మ – జ్యోతివంటిది, పరమాత్మ – పరంజ్యోతి, 'తారల వెలుగులు ఎట్లు స్వయంప్రకాశమైనవో, మనలోని జ్యోతి స్వరూపమైన ఆత్మగూడ స్వయంప్రకాశమానమైనది' అను అర్థములో 'జ్యోతి రితి నక్షత్రేషు' అని చెప్పబడినది.

ఎవరికైనా తన స్థితి చెడనపుడు ఆనందము కల్గును. తను మృతుడు కానపుడు ఆనందము కల్గును. మరణము దుఃఖమును కల్గించును. తన శుక్రమే కుమారుడుగా పుట్టినపుడు తానే మరల పుట్టినట్లు లెక్క. తన శరీరములోని ఒక భాగమే మరల పుత్రుడుగా పుట్టుచున్నాడు. కాబట్టి, తండ్రికి మరణము లేదని భావము. దీనినే మనిషి 'అమృతత్వవంతుడగుట' అందురు. 'ఇది సిద్ధించునపుడు పొందు ఆనందము ఉపస్థేంద్రియము (జననేంద్రియము) ద్వారా కలిగినది' అను అర్థములో 'ప్రజాతి రమృత మానంద ఇత్యుపస్థే' అని చెప్పబడినది. 'స్థ – అనగా ఉండుట, ఉపస్థ – అనగా గౌణముగా ఉండుట' గా, అనగా 'తండ్రి – కొడుకు అగుటను' 'స్థ' – 'ఉపస్థ అగుట'గా చెప్పుకొనవచ్చును.

ఏమియు లేనట్లుగా కనపడు ఆకాశము నుండి అన్నియు వున్నట్లు కనపడు భూలోకము వరకు (From seeming nothingness to apparent something) ఈ సృష్టి జరిగినది. (ఆకాశాద్వాయుః... అద్భ్యః పృథివీ) కావున, మనము చూచు భౌతిక పదార్థమునకు మూల ఉత్పత్తి కేంద్రము సూక్ష్మతమమైన ఆకాశము. కాని, 'ఆకాశము నుండి ఏమి పుట్టును ?' (ఆకాశం గగనం శూన్యం) అని అనిపించును. కాని, 'ఆకాశం గగనం పూర్ణం' అని తెలుసుకొనవలెను. ఉప్పు, పంచదార, పటిక బెల్లము మొదలైనవి కరిగి యున్న నీటిని చూచినపుడు నీరువలెనే కనపడును గాని ఆ ఉప్పు, పంచదార, పటికబెల్లము గోచరించవు. అంత మాత్రము చేత ఆ నీటి ద్రావణములో ఆ పదార్థములు లేవని అనుట మన అవివేకము. అదే విధముగా జగత్తులోని సర్వపదార్థములు చక్కగా కరిగి లేదా లీనమైఉన్న సూక్ష్మతమమైన స్థితిలోని ద్రవ్యమును ఆకాశముగా అర్థము చేసుకొనవలెను. అందుచేతనే పంచ భూతములలో దీనిని మొదటి దానినిగా గుర్తించిరి. ఇద్దరి

మధ్య చోటు ఈ అకాశమే, 'జగత్తులో అన్నిటి కన్న అమాయకముగా కనపడునది ఏది?' అని ప్రశ్న వేసినపుడు ఆకాశము లేదా 'చోటు' అని చెప్పవచ్చును. దీనిలోని రహస్యములనే మానవుడు విజ్ఞాన శాస్త్రము ద్వారా ఒక్కొక్కటి గ్రహించుచున్నాడు. అందుచే 'సర్వము ఆకాశమునందే ఉన్నది' అను అర్థములో 'సర్వమిత్యాకాశే' అని ఇక్కడ చెప్పబడినది. 'దీని ప్రతిష్ఠను ఉపాసించి తెలుసుకున్న వాడు కూడా జగత్తుపట్ల, సృష్టిపట్ల, విజ్ఞానముపట్ల, సుస్థిరమైన అభిప్రాయములు లేదా జ్ఞానము కలిగినవాడు అగును' అను అర్థములో 'తత్ప్రతిష్ఠే త్యుపాసీత, ప్రతిష్ఠావా న్భవతి' అని చెప్పబడినది.

ఆకాశమునకు మహిమాన్వితమైన దానిగా లేదా మహత్తును (Universal mind) కలిగినదానిగా ఉపాసించువానికి ఆ విశ్వమనస్సుతో తమ మనస్సు అనుసంధానపరచబడి (Tune) తానుగూడ మహనీయుడగును. కొందరికి 'చోటుకు మనస్సు ఉండునా ?' అని సందేహము కలుగవచ్చును, చోటులో చెంబు ఉండుటచే చెంబులో చోటు ఉన్నట్లు - జగత్తు అంతా నిండి వున్న ఈ విశ్వమనస్సులో మన బుఱ్ఱవుడుటచే మన బుఱ్ఱలో గూడ వ్యక్తిగతమనస్సు ఉండుటకు అవకాశమేర్పడినదని తెలియవలెను. వ్యక్తి గత మనస్సు విశ్వమనస్సుతో అనుసంధానము జరిగినపుడే మహత్తరమైన సత్యములు స్ఫురించునను అర్థములో 'మహాన్భవతి' అని చెప్పబడినది. చోటులోని విశ్వమనస్సు యొక్క భాగమే మనిషిలో మనస్సు. దానిని కలిగినవాడే మానవుడు. అందుచే ఈ ఉపాసనలో సరైన అర్థము తెలిసిన 'మనస్సు'ను కలిగినవాడగుచున్నాడు అను అర్థములో 'మానవాన్భవతి' అని చెప్పబడినది.

సృష్టి - పై నుండి క్రిందకు లేదా ఆకాశము నుండి భూమికి (ఊర్ధ్వము నుండి అధస్సునకు) జరుగునను విషయమును బట్టి, ఆకాశము - పై నుండి క్రిందకు దిగుటకు వంగుచూ, వంగుచూ, సూక్ష్మస్థితినుండి స్థూలస్థితిని పొందుటలో భౌతిక సృష్టి జరిగినది. "ఇట్లు 'పైనుండి క్రిందకు వంగుట' ఆకాశమునకు కలదని ఉపాసించి తెలిసికొనిన వానికి అవసరమగునవన్నియు వాని దగ్గరకు నడిచి వచ్చును" అను అర్థములో 'తన్నమ ఇత్యుపాసీత, నమ్యంతేస్మై కామాః' అని చెప్పబడినది.

ఆకాశము విత్తనము వలె అతి సూక్ష్మముగా వున్నను ఇంత భౌతిక సృష్టిగా శాఖలతో వృక్షమువలె విచ్చుకొనుచున్నది. ఆకాశమునందుగల ఈ విచ్చుకొనెడి

శక్తిని 'బృహ్మాణ శక్తి' అందురు. ఈ బృహ్మాణ శక్తి కల దానినిగా ఆకాశమును ఉపాసించి, గ్రహించిన వాడు తాను గూడ అట్టి బృహ్మాణశక్తి కలిగి బ్రాహ్మణుడగును. ఈ బృహ్మాణశక్తి వలననే ఎట్టి విషయమునైనను చక్కగా విపులీకరించి చెప్పకలుగును. అట్టివాడే బ్రాహ్మణుడు. ఈ అర్థములో 'త ద్బృహ్మేత్యు పాసీత, బ్రహ్మావాన్భవతి' అని చెప్పబడినది.

చోటు కదలనపుడు ఆకాశమని, కదిలినపుడు వాయువని తెలుసు కొనవలెను. విద్యుత్తు, వర్షము, చంద్రకాంతి, సూర్యదీప్తి, అగ్నిప్రభ ఇవి ఈ కదిలెడు చోటునందు అనగా వాయువునందు లీనమగును. ఇట్టి లీనమొనర్చు కొను వాయువును 'పరిమరము' అందురు. చోటు కదులుటను బట్టి ఆకాశముకన్న వాయువు వేరుగా గుర్తింపబడుచున్నదేగాని రెంటికీ అభేదమే ! కాని, ఈ కించిత్ భేదమును తెలియుటకు గాను ఆకాశమునకు – వాయువు 'పరిమరము' అందురు. బ్రహ్మకు – ఆకాశము 'పరిమరము' అని గుర్తించవలెను. అనగా బ్రహ్మకు – ఆకాశమెట్లో, ఆకాశమునకు – వాయువు అటువంటిదని ఉపాసన ద్వారా తెలుసుకొనువానికి ఇతరుల యెడ భేదభావము, ద్వేష భావము పుట్టదు. అందుచే శత్రువులు ఏర్పడుటకు అవకాశము పుండదు. చివరకు అప్రియులలో గూడ శత్రువులు కన్పడరు. ఈ శత్రుభావన రాని ఆత్మస్వరూపుడుగా తయారై, తనలో ఎవడువున్నాడో- ఎదుటి వారిలో కూడ వాడేవున్నాడని, వాడే ఆ సూర్యునిలో గూడ వున్నాడని ఈ విధముగా అందరిలోను వ్యక్తమగువాడు ఒకే ఒక పురుషుడని తెలుసుకొను స్థితికి వచ్చునను అర్థములో 'తద్బృహ్మణః పరిమర ... యశ్చాసావాదిత్యే, స ఏకః' అని చెప్పబడినది. (క్షేమ ఇతివాచి నుండి 'స ఏకః' అను మంత్రము వరకు పరమాత్మ యొక్క వ్యక్త వైభవములు చెప్పబడినట్లు గూడ గ్రహించవలెను).

పైన చెప్పబడిన విషయములలోని అంతర్యమును, అంతర్ధారమును కూలంకషముగా తెలిసికొనినవాడు ఈ లోకమును విడిచి అన్నమయాత్మని, ప్రాణమయాత్మని, మనోమయాత్మని, విజ్ఞానమయాత్మని, ఆనందమయాత్మని అవసరమును బట్టి పొందగలడు. అనగా, తాను వచ్చినక్రమము అనందమయ, విజ్ఞానమయ, మనోమయ, ప్రాణమయ, అన్నమయకోశములవరుసలో కాగా –

భౌతికలోకమును విడుచునపుడు దీనికి సరిగా వ్యుత్క్రమ(తలక్రిందు) మార్గములో అనగా, అన్నమయ, ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయ కోశముల వరుసక్రమములో ఆ యా కోశములకు సంబంధించినవానిగా మారుచు, చివరకు ఆనందమయాత్ముడగునను అర్థములో "స య ఏవం విత్ .... ఆనందమయ మాత్మాన ముపసంక్రమ్య" అని చెప్పబడినది. వెలుగుచున్న కొవొత్తిని పరిశీలించినచో అట్టడుగన గట్టికొవ్వు, దానిపైన ద్రవస్థితిలోని కరుగుచుండెడికొవ్వు, దాని పైన అగ్ని స్థితిలోని వెలుగుకొవ్వు, దానిపైన వాయుస్థితిలోని కొవ్వు కనబడి చివరకు ఆ వాయుస్థితి లోని కొవ్వు ఊర్ధ్వమార్గముగా ఆకాశమును పొందునట్లు ఈ జీవుడు అన్నమయాదికోశములు విడిచి ఆనందకోశమును పొంది ఆనందమయుడగును.

ఒక కోశమునకు ఒక కోశమునకు మధ్యగా ఉన్నదానిని 'సంధి' అందురు. క్రిందికోశము 'అన్నము' ఐనచో, దానిపై కోశము 'అన్నాదము' అగును. అనగా, ప్రతి ప్రక్క ప్రక్కల కోశముల జంటను అన్న - అన్నాదములజంటగా తెలియవలెను. 'ఈజంటమీద ఆధారపడియే ఆయా కోశములకు తగినరూపములతో సంచరించుచూ ఉన్నాడు' అను అర్థములో 'ఇమా న్లోకాన్ కామాన్నీ కామరూప్యనుసంచరన్' అని చెప్పబడినది.

బ్రతుకునకు ఆధారము శ్వాస. శ్వాస - ఉచ్ఛ్వాస, నిశ్వాసముల జంట. ఈ జంటలో ఒడిదుడుకులు ఉన్నప్పుడు గాని లేదా వియోగమేర్పడినపుడుగాని మరణమునకు దారితీయును. అందుచేతనే ఆరోగ్యవంతునిలో ఉచ్ఛ్వాస, నిశ్వాసములు సమముగా ఒక దాని తరువాత నొకటి సృష్టి ప్రళయములవలె, వెలుగు - చీకట్లవలె, కంటిరెప్పలు తెరుచుట - రెప్పలు మూయుటలవలె, పగలు - రాత్రులవలె, శుక్లపక్షము - కృష్ణపక్షములవలె, ఉత్తరాయణ - దక్షిణాయనములవలె, ఉదయకల్ప క్షయకల్పములవలె, జరుగుచుండును. బయటినుండి గమనించువానికి వీటి నిరంతర ఆవర్తనములో ఒక గానము వినపడును. సమముగా జరుగు ఈ గానమును 'సామగానము' అందురు. ఉచ్ఛ్వాసమును 'హా' అను అక్షరములతోను, నిశ్వాసమును 'ఉ' అను అక్షరముతోను, ఇక్కడ సంకేతించినట్లు అర్థము చెప్పుకొనినచో 'హా' అనునపుడు పెదవులు తెరచుకొనుటను, ఆవిధముగా తెరుచుకొనినపుడు గాలి

లోపలికిపోవుటను సూచించును. అట్లే, 'ఉ' అనునపుడు పెదవులు దగ్గరకు వచ్చి మూతపడుటను, లోని గాలి బయటకు నెట్టబడుటను సూచించును. అదియునుగాక 'హా' అనునపుడు గాలి ఎక్కుటను, దానిననుసరించి జననమును. 'ఉ' అనునపుడు గాలి దిగజాఱుటను, దానిననుసరించి మరణమును సూచించును. మరియు, 'హా' అనునపుడు నోరు తెరువబడుట – స్వీకరించుటను, 'ఉ' అనునపుడు నోరుమూయబడుట – విడుచుటను తెలియజేయును. ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసములు లేదా ఎక్కుట దిగుటలు, లేదా స్వీకరించుట విడుచుటలు, లేదా జనన మరణములు ఒక దాని తరువాత ఒకటి జరుగుచుండునని తెలియచేయునట్లుగా 'హావు' 'హావు' 'హావు' అనుసామగానము ఈ ఆనందమయుడు చేయునని చెప్పబడినది. ఇది 'ఆశ్చర్యకరమైన విషయము' అని గూడా 'హా' 'వు' అను పదములకు అర్థము కలదు.

ప్రతికోశము అన్నము, అన్నాదము కూడ అగుచుండుట వలనను, 'హావు', 'హావు' అను శ్వాసాత్మక సామగాన శ్లోకమును నిరంతరము చేయుచుండువాడగుట చేతను ఆనందమయుడైన 'నేను' 'అహ మన్నం' అని 'అహమన్నాదః' అని 'అహగ్గ్ శ్లోకకృత్' అని ఇక్కడ చెప్పబడినది.

గృహయజమాని గృహములోఉండును. గృహమును కట్టక పూర్వము గృహయజమాని లేడనుట అవివేకము. అట్లే, ఆత్మ స్వరూపుడైన జీవుడు దేహమును కట్టుకొనక పూర్వము లేడనుట కూడా అవివేకమే ! న్యాయమునకు గృహమునందలి కిటికీలు, ద్వారబంధములు, తలుపులు మొదలైన వాటి కన్న, గృహము యొక్క గోడలకన్న, గృహనిర్మాణపు బ్లూప్రింట్ కన్న, 'గృహమును కట్టవలె' నను మనస్సంకల్పమున్న గృహమును కట్టవలెనను నిశ్చయాత్మక బుద్ధికన్న, కట్టుటకు అవసరమగు ద్రవ్యమును సంపాదించుటకు కావలసిన తెలివితేటలు కన్న కూడా ముందు వున్నవాడు ఈ గృహయజమాని. ఈ తెలివితేటలను దేవతలతోను, సంకల్పమును మనస్సుతోను, నిశ్చయాత్మక బుద్ధిని ఋతముతోను పోల్చినచో, 'వీటన్నిటి కన్న గృహమునకు గృహయజమానివలె వీటన్నిటినీ కల్గిన దేహమునకు జీవాత్మ అటువంటి ప్రథముడు' అను అర్థములో 'అహ మస్మి ప్రథమజా... పూర్వందేవేభ్యో' అని చెప్పబడినది. రెండు తరములనుసంధించి, సృష్టి యొక్క

నిరంతరత్వమును తల్లీ - బిడ్డల మధ్య నాభి ఎట్లు తెలియచేయునో, 'పరమాత్మ జీవాత్మగా వ్యక్తమగునపుడు "నేను" అనునది అట్టి సంధానమును చేయును. "ఈ సంధానము వలన బ్రహ్మసూత్రము తెగకుండా 'అవరోధము' అను 'మృతత్వము' లేనిదగు 'అమృతత్వము'ను సిద్ధింపచేయును' అను అర్థములో 'అహం అమృతస్య నాభా ఇ', అని చెప్పబడినది.

ప్రపంచములో ఉల్లి - ఎలుకకు ఆహారముకాగా, ఎలుక పిల్లికి ఆహారము, పిల్లి - కుక్కకు..... . ఈవిధముగా ఒకరి నొకరు అన్నము - అన్నాదము (తినబడునది, తినునది) అగుచున్నారు. ఐననూ బ్రతికినంత కాలము జీవులు బ్రతుకుచూ సృష్టికార్యము జరుగుచునే యున్నది. ఒక విధముగా చెప్పవలెనన్నచో 'ఒకరికి అన్నమును ఏర్పాటు చేసినవాడే మరియొకరికి ఈ ఒకరిని అన్నముగా ఏర్పాటు చేయుచున్నాడు' అనునది నిజమే గదా! దీనిని చెప్పుటకే రక్షించుటకు, భక్షించుటకు వాడే కారకుడు. అను అర్థములో 'యో మాదదాతి స ఇదేవమా ౨ ౨ వాః' అని చెప్పబడినది.

అన్నమును, అన్నమును తినువానిని కూడా ఈ 'నేను' తినుచున్నాడు అను అర్థములో 'అహమన్న మన్న మదంత మాద్మి' అని చెప్పబడినది. ఈ పైన చెప్పిన కారణములుగా ఈ 'నేను' చతుర్దశ భువనములకు కారకమై కూడా దానికతీతముగా ఉన్నాడను అర్థములో 'అహం విశ్వం భువన మభ్యభవామ్' అని చెప్పబడినది. సూర్యుని తేజస్సు స్వయంప్రకాశము. మరియు, వివిధమైన మంచి మంచి రంగుల నిచ్చునది. మనమెఱుగున్న బంగారమునకు ఈ స్యూరరశ్మి రంగు ఉండుట వల్లనే 'సువర్ణ'మని పేరు వచ్చినది. ఈ సువర్ణ దీప్తి ఎటువంటిదో - సూర్యరశ్మి ఎటువంటిదో ఈ 'నేను' కూడా అట్టి స్వయంప్రకాశ పరంజ్యోతి. ఈ సువర్ణజ్యోతీ స్వరూపమైన 'నేను' నుండియే వివిధ వర్ణములు, క్షరాక్షరములు మొదలైనవన్నియు ఉత్పత్తి యగును. ఈ 'నేను' మాత్రము దేని నుండి ఉత్పత్తికాదు. ఈ 'నేను 'స్వయమ్భూః, స్వయంప్రకాశము (Self mainfest, self propelling, self luminous)' అను అర్థములో 'నేను' ను గూర్చి 'సువర్ణజ్యోతీ.' అని చెప్పబడినది.

ఈ పైన చెప్పిన విషయములు తెలిసికొనువానికొఱకు ఈ ఉపనిషత్తు చెప్పబడినది లేదా 'ఈ పైన చెప్పబడిన విషయములన్నియు ఎవడు తెలుసుకొనుచున్నాడో వానిని గూర్చియే ఈ ఉపనిషత్తు చెప్పబడుచున్నది' అను అర్థములో 'య ఏవం వేద, ఇత్యుపనిషత్' అని అనువాకాంతము నందు చెప్పబడినది.

## ఉత్తర శాంతి పాఠము

**మంత్రము : సహ నా వవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై। తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై । ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥**

ఈ శాంతి పాఠమునకు టీకా తాత్పర్య వివరణములు ముందే తెలుపబడినవి. కావున, మరల ఇక్కడ తెలుపుట లేదు.

**హరిః ఓం తత్సత్ ।**

# అనుబంధము

(గ్రంథవిస్తరణభీతిచేత ఇంతకు పూర్వం కొన్ని ముఖ్య విషయాలకు అసంపూర్ణంగానే వివరణ ఇవ్వబడింది. ఈ అనుబంధంలో అటువంటి ముఖ్య విషయాలకు మరికొంత వివరణ తెలుపబడుతుంది - వివరణకర్త)

## హ్రస్వ, దీర్ఘ, ప్లుతాలు :

హ్రస్వ, దీర్ఘ ప్లుతాల గూర్చి 58, 59 పేజీలలో కొంత వివరణ చెప్పబడింది. ఈక్రింది శ్లోకం మరికొంత వివరణను ఇస్తుంది.

'ఏకమాత్రో భవేద్ధ్రస్వః ।
ద్విమాత్రో దీర్ఘ ముచ్యతే
త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయః'

'హ్రస్వం' అంటే - ఒక మాత్ర కాలవ్యవధిగాను, 'దీర్ఘం' అంటే - రెండు మాత్రల కాలవ్యవధిగాను, 'ప్లుతం' అంటే మూడు మాత్రల కాలవ్యవధిగాను తెలుసుకోవాలని పై శ్లోకం యొక్క భావం. 'మాత్ర' అంటే ఎంత కాలవ్యవధో పై మూడు పాదాల్లోను లేదు. ఒక చిటికె వెయ్యడానికి పట్టే కాలవ్యవధిని 'మాత్ర' అంటారు.

## ఉచ్చారణ దోషాలు :

ఉచ్చారణ దోషాలను గూర్చి 60వ పేజీలో కొంత వివరణ ఇవ్వబడింది. 'సకలం', 'శకలం' ఈ పదాలతో మరికొన్ని పదాలను గూడా కలిపి ఈ క్రింది శ్లోకం చిత్రమైన పద్ధతిలో ఉచ్చారణ దోషం వల్ల వచ్చే అనర్థాలను తెల్పుతుంది.

**"యద్యపి బహునాధీతే తథాపి పఠ పుత్ర వ్యాకరణమ్,**
**స్వజనః శ్వజనో నస్యాత్ సకలం శకలం సకృత్ శకృత్."**

"ఎక్కువ అధ్యయనం చేయలేకపోయినా, ఓ పుత్రా ! వ్యాకరణమైనా నేర్చుకో! లేకపోతే, స్వజనం అంటే - తనవాళ్ళు, శ్వజనం అంటే కుక్కల గుంపుగా మారి; సకలం అంటే - పూర్తిగా (మొత్తం అందరూ); శకలం అంటే ముక్కలైపోయి (విడిపోయి); సకృత్ అంటే ఒక్కసారిగా, శకృత్ అంటే వదలివేయబడతారు.

(విసర్జింపబడతారు)" అని ఈ శ్లోకానికి అర్థం. అంటే – స్వజన, సకల, సకృత్ పదాలను దంత సహకారంతో ఉచ్చరించవలసిన 'స' కారంతో బదులు తాలు సహకారంతో ఉచ్ఛరించే 'శ' కారంతో వరుసగా శ్వజన, శకల, శకృత్ పదాలుగా ఉచ్చరిస్తే అసలైన అర్థమే మారిపోయి అనర్థాలకు దారితీస్తుంది సుమా!" అని హెచ్చరిక అన్నమాట !

## ఉత్తమ పాఠక లక్షణాలు :

ఉత్తమ పాఠక లక్షణాల గూర్చి 61వ పేజీలో
"మాధుర్య, మక్షర వ్యక్తిః, పదచ్ఛేదస్తు సుస్వరః
ధైర్యం, లయ సమర్థంచ, షడేతే పాఠకాగుణాః"

అని శ్లోకం మాత్రమే ఇవ్వబడింది. ఈశ్లోకంలో తెలుపబడిన ఉత్తమ పాఠక లక్షణాలు ఇక్కడ వివరింపబడతాయి.

'మాధుర్యం' అంటే చదువుతున్నపుడు చెవులకు ఇంపుగా ఉండటం, 'అక్షరవ్యక్తిః' అంటే పదంలోని ప్రతి అక్షరాన్ని సుస్పష్టంగా ఉచ్చరించడం, 'పదచ్ఛేదః' అంటే వాక్యంలోని పదాలను ఎక్కడ, ఎక్కడ ఆపి విడదీయాలో అక్కడ అక్కడే ఆపి విడదీసి పలకడం, 'సుస్వరః' అంటే శ్రావ్యమైన గొంతుతో స్వరబద్ధంగా ఉచ్చరించడం, 'ధైర్యం' అంటే తాను ఉచ్చరించేది తనకు సందిగ్ధంగా (అనుమానంగా) లేకుండా వుండే ధైర్యంతో పలకడం, 'లయ సమర్థం' అంటే తోటివారితో (సహ పాఠకులతో) కలిసి లయ చెడకుండా ఉచ్చరించడం – ఈ ఆరూ ఉత్తమ పాఠకుని లక్షణాలని పై శ్లోకానికి అర్థం.

## ద్వాదశ ఆదిత్యులు :

సృష్టి ప్రక్రియకు సంబంధించిన 33 కోట్ల దేవతల గూర్చి 81,82,83 పేజీలలో వివరణ ఇవ్వబడింది. ఈ 33 సంఖ్యలో 12 ఆదిత్యులు,11 రుద్రులు,8 వసువులు,2 అశ్వినీ దేవతలు ఉన్నారని చెప్పి, 82వ పేజీలో ద్వాదశ ఆదిత్యులంటే మేషాది మీనపర్యంతం ఉన్న ద్వాదశరాశులలో ఒక్కొక్క రాశిలో ఉన్నప్పటి

సూర్యుడు ఒక్కొక్క ఆదిత్యునిగా ప్రభావం కలిగి ఉంటాడని చెప్పబడింది. మనకు - ఈ పన్నెండు రాశులకు, రాశులలో వసించే సూర్యునికిగల సంబంధం ఇక్కడ వివరింప బడుతుంది. (ఏకాదశరుద్రులు, అష్టవసువులు, అశ్వినీ దేవతలు. మనలో ఎవరో 82,83 పేజీలలోనే చెప్పబడింది)

ఒక సంవత్సరంలో 12 మాసాలు (నెలలు) ఉంటాయి. అందువల్ల సంవత్సరాన్ని ఒక పురుషుడుగా ఊహిస్తే లేదా ఒక పురుషునితో పోలిస్తే ఆ సంవత్సర పురుషునికి 12 అంగాలుగా 12 నెలలుంటాయి. పరమాత్మ (spirit) గా సంకేతింపబడే నారాయణుని అంశగా ప్రతి మనిషి యొక్క హృదయాకాశంలో (దహరాకాశంలో) ఆత్మగా (soul) వున్న సూర్యనారాయణుడు - ప్రతి జీవి భౌతికంగా వ్యక్తమయేటప్పుడు 12 అంగాలుగా విస్తరిల్లి ఉంటాడు. ఆ 12 అంగాలకు 12 రాశులకు సమన్వయం జ్యోతిశ్శాస్త్రం చెబుతుంది. మేషం - శిరస్సు; వృషభం - ముఖం, కంఠం; మిధునం - చేతులు, శ్వాసనాళాలు; కర్కాటకం - ఊపిరితిత్తులు; సింహం - గుండెకాయ (హృదయం); కన్య - పొత్తికడుపు; తుల - నడుము; నాభి; వృశ్చికం - జననేంద్రియ పురీషావయవాలు; ధనుస్సు - తొడలు; మకరం - మోకాళ్ళు (Knees); కుంభం పిక్కలు (Calves); మీనం - పాదాలుగా సమన్వయ పరచుకోవాలి. ఈ విధంగా 12 రాశులలోను 12 నెలల్లో ఉండే సంవత్సర పురుషునికి, ప్రతి జీవిలోను వసించి 12 అంగాలుగా విస్తరిల్లే నారాయణునికి సంబంధించిన మంత్రమైన "ఓం నమోభగవతే వాసుదేవాయ"లో గూడ 12 అక్షరాలే ఉంటాయి. ఈ ద్వాదశమాసాత్మక సంవత్సర పురుషుడైన నారాయణుని గురించి చెప్పే గ్రంథమే భాగవతం. అందుకే దానిలో గూడా 12 స్కంధాలుంటాయి. వాసుదేవుండంటే 'వసుదేవుని కొడుకు' అని కాకుండా, 'సర్వభూతములందు వసించే వాడు' అని అర్థం చెప్పుకోవాలి. వాసుదేవుడంటే ఈ అర్థం చెప్పుకోవాలని సూచించడం కోసమే -

> "వాసనాద్వాసుదేవస్య వాసితంతే జగత్త్రయం
> [illegible] ఊసి 'వాసుదేవ' నమో ఽస్తుతే"

అనే శ్లోకం చెప్పబడింది.

కాబట్టి, మొత్తం మీద ద్వాదశ ఆదిత్యులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు, అశ్వినీదేవతలు ఈ 33గ్గురు మనకు, మన శరీరానికి సంబంధించిన వారుగానే సంకేతింపబడ్డారని తెలుసుకోవాలి.

## షట్చక్రాలు (Vital or Functional Centres):

మానవ శరీరంలో ఉండే షట్చక్రాలలోని ఆజ్ఞాచక్రం, మూలాధార చక్రం గూర్చి 50, 51వ పేజీలలో కొంత ప్రస్తావించబడింది. ఇక్కడ పటసహాయంతో ఆరు చక్రాల స్థానాలను, చక్రాల యొక్క కీలక లక్షణాలను గూర్చి చెప్పబడుతుంది.

మానవ శరీరంలో వెన్నెముక (Spinal Cord) వెంబడి ఈ షట్చక్రాలుంటాయి. ఇవి భౌతికమైనవి కావు. అంటే - పదార్థమయమైన అంగాలు కాదు. కాని, మనలో ఉండే పంచభూతాత్మక ద్రవ్యాలను ఈ చక్రాలు నియంత్రణం (Control) చేస్తాయి. మానవ శరీరంలో వీటి స్థానాలు పటం-1లో చూపబడిన విధంగా ఉంటాయి.




పటం 1 షట్చక్రస్థానాలు

1. మూలాధారము
2. స్వాధిష్ఠానము
3. మణిపూరము
4. అనాహతము
5. విశుద్ధి
6. ఆజ్ఞ
7. సహస్రారం

I = ఇడానాడి
P = పింగళానాడి
S = సుషుమ్నానాడి

**వివరణ :** మూలాధాగము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధి, ఆజ్ఞ – అనే పేర్లతో ఆ ఆరు చక్రాలను పిలుస్తారు. ఈ ఆరు కాక అన్నిటి కన్న పైది, మానవ ప్రజ్ఞకు లోబడి ఉండకుండా, అతీతంగా వుండే మరో చక్రం వుంది. దాని పేరు 'సహస్రారం', పటం–1లో చూపబడిన చక్రాల గూర్చి విడివిడిగా కొంత వివరణ అవసరం.

**1. మూలాధార చక్రం (Base Centre)** : దీనినే 'ఆధార చక్రము' అని గూడా అంటారు. ఇది వెన్నెముక క్రింది కొసవద్ద ఉంటుంది. తల దగ్గర నుండి పాదాల వరకుఉండే మానవ శరీరాన్ని వరసగా అశ్విని నుండి రేవతి వరకు గల 27 నక్షత్రాలతో న్యాసం చేస్తే వెన్నెముక క్రింది కొసవద్దకు 'మూలా నక్షత్రం' వస్తుంది. మూలానక్షత్రానికి సంబంధించిన చోట ఈ చక్రం వున్నది కాబట్టి దీన్ని 'మూలాధార చక్రం' అన్నారు. మన శరీరంలోని ఘన పదార్థాన్ని (Solid) అంటే పంచభూతాల్లో ఒకటైన పృథివీ తత్త్వాన్ని ఈ చక్రం నియంత్రణ (Control) చేస్తుంది.

**2. స్వాధిష్ఠాన చక్రం (Spleen Centre) :** ఇది వెన్నెముక వెంబడి ప్లీహం వద్ద ఉంటుంది. మన శరీరంలోని శీతోష్ణాగ్నులను అంటే పంచభూతాల్లో ఒకటైన తేజస్తత్త్వాన్ని నియంత్రణ చేస్తుంది. (ఆది శంకరులు చెప్పిన ప్రకారం).

**3. మణిపూర చక్రం (Solar plexus or Naval Centre) :** ఇది నాభివద్ద ఉంటుంది. మన శరీరంలోని ద్రవపదార్థాలను అంటే, పంచభూతాల్లో ఒకటైన ఆపస్తత్వాన్ని నియంత్రణ చేస్తుంది. (ఆది శంకరులు చెప్పిన ప్రకారం).

**4. అనాహత చక్రం (Heart Centre) :** ఇది గుండెకాయలో అంటే హృదయకేంద్రం వద్ద ఉంటుంది. మన శరీరంలో వాయు పదార్థాలను అంటే, పంచభూతాల్లో ఒకటైన ఆకాశతత్వాన్ని నియంత్రణ చేస్తుంది.

**5. విశుద్ధి చక్రం (Throat Centre) :** ఇది గొంతు వద్ద వుంటుంది. మన శరీరంలోని చోటును అంటే, పంచభూతాల్లో ఒకటైన ఆకాశతత్వాన్ని నియంత్రణ చేస్తుంది.

**6. ఆజ్ఞాచక్రం (Brow Centre) :** ఇది రెండు కనుబొమ్మల మధ్య భాగ ప్రాంతంలో వుంటుంది. మన మనస్సును నియంత్రణ చేస్తుంది. అంటే, పంచభూతాలకు అతీతంగా వుండి వాటిని నియంత్రణ చేయగల సామర్థ్యం ఈ చక్రానికి వుంటుంది.

**7. సహస్రార చక్రం (Heat Centre) :** ఇది శిరస్సు పై భాగంలో బ్రహ్మ రంధ్రం వద్ద ఉంటుంది. మన శరీరంతో భౌతికమైన అనుసంధానం లేకపోయినా ఇది ఆరుచక్రాలకు అతీతంగా, గమ్యస్థానంగా వుంటుంది. ఈ చక్రాల వరుస క్రమ మార్గాన్నే కుండలినీయోగంలో సుషుమ్నా మార్గం, లేదా 'కులపథం' అంటారు.

పటంలో చూపినట్లుగా సర్పాకారంలో వున్న వెన్నుపాము లోపల వుండే సూక్ష్మాతి సూక్ష్మమైన చైతన్య ప్రదేశాన్ని 'సుషుమ్న' అంటారు. ఇది అగ్నితత్త్వము. (ఇది S అనే అక్షరంతో గుర్తింపబడింది) సర్పాకారానికి రెండు వైపులా వుండే నిలువు రేఖలలో 'I' అని గుర్తించిన దానిని 'ఇడానాడి' అని, 'P' అని గుర్తించిన దానిని 'పింగళానాడి' అని అంటారు. పింగళానాడి సూర్యాత్మకము. ఇది స్థూలం నుండి

సూక్ష్మానికి మారే ప్రక్రియను (Sublimation) నిర్వహిస్తుంది. ఇది విద్యుత్తు (Electricity) వంటిది. ఇడానాడి చంద్రాత్మకము. ఇది సూక్ష్మం నుండి స్థూలానికి మారే ప్రక్రియను (Manifestation, Precipitation or Establishment) నిర్వహిస్తుంది. ఇది అయస్కాంతత్త్వము (Magnetism) వంటిది.

## ఈశ్వరుడు (Soul) - పరమేశ్వరుడు (Spirit) :

ప్రతి వ్యక్తి హృదయంలో దహరాకాశంగా ఉన్నవాడు ఈశ్వరుడని, అందరి వ్యక్తుల వెనుక నేపథ్యంగా ఉన్నవాడు పరమేశ్వరుడని,53, 54 పేజీలలో చెప్పబడింది. ఇదే విషయం సూటిగా అర్థమయేందుకు పటం - 2లో వివరింపబడింది.




పటం : 2 ఈశ్వరుడు - పరమేశ్వరుడు

మొదటి చిత్రంలో S = నేపథ్యంగా ఉన్న పరమేశ్వరుడు (Spirit)

$S_1$ = వ్యక్తి దహరకాశంగా వున్న ఈశ్వరుడు (Soul)

రెండవ చిత్రంలో W = నేపథ్యంగా ఉన్న గోదావరి (Spirit)

$W_1$ = పాత్రలో వున్న గోదావరి (Soul)

వివరణ : నేపథ్యంగా ఉన్న గోదావరిలోను, పాత్రలో వున్న గోదావరి లోను ఉన్నది ఒకే ద్రవ్యం అనీ, అదే $H_2O$ సంకేతంతో పిలువబడే నీళ్ళని తెలుసుకోవాలి. పాత్ర గూడా మంచుతో చేసినదే అయితే ఈ ఉదాహరణ ఇంకా అర్థవంతంగా ఉంటుంది. అప్పుడు పాత్ర బయట ఉన్నది, పాత్రలోపల ఉన్నది, పాత్ర పదార్థంలో ఉన్నదీ కూడా ఒకే ద్రవ్యం $H_2O$ అవుతుంది. మంత్రపుష్పంలో చెప్పిన 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణస్థితః' అనే మంత్రానికి ఈ

ఉదాహరణ బాగా నప్పుతుంది. "తత్సృష్ట్వా, తదేవాను ప్రావిశత్', అన్న మంత్రాలకు 161వ పేజీలో ఇచ్చిన వివరణకు గూడా ఈ పటంలోని ఉదాహరణ సరిపోతుంది.

విశ్వమనస్సులో మన బుర్ర ఉండటం వల్ల, మన బుర్రలో గూడా మనస్సు ఉన్నదని 225వ పేజీలో మహత్తు (Universal mind), వ్యక్తిగత మనస్సు (Individual mind) లను గూర్చి చెప్పిన చోట గూడా ఈ పటంలోని విషయాన్ని సమన్వయ పరచుకోవచ్చు.

అట్లాగే, 209, 210, 211వ పేజీలలో 'పృథివ్యామాకాశః, ప్రతిష్ఠితః ఆకాశే పృథివీ ప్రతిష్ఠితా,' అనే మంత్రాలకు చోటులో దేహం, దేహంలో చోటు ప్రతిష్ఠితమై ఉన్నాయని చెప్పిన దానికి గూడా ఈ పటంలో విషయాన్ని సమన్వయపరచువచ్చు.

**ఇంద్రగ్రంథి (Penial Gland) :**

"అన్తరేణ తాలుకే, య ఏషస్తన ఇవావలంబతే, సేంద్రయోనిః, యాత్రాసౌ కేశాన్తో వివర్తతే, వ్యపోహ్యా శీర్షకపాలే," ఇంద్ర గ్రంథి యొక్క స్థానం మనలో ఎక్కడవున్నదో ఈ మంత్రం చెబుతుంది. దీని వివరణ 88వ పేజీలో కొంత వివరించ బడింది. ఎంత వివరించినా పటంగీసి చూపిస్తేనే గాని సూటిగా, ప్రత్యక్షంగా దీని స్థానం తెలియదు. పటం – 3 ఈ ఇంద్రగ్రంథి స్థానాన్ని తెలియజేస్తుంది.




పటం : 3 ఇంద్రగ్రంథి

E = భ్రూ మధ్యం. ఇది మన శరీరానికి తూర్పు

N = బ్రహ్మరంధ్రం. ఇది మన శరీరానికి ఉత్తరం

T = శిఖ స్థానం (తలలో వెంట్రుకలు సుడి తిరుగుచోటు)

NE = ఉత్తరం, తూర్పు దిశలు కలిసే ఈశాన్య బిందువు

**వివరణ :** జీవునికి రెండు ప్రజ్ఞలుంటాయి. 1. సూర్యప్రజ్ఞ 2. చంద్రప్రజ్ఞ. జీవిలోని సూర్యాత్మక ప్రజ్ఞ (Solar Spark or Electric Vector) - తాను పుట్టబోవు తండ్రియొక్క సహస్రారం (బ్రహ్మరంధ్రం) వద్దను, చంద్రాత్మక ప్రజ్ఞ (Lunar Spark or Magnetic Vector) తాను పుట్టబోవు తండ్రియొక్క ఎడమముక్కు ద్వారా ఇడానాడి వలన ప్రచోదితమై ఈ ఇంద్ర గ్రంథివద్దను 9 రోజులుంటాయి. 9వ రోజున తండ్రికి దాంపత్యం వహిద్దామని సంకల్పం కలుగచేస్తాయి. అప్పుడు ఇంద్రగ్రంథి వద్ద వున్న జీవుని చంద్ర ప్రజ్ఞ వెన్నెముక లోని సుషుమ్నా మార్గం గుండా క్రిందకు దిగి మూలాధార కేంద్రం వద్ద ఉండే శుక్రకణంలో ప్రవేశిస్తుంది. దాంపత్య క్రియలో శుక్రకణం ద్వారా తల్లి గర్భంలో ప్రవేశించి 9 నెలలు అక్కడ మానవ రూపం పొందేవరకు పెరుగుతుంది. సూర్య ప్రజ్ఞ మాత్రం తండ్రి బ్రహ్మరంధ్రం వద్ద ఇన్ని రోజులు వేచి ఉంటుంది. 9 నెలల తర్వాత జీవుడు ప్రసవింపబడినపుడు ఆ జీవుని బ్రహ్మరంధ్రం వద్దకు ఆ సూర్య ప్రజ్ఞ చేరుకొంటుంది. (ఈ 9 నెలలు ఆ సూర్యప్రజ్ఞ తండ్రి బ్రహ్మరంధ్రం వద్ద వుంటుంది. ఒక వేళ జీవుడు ప్రసవింపబడక పూర్వమే తండ్రి చనిపోవడం జరిగితే - తండ్రి బ్రహ్మ రంధ్రం వద్ద వున్న జీవుని సూర్యప్రజ్ఞ తల్లి బ్రహ్మరంధ్రం వద్దకు చేరుతుంది). కాబట్టి, మన శరీరంలో ఆ జీవుని పుట్టుకకు సంబంధించిన మొట్టమొదటి ఉత్పత్తి స్థానం (యోని) ఈ ఇంద్రగ్రంథి వద్ద అని తెలుసుకోవాలి. బ్రహ్మరంధ్రం ఉత్తర దిక్కును, భ్రూమధ్యం తూర్పు దిక్కుని తెలియజేస్తాయి. కాబట్టి, పటంలో చూపించినట్లు ఈ రెంటిని పొడిగిస్తే కలుసుకునే బిందువు ఈశాన్య బిందువు అవుతుంది. అక్కడే ఇంద్రగ్రంథి వుంటుంది. శిఖస్థానం నుండి $45^0$లో గీసిన రేఖను వెనక్కి పొడిగించినా ఈ ఇంద్రగ్రంథిస్థానాన్నే చేరుతుంది. మన శరీరంలో, జీవుని యొక్క మొట్టమొదటి ఉత్పత్తి స్థానం ఈశాన్య బిందువు వద్ద కాబట్టే ఇల్లు కట్టేటప్పుడు గూడా ఇంటికి శంకుస్థాపన ఈశాన్య బిందువు వద్ద చెయ్యడం

జరుగుతుంది. ఈ బిందువును రోజూ మనస్సులో గుర్తుంచుకునేందుకే భ్రూమధ్యంలో బొట్టు పెట్టుకోమని భారతీయులు చెబుతారు. ఈ గ్రంథిలో తేడాలొస్తే, తెలివితప్పటం, ఉన్మాదం, జడత్వం, మూగ, అంధ, బదిరత్వాలు గూడా వస్తాయి. ఈ గ్రంథిలో లోపం లేకపోతే సంగీతజ్ఞానం, భక్తియోగసాధన బాగుంటాయి. ఈ గ్రంథి ప్రాంతాన్నే 'మానస సరోవరం' అని గూడా అంటారు. మయుడు మానససరోవరం లోంచి అంతకు పూర్వమే నిర్మితమై వున్న మయసభను బయటకు తీసి ధర్మరాజుకు బహూకరించినట్లు భారతంలో చెప్పబడుతుంది. ఇది గూడా జీవుని ఉత్పత్తి స్థానానికి సంబంధించిన కథే !

## ఉచ్ఛ్వాస నిశ్వాసాలు :

పరమేశ్వరుని నిశ్వాసం మీద మన ఉచ్ఛ్వాసం, పరమేశ్వరుని ఉచ్ఛ్వాసం మీద మన నిశ్వాసం ఆధారపడి వున్నాయని 88వ పేజీలో చెప్పబడింది. మనమున్న విశ్వం చుట్టూ వున్న చోటును రబ్బరుతో చేసిన ఒక గోళం (Space globe as Rubber baloon) లాగా ఊహిస్తే ఈ చోటు గోళానికి సంకోచ, వ్యాకోచ లక్షణాలుంటాయి. (Space pulsates) చోటుకు ఈ స్పందన లక్షణం ఉండబట్టే మన హృదయంలోని దహరాకాశానికి గూడా స్పందన గుణం ఉండి తనంతకు తానే స్పందించి (ఈ స్పందనవల్ల 'లబ్' 'డబ్' అనే ధ్వనులు గూడా వినబడతాయి.) శ్వాసప్రక్రియను, రక్తప్రసరణను జరిపిస్తూ మన జీవనానికి, జీవ దేహ సంబంధానికి కారణమౌతుంది. ఈ విశ్వాన్ని ఒక పురుషునితో పోలిస్తే ఆ పరమపురుషుని స్వయం ప్రేరకమైన ఉచ్ఛ్వాస, నిశ్వాసాలే చోటు గోళానికి ఉండే స్పందనాత్మక గుణానికి, అనగా సంకోచ, వ్యాకోచాత్మక గుణానికి గల కారణం అని తెలుస్తుంది. ఈ విషయాన్ని పటం – 4 వివరిస్తుంది. ఆ పరమ పురుషుణ్ణే పరమేశ్వరుడని, పరమాత్మ అనీ, భగవంతుడని సంకేతిస్తారు.




పటం : 4 భగవంతుని ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు

అంతరిక్ష గోళం (Space Globe)

I = భగవంతుని ఉచ్ఛ్వాసం

E = భగవంతుని నిశ్వాసం

SG = అంటే చోటు గోళము

పై పటంలోని బొమ్మలకు వేరే వివరణ అవసరం లేదు.

## పంచభూతాలు (Five Elements) :

పంచభూతాలను గూర్చి 127 పేజీలో చెప్పబడింది. వీటిని, వీటి క్రమాన్ని, వీటి మధ్య గల సంబంధాన్ని గూర్చి ఒక వెలుగుతున్న క్రొవ్వొత్తిని ఉదాహరణగా తీసికొని 128 పేజీలో చెప్పబడింది. అదే విషయం తేలిగ్గా అర్థమవడం కోసం పటం –5లో చూపబడింది.




పటం : 5 వెలుగుతున్న క్రొవ్వొత్తి : పంచభూతాలు

1. ఆకాశం 2. వాయువు 3. తేజస్సు 4. ఆపస్ (ద్రవ) 5. పృథివి

**వివరణ :** ఏమి లేనట్లుకనబడే (Seeming Nothingness) ఆకాశతత్త్వం నుండి అన్నీ ఉన్నట్లుకనబడే (Apparent Something) పృథివీతత్త్వం వరకు అనగా, పై నుండి క్రిందకు దిగే మార్గంలో సృష్టిప్రక్రియ జరుగుతుందని "ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః। అగ్నేరాపః। అద్భ్యః పృథివీ" అని బ్రహ్మవల్లిలోని మొదటి అనువాక మంత్రం చెబుతుంది. ప్రళయ మార్గం అంటే ముక్తి మార్గం - సరిగ్గా దీనికి వ్యతిరేక మార్గంలో అంటే క్రింద నుండి పైకి ఉంటుందనే విషయాన్ని పటం-5లోని వెలుగుతున్న క్రొవ్వొత్తి చక్కగా తెలియ జేస్తుంది. (ఈ క్రొవ్వొత్తి ఉదాహరణ 226, 227 పేజీలలో అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలను గూర్చి చేప్పేటప్పుడు గూడా వర్తిస్తుంది.)

**కేంద్రము - పరిధి :** వృత్తంలోని కేంద్రబిందువును సృష్టికర్తతోను, పరిధిపై బిందువులను సృష్టిలోని సమస్త జీవభూత, స్థావరాలతోను పోల్చి 154వ పేజీలో జీవుల అస్తిత్వము సృష్టికర్తపై ఆధారపడి వుందని చెప్పబడింది. ఇదే విషయం పటం-6లో మరింత విపులంగా వివరింపబడుతుంది.




**పటం : 6 కేంద్రము - పరిధి (Centre and circumference)**

$O_1$ = ఒక వృత్త కేంద్రం $O_2$ = రెండవ వృత్తకేంద్రం

$O = O_1, O_2$ కేంద్రాలు ఏర్పడటానికి కారణమైన వృత్తలేఖిని శీర్షకేంద్రం.

**వివరణ** : $O_1$ వృత్త కేంద్రం ఒక మనిషి అనుకుంటే, అతనికి చుట్టు వున్న ప్రపంచమంతా తన కేంద్రానికి సంబంధించిన పరిధిపై బిందువుల్లాగ కనిపిస్తుంది. కాని, $O_1$ కేంద్రంగా గల వృత్తపరిధి మీద గల ఒక బిందువు గ $O_2$తీసికొని, ఆ $O_2$ను రెండవ మనిషిగా అనుకుంటే, ఆ రెండవ మనిషికి మొదట మనిషి తన వృత్త పరిధిమీద వుంటాడు. అంటే, ప్రపంచంలో ప్రతివ్యక్తి ఒక కేంద్రమే కాకుండా ఇంకొక వృత్తపరిధి మీద బిందువులాంటివాడని తెలసుకోవాలి. 'ప్రతివ్యక్తి ఒక కేంద్రమైనపుడు, అందరి వ్యక్తుల కేంద్రాలకు కారణభూతమైన ప్రధాన కేంద్రం ఎవరు?' అన్న ప్రశ్నకు 'ఈ కేంద్రాలన్నిటికి పైన వున్న వృత్తలేఖిని శీర్షకేంద్రం' అని జవాబు చెప్పాల్సివస్తుంది. ఈ వృత్తలేఖిని శీర్షకేంద్రమే (O) భగవంతుడనీ, కాగితంపై గల మిగిలిన కేంద్రాలన్నీ ($O_1$, $O_2$...) వివిధ వ్యక్తులనీ, వాటి పరిధులే ఆ వ్యక్తులు సృష్టించుకొన్న ప్రపంచాలనీ అర్థం చేసుకోవాలి. (ప్రతి వ్యక్తి కేంద్రం తాలూకు పరిధిని ఆ వ్యక్తి యొక్క Point of View అని గూడా అనవచ్చు)

**"సయశ్చాయం పురుషే, యశ్చాసావాదిత్యే స ఏకః".**

ఈ మంత్రాలను గూర్చి 178 పేజీలోని బ్రహ్మవల్లి యందలి 8వ అనువాకానికి 226వ పేజీలోని భృగువల్లి యందలి 10వ అనువాకానికి సంబంధించిన వివరణలలో ఇవ్వబడింది. ఈ విషయానికి సంబంధించిన సూటి వివరణ పటం-7లో ఇవ్వబడింది.

**వివరణ** : సూర్యుడు వస్తువు అనుకుంటే ఆ సూర్యుని నుండి వచ్చే కిరణాలు మనలోని మనస్సనే సమతల దర్పణంపై పడి, హృదయం వద్ద సూర్య ప్రతిబింబాన్ని ఏర్పరుస్తుందని చెప్పుకోవచ్చు. అందరికీ వస్తువు సూర్యుడే ! మనస్సులనే దర్పణాలు వేరు వేరుగా వుంటాయి. కాబట్టి అందరి హృదయాల్లోను సూర్యప్రతిబింబాలుంటాయి. ("ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచు" అన్న పద్యాన్ని ఇక్కడ అన్వయించుకోవాలి) మనస్సనే అద్దం ఎంత స్వచ్ఛంగా వుంటే వస్తువుకు బింబానికి తేడా అంత తగ్గి 'రెండూ ఒకటేనా' అని అనిపించేటట్లు ఉంటాయి. ఈ స్థితి వచ్చినపుడే "సయశ్చా యంపురుషే, యశ్చాసావాదిత్యే, స ఏకః " అన్న మంత్రాలకు అనుభూతి చెల్లుతుంది.




పటం :7 యశ్చాసావాదిత్యే, స ఏకః

S = సూర్యుడు (ఆదిత్యుడు) (Sun)

M = మనస్సు (Mind)

H = హృదయం (Heart)

## పంచకోశములు (Five Sheaths of Human Being) :

భృగువల్లిలో అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలను గూర్చి మొదటి ఆరు అనువాక మంత్రాల్లోను చర్చించబడింది. 100 రూపాయల వంటి ఆనందమయ కోశంలో వరుసగా - 50 రూపాయల, 20 రూపాయల, 10 రూపాయల, 5 రూపాయల వంటి విజ్ఞానమయ, మనోమయ, ప్రాణమయ, అన్నమయ కోశాలు ఇమిడే వుంటాయని 199వ పేజీలో చెప్పబడింది. ఈ విషయంతో పాటు మరికొన్ని సాంకేతిక విషయాల వివరణ పటం-8లో ఇవ్వబడింది.




పటం : 8 కాలంతో జీవుని జీవన యానం – పంచకోశాలు

మొదటి చిత్రంలో : T = కాలాన్ని సూచించే అక్షము (Axis)

రెండవ చిత్రంలో : B = ఆనందమయ (Bliss) కోశం

I = విజ్ఞానమయ (Intellectual) కోశం

M = మనోమయ (Mental) కోశం

V = ప్రాణమయ (Vital) కోశం

P = అన్నమయ (Physical) కోశం

B = జనన బిందువు (Point of Birth)

D = మరణ బిందువు (Point of Death)

గీతల భాగం జనన మరణాల మధ్య జీవుడు దేహంతో ఉండే భాగాన్ని సూచిస్తుంది. గీతల భాగంలో వంపుకు అట్టడగున వున్న బిందువు జీవుడు దేహం నుండి ఉపసంహరణ చెందటానికి ప్రారంభస్థితిని (Point of withdrawal) తెలియజేస్తుంది. మూడవ, నాల్గవ చిత్రాల్లో B, I,M, V, P వరుసగా ఆనందమయాది కోశాలను తెలియచేస్తాయి.

వివరణ : మొదటి చిత్రంలో - కాలంతో పాటు జీవుని జన్మ జన్మల ప్రయాణ మార్గం చూపబడింది. ఇది చూడడానికి నీటి అలల (తరంగముల) లాగా లేదా ఏకాంతర విద్యుత్ప్రవాహమార్గం (Path of Alternating Current) లాగా వుంటుంది. పై లోకాల నుండి దిగువ లోకాలకు, మళ్లీ దిగువలోకాల నుండి పై లోకాలకు జీవుని ప్రయాణం ఏకాంతరంగా మారుతూ వుంటుందని ఈ పటంలో మొదటి చిత్రం సూచిస్తు,ది.

రెండవ చిత్రంలో ప్రత్యేకించి జీవుని ఒక జన్మకు సంబంధించిన జీవన మార్గం విపులంగా చూపబడింది. మొట్ట మొదట జీవుడు ఆనందమయకోశం నుంచి దేహాన్ని పొందటానికి కావలసిన విజ్ఞానం కోసం విజ్ఞానమయకోశం లోకి దిగి, ఇంద్రియాలను కల్పించుకొనే నిమిత్తం ఇంద్రియాలకు అధిపతి అయిన మనస్సు వుండేమనోమయ కోశంలోకి దిగి, దేహం అనే యంత్రం పనిచెయ్యడానికి కావలసిన ప్రాణం అనే విద్యుత్తును పొందడానికి ప్రాణమయకోశంలోకి దిగుతాడు. ఇటుపైన భౌతికమైన దేహాన్ని ఏర్పరచుకోవడం కోసం అన్నమయకోశంలో తాను ఒక భౌతిక పదార్థ మయజీవిగా వ్యక్తమైనప్పటి కాలాన్ని జనన బిందువు (Time of Birth) అంటారు. ఇప్పటి నుండే జీవుడు ఒక పదార్థమయజీవిగా అందరికీ కనబడతాడు. రోజురోజుకు అన్నంతింటూ, స్థూలమైన భౌతికత్త్వం పెరుగుతూ, పటంలో గీతల భాగంలో అట్టడుగున వున్న ఉపసంహరణ బిందువును (Point of withdrawal) చేరతాడు. ఈ స్థితిని చేరినప్పటి నుండి క్రమ క్రమంగా స్థూలమైన భౌతికత్త్వం తగ్గుతుంది. క్రమక్రమంగా భౌతికదేహంతో సంధానం తెగిపోతుంది. భౌతిక దేహంతో సంధానం తెగిపోయినప్పటి కాలాన్ని మరణ బిందువు (Time of death) అంటారు. అప్పటి నుండి మళ్లీ తిరుగు ప్రయాణంలో వ్యతిరేక మార్గంలో అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలను దాటి ఆనందమయకోశంలో ఉంటాడు. మళ్ళీ రెండవ జన్మలో ఇదే రకంగా మొత్తం తంతు అంతా జరుగుతుంది.

మూడవ చిత్రంలో జీవుడు ఎప్పుడూ ఒకే స్థితిలో వుండాలంటే ఏ మార్పులు జరగాలో చూపబడింది. ఎప్పుడూ ఒకే స్థితిలో వుండాలంటే మొదటి చిత్రంలో చూపిన వంపుల పరిమితి (amplitude) తగ్గి శూన్యమవాలి. అంతేకాకుండా వంపుల యొక్క సంఖ్య అనగా జన్మల పౌనఃపున్యము (Frequency of births and

deaths) తగ్గాలి. తన విధ్యుక్త ధర్మాలన్నీ చేస్తూ, బాధ్యతలను నిర్వర్తిస్తూ, 'వచ్చిన ఫలితాలు' అనే ఆటుపోట్ల ప్రభావానికి అతీతంగా వున్నపుడు మాత్రమే ఈ స్థితి వస్తుంది. ఈ స్థితినే ముక్త సంగస్థితి లేదా మోక్ష స్థితి అంటారు. ఈ స్థితిలో వున్న జీవునికి తన కంటూ ఒక కోరిక వుండదు, అయినా విధ్యుక్త ధర్మాలు అన్నీ చేస్తాడు. సంగాన్ని పెంచుకోడు. అనగా దేనికీ అంటడు. ఈ స్థితిలో వున్న వాని మీద కాల, ప్రదేశాల ప్రభావం గూడా పనిచెయ్యదు. ఇది జన్మరాహిత్యస్థితి కాకుండా జనన, మరణాతీతమైన (It is trancendental but not trancegress) స్థితి. ఈ స్థితిని మూడవ చిత్రం తెలియ జేస్తుంది.

నాల్గవ చిత్రం 100 రూపాయల వంటి ఆనందమయకోశంలో 50 రూపాయల వంటి విజ్ఞానమయ కోశం, 20 రూపాయల వంటి మనోమయకోశం, 10 రూపాయల వంటి ప్రాణమయకోశం, 5 రూపాయల వంటి అన్నమయకోశం ఎలా ఇమిడి ఉంటాయో తెలియచేస్తుంది. ఈ చిత్రంలో చూపించిన విధంగా ఆనందమయ కోశంతోనే మిగిలిన కోశాలన్నీ తయారు చేయబడి, ఆ ఆనందమయకోశం భాగాల్లాగానే అవి వుంటాయని తెలుసుకోవాలి.

ముక్త సంగస్థితి ఎలాంటిదో 8వ పటంలోని మూడవ చిత్ర వివరణలో చెప్పబడింది. జీవికి ఈ స్థితి రావడాన్ని ఒక కొబ్బరికాయ కొబ్బరి కురిడీగా లేదా ఒక వెలగకాయ వెలగపండుగా లేదా ఒక చింతకాయ చింతగుల్లగా మారే స్థితితో పోల్చవచ్చు. (ఈ ముముక్షత్వం గురించి 103, 104వ పేజీలలో గూడా చెప్పబడింది) కొబ్బరికాయతో జీవిని పోల్చినపుడు దాని గట్టి పెంకులాగా అహంకారం ఉంటుంది. కొబ్బరిలాగా పాండిత్యం, ప్రతిభ, పరువు, ప్రతిష్ఠ, పదవీ, అధికారాలు ఉంటాయి. వీటికి – అహంకారానికి ఉండే సంబంధం కొబ్బరికి – పెంకుకీ ఉండే సంబంధంలా వుంటుంది. అంటే, రెంటికీ మధ్య 'సంగం' (attachment) బాగా వుంటుంది. కొబ్బరి లోపల ఉండే నీళ్ళు జీవిలోని కోర్కెలను తెలియజేస్తాయి.

కొబ్బరికాయ కొబ్బరి కురిడీగా మారిన ముక్తసంగస్థితి – లోపల వున్న కోర్కెలనే నీళ్ళు ఇగిరిపోయినపుడు వస్తుంది. అప్పుడు, పై పెంకుకి, కొబ్బరికి మధ్య సంబంధం లేదా సంగం (attachment) ఎలా తొలగిపోతుందో జీవి అహంకారానికి పాండిత్యాది స్వాతిశయ గుణాలకూ మధ్య సంగం అలా తొలగిపోతుంది. విధ్యుక్త

ధర్మాలను, బాధ్యతలను నిర్వర్తిస్తూ గూడా తానే అవన్నీ చేస్తున్నాననే అహంకారానికి లోనుకాదు. అలాగే - వెలగకాయ వెలగపండు అయినపుడు లేదా చింతకాయ చింతగుల్ల అయినపుడు పై పెంకుకు లోపల వుండే గుజ్జు లేదా కండకు సంబంధం వుండదు. పైగా ఇంతకు పూర్వం ఉన్న పచ్చిదనం, పులుపు, వగరు అన్నీపోయి తీపిదనం వస్తుంది. పెంకులోనే ఈ గుజ్జు వున్నాపెంకుకు అంటదు. అలాగే, ముక్త సంగ స్థితిలో జీవి భౌతిక శరీరంలోనే వున్నా దానికి అతీతుడగా వుంటాడు. ఈ ముక్త సంగస్థితిలో జీవునికి వచ్చే మార్పులను వరుసగా పటం-9లో చూపిన విధంగా కొబ్బరికాయ, వెలగకాయ, రబ్బరు బంతి, రబ్బరు బూర, నీటి బుడగలలాగా ఉండే విధంగా అర్థం చేసుకోవచ్చు.




పటం : 9 ముక్త సంగస్థితి రావడంలో జీవుని స్థితులు

1. కొబ్బరికాయ 2. వెలగ కాయ 3. రబ్బరు బంతి 4. రబ్బరు బూర 5. నీటి బుడగ

**వివరణ :** పై 5 చిత్రాల్లో గీతలు గీసిన భాగం వాటి వాటి పైన గల పెంకుల యొక్క లేదా పొరల యొక్కమందాన్ని, గట్టిదనాన్ని తెలియజేస్తాయి. ఇవి జీవిలో గల అహంకారాన్ని, స్థూల గుణాన్ని తెలియజేస్తాయి. 1 నుండి 5వ చిత్రానికి పోతున్న కొలదీ ఈ అహంకారం, స్థూల గుణాలను తెలియజేసే పెంకు లేదా పొరల మందం తగ్గుతూ' లోపల వుండే సూక్ష్మగుణమైన ఆనందానికి ప్రాధాన్యం పెరుగుతూ ఉండడం గమనించవచ్చు. చివరకు నీటి బుడగ స్థితిలోకి వచ్చేటప్పటికి పై పొర 'ఉందా – లేదా' అన్నట్లుండి లోపల అంతా ప్రధాన గుణమైన ఆనందమనే గాలి నిండి వుంటుంది. ఈ స్థితిలో బయట గాలికి లోపల గాలికి మధ్య ఉండీ ఉండనట్లు ఉండే' పొరమాత్రమే ఉంటుంది. దీన్ని ముక్త సంగస్థితితో పోల్చవచ్చు.

జీవి అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాల్లోంచి ఆనందమయకోశంలోకి ప్రవేశించడాన్ని చెప్పే "అస్మాల్లోకాత్ప్రేత్య, ఏత మన్నమయ మాత్మాన ముపసంక్రమ్య" అని 212వ పేజీలో చెప్పిన మంత్రాలకు గూడా ఈ పటంలోని చిత్రాలకు తెలిపిన వివరణను అన్వయించవచ్చును. అంటే, జీవి అన్నమయాది పంచకోశాల్లో ఉన్న స్థితిని వరుసగా 1 నుండి 5 చిత్రాల్లో చూపించినట్లుగాను ముక్త సంగస్థితిలో 5వ చిత్రంలో చూపించిన నీటి బుడగలాగా ఎప్పుడూ సంపూర్ణమైన ఆనందస్థితిలోనే ఉంటాడనీ అర్థం చేసుకోవాలి.

శ్రీ కృష్ణార్పణమస్తు